# హిందువుల పండుగలు పర్వములు

గ్రంథకర్త:


**శ్రీ తిరుమల రామచంద్ర**

(విద్వాన్, హిందీ ప్రభాకర, ఆయుర్వేదభూషణ)






ప్రకాశకులు:

**బాలసరస్వతీ బుక్ డిపో**

(రిజిష్టర్డు) ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

కర్నూలు :: మద్రాసు

బ్రాంచి ఆఫీసు : 6, సుంకురామశెట్టి వీథి, మదరాసు-1.





**1960**

# మనవి మాటలు

మనసు మరుగున తారాడు మొలకవలను వెలువరించుటకు మాటలే కాక మరి ఎన్నియో మార్గములున్నవి. వానిలో ఒకటి పండుగలు. ప్రజల మనోవికారములు, జిజ్ఞాసా విలసితములు, ఋతు పరివర్తనమువలన ప్రకృతిలో నేర్పడు వివిధ పరిణామములు, పరంపరాగతములగు పూర్వగాథలు, నభోమండలమున నగపడు నక్షత్ర గ్రహాది సన్నివేశములు, తమ పర్యవేక్షణ ఫలములన్నియు నిత్యజీవితమున మేళవింపజేసి వానికి నిత్యత్వము సంతరింప జేయవలెనను అభిలాష మొదలగున వెన్నియో జున్ను కట్టగా రూపొందినవి పండుగలు. వానిలో కొన్నింటిని ఈ చిన్ని పుస్తకములో చర్చించితిని. సహృదయులు పరిశోధకుల హృదయమే ప్రమాణము.

ఈ రచనలో పెక్కు విషయములను నా కతి సుబోధముగా సమన్వయపరచి చెప్పిన మా అమ్మగారు మూర్తీభవించిన ప్రాచీన సంస్కృతి శ్రీమతి జానకమ్మగారికి నేను మిగుల ఋణపడియున్నాను. జన్మసిద్ధమగు మాతృఋణ మొకటి యుండనే యున్నది.

దీనిని నా ప్రథమ గురువర్యులు శ్రీమాన్ వెంబారుఅంబాళం రామానుజాచార్యులవారికిని, నా తండ్రిగారు శ్రీమాన్ తిరుమల తాడిమర్రి శేషాచార్యులవారికిని స్మృతికుసుమముగా సమర్పించి ధన్యుడ నగుచున్నాను. శ్రీమాన్ రామానుజాచార్యులవారు మైసూరు, ఆనెగొంది ఆస్థాన విద్వాంసులుగా నున్న మహా వైయాకరణులు; చంపూ భారతాద్యనేక గ్రంథ వ్యాఖ్యాతలు; శిష్యులను పుత్ర నిర్విశేషముగ ప్రేమించిన గురుసత్తములు. నా తండ్రిగారు బహుభాషా ప్రవీణులు; జీవితమును అసిధాగ్రపై నడిపిన నిష్ఠాగరిష్ఠులు.

ఈ రచనలో నా కెన్నియో గ్రంథములు, వ్యాసములు తోడ్పడినవి. వాని రచయితలకు కృతజ్ఞుడను. ఆ గ్రంథములను, తత్కర్తలను ప్రక్కపుటలో స్మరించినాను.

ఈలాటి రచనకు నన్ను ప్రోత్సహించి, నావలన ఎంత విలంబనము కలిగినను సహించి ఆదరించిన శ్రీ బాలసరస్వతీ బుక్ డిపో యజమానులు శ్రీ టి. బాలనాగయ్య శ్రేష్ఠిగారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

ఇట్లు

మద్రాసు,
శార్వరి, కృష్ణజయంతి

సహృదయ విధేయుడు
తిరుమల రామచంద్ర

ఈ రచనకు తోడ్పడిన గ్రంథములను, తత్కర్తలను కృతజ్ఞతతో స్మరించుచున్నాను.

**సంస్కృతము :**

గాథాసప్తశతి ... హాలసాతవాహనుడు
చతుర్వర్గ చింతామణి–వ్రతఖండము ... హేమాద్రి
ధర్మసింధు ... కాశీనాథోపాధ్యాయుడు
నిర్ణయసింధు ... కమలాకరభట్టు
వ్రతచూడామణి, స్మృతికౌస్తుభము ... అనంతదేవుడు

**తెనుగు :**

ఆంధ్రుల సాంఘిక చరిత్ర ... శ్రీ సురవరం ప్రతాపరెడ్డి
గణేశ్వరీయము–పీఠిక ... శ్రీ నిడదవోలు వేంకటరావు
ప్రాచీనభుగోళము ... శ్రీ వేలూరి శివరామశాస్త్రి
వ్యాసావళి ... శ్రీ విస్సా అప్పారావు
హిందువుల పండుగలు ... శ్రీ సురవరం ప్రతాపరెడ్డి
శ్రీ పాణ్గార సుబ్బరాయశాస్త్రి వ్యాసాలు
శ్రీ రాళ్లపల్లి గోపాల కృష్ణమాచార్యుల వ్యాసాలు
శ్రీ గన్నవరపు సుబ్బరామయ్య వ్యాసాలు

**హిందీ :**

ఆర్యపర్వపద్ధతి ... శ్రీ భవానీప్రసాద్
జీవనసాహిత్య ... ఆచార్య కాకాకాలేల్కర్
వైదిక సంపత్తి ... పండిత రఘునందనశాస్త్రి
హమారే కుఛ్ ప్రాచీన లోకోత్సవ ... శ్రీ మన్మథ్ రాయ్

కన్నడము :

| | | |
|---|---|---|
| పురాణనామ చూడామణి | ... | శ్రీ బెనగల్ రామారావు,<br>శ్రీ పాణ్యం సుందరశాస్త్రి. |

ఇంగ్లీషు :

| | | |
|---|---|---|
| Gods of India | ... | *Rev. E. Osbrown.* |
| Hindu Fasts and Festivities. | | *Swami Sivananda.* |
| Hindu Feasts, Fosts and Ceremonies. | | *S. M. Natesa Sastry, B.A.* |
| Hindu Holidays and Ceremonials. | | *Rao Bahadur B. A. Gupte, F.Z.S.* |
| Mohinjodaro | ... | *Marshell.* |
| South Indian Festivities | ... | *Jagadesh Ayyar.* |

# అంకితము

శ్రీమాన్ వెంబాకు అంబాళం రామాచార్యులవారి
దివ్యసన్నిధికి
శ్రీమాన్ తిరుమల శేషాచార్యులవారి
దివ్యసన్నిధికి

## గౌ॥ డాక్టర్ బూర్గుల రామకృష్ణరావు గారు,
## గవర్నర్, ఉత్తరప్రదేశ్ లక్నో.
(18-1-'61)

" 'హిందువుల పండుగలు - పర్వములు' అను గ్రంథమును రచించిన శ్రీ తిరుమల రామచంద్రగారు సాహిత్య విమర్శకులుగను, పరిశోధనాసక్తిగల రచయితలుగను తెలుగు వాఙ్మయమునకు సుపరిచితులైన వారు......ఈ గ్రంథమునందు లభ్యమైన పూర్వవాఙ్మయమును పరిశీలించి ముప్పది పండుగలు - పర్వములను గురించిన పురాణేతిహాస కల్పశాస్త్రాధారములను సేకరించి, ప్రజానీకమందు ప్రచలితమైయున్న గాథలతోను విశ్వాసములతోను సరిపోల్చి, అవి ఎంతవరకు సమన్వయించునో చర్చించి విమర్శించినారు......అందఱకును రమగు సులభశైలిలో ముఖ్యమగు పండుగలను-పర్వములను గురించి ఈ గ్రంథమును రచించి ఆంధ్రలోకమున కందించిన రచయితలును, ప్రకాశకులును మిగుల ప్రశంసనీయులు."

## శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ గారు,
## తిరుపతి.
(17-1-'61)

"మీరు పంపిన 'హిందువుల పండుగలు-పర్వములు' అనుగ్రంథము చేరినది......పైగ్రంథమును పూర్తిగా చదివినాను. రచన శ్రీ తిరుమల రామచంద్రాచార్యు లొక్కరే చేయగలిగి నట్లున్నదని వ్రాయుటకంటె మరేమి వ్రాయగలను? విషయము ప్రామాణికమై, విస్తరమై, రచన నిర్మలమై యున్నది...."

## కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు,
## కరీంనగర్.

(16-1-'61)

"శ్రీ తిరుమల రామచంద్రగారు వ్రాసిన 'హిందువుల పండుగలు-పర్వములు' అన్న గ్రంథములో కొన్ని చదివితిని. శ్రీ రామచంద్ర గారు ప్రతివిషయమును గూర్చి యితరులకు మిగులకుండ వ్రాసిరి. ఎంతయో పరిశోధనయు నోర్పును కలిపి చేసిన పనిగాని సామాన్యమైనది కాదు. ఇది గొప్ప గ్రంథము."

## ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారు,
## తెలుగు శాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము.
## హైదరాబాదు.

(19-1-'61)

"శ్రీ తిరుమల రామచంద్రగారు వ్రాసిన 'హిందువుల పండుగలు-పర్వములు' అను పుస్తకమును కొన్ని భాగములు చదివి ఆనందించితిని. రామచంద్రగారు బహుగ్రంథ పఠితలుగను శ్రద్ధాళువులైన పరిశోధకులుగను ప్రతిష్ఠ సంపాదించి యున్నారు. ఈగ్రంథము వారి యశస్సునకు వన్నె తెచ్చునదిగా ఉన్నది."

## శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు గారు,
## ఆల్ ఇండియా రేడియో, హైదరాబాద్.

(29-1-'61)

"తాము ప్రచురించిన శ్రీ తిరుమల రామచంద్రగారి 'హిందువుల పండుగలు - పర్వములు' సావధానముగా పరిశీలించితిని. శ్రీ ప్రతాప రెడ్డిగారి గ్రంథముకంటె ఇందులో ముఖ్యమైన పండుగలను గూర్చిన

వివరాలు చాల ఎక్కువగా ఉన్నవి......ఎక్కుడు కృషి చేసి ఈగ్రంథమును రచించిన శ్రీరామచంద్రగారి పాండితికి నాజోహారులు."

## విద్వాన్ కె. సుబ్బరామప్ప గారు, ఎం. ఎ., బి. ఇడి.,

తెలుగు శాఖాధ్యక్షులు, మైసూరు విశ్వవిద్యాలయము,

మైసూరు.

(22-12-'60)

" 'హిందువుల పండుగలు - పర్వములు' రచయిత శ్రీ తిరుమల రామచంద్రగారు... తెలుగుసాహిత్య లోకమున చిరపరిచితులు. రచయిత అనేక గ్రంథములను పరిశోధించి మనపండుగ పర్వముల తత్త్వములను, ఆశయములను, అనుష్ఠానములను ఆధార సహితముగ విమర్శించియున్నారు..."

---

# విషయసూచిక

—:o:—



వినాయక వ్రతకల్పము

# 1. వినాయకచవితి

మనదేశమున త్రిమూర్తుల పిదప విశేషముగ పూజింపబడు దైవము వినాయకుఁడు—విఘ్నేశ్వరుడు. ఏ శుభ కార్యమయినను నిర్విఘ్నముగా కొనసాగుటకు

"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే."

అని వినాయకపూజతో ప్రారంభమగును. మన కవులును తమ కృతులను ఇష్టదేవతా స్తుతితో ప్రారంభించుచు, ఆ యిష్టదేవతలలో వినాయకునిగూడ చేర్చిరి. నన్నయ భట్టారకుఁడు,

"హరి హర రాజ గజాననార్క షడాస్య మాతృ సరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతికి న్నమస్కృతి సేసి"

పిదప ఆదికవి వాల్మీకిని స్తుతించి మహాభారత కావ్యరచన ప్రారంభించినాడు. శైవ వైష్ణవ మతములు పరస్పర ప్రత్యర్థులుగా ప్రబలిన పిదప ఈ విఘ్నేశ్వరార్చనము వైష్ణవులలో విష్వక్సేన పూజగా మారిపోయినది; 'శుక్లాంబరధరం' అన్న శ్లోకమునకు విష్ణు పరముగా నర్థ చెప్పుటయు సంభవించినది; వినాయకాదులు (గజానన, షడానన, హయానన నాదులు) విష్వక్సేనుని క్రింది సేనానులనియు సంప్రదాయ మేర్పడినది. ఈ గణపతినే ప్రధాన దైవముగా పూజించు శాఖవారిని గాణాపత్యులనుట తర్వాత తర్వాత ఏర్పడినది.

ప్రతి కార్యారంభమునను పూజింపబడుచున్న ఈ దేవుడు సంవత్సరమున కొకమారు భాద్రపద శుక్ల చతుర్థి నాడు విశేషముగ నారాధింప బడుచున్నాడు. ఈ దినము వినాయకుని జన్మదినముగా పరిగణింపబడుటచే వినాయక చతుర్థి వినాయకచవితి యని ప్రసిద్ధి పొందుటయు, వినాయక పూజ వైభవముతో ఈనాడే కావింపబడుటయును పరిపాటి యయినది.

ఈనాడు నైటికమతానుయాయులు ఇష్టార్థముల నిరంతర సిద్ధిని అభిలషించుచు మంగళస్నానాదు లాచరించి మంటితో వినాయకుని ప్రతిమచేసి గృహాంతర్భాగమునందలి అలంకృతమైన వేదికయందు ధాన్యరాశిపైగాని, తండులరాశిపైగాని దానిని నెలకొల్పి, వినాయకుని ఆవాహించి పూజనము కావింతురు. భాద్రపదమాసమునందు లభించు మాచిపత్రి, తులసి, బిల్వము, మరువము, బృహతి (వాకుడు), గరిక, ఉమ్మెత్త, రేగు, ఉత్తరేణి, మామిడి, గన్నేరు, విష్ణుక్రాంత, దానిమ్మ, దేవదారు, వావిలి, జాజి, గణకి, జమ్మి, రావి, మద్ది, జిల్లేడు—ఈ ఇరువదియొక్క పత్రులతోను, పుష్పములతోను పూజింతురు. తినుబండారము లలో కుడుములు, ఉండ్రాళ్లు వినాయకున కత్యంతము ఇష్టములు. కావున 21 విధములు నేతితో చేసి నైవేద్య మిత్తురు.

"నానాభాద్య మిదం దివ్యం సుష్టార్థం తే నివేదితం,
మయా భక్త్యా శివాపుత్ర గృహాణ గణనాయక.
......................

ఏకవింశతిసంఖ్యాకాన్ మోదకాన్ ఘృతపాచితాన్,
నైవేద్యం సఫలం దద్యాం నమస్తే విఘ్ననాశినే.''

అని అన్ని వ్రతగ్రంథములలోను నుడువబడినది. ఈ మాసమున పండు ఫలములు – నేరేడు, వెలగ మొదలగున వన్నియు నివేదింతురు. పిదప వినాయకవిగ్రహము సన్నిధియందు అఖండదీప మొకటి యుంతురు. ఈ దీపము మరునాటి సాయంకాలమువరకు నుండును. మరునాటి సాయంకాలము ఈ విగ్రహమును బావియందో, చెఱువుననో, నదియందో విసర్జింతురు. కొన్ని ప్రాంతములలో ఈ విగ్రహములను ధాన్యపు గాదెలలో నుంచుట, గోడలలోని గూళ్ళలో పెట్టి అద్దము వేసి మెత్తివేయుట యాచారము. దీనివలన ధాన్య మక్షయముగా నుండుననియు, అపుత్రలు పుత్రవతు లగుదురనియు ప్రజలలో విశ్వాసము గలదు.

కొన్ని ప్రాంతములలో వినాయకచతుర్థి మొదలు తొమ్మిది దినములు అనుదినమును పూజోత్సవాదులు జరుపుటయును గలదు. ఈ పద్ధతిని గణపతి నవరాత్రు లందురు.

ఇంతటి ప్రాముఖ్యము పొందిన ఈ దైవము పుట్టుకను గురించి పురాణములు పలువిధములుగ చెప్పుచున్నవి. లింగపురాణమున నీ గాథ గలదు :

అసురులును, రాక్షసులును శివునిగూర్చి తపమాచరించి పెక్కు వరములు బడసి, దేవతలను హింసించువారట. వారి హింసలను సహించక దేవతలు శివునియొద్ద మొర పెట్టుకొనిరి. శివుడు విఘ్నేశ్వరుని సృష్టించి రాక్షసుల తపస్సునకు

విఘ్నములు కల్పించుచు, దేవతలకు తోడ్పడుమనియు ఆదే
శించె నట. కావున విఘ్నేశ్వరుడు విఘ్నములు కల్పించుట
కును, నివారించుటకును సమర్థుడు. కనుక ప్రతి కార్యారంభ
మునను వినాయకుని పూజింపవలెను.

శివపురాణమున గణేశ ఖండమున మరియొక విధముగ
నున్నది : జయవిజయులు లోకమాత పార్వతిని దర్శించి శివునికి
నంది భృంగ్యాది పరిచారకులు ఉన్నారనియు, అట్టి పరిచార
కులు ఆమెకును ఉండవలెననియు మనవిచేసిరి. దానిని ఆమె
పాటించి ఒకనాడు అభ్యంగస్నాన మాచరింపబోయి నలుగు
పిండితో నొక బొమ్మనుచేసి, దానికి ప్రాణప్రతిష్ఠచేసి ఎవరిని
లోపలికి రానివ్వకుమని వాకిట కావలియుంచెనట. ఇంతలో
శివుడు ఆమెకోసము రాగా వినాయకు డాతనిని లోపలికి
బోనివ్వడాయెను. అంతట శివుడు ఉగ్రుడై అతని శిరశ్ఛేదము
కావించి, లోపలికి వెళ్లెను. పార్వతి యిది తెలిసి మిగుల
చింతించి తన యనుంగుబిడ్డను బ్రతికింపుమని శివుని వేడెను.
శివు డంగీకరించి ఉత్తరదిశకు తలయుంచి నిద్రించుచున్న ప్రాణి
శిరస్సును ఖండించి తెచ్చి యతని మొండెమున కతికింపుమని
యానతిచ్చెను. అట్లు నిద్రించుచున్నటి యొక్క యేనుగ దే
కనిపించినది. దాని శిరము ఖండించి ఆతని మొండెమున నతి
కించిరి. అప్పటినుండి వినాయకుడు గజాననుడాయెను.

శైవాగమములలో ప్రముఖమగు సుప్రభేదాగమములో
వినాయకోత్పత్తి యిట్లున్నది :

"అథాత స్సంప్రవక్ష్యామి విఘ్నేశస్థాపనం పరం,
ఆదౌ త్వహ ముమాసార్థం క్రీడార్థం హేమపర్వతే.

కరేణు శ్చ గజేంద్రేణ సంభోగ మకరో త్తతః,
యదృచ్ఛయా తు తం దృష్ట్వా తదాకార మగా మహం.
కరేణో రాకృతిం చోమా తదాక్రీడ మహం భృశం.
తస్యాం తు గర్భ మదధా త్తస్మి న్నా-తే త్వముద్భవః.''

శివుడే వినాయకునకు చెప్పుచున్నట్లున్న మాట లివి : నేను ఉమతోపాటు సోమవనమున విహరించుచుండగా ఒక ఏనుగులజంట క్రీడించుట చూచితిని. దానిని చూచినపిదప నేను మగయేనుగు నాకారమును, పార్వతి పిడియేనుగు నాకారమును స్వీకరించి క్రీడించితిమి. అప్పుడు పార్వతి గర్భము ధరించగా గజాననుడుదయించెను.

నన్నెచోడ మహాకవి రచించిన కుమారసంభవ మహాకావ్యమున ఈ విషయ మిట్లున్నది :

దక్షప్రజాపతి సృష్టికార్యారంభమున ప్రకృతి స్వరూపిణియగు మహామాయాదేవి నారాధించును. ఆమె ప్రసన్నయై నవయౌవనసౌందర్య విలాసములతో నొప్పారు రూపమున నతనికి ప్రత్యక్షమై వర మడుగు మనును. అతడు "నీవలెనే నవయౌవనస సౌందర్యవిలాసవతియగు నొక కూతును, పరమశివహృదయహారిణియగు దానిని దయ చేయు''మని వేడును. తదనుగ్రహమున నతనికి తాను కోరిన యట్టి కూతు రుద్భవించును. అత డామెను సతీదేవియను నామ మిడి పరమశివునకు భార్యగ నర్పించును. వారిరువురును రజతనగమున గజవనమున విహరించుచుండగా నచటికి ఏనుగుల గుం పొకటి వచ్చి విహరించుచు, ఎండవేడిమికి తాళ

జాలక అచ్చొటి కొలనిలో దిగి జలక్రీడ లాడ దొడగెను.
అప్పుడు,

"హృదయాహ్లాదముతోడ బాయక సదా
 నైకప్రకారంబులన్
మదనాసక్తి బెనంగుచున్న విలసన్
 మత్తేభ విక్రీడితం
బది దాక్షాయణి చూచి కౌతుకరతై
 కాలీన భావాభిలా
షదృగత్యుజ్జ్వల దీధితుల్ నెఱపె
 నీశానాననాబ్జంబుపైన్."

అప్పుడు శివుడా భావము గ్రహించి,

"సతి గరిణి యగుడు ద్రిజగ
త్పతి గరియై కూడె సతులు భావించిన యా
కృతి గూడ నేర్పు గాదే
యతిశయముగ నింగితజ్ఞులకు ఫలమెంచున్."

అప్పుడు సద్యోగర్భమున:

"పురుషాకారము బటుమద
కరివదనము గుజ్జుపాదకరములు లంబో
దరము హరినీలవర్ణము
గరమొప్పగ దాల్చి విఘ్నకరు డుదయించెన్."

ఆ సమయమున బ్రహ్మేంద్రాది దేవతలును, ఋషి
గణములును, అఖిల జగజ్జనములును గజవనమునకు జను

దెంచిరి. వారందరి ప్రార్థన నంగీకరించి ఆ కుమారునకు శివుడు "శివగణ సురగణ సమస్త గణాధిపత్యాఖిల క్రియారంభాధిపత్యముల"తో యువరాజపట్టము గట్టెను. క్రియారంభాధిపత్యముగల యా కుమారుడు కుపితుడై నచో క్రియాచరణమున విఘ్నము గలిగించుచునని భీతులై యప్పటి నుండి యెల్లవారును శుభాశుభకర్మారంభమున నియతముగా విఘ్నకరు నారాధింప దొడిగిరి.

ఈ కుమార సంభవముననే తారకాసుర సంగ్రామ ఘట్టమున

"ఉరుతర తనుడగు సద్భట
వరు నట్ట నిభంబుశిరము వడి నదికి బలో
త్కరమున బ్రతివీరభయం
కరుడై యుద్ధంబుచేసె గణపతి వోలెన్."

(11–179)

అని రణమున భటుని మొండెమునకు ఏనుగుతల నదికినట్లు వర్ణించుటవలన నలుగుపిండి బొమ్మ వృత్తాంతమును నన్నెచోడుని కాలమునను ప్రచారములో నున్నట్లు స్పష్టమగుచున్నది. గజాననుడు తారకాసురునిపై దండెత్తి తరలినప్పుడు తానును రిపుఖండనముసేయ

"నీలాద్రిపై నీల నీరదం బొఱగిన
కరణి మహా మూషికంబు నెక్కి"

బయలు దేరెనట. గణనాయకాష్టకమునను ఈ విషయము వర్ణించబడినది :

"మూషికోత్తమ మారుహ్య దేవాసుర మహాహవే,
యోద్ధుకామం మహావీర్యం వందేహం గణనాయకం."
మౌంజీ కృష్ణాజినధరం నాగయజ్ఞోపవీతినం,
లంబోదరం విశాలాక్షం వందేహం గణనాయకం."

మీద వివరించిన గాథలను, స్తోత్రములను బట్టి వినాయకుడు గజరూపుడనియు, ఏకదంతుడు, మూషిక వాహనుడు, బ్రహ్మచారి, లంబోదరుడు ననియు తెలియుచున్నది.

"వినాయకో విఘ్నరాజ ద్వైమాతుర గణాధిపాః,
అప్యేకదంత హేరంబ లంబోదర గజాననాః."

అని అమర సింహుడు తన నామ లింగాను శాసనమున వినాయక పర్యాయముల నిచ్చినాడు.

ఈ వినాయకచవితి వ్రతమును సిద్ధి వినాయక వ్రత మని వ్రతగ్రంథములు నుడువుచున్నవి. "భాద్రపద శుక్ల చతుర్థ్యాం సిద్ధి వినాయక వ్రతం...ఇయం రవి భౌమవారయోగే ప్రశస్తా." (భాద్రపద శుద్ధ చవితినాడు సిద్ధివినాయక వ్రతము. ఈ చతుర్థి రవిభౌమ సంబంధము కలిగిన ప్రశస్తము.) అని ధర్మసింధుకారు డనినాడు. నిర్ణయసింధువు లోను నిట్లే తెలుపబడినది. స్కాందపురాణమున గల ఈ వ్రతమును హేమాద్రి యిట్లు తెలిపినాడు.

నైమిశారణ్యమున శౌనకాది మహామునులు "సర్వ కార్యములు నిర్విఘ్నముగా సిద్ధించు మార్గమేది? ప్రజలకు పుత్ర సౌభాగ్య సంపదలు కలుగుట యెట్లు? వివాహాదుల

దంపతులు, బంధువులు మరల కలయుట యెట్లు? ఉదాసీనులు సమ్ముఖులగుట యెట్లు? విద్యారంభమందును, వాణిజ్యమునందును, కృషియందును, రాజులకు పరరాష్ట్ర దండయాత్రయందును జయ మెట్లు సిద్ధించును? ఏ దేవతను నమస్కరించి పూజించిన సిద్ధి కలుగును?" అని సూతుని ప్రశ్నించిరి. సూతు డిట్లు సమాధాన మిచ్చెను: "పూర్వము కురు పాండవ సేనలు నిలువబడినప్పుడు ధర్మరాజు దేవకీనందనుని చూచి, 'మనకు నిర్విఘ్నముగా జయమెట్లు లభించునో చెప్పుము' అని కోరెను. 'గణాధ్యక్షుడగు విఘ్నేశ్వరుని పూజింపుము. అతడు సిద్ధి దాయకుడు. అతనిని పూజించిన సర్వాభీష్టములు పొందుదువు' అని కృష్ణుడనెను. 'ఆ గణాధిపుని ఎట్లు పూజించవలెను. ఏతిథియందు గణాధిపతి సిద్ధి దాయకు డగును?' అని యుధిష్ఠిరుడు మరల ప్రశ్నించెను. "భాద్రపద శుక్ల చతుర్థినాడు భక్తితో పూజింపవలెను. సకల విషయములు లభించును' అని కృష్ణుడు తెలిపెను."

భవిష్యోత్తపురాణమునను ఇట్లే వ్రతవిధాన వివరింపబడి యున్నది.

వినాయకచవితినాడు చంద్రుని చూచుట వలన లేని పోని యపవాదములు కలుగు చుండునని పురాణము లుద్ఘోషించు చున్నవి. ఈదోష పరిహారార్థము

"సింహః ప్రసేన మవధీత్ సింహో జాంబవతా హతః,
సుకుమారక మారోదీః తవ హ్యేష శమంతకః."

అను శ్లోకము పఠింపవలయుననియు, శమంతకోపాఖ్యానమును వినవలయునని, అట్లు వినిన దోషముండదనియును పురాణములును, వ్రతగ్రంథములు నుడువుచున్నవి.

"అత్ర చతుర్థ్యాం చంద్రదర్శనే మిథ్యాభిదూషణం దోషః......దర్శనే జాతే తద్దోషశాంతయే 'సింహః ప్రసేన మవధీ త్సింహో జాంబవతా హతః, సుకుమారక మారోదీః తవహ్యేష శ్యమంతకః' ఇతి శ్లోకజపః కార్యః."
అని ధర్మసింధుకారుని ఆదేశము.

ఈ నాడు చంద్రదర్శనము దోషమగుటకు కారణముగా నీ క్రిందిగాథ స్కాందపురాణమున సూతశౌనక సనత్కుమార సంవాదమున నున్నది. నారదుడు శ్రీకృష్ణున కిట్లు చెప్పుచున్నాడు:

"గణపతిని రుద్రుడు గణాధిపత్యమున నియమించగా, బ్రహ్మదేవుడు అణిమాద్యష్టసిద్ధులను అతనికి భార్యలుగా జేసెను. దాని కతడు ప్రీతుడై బ్రహ్మను వర మడుగుమనెను. నా సృష్టికార్యము నిర్విఘ్నముగా కొనసాగునట్లు వర మిమ్మని బ్రహ్మ కోరెను. గణపతి 'తథాస్తు' అని మోదకములను చేతబట్టి మూషిక వాహనము నెక్కి సప్తలోకములను విహరించి వచ్చి, చంద్రలోకమునకు వెళ్లెను. రూపమదాన్వితుడైన చంద్రుడు వినాయకునిరూపము పరిహసించెను. దానికి గణపతి కుపితుడై 'నీ ముఖము చూచినవారందరు అపనింద పాలగుదురు' అని చంద్రుని శపించెను. శాపభీతుడగు చంద్రుడు జలనిధిలో దాగెను. లోకములు

అంధకార బంధురము లయ్యెను. లోకములు నిశ్చంద్రము లగుట సహించక దేవతలు, ఇతరులు చంద్రుని శాపమును మరల్ప వినాయకుని ప్రార్థించిరి. వినాయకుడు ప్రసన్నుడై "భాద్రపదశుక్ల చతుర్థినాడు నన్ను దర్శించు వారికి మాత్రమే సంవత్సర పర్యంతము ఈ మిథ్యాపవాద దోషముండును; మాసాదిలో దర్శించిన నుండదు." అని సెల విచ్చెను. ప్రమాదవశమున ఆనాడు చూచిన కలుగు దోష మెట్లు పరిహారము కాగల దని యడుగగా, "ఆదినమున నన్ను పూజించి శమంతకోపాఖ్యానమును వినిన నెట్టి నీలాప. నిందలును రావు" అనెను. అందువల్లనే ద్వితీయనాడు చంద్రుని దర్శించు నాచారమయినది.

ఈ చంద్రదర్శన కార్యము నాధారము చేసుకొని, కొందరు కొంటెకాయలు పలువురు నడచు బాటలలో పల్లేళ్లు, ముండ్లు చల్లుదురు. ఇక కొందరు త్రోవను పోవువారి మీద కుడుములు, ఉండ్రాళ్లు మొదలయిన వానిని విసరు దురు. పల్లేళ్లు ముండ్లు తొక్కినవారు, కుడుములు మొదల యినవాని దెబ్బలు తిన్నవారు కొంటెకాయలను నిందింతురు. వారు ఆ నిందలకు లోలోన సంతసిల్లుచు చంద్ర దర్శనముచేసి కృతకృత్యు లగుదురు.

మిథ్యాపవాదమును తొలగించుకొనుటకు వినవలసి నదిగా తెలిపిన శమంతకోపాఖ్యానము హరివంశ, విష్ణుపురాణ, భాగవత, స్కంద పురాణములలో గలదు. మొదటి రెండిటి లోని కథలో చంద్రదర్శనమునకు ప్రసక్తి యేమియు లేదు.. ఆ కథాసంగ్రహ మిది.

ద్వారకను ఉగ్రసేను డేలుచున్నప్పుడు వృష్ణివంశము లోని వాడగు నిఘ్నుడను వానికి ప్రసేన సత్రాజిత్తులను కుమారు లుండిరి. సత్రాజిత్తు సూర్యభక్తుడై యొకమారు సముద్రతీరమున సూర్యుని గూర్చి తపమాచరింప, సూర్యుడు ప్రసన్నుడై ప్రత్యక్షమై వర మడుగు మనెను. సత్రాజిత్తు సూర్యుడు ధరించిన దేదీప్యమానమగు శమంతకమణిని కోరెను. సూర్యుడు ఆశ్యమంతమణిని ప్రసాదించి యదృశ్యు డాయెను. సత్రాజిత్తు మణిని ధరించి ద్వారకకు తిరిగిరాగా, ప్రజలందరును మిగుల నాశ్చర్యపడిరి.

ఆమణి దినమునకు ఎనిమిది బారువల బంగారు రత్నములను కురిపించుచుండెను. అది యెక్కడున్న నక్కడ క్షామాది దుఃఖము లుండవు. కృష్ణు డది చూచి, యదు రాజగు నుగ్రసేనునియొద్ద నుండదగినదని, దానిని ఉగ్రసే నున కిచ్చివేయుమని సత్రాజిత్తును కోరెను. కృష్ణుని కోరి కను సత్రాజిత్తు నిరాకరించెను. కాని, కృష్ణు డెట్లయినను తన మణిని అపహరించునని సత్రాజిత్తు భయపడి, దానిని అన్నయగు ప్రసేనున కిచ్చెను. అశుచియై ధరించుటవలన మణి యపాయము కలిగించునని తెలియని ప్రసేనుడు ఒకనాడు దానిని ధరించి వేటకు వెళ్లెను. అచట నొక సింహ మతనిని చంపి, రత్నమును నోట కరచుకొని పోవుచుండగా, పరా క్రమశాలియగు జాంబవంతుడు దాని నడ్డగించి, చంపి, రత్నమును గొని తన గుహకు వెళ్లి సుకుమారుడను తన కుమారునికి ఆటలాడు కొన నిచ్చెను.

వేటకు వెళ్లిన ప్రసేనుడు ఎంత కాలముకును తిరిగి రాకపోగా, నతని బంధు మిత్రులు ఆందోళన చెంది, మణిలోభమున కృష్ణుడే యతనిని చంపించెనని యాడికలు ప్రారంభించిరి. కృష్ణు డా యపవాదును తొలగించుకొనుటకు పరిజనముతో ప్రసేనుని వెదకుచు వచ్చి, వింధ్యాటవిలో నొకచోట ప్రసేనుడు మరణించియుండుట చూచి, యాతని దేహామంతటను మణికోసమై వెదకెను. మణి కనిపించలేదు. ఆ శవమునకు కొంత దూరముననే చచ్చిపడియున్న సింహాము, దానిచుట్టును ఎలుగుబంటి యడుగు జాడలును కని పించెను. ఆ జాడ లొక గుహాలయమునకు దారి తీసెను.. గుహాలయములోపల ''సింహాము ప్రసేనుని వధించెను. ఆ సింహామును జాంబవంతుడు చంపెను. సుకుమార! ఏడువ కుము. శమంతకమణి నీదే.'' (సింహః ప్రసేన మవధీత్ సింహో జాంబవతాహతః, సుకుమారక మారోదీః తవ హ్యేషః శమంతకః) అని ఎవరో దాది ఒక బాలుని ఊరడించు ధ్వని వినబడెను. కృష్ణు డొక్కడు దటుసు గుహాలో ప్రవేశించి మణిని తీసుకొనబోగా, దాది భీతయై కెవ్వున కేకవేసెను. అది విని జాంబవంతుడు వచ్చి, కృష్ణునితో తలపడెను. ఆ యుద్ధము ఎనిమిది దినములు జరిగెను. రక్త ప్రవాహాములు గుహాముఖమున పారెను. అది చూచి గుహాముఖమున కాచుకొనియున్న పరిజనులు కృష్ణుడు మరణించెనని శంకించి, దుఃఖించుచు ద్వారకను మరలి వచ్చి, యావార్తను బంధుమిత్రుల కెరుక పరచిరి. వారును దుఃఖించి శ్రాద్ధాదు లొనర్చిరి. జాంబవంతుడును కృష్ణుని

నిజతత్త్వము నెరిగి లొంగిపోయి, తన కుమార్తె జాంబవతిని, శమంతకమణిని కృష్ణునికి సమర్పించెను.

కృష్ణుడు తిరిగి రాగా, ఊరంతయు సంతోషించెను. కృష్ణుడు పిదప సకల యదు వృష్ణి భోజ కాంధక సభను ఏర్పాటుచేసి, యావద్వృత్తాంతమును వివరించి, తన యపవాదును కడిగి వేసుకొని, మణిని సత్రాజిత్తునకు అప్పగించెను. సత్రాజిత్తు పశ్చాత్తాపపడి, తన యనుమానమునకు ప్రాయశ్చిత్తముగా తనకూతురు సత్యభామను కృష్ణునికిచ్చి వివాహము చేసెను.

ఇట్లుండగా లాక్షాగృహదహనానంతరము కృష్ణుడు వారణావతమునకు వెళ్లెను. ఆ యదను చూచి శతధన్వుడను వాడు సత్రాజిత్తును చంపి మణి నపహరించెను. సత్యభామ రథముపై వారణావతమునకు వెళ్లి తన జనకుని మరణవార్తను కృష్ణునికి తెలిపెను. అతడు వెనువెంటనే తిరిగివచ్చి, శతధన్వునిచంపి మణిని గ్రహించవలెనని బలరామునితో నాలోచించుచుండగా, అది తెలిసి శతధన్వుడు మణిని అక్రూరునికి అప్పగించి, గుర్రమెక్కి పారిపోయెను. కృష్ణుడు బలరామునితోపాటు వానిని తరిమి చంపి, మణికోసము వెదుకగా మణి కనిపించలేదు. బలరాముడది నమ్మక కృష్ణుడే మణి నపహరించి, తనను కూడ మోసగించెనను ననుమానముతో ద్వారక వదలి మిథిలకు వెళ్లిపోయెను.

శమంతకమణి ప్రభావమువలన ద్వారకలో అక్రూరుడు మహావైభవముతో దానధర్మములు చేయుచుండెను.

ఇట్లుండ భోజులు శత్రుఘ్నుడను యాదవుని చంపినందులకు అతడు విచారపడి ద్వారకను వదలిపోయెను. అతనితోపాటు శమంతకమణియును ద్వారకను వీడిపోవుటవలన ద్వారకలో ఉత్పాతములు పుట్టెను. కృష్ణుడు అక్రూరునియొద్ద మణియున్నదని గ్రహించి, అతనికడకు వెళ్ళి, మణిని అప్పగించి తనకు కలిగిన మిథ్యాపవాదమును తొలగింపుమని కోరెను. అక్రూరుడు సంతోషించి, "కృష్ణా! నీవు సకలము నెరిగినవాడవు. నీవు అడిగిన మణిని ఇత్తమని తలచితిని. ఇదిగో తీసుకొనుము. నీ కిష్టమున్నవారి కిమ్ము." అనెను. కృష్ణుడు తీసుకొని వెళ్లి ఆత్మశుద్ధికొరకు తన బంధువులందరికిని చూపి, మరల అక్రూరునికి ఇచ్చివేసెను. అది మొదలా మణి అక్రూరునికడనే యుండెను.

"జలజనాభు మిథ్యాభిశంసనవిముక్తి
యైన యిక్కథ చదివిన ననుదినంబు
వినిన దలచిన నడిలేక జనులు సర్వ
దోషరహితులై పొందుచుందురు శుభంబు."

(ఎఱ్ఱన హరివంశము.)

మిథ్యాపవాద సంగతి యెట్లు తొలగునని కృష్ణుడు చింతించుచుండగా నారదుడు వచ్చి, "నీవు భాద్రపద శుద్ధ చవితినాడు చంద్రుని జూచిన దోషమున నిట్టి నిందకలిగెను. కనుక వినాయకుని పూజింపుము" అని బోధించెనని స్కాంద పురాణమున గలదు.

వినాయకుడు ఏకదంతుడైన గాథ మిగుల కుతూహలము కలిగించును. పరశురాముడు పరమేశ్వరుని శిష్యుడు; అతనియొద్ద ధనుర్విద్య నభ్యసించినవాడు. ఒకనాడతడు కైలాసమునకు వచ్చి తన గురువును దర్శించబోయెను. పరమేశ్వరుడు నిద్రించుచుండెను. ద్వారముకడ గణనాయకుడు కావలియుండెను. పరశురాముడు లోపలికి వెళ్ళబోగా, వినాయకుడు అడ్డగించెను. పరశురాముడు కోపోద్రిక్తుడై తాను గురువును దర్శింపబోగా, అడ్డగించువాడు వీడెవడని బలదర్పమున అదలించెను. ఇరువురును పోరునకు తలపడిరి. పరశురాముడు ఓడిపోవొడగెను. వినాయకుడు తన తొండముతో అతనిని చుట్టి పట్టుకొని గిరగిర త్రిప్పి విసరివైచెను. దానితో పరశురాముడు స్మృతిలేక పడిపోయెను. తర్వాత కొంతసేపటికి తెలివి తెచ్చుకొని, తన పరశువును వినాయకునిపై విసరెను. ఆ పరశువు పరమేశ్వరుడు పరశురామునికి పారితోషికముగ నొసగినదే. కనుక దానిని అవమానించుట పాడి గాదని వినాయకుడు సాదరముగా తన దంతము నొకదానిని ఒగ్గెను. పరశువు అతని దంతమును భగ్నమొనరించెను. దీన నతడు ఏకదంతు డాయెనట.

ఈ పురాణగాథ లెట్లున్నను వినాయకుడు కేవలము విఘ్ననియంతగనేకాక, విద్యాధిదైవతముగను, లేఖన సంప్రదాయ ప్రవర్తకుడుగను, బ్రహ్మచర్య దీక్షాస్వరూపుడుగను అనాదిగ పూజింపబడు చున్నాడు. ఋగ్వేదము

"గణానాం త్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనా ముపమశ్రవ స్తమమ్,
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనః శ్రుణ్వ న్నూతిభిః సీదసాదనమ్."

అని గణపతిని బ్రహ్మణస్పతిగను, విద్యాధిదేవతగను పేర్కొన్నది. యాస్కాచార్యుడు తన వేద నిఘంటువనగు నిరుక్తమున గణశబ్దమును వాక్కునకు పర్యాయముగ స్వీక రించినాడు. సమానార్థ ద్యోతకములగు పదములు గణము లనియు, వాని కధిపతి గణపతియనియు, అతడే బ్రహ్మణస్పతి యనియు ప్రాచీనార్యులు భావించిరని మ్యూర్ అను పాశ్చాత్య పండితుడు అభిప్రాయపడినాడు.

నేటికిని భారతదేశమున పలు ప్రాంతములలో "శ్రీ గణేశాయ నమః" అని గణపతి నమస్కారముతోనే అక్షరా భ్యాస కర్మ జరుపబడుచున్నది. వీరశైవ సంప్రదాయము ప్రబలిన తర్వాత "ఓం నమశ్శివాయ" (ఓ నామాలు సీనాలు) అనుటతో అక్షరాభ్యాస మాంధ్ర కర్ణాటక దేశములలో వ్యాపించినది.

వేదవ్యాసునకు గణాధిపతి లేఖకుడుగా నుండెనను గాథ యందరకును విదితమే. వ్యాసమహర్షి భారతేతి హాసము రచింపదలచి తగిన లేఖకుడు లభించలేదను ఆలోచ నలో నుండగా, "పరం న లేఖకః కశ్చి దేతస్య భువి విద్యతే" ఈ ఇతిహాసమును వ్రాయుటకు భూలోకమున లేఖకుడు లేడ యను విచారమును బ్రహ్మకు తెలుపగా, నతడు "కావ్యస్య

లేఖనార్థాయ గణేశ స్స్మర్యతాం మునే'' ఈ కావ్యలేఖన మునకు గణపతిని స్మరింపుము—అని ఉపదేశించెను. బ్రహ్మ మాటమేరకు వ్యాసుడు గణపతిని స్మరించగా, నతఁడు ప్రత్యక్షమై...

''............యది మే లేఖినీ క్షణం,
లిఖతో నావతిష్ఠేత తదా స్యాం లేఖకో హ్యాహం.''

నేను వ్రాయునపుడు నా లేఖని ఒక్క—క్షణమైనను ఆగుటకు వీలులేదు. అట్లయిన నేను వ్రాయుదును—అని షరతు పెట్టెనట. వ్యాసుడు దాని కొడబడి,

''......తదేవ మబుధ్వా మాలిఖ క్వచిత్,
ఓ మిత్యుక్త్వా గణేశోపి బభూవ కిల లేఖకః''

నేను చెప్పుచున్నప్పుడు అర్థము చేసికొనకుండ నీవు వ్రాయ కుము. అర్థము చేసుకొనుచు వ్రాసిన నీ లేఖని యాగకుండ చెప్పెదను అనెను. అట్లైన సరేయని గణేశుడు లేఖకు డాయెను.

ఈ కథ నన్నయ భారతోపక్రమణికలో లేకున్నను అనూచానముగ జనశ్రుతిగా వచ్చుచున్నది. మూలభారతము లోను కొన్ని ప్రతులలో లేదని పండితులు చెప్పుచున్నారు. కాని, రాజశేఖర కవి (క్రీ. శ. 940) తన బాలభారత నాటకమున

''వినాయకో య శ్శివయో రపత్య
మర్థం పుమా సర్థ మిభశ్చ దేవః,

స వర్తతే భారత సంహితాయాం
వృత్త స్తపోభి ర్నమ లేఖకోత్ర.''

"'పార్వతీ పరమేశ్వరుల పుత్రుడును, సగముఏనుగు, సగము మానవరూపము గలవాడును నగు దేవుడు నాతపఃఫలముగా భారత సంహితకు లేఖకుడుగా కుదిరినాడు'' అని వ్యాసుడే తెలిపినట్లు వ్రాసినాడు. కేవలము జనశ్రుతియని నన్నయగారు దీనిని వదలివేసి యుండవచ్చును.

వినాయకుడు బ్రహ్మచర్య దీక్షాస్వరూపుడుగ వర్ణింపబడినాడని ఇదివరకే యంటిని. బ్రహ్మచర్య దీక్షకు మన గ్రంథములలో మిగుల ప్రాధాన్య మియ్యబడినది. బ్రహ్మచర్యము సకలార్థ సిద్ధిదాయకమని మన పూర్వుల విశ్వాసము. కనుకనే గణపతి పెండ్లికి విఘ్నములును కల్పింపబడినవి. ''విఘ్నేశ్వరుని పెండ్లికి వేయి విఘ్నాలు'' అను సామెతయు నేర్పడినది. వినాయకుని పెండ్లి విషయమున పురాణములలో చిత్రమైన గాథ యొకటి కలదు. పార్వతీ పరమేశ్వరులు అతనిని పెండ్లిచేసుకొమ్మని కోరిరట. తల్లి యగు పార్వతీదేవితో అన్నిటా తులదూగు కన్యను పెండ్లాడుదునని వినాయకుడు తెలిపెనట. కాని, సమస్తలోకములకు జనని, శక్తిరూపిణియగు పార్వతితో సాటియగు కన్య లభింపుట యెట్లు? దానికై అప్పటినుండి యిప్పటివరకును కన్యాన్వేషణ తత్పరుడై శివాలయములముందు మూషిక వాహనుడై తిష్ఠ వేసుకొని దేవదర్శనమునకై వచ్చు స్త్రీల నుండ

రినీ పరిశీలించుచున్నాడట. అందువలన ఇంతవరకును పెండ్లి కాక ఉన్నాడట.

కాని, శివపురాణములో వినాయకునికి బుద్ధి, సిద్ధి యను భార్య లున్నట్లు గాథ గలదు. ఒకనాడు పార్వతీదేవి తనకుమారులగు గజానన షడాననులను పిలచి, "నాయొద్ద బుద్ధి, సిద్ధి యను నిద్దరు కన్య లున్నారు. ఏడుసార్లు భూప్రదక్షిణ మొనర్చి ముందుగా వచ్చువారికి ఆ కన్యలనిచ్చి పెండ్లి చేతును." అని చెప్పెను. వారిద్దరును తమ తమ వాహనముల నెక్కి భూప్రదక్షిణమునకు బయలుదేరిరి. కాని, యెలుక నెమలితో పోటీపడుట సంభవమా? కనుక వినాయకునికి చక్కని యుపాయము తోచినది—మాతృదేవి భూమికన్నను గొప్పది. ఆమెను ఏడుసార్లు ప్రదక్షిణముచేసిన భూప్రదక్షిణమంత ఫలము కలుగగలదు అని. వెంటనే అతడట్లు చేసెను. పార్వతీదేవి అతని తెలివి తేటలకు మెచ్చి ఆ యిద్దరు కన్యల నిచ్చి వివాహముచేసెను. ఆ బుద్ధి సిద్ధులకు క్షేముడు, లాభుడు అను కుమారులు పుట్టిరట. దీనినిబట్టి బ్రహ్మచర్యము వలన బుద్ధి సూక్ష్మత, కార్యసిద్ధి కలుగుననియు, వానివలన క్షేమలాభములు కలుగుననియును కదా యర్థము!

వినాయకుడు విద్యారంభ దైవత మనుటకు సామవేదులగువారు వినాయకచవితినాడే ఉపాకర్మ చేయుటయు నిదర్శనము. (దీనిని శ్రావణ పూర్ణిమలో చూడుడు.)

తంత్రశాస్త్రములలో వినాయకుడు త్రికోణ మధ్యగతు డుగా వర్ణితుడయినాడు. దీక్షితులవారి సుప్రసిద్ధమగు "వాతాపిగణపతిం భజే" అను కృతిలో వినాయకుడు "త్రికోణ మధ్యగతుడు"గా పేర్కొనబడినాడు. ప్రపంచ మూలకారణమగు పరమేశ్వరుని ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులను ఈ సమ త్రిభుజాకారమగు త్రికోణయంత్రము సూచించునని పెద్దలు తెలుపుచున్నారు. ఈ మూడింటి మధ్యనున్న వినాయకుడు–ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తిస్వరూపి యగుచు సకలశుభ లాభ దాయకుడనుట చర్విత చర్వణము.

వాతాపియనునది ప్రాచీన చాళుక్యుల రాజధాని. అక్కడి గణపతి వాతాపి గణపతి. వాతాపి నేడు బాదామి యని వ్యవహరింప బడుచున్నది. నేడు దక్షిణ భారత దేశ మున విరివిగా గణపతి పూజలు జరుగుచున్నవిగదా! 13 వందల ఏండ్లకు ముందు అంత విరివిగా లేదు; సుబ్రహ్మణ్య పూజలే హెచ్చు. పల్లవరాజగు నరసింహవర్మ బాదామి పట్టణమును ముట్టడించి పులకేసి చక్రవర్తిని జయించి, విజయ చిహ్నముగా తన రాజధానియగు కంచిలో విఘ్నేశ్వర మందిరమును నెలకొల్పెను. (రాజులు తమ విజయ చిహ్న ముగా శత్రురాజుల కులదైవముల మందిరములను నెల కొల్పుట సంప్రదాయము. శ్రీ కృష్ణదేవరాయలు సింహాచల విజయము తర్వాత తన రాజధానియగు విజయనగరములో ఉగ్రనరసింహ విగ్రహమును, తిరువనంతపుర విజయము తర్వాత అనంతశయన గుడిని నిర్మించెను. ఆర్కాటు ముఖలింగ మును గెలిచిన పిదప బడివేలింగ ఆలయమును స్థాపించెను.)

అప్పటినుండి వినాయకుని పూజలు తమిళనాడులో వ్యాపించె నని తమిళ విద్వాంసులు డాక్టర్ మీనాక్షి, శ్రీ సేతుపిళ్లే మొదలగు వారు తెలుపుచున్నారు. ప్రాచీన తమిళ సాహిత్యము జైనమత ప్రాబల్యముగలది గనుక, ఇటీవలి వరకు విఘ్ననాయకుని ప్రశంస కనుపించదు.

ఎలుక యెట్లు తన వాడి దంతములతో భూమిని ఛేదించి బొరియలు చేసుకొని నివాసముల నేర్పరచుకొనగలదో, అట్లే బ్రహ్మచారియు తన నిశితబుద్ధితో ప్రతిగహన విషయమునను ప్రవేశించగల డనుటకు తార్కాణముగ ఎలుకతో వినాయకునికి సంబంధము కల్పింపబడినదనియు నొకరు నుడివిరి.

కాని కొందరు పాశ్చాత్య పండితులు ఈ గణపతి స్వరూపము, పూజనము బౌద్ధమత ప్రభావమువలన వైదిక మతములో ప్రవేశించినవని అభిప్రాయపడుచున్నారు. బుద్ధుని జన్మవృత్తాంతముతో ఐరావతమునకు సంబంధము గలదు. మాయాదేవికి తెల్ల యేనుగు స్వప్నమున కనిపించినట్లు జాతక కథలలో గలదు. బుద్ధుడు ఒకానొక జన్మలో ఏనుగుగా నుండి, పిడియేనుగు వ్యామోహమునబడినట్లొక జాతక కథలో గలదు. బుద్ధునికిని వినాయకుడను పే రున్నది. ''షడభిజ్ఞో దశబలో అద్వయవాదీ వినాయకః'' అని అమరకోశమున బుద్ధ పర్యాయములలో వినాయక నామమును గలదు. వినయతి శిక్షయతి దుష్టాన్ విఘ్నాంశ్చేతి=వినాయకః (దుష్టులను, విఘ్నములను అదుపున బెట్టువాడు.), విగతో నాయకః

యస్య సః=వినాయకః (నాయకుడు లేనివాడు, స్వతంత్రుడు) అని వినాయక శబ్దమునకు వ్యుత్పత్తులు కలవు. కనుక బౌద్ధ మత వ్యాప్తి తర్వాతనే గజానన దైవము వైదికమతమున చోటు చేసుకొనినదని వీరి వాదము.

ఈ వాదము మూలములేనిదని 'విద్యారత్న' (శ్రీ) నిడదవోలు వేంకటరావుగారు గణేశ్వరీయము పీఠికలో ఖండించినారు. బౌద్ధమతావతరణమునాటికే వైదికసంప్రదాయమున గణపతికి స్థానము గలుగుటచేత బౌద్ధులే తాంత్రికవిధానమున గణపతికి తమ వాఙ్మయమున స్థానము కల్పించిరని వారు తెలిపిరి. క్రీస్తు శకము మొదటి శతాబ్ది నాటిదని చరిత్రకారు లనుచున్న హాలుని గాథాసప్తశతిలో గణపతి చేష్టిమును వర్ణించు నొక చక్కని గాథయున్నది.

హేలా కరగ్గయట్టిఅ
జలరిక్కం సాఅరం ప్రఅసంతో,
జఅఇ అణిగ్గఅ వడవ
గ్గి భరిఅ గగణో గణాహివఈ. (5-3)
(హేలాకరాగ్రాకర్షిత జలరిక్తం సాగరం కలయన్,
జయ త్యనిగ్రహ బడబాగ్ని భృతగగనో గణాధిపతిః.)

గజానను డు సరదాకోసము తన తొండముతో సముద్రములోని నీటినంతా పీల్చివేసెనట. సముద్రము వట్టిపోయినది. బడబాగ్ని ఆకాశమును కప్పినది. అట్టి గణాధిపతి జయించుచున్నాడు!—అని దీని భావము. రెండువేల యేండ్లనాటి హాలు

వులలోనే వ్యాపించిన గణాధిపతి బౌద్ధులనుండి వైదికమతము నకు వచ్చినవాడు కాడనుట నిశ్చయము.

"హిందూయిజం" అను ఆంగ్లగ్రంథకర్తలగు శ్రీ గోవిందదాసుగారు వినాయకుడు అనార్యుల దేవతయనియు, ఆర్యానార్య సంబంధము ప్రబలిన తర్వాత ఆర్యులచే పూజింపబడజొచ్చెననియు అన్నారు. వారి వాద మిట తెలుపుచున్నాను: "ఆధునికులలో ప్రతి కార్యమునకును ప్రారంభమున వికారస్వరూపుడగు వినాయకుని పూజించుట యాచారమయినది. ఈ వికార స్వరూపమున నేదియో పర మార్థ మున్నదని కొందరు వ్యాఖ్య చేయుదురు. యాజ్ఞవల్క్యస్మృతిలో నీతడు దుష్టదేవతగా పరిగణించబడెను (1-270, 289, 293). వాల్మీకి యితనిని స్మరించలేదు. గనుక రామాయణకాలమున కానరాడు. "గణానాం త్వా గణపతిం హవామహే" అను ఋగ్వేదమంత్రము బృహస్పతికి సంబంధించినది. ఈ దైవము ప్రబలిన పిదప, దీనికి ఈ మంత్రమును అన్వయించబడినది. గృహ్యసూత్రములలో ఈ గణపతి ఒక దేవతగా గాక నలుగురు దేవతలుగా-శలకటంకట, కూష్మాండ రాజపుత్ర, అజస్మిత, దేవయజను లను వారుగా-నుండి మనుష్యులను పీడించుచుండెడివారని యున్నది. యాజ్ఞవల్క్యుని కాలమున ఈ దేవతలు నలుగురు ఒక్కరై పేర్లు మాత్రము శల, కటంకట, కూష్మాండ, రాజపుత్ర, మిత, సమ్మితయని ఆరయినవి. ఇట్లు సూత్రకాలమున ఏకాదశ రుద్రులు ఒక్క మహాదేవుడుగను, నలుగురు వినాయకులు ఒక్క గణేశుడుగను మారిరి. విఘ్నకారకుడును,

విరూపుడును అగు ఈ అనార్య దేవతను భయముతో ఆర్యులు కొలుచుట నారంభించిరి. వేదమంత్రములతోను సమన్వయించిరి.''

ఈ గణపతికి పురాణకాలమున మిగుల ప్రాధాన్య మేర్పడినది. వామాచారపద్ధతి ప్రకారము, తాంత్రిక పద్ధతి ప్రకారము పెక్కు సంప్రదాయ భేదములును ఏర్పడి నవి. వానిలో ముఖ్యమయినవి ఎనిమిది : లక్ష్మీగణపతి, ఊర్ధ్వగణపతి, సిద్ధిగణపతి, చింతామణి గణపతి, శక్తిగణపతి, ఉచ్ఛిష్టగణపతి, ఏకాక్షరగణపతి, కుమారగణపతి.

ఏనుగుతల బుద్ధికిని, ఎలుక శ్రద్ధకును చిహ్నము లనియు, విజయమునకు ఈ రెండును ఆవశ్యకములు గనుక స్థానికమైన కట్టుకథలతో నీ రూపము రూపొందినదని యొక పండితు డన్నాడు.

వినాయకుడు పంటల దేవుడని రావుబహదూర్ శ్రీ బి. ఎ. గుప్తేగారు అభిప్రాయపడుచున్నారు. వారి వాదము సారాంశమిది:– ''గణపతిని మూషికవాహనుడని యనుచున్నాము. మూషక శబ్దము 'ముష స్తేయే' అను ధాతువునుంచి వ్యుత్పన్నమై దొంగయను నర్థ మిచ్చు చున్నది. అనగా వినాయకుడు క్షేత్ర తస్కరుడగు మూషక ముపై సవారి చేయుచున్నాడనుట. ఈ దేవతను గజ ముఖము, తొండము బహుశః ధాన్యము [illegible] పదన వరిమోపును తలపై నిడుకొని వెళ్ళు కృషీవల్లుని రూపము నకు ప్రతిబింబము కావచ్చును. మన దేశమున [illegible]యను

భావమును చెప్పుటకు ఏనుగును పోలికచూపుట సహజము. కనుక పంటపొలములను పాడుచేయు ఎలుకలను జయించి పెద్ద పంట పండించుట కుపలక్షణముగా, ఏనుగుతల, ధాన్యపుగాదెలనుబోలు మహాకాయము, మూషిక వాహనము గల దైవమును ఆదిమానవులు సృష్టించుకొనినట్లు తోచుచున్నది. తాము జయించిన దానిని తమ దేవతలకు వాహనములుగా చేయుట పెక్కు విషయములలో కానవగును. శివునికి నంది వాహనము. కృష్ణుడు తాను జయించిన కాళియుని పడగపై నాట్యమాడును. అట్లే తాను ధ్వంసము చేసిన మూషకమును మానవుడు గణపతికి–పంటల దొరకు – వాహనము చేసినాడు.

"గణపతికి గల శూర్పకర్ణ, ఏకదంతాది పర్యాయములును ఇతడు పంటల దేవుడనుటకు సూచనలు. శూర్పములు ధాన్యమును తూర్పారబట్టుటకు ముఖ్యసాధనవి. ఏకదంతము నాగలికి రూపకల్పన. గణపతికి నివేదించు ఉండ్రాళ్లు, కుడుములు కూడ ఇతడు పంటల దొరయనుటను నిరూపించు చున్నవి. లంబోదరము – ధాన్యపుగాదె – దానిచుట్టును పామును బిగించుట – పంటలను పాడుచేయు ఎలుకలను నాశము చేయుటకు సూచన.

"గణేశ విగ్రహమును చెరువులోనో, బావిలోనో కలిపిన తరువాత, అక్కడి ఇసుకనో, బంకమట్టినో గణేశ విగ్రహమును తీసుకొని వెళ్లిన పళ్లెములో వేసుకొని వస్తారు. ఇల్లు చేరిన తర్వాత ఆ మట్టినిగాని, ఇసుకనుగాని ధాన్యపు

కణజములలోను, గాదెలున్న గదులలోను, సరకులు పెట్టు-కొను ఉగ్రాణపు గదులలోను చల్లుదురు. అనాదికాలమున యూరోపులోను, ఇతర దేశములలోను ఇట్లే చేయుచుండిరట. భారతీయుల గణేశుడు మెక్సికోలోని ధాన్య దేవతను, టోంగాదీవుల ఆలో ఆలో దేవతను, గ్రీకుల డెమెటర్ను, రోమనుల కెరెస్ అను దేవతను పోలి ఉన్నాడు.''

శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారును వినాయక చతుర్థి అంతర్యము పంటల సమృద్ధి, సస్యఫలాభ్యుదయము నిర్విఘ్నముగా కొనసాగవలెనను వాంఛతో మన పూర్వులు నెరవేర్చిన ప్రకృతి యారాధనమేయని యన్నారు. వారిట్లు నుడివిరి:—

''ఈ పండుగలకును, పర్వములకును ప్రకృతితో నిత్య సంబంధము గలదు. ప్రకృతి విలాసమే వీనియుత్పత్తికి మూలకారణము. జీవకోటి జీవయాత్రకాధార మీ ప్రకృతియే. ఇది పరిణామశీలము; కాలచక్రగతి ననుసరించుచు వివిధముగ పరిణమించుచుండును. ఋతువుల యావృత్తితో పాటు వివిధ ప్రకృతి పరిణామములును పునఃపునరావృత్తము లగుచుండును. ప్రకృతి పొందు వివిధపరిణామముల ప్రారంభసమయములే తత్పరిణామఫలము ననుభవించునట్టి – జీవకోటిలో నుత్తము డయినట్టి – మానవుని పండుగలు, పర్వములు నైనవి. ప్రకృతి కామధేనువు. మానవుని కృషి కనుగుణముగ తదభివాంఛితములను పిదుకుచుండును. వాంఛితార్థసిద్ధికి ముగ్ధుడైన మానవుడు ఆనందోత్సాహము

లను పండుగుల – పర్వముల ఆచరణరూపమున ప్రకటించు చున్నాడు.

"వినాయకచతుర్థియు నట్టి పర్వములలో నొక్కటి. ఇది వర్షర్తులో నుత్తరార్థ మందలిది. ప్రకృతి యంతయు ప్రౌఢవయఃపరిపాకమున రమణీయదర్శనమై యుండును. అపుడు తొలికారు సస్యములన్నియు ఫలోన్ముఖములై యుండును. సిద్ధముగనున్న ఆ పూర్వ సస్యఫలాగమము, మధ్యాపర సస్య ఫలాభ్యుదయము నిర్విఘ్నముగ సాగవలె నను వాంఛతో నాచరింపబడునది యీ వినాయకపర్వము.

"వినాయకుని యేనుగురూపము ధాన్యము నిలువ చేసికొను మట్టిగాదెను స్ఫురింపజేయును. చెమ్మగిల్లి ఆగాదె శిథిలము కాకుండుటకై చేసిన యాచ్ఛాదనమును పత్రముల, దూర్వాంకురముల పూజ స్ఫురింపజేయును. మూషిక బాధ యనివార్యమగుటను వాహనము సూచించును.

"సర్వ కార్యక్రమము ముగిసిన తరువాత వినాయక విగ్రహమును గాదెలో దాచుట యాచారము. గాదెలో ధాన్య మక్షయముగా నుండవలెనను వాంఛయే యిందులకు కారణము.

"ఈ తీరున ప్రతి పర్వమునను ప్రకృతి ప్రతిబింబించు చుండును. దైవబుద్ధితో నారాధింపబడునది ప్రకృతియే కావున దైవమునకును ప్రకృతికిని భేదము లేదు. దైవమే ప్రకృతి ; ప్రకృతియే దైవము."

పూర్వము రాజాంతఃపురములలో "హస్తిమంగళము", "హస్తిమహము" అను ఉత్సవమును జరుపుచుండిరని జాతక గ్రంథములలో పేర్కొనబడినది. ఆనాడు రాజప్రాసాదము పుష్పమాలికలతో, రంగు రంగుల తోరణములతో, ధ్వజములతో అలంకరింపబడుచుండెను. ఇక ధూపదీపాలంకరణముల, వాద్యముల ఘోషణముల చెప్పవలెనా ? వందమత్తగజములను వెండి, బంగారు నగలతో అలంకరించి వరుసగా నిలబెట్టి పూజ జరుపుచుండిరి. దీనికి హస్తిమంగళమహామని ప్రసిద్ధి. దీనికిని వినాయకపూజకును సంబంధము గలదేమో విజ్ఞులు ఆలోచించవలెను.

భాద్రపదచతుర్థినాడే ఈ గణేశచతుర్థి చేయనేల ?

"గణేశ పూజనం కుర్యా చ్చతుర్థ్యాం సర్వకర్మసు,
అవిఘ్నం సురలోకేచ గతి మిష్టాం ప్రయచ్ఛతి.
సర్వేషాం కర్మణా మాదౌ తతః పూజ్యో గణాధిపః."

సకలకార్యములయందు అవిఘ్నముకొరకు చతుర్థినాడు గణేశపూజ జరుపవలెను – అని భవిష్యపురాణమునందును, నరసింహపురాణమునందును, సామాన్యవిధిగా చెప్పబడినది. ఫాల్గుణ శుద్ధ చతుర్థినాడు విఘ్నవినాయకవ్రత మాచరించవలెనని వరాహపురాణము నందును,

"మాసి భాద్రపదే శుక్లే చతుర్థ్యాం గణనాయకం,
మధ్యాహ్నే శ్రావణే వాపి మార్గశీర్షే థవా వ్రతీ.
గజవక్త్రంతు శుక్లాయాం చతుర్థ్యాం సర్వదార్చయేత్."

అని భాద్రపదమాసముననో, శ్రావణమాసముననో, మార్గ

శీర్షమునవో వినాయకుని అర్చింప వచ్చునని భవిష్యపురాణమునను నుండగా భాద్రపదశుక్లచతుర్థినాటి ఈ పండుగకే యింతటి ప్రాధాన్య మెందులకు ? దీనికి ఆచార్య విస్సా అప్పారావుగారు చక్కని ఉపపత్తి చెప్పిరి. దాని నిట వారి మాటలలోనే తెలిసికొనుట యుక్తము.

"పురాణములయందలి దేవతలకు సంబంధించిన గాథలకును ఖగోళదృశ్యములకు పరస్పర సంబంధము కల్పించుట అనాదిగా వచ్చుచున్నది. సూర్యభగవానుడే సూర్య గోళము కూడ. రాత్రులయందు మిక్కిలి కాంతివంతముగ గోచరించు గురుగ్రహామే నక్షత్రములకు దేవతలకు గురువు, దేవగురువు. ఇట్లే అనేకోదాహరణములు జూపవచ్చును.

"ప్రాత ర్యవాణా ప్రథమా యజధ్వమ్
నో రనసా మయంతి దేవాయా అజుష్టమ్."

అని ఋగ్వేదమున గలదు. సూర్యోదయాత్పూర్వమున తూర్పున ఏనక్షత్రముదయించునో ఆ నక్షత్రమునకు సంబంధించిన దేవతను ఆనాడు పూజింపవలెను. లేక సూర్యాస్తమయ సమయమందు తూర్పున ఉదయించు నక్షత్ర దేవతనైనను పూజింపవలెనని దీని తాత్పర్యము. నక్షత్రములకు సరియైన దేవతాస్వరూపము లున్నవని దీనివలమున స్పష్టమగుచున్నది. సప్తఋషిమండలము – సప్త ఋషులు, ధ్రువనక్షత్రము – ధ్రువుడు మొదలగున విట్టివే. ఇట్లే విఘ్నేశ్వరునికి సంబంధించిన నక్షత్రముల గుంపొకటి కల్పింపబడినది. చిన్న యెలుక యాకారముగల నక్షత్రా

ములగుంపు, దాని మీాదనే విఘ్నేశ్వరరూపముగా భావింప దగిన ఇంకొక నక్షత్రములగుంపు కలవు. ఈ విఘ్నేశ్వర నక్షత్రములు సూర్యోదయమునకుపూర్వము తూర్పున భాద్రపదశుద్ధచవితినా డుదయించును. అందువలన నాడు సిద్ధివినాయకవ్రతము చేయు నాచారము పుట్టియుండును. ఆమరునాడే సప్తఋషిమండలమందలి పడమటి భాగము సూర్యోదయాత్పూర్వ ముదయించును. ఆనాడు ఋషి పంచమీవ్రతము చేయుదురు.

"మరియు భాద్రపద శుద్ధ చవితినాడు సాధారణముగ హస్తా నక్షత్ర మగుచుండును. అనగా నాటి చంద్రుడు హస్తా నక్షత్రమం దుండును. 12 చంద్ర మాసములు పదమూడు నాక్షత్రమాసములకు సమానము. హస్తానక్షత్రము ముంజేతి యాకారముకలదై యుండును. అందుచేత నాటి చంద్రునికి హస్తాసంబంధముచేత హస్తిత్వము కలదన వచ్చును. నాడు సూర్యోదయాత్పూర్వమున వినాయక నక్షత్రోదయ మగును గనుక వినాయకుని హస్తిత్వము ప్రత్యేకముగ ప్రకటన చేయబడుచున్నది. ఇట్లు చంద్రునకు విఘ్నేశ్వరునకు భాద్రపద శుద్ధ చతుర్థినాడు వేరు కారణములచేత హస్తిత్వము సంభవించుచున్నది. మరియు నాటి చంద్రుని పరికించిచూచినచో బోసినోరు తెరచి నవ్వుచున్నట్లు కనిపించును. (దక్షాధ్వరధ్వంస సమయమున వీరభద్రుడు చంద్రుని పండ్లూడునట్లు తన్నెనని కథ గలదు.) చంద్రుని గోళమంతయు భూమిమీాద నుండి ప్రతిఫలించిన

సూర్యకాంతిచేత గుండ్రముగా కనబడును. అట్టి చంద్ర ముఖము క్రింది భాగమున చవితినాటి చంద్రవంకలో గూడి నవ్వుచున్నట్లుండును. దీనిని బట్టి విఘ్నేశ్వరుని చూచి చంద్రుడు నవ్వినట్లు కథ యున్నది. దానివల్ల ఒక శాపము, దాని నివృత్తిగాథ, శ్యమంతకమణి వృత్తాంతము మొదలైనవి కలవు. ఈ కథలోని సింహము సింహరాశి – (సింహరాశిలో సూర్యుడుండు కాలమది), శ్యమంతకమణి (సూర్యుడు), జాంబవంతుడు (సప్తర్షి మండలము) – పెద్ద ఎలుగుబంటి (Great - Bear) – ఖగోళ దృశ్యములై యున్నవి.

"భాద్రపద శుద్ధ చతుర్థికి ఆరుమాసముల తరువాత ఫాల్గుణ శుద్ధ చతుర్థినాడు విఘ్నేశ్వర నక్షత్రము సూర్యాస్తమయసమయమున తూర్పున ఉదయించును. ఆనాడు "పుత్రగణపతి వ్రత" మని పంచాగములలో వ్రాయుదురు. ఇట్లు ఖగోళ దృశ్యములను పురాణగాథలకు ముడిపెట్టుట, పురాణగాథలనే కొన్నిటిని ఆ దృశ్యములనుబట్టి కల్పించుట కనిపించుచున్నది."

దీనిని బట్టి భాద్రపదశుద్ధ చవితినాటి ప్రాశస్త్యము తేటతెల్లమయినది కదా ? వినాయకుడు గజాసను డను కల్పనకును నక్షత్రమండల సన్నివేశమే కారణమని ఆ ఆచార్య అప్పారావుగారే తెలిపియున్నారు. "చంద్రుడు ఖగోళచక్రములో ఒకసారి తిరిగివచ్చుటకు 27 దినములు పట్టును. అందుచేత ఆ చక్రమును ఇరువదియేడు భాగములుచేసి అశ్విని, భరణి యను ఇరువదియేడు నక్షత్రములను పేర్కొను

చున్నాము. ఈ మార్గమందే సూర్యుడు కూడ ఒక సంవత్స రములో తిరిగి వచ్చును. అందుచేత ఈ నక్షత్రములను పదిరెండు రాసులుగా రూపకల్పన చేసిరి ($12 \times 2\frac{1}{4} = 27$). ఒకొక్క రాశిలో రెండు నక్షత్రములు మూడవ దానిలో నాలుగవ వంతు (నక్షత్రపాదము) కలిసియుండును. అశ్విని, భరణి, కృత్తికలో నాల్గవవంతు చేరి మేషరాశి యగును. నేటి వలె ఆదికాలములో ఈ రాసుల నిర్ణయము అంత నిశిత ముగా ఏర్పడి యుండ లేదు. పరిశీలనచేయుచు, నూతనముగా కనిపెట్టిన విషయములను చేర్చుచు ఖగోళ జ్ఞానమును పెంచుకొనుచు వచ్చిరనుట సమంజసమే కదా! అందుచేత ఆరంభమందు ఆర్ద్రా నక్షత్రమును వృషభరాశిలో చేర్చి యుండిరి. (అశ్విని, భరణి, కృత్తిక, మేషమని; రోహిణి, మృగశిర, ఆర్ద్ర వృషభమని.) అది సరికాదని తెలియగనే దాని తర్వాతి రాశియగు మిథునములో ఆర్ద్రను చేర్చియుం దురు. ఈ విషయమునే ఒక కథగా ఇట్లు కల్పించి యుందురు.

"రోహిణి, మృగశీర్ష, ఆర్ద్రలు ఆకాశమందు గజవీథి యనుదానియందుండును. ఈ గజవీథికి పై భాగమైన ఆర్ద్రా నక్షత్రమును గజవీథినుండి తీసి మిథునరాశిలో చేర్చుట గజాసురుని తల తీయుట. ఆర్ద్ర పునర్వసుతో చేరినగాని మిథునరాశి యేర్పడదు. మిథున మనగా పురాణదంపతు లగు పార్వతీ పరమేశ్వరులు. ఆర్ద్ర చేరక పూర్వము పార్వతి (పునర్వసు) ఒంటరిగా నుండెను. భర్తజాడ తెలి యక బాధపడినట్లు — తన భర్త - గజవీథిలో దాగి

యున్నట్లు – అనగా గజాసురుని గర్భస్థుడై శివు డున్నట్లు – తెలుసుకొని విష్ణువును వేడగా (సూర్యుని వేడగా – సూర్యుడు సంచరించు దారులే గనుక – అతడు సరిదిద్దగల డని) ఆర్ద్రను పునర్వసుతో చేర్చి మిథునమునకు సరియగు రూపకల్పన జరిగినట్లు కథ. ఆర్ద్ర రుద్రదేవతాకమైన నక్షత్రము. అది వృషభ రాశికిపైన సూర్యాస్తమయ సమయమున గోచరించును. అందుచేత శివుడు వృషభ వాహనుడని చెప్పుచున్నాము. శివుని వాహనమగు వృషభము – నందీశ్వరుడు – గజాసురుని సంహరించి పార్వతీదేవితో శివుని జేర్చుట జరిగినది. ఇట్లు తన్ను జేరరానున్న భర్త విషయమును విన్న పరాశక్తి ముదమంది అభ్యంజన స్నానము చేయబోయి గుమ్మము వద్ద విఘ్నేశ్వరుని ప్రతిష్ఠచేసి కావలియుంచెనట. అంతలో పరమేశ్వరుడు వచ్చి లోపలికి పోబోవ విఘ్నేశ్వరు డడ్డగించెను. శివుడు కోపావిష్టుడై విఘ్నేశ్వరుని తలద్రుంచి లోనికి జనెను. (బ్రహ్మచారియగు విఘ్నేశ్వరుడు–అనగా బ్రహ్మచర్యము–పార్వతిని చేరుటకు శివుని కడ్డముగా నిలిచినదని, బ్రహ్మచర్యమును సంహరించి, తల ద్రుంచిన తరువాతగాని మిథున మేర్పడలేదని – పార్వతిని శివుడు కలియజాలడయ్యెనని అనుకొన వచ్చును.) లోనికి జనిన తరువాత పార్వతివలన విషయమును తెలిసికొని ఆ బాలుని బ్రతికించి త్రుంపబడియున్న ఒక ఏనుగు తలను అతికించెనని కథ.''

ఇవి యన్నియు పరిశీలించగా బ్రహ్మచర్య దీక్ష, విద్యార్జన, పంటల అభివృద్ధి, నక్షత్రమండల సన్నివేశము,

పురాణగాథలు మొదలగునవి యెన్నియో సహస్రాబ్దము లుగా కలగాపులగమై ఈ పండుగ ఆచారములో వచ్చిన ట్లూహించవచ్చును.

ఈ గణపతిపూజ ఆరవ శతాబ్దినుండి బాగుగా వ్యాపించినదని డాక్టర్ భండార్కర్ అభిప్రాయపడిరి.

భారతీయ విజ్ఞానము ప్రాకిన ఆసియాఖండమునందలి చైనా, జపాను, ఇండోనీసియా మున్నగు దేశములలోను విఘ్నేశ్వరుడు దేవతగా వెలసినాడు. జపానువారు వినాయకుని "బినాయికియా" అందురట. ఈ దేశములలో నేటికిని అసంఖ్యాకముగ వినాయక విగ్రహములు లభించుచున్నవి. దీనికి కారణము బౌద్ధులును వినాయకుని దేవతగా పరిగణించుటయే. అశోకచక్రవర్తి కుమార్తె నేపాలులో విఘ్నేశ్వరాలయమును కట్టించినట్లు శ్రీ నగేంద్రనాథ్ వసు అను విద్వాంసులు తెలిపిరి.

చీనా ఖగోళపటమునను వినాయక నక్షత్రరూపము గలదు. ఇతర దేశవాసులును ఎలుక రూపమును, ఏనుగ రూపమును గుర్తించి గ్రంథస్థము చేసిరి.

"తత్పురుషాయ విద్మహే
వక్రతుండాయ ధీమహి
తన్నో దంతిః ప్రచోదయాత్."

# 2. ఉగాది

దూరమును కొలుచుటకు గజము బద్దవలెనే, ధనమును లెక్కించుటకు రూపాయ నాణెమువలెనే, అనంతమైన కాలపరిమితిని తెలిసికొనుటకు సంవత్సర ముపయోగపడుచున్నది. ప్రపంచమున మానవుడు పుట్టిన తరువాత కొంత కాలమునకు, అప్పటికి గడచిపోగా జరుగనున్న కాలము పరిమితిని తెలిసికొనవలెనను వాంఛ వానికి కలిగిననాడు, కాలమును కొలుచుట కేర్పరచుకొనిన కొలగర్ర సంవత్సరము.

ఇట్లు కాలమును కొలుచుటకు సంవత్సరమునే ఏల కొలగర్రగా గ్రహించినాడు ? ప్రస్ఫుటమైన ఆద్యంతములుగల కాలమానము అంతకంటె పెద్దది లేదు ; చిన్నవి రెండున్నవి. అహోరాత్ర నిర్దిష్టమగు దినమొకటి ; చంద్రుని వృద్ధి క్షయములచే విదితమగు పక్షద్వయాత్మకమగు మాసమిం కొకటి. కాని, అంత చిన్నవానితో నెన్నిమారు లీయనంత కాలమును కొలువగలడు ? కావున సంవత్సరమునే గ్రహించినాడు. ఈ సంవత్సర మానదండము నియతములగు మార్పులతో ఆరంభమై యంతమగుచుండును.

ఆకసమున మిలమిలలాడే చందమామ తరుగు పెరుగులతో మానవుని కాలజ్ఞానము ప్రారంభమైనది. చంద్రమండలము కొన్నాళ్లు నిండారుచు, పిదప క్రమముగా సన్న

గిలుచు ఇరువది యెనిమిది నాళ్లలో (అభిజిన్నక్షత్ర పరిగణనముతో సహా) మరల నిండుతనము సంతరించుకొనుచునుండుట చూచి పూర్ణిమనుండి పూర్ణిమకు మధ్యగల కాలమును లెక్కగట్టి చంద్రుని పేరుతోనే వ్యవహరించినారు. మాసః అనగా చంద్రుడు గలదియని యర్థము. మనకును మాసపరిమితకాలము నెల. నెలయనగా చంద్రుడు. పాశ్చాత్యభాషలలో మాస పర్యాయమైన "మంత్" శబ్దము గూడ చంద్రగతితో నేర్పడినదే; మూన్+త్, మున్త్, మంత్ అని మార్పుచెందినది. పూర్ణిమనుండి మరియొక పూర్ణిమవరకు ఉన్న కాలము నెలయని మొదటనున్న ఈ లెక్క అనులోమముగను, ప్రతిలోమముగను వృద్ధి క్షయములను గణించుటవల్లనే కాలోవు ... మారహిత-మైన నాటినుండి మరియొక చంద్ర విహీనమైన నాటివరకు అను లెక్క ఏర్పడి, తొలి నెలవంక నెలనే పాడ్యమి నుండి పాడ్యమివరకు అను విధముగా రూఢమైనది. కనుకనే 'ధర్మసింధు' కారుడైన కాశీనాథుడు "అత్రశుక్ల ప్రతిపదాదిరమాంత ఏవ మాసః ప్రాయేణ దాక్షిణాత్యై రాద్రియత ఇతి తమే వాశ్రిత్య నిర్ణయ ఉచ్యతే" (శుక్లపక్ష పాడ్యమి మొదలు బహుళ పక్షామావాస్యతో ముగియునదే నెలగా దాక్షిణాత్యులు పరిగణించుచున్నారు. ఆ పరిగణనము ప్రకారమే వ్రతములను నిర్ణయించుచున్నాను) అని స్పష్టపరచినాడు. ఒక్క దాక్షిణాత్యులే కాక భారతీయులందరును వైదికకర్మలకు చాంద్రమానపు ఈ మాస సంవత్సర పద్ధతినే యనుసరించుచున్నారు.

క్రమముగా మానవుని బుద్ధి వికసించినది. చంద్రుని గతిని, ఆగతిలో చంద్రునికి సన్నిహితముగానుండు ప్రధాన నక్షత్రములను, చంద్రుడు ఆ నక్షత్రములను సమీపించుటతో ప్రకృతిలో కలుగుచున్న మార్పులను పరిశీలించినాడు. నక్షత్రమండలములకు ఏవో పేర్లు పెట్టుకొని, ఆమండలములలో చంద్రుడు ప్రవేశించినపుడు ఆయా నెలలకు ఆయా నక్షత్రముల పేరును - చిత్తా నక్షత్రమున పూర్ణచంద్రుడున్న చైత్రమని, విశాఖా నక్షత్రమున పూర్ణ చంద్రుడున్న వైశాఖమని ఇట్లు - పెట్టుకున్నాడు.

నెలలతోపాటు ఋతుపరిగణన జరిగినదో, అంతకు ముందే జరిగినదో చెప్పలేము. మండే ఎండలు, వెంటనే వానలు, వానలు వెలిసినవో లేవో మరల ఎండలు, పండిన అడవులు, ఆకు అలము రాలుచు ప్రకృతి మోడుపోవుట, తర్వాత ఎముకలు కొరుకుచలి, పిదప గారడీవలె రాగోదయము, ఎటు చూచినను కానవచ్చు ఇంపు సొంపులు మానవునికి అనాయాసముగ కాలజ్ఞానము కలిగించియుండును. చూచాయగను సహజముగను అలవడిన ఈ అభిజ్ఞతను అనుభవముతో స్ఫుటములువేసి క్రమముగా కాలమును గుర్తించుకొనియుండును. దినములు లెక్కించుకొని నెలలు నిర్ణయించుకొనినట్లే, ప్రకృతి విలాసములనుబట్టి ఋతువులను, ఋతువుల ఆవృత్తినిబట్టి సంవత్సరమును లెక్కగట్టుకొనినాడు. పంటకారుకు మరొక పంటకారుకు మధ్యగల కాలము ఏడాదిగను, పంటకారు సంవత్సరాదిగను మొదట ఆచారమేర్పడినది.

మన దేశమున పుష్య మాఘ మాసములు పంటలు పండి ప్రకృతి రస నిర్భరముగ నుండు కాలము. ప్రజలు తమ శ్రమ ఫలమును కట్టెదుట చూచుచు పొంగి పోవుదురు. ఈసమయమున వచ్చు పర్వదినము మకర సంక్రాంతి. ఈ సంక్రాంతిని ఉత్తరాయణ పుణ్యకాలమని, విషువత్పుణ్యకాలమని అందురు. విషువత్తనగా పగలును రాత్రియు సమానముగనుండు కాలము; సూర్యుడు భూమధ్య రేఖపై నుండు కాలము. "సమరాత్రిందివే కాలే విషువత్" అని అమరసింహుడు నిర్వచించినాడు. ఈ విషువత్తులు రెండు. మకర సంక్రాంతి అట్టి విషువత్తులలో ఒకటి. ఆనాటి నుండి ప్రకృతిలో క్రొంగ్రొత్త మార్పులు ఆరంభమగును. కనుక సంక్రాంతి పండుగ మనకు ఉగాది.

ఇది యేమి చిత్రము ? సంక్రాంతి యెట్లుగాది పండుగ యగును ? ఉగాది పండుగను మన మిప్పుడు చైత్రశుద్ధ పాడ్యమినాడు చేసికొనుచున్నాము. మనమే కాదు; మన పక్కింటి కర్నాటకులును, పొరుగింటి మహారాష్ట్రులును, చాంద్రమానమును అనుసరించు మరికొందరును చైత్ర శుద్ధ పాడ్యమిని ఉగాదిగ, సంవత్సరాదిగ పరిగణించుచున్నారు. సంక్రాంతికి మారు చైత్రశుద్ధ పాడ్యమి సంవత్సరాది యెట్లయినది ?—అను ప్రశ్నలు చెలరేగును. నిజమే.

"జనవరితోనే క్రొత్త సంవత్సరము ఎందుకు ప్రారంభము కావలెను ?" అని రోమను కవియగు ఓవిడ్ అను వాడు జ్యోతిర్విశారదుడగు జానుస్సును ప్రశ్నించెనట. "జనవరి నాటికి సూర్యుడు మకరరాశిలో ప్రవేశించును.

అంతవరకు మంచుముసుగుననున్న ప్రకృతి ఆముసుగును తొలగించుకొని తొంగి చూచును. తర్వాత దానికి రాగోదయమగును. నూతనజీవితము జనవరినుండి ప్రారంభమౌను గనుక దానితోనే నూతన సంవత్సర ప్రారంభము.'' అని జానుస్ జవాబు చెప్పెనట.

రోమనులు సూర్యోపాసకులు. సూర్యోపాసకులు, సూర్యమానమును అనుసరించువారు జానుస్ జవాబుతో తనివి చెందవచ్చును. చాంద్రమానమును అనుసరించువారికి ఇది ఎట్లు సమాధానము? జానుస్‌ను ప్రశ్నించినట్లే మన సంవత్సరాది చైత్రమాస ప్రారంభములోనే ఎందుకు మొదలు కావలెనని ఎవరైనను ప్రశ్నించిరే యుందురు. దానికి హేమాద్రి పండితుడు

''చైత్రే మాసి జగ ద్బ్రహ్మా ససర్జ ప్రథమేహని,
శుక్ల పక్షే సమగ్రంతు తదా సూర్యోదయే సతి.
ప్రవర్తయామాస తథా కాలస్య గణనా మపి,
గ్రహా న్నాగా నృతూ న్మాసాన్వత్సరాన్వత్సరాధిపాన్ .''

(బ్రహ్మ ఈ జగత్తును చైత్రమాస శుక్లపక్షప్రథమ దినమున సూర్యోదయవేళ సమగ్రముగ సృజించెను. కాలగణనమును, గ్రహ నక్షత్ర ఋతు మాస వర్ష వరాధిపులను ప్రవర్తింపజేసెను.) అని చతుర్వర్గ చింతామణి వ్రతఖండమున సమాధాన మిచ్చినాడు.

నిర్ణయసింధుకారుడగు కమలాకరభట్టు ''తత్ర చైత్ర శుక్ల ప్రతిపది వత్సరారంభః'' (చైత్రశుక్ల పాడ్యమి నూతన

వత్సరారంభము) అని అనినాడు. ధర్మసింధుకారుడగు కాశీనాథ భట్టోపాధ్యాయుడును నిట్లే నిర్వచించినాడు. "తత్ర చాంద్ర సంవత్సరస్య చైత్రశుక్ల ప్రతిప ద్యారంభః. 'చంద్రాబ్దో మధుశుక్లగ ప్రతిపదారంభ' ఇతి దీపికోక్తేః" చాంద్రమాన సంవత్సరమునకు చైత్రశుక్ల పాడ్యమి మొదలు అని స్మృతి కౌస్తుభకారుడు అనంతదేవుడు నిర్ణయించినాడు.

మానవసంఘుక్రమ వికాసమునకు తార్కాణము లన దగిన ఉగాదివంటి పండుగలను, పర్వములను బ్రహ్మ సృష్టిలో ముడిపెట్టుటయనిన ఆధునికులకు సహేతుకముగా కనిపించక పోవచ్చును. కాని, హేమాద్రిపండితుడు మున్నగు స్మృతి కారుల వివక్ష సంఘమున స్థిరపడిన ఆచారములను వివరించుటయేయని మనము తెలియవలయును. అయిన చైత్రశుద్ధ ప్రతిపత్తే సంవత్సరాదియగుట యెందులకు? దీనికి సమాధానము నరయుటకు ముందు మనము ఉగాది యననేమియో చర్చింతము. ఆచర్చతో పెక్కు సమస్యలు విడిపోవును.

ఉగాది యనునది యుగాది యనుదాని వికృతి. యుగ మనగా నొక కాలవిభాగము; నూతనకాలము; దాని ఆది యుగాది. యుగాదులయందును, మన్వాదులయందును పితృకర్మలు, వ్రతములుచేయుట పూర్వపు ఆచారమని పురాణములు చెప్పుచున్నవి. రత్నమాలలో నిట్లున్నది:

"మాఘే పంచదశీ కృష్ణా నభస్యే చ త్రయోదశీ,
తృతీయా మాధవే శుక్లా నవ మ్యూర్జే యుగాదయః."

(వైశాఖ శుద్ధ తృతీయనాడు కృతయుగము, కార్తిక శుద్ధ నవమిని త్రేతాయుగము, భాద్రపద బహుళ త్రయోదశినాడు ద్వాపరయుగము, మాఘ బహుళ అమావాస్యనాడు కలి యుగము ప్రారంభమైనవి.)

"మాఘస్య పౌర్ణమాస్యాం తు ఘోరం కలియుగం స్మృతం."

(మాఘ పౌర్ణమియందు ఘోరమగు కలియుగ మారంభ మయ్యెను.) అని బ్రాహ్మవచనము.

"వైశాఖమాసస్య చ యా తృతీయా
నవమ్యసౌ కార్తిక శుక్లపక్షే,
నభస్యమాసస్య తమిస్రపక్షే
త్రయోదశీ పంచదశీ చ మాఘే."

అని విష్ణుపురాణమున గలదు.

"నవమ్యాం శుక్లపక్షస్య కార్తికే నిరగా త్కృతం,
త్రేతా సితతృతీయాయాం వైశాఖే సమపద్యత.
దర్శేతు మాఘమాసస్య ప్రవృత్తం ద్వాపరం యుగం,
కలిః కృష్ణత్రయోదశ్యాం నభస్యే మాసి నిర్గతః."

(కార్తిక శుద్ధ నవమిని కృతయుగము, వైశాఖ శుద్ధ తృతీయ నాడు త్రేతాయుగము, మాఘామావాస్యయందు ద్వాప రము, భాద్రపద బహుళ త్రయోదశినాడు కలియుగము ఆరంభమయినవి) అని భవిష్యపురాణములో గలదు. ఈ యుగముల పుట్టుకలో మతభేదము కనిపించినను

"యుగాదయశ్చ కథ్యంతే తథైతాః సర్వసూరిభిః,
యా మన్వాద్యాః యుగాద్యాశ్చ తిథయ స్తాసు మానవః,
స్నాత్వా హుత్వాచ దత్వాచ జప్త్వా నంత ఫలం లభేత్."
(వీనిని పండితులందరూ యుగాదులందురు. ఈ యుగాదుల లోను, మన్వాదులలోను స్నానమొనర్చి, హోమదాన జపాలొనర్చు మానవుడు అనంత ఫలముల నందును.) అన్న భారత వచనముతో నందరు నేకీభవించుచున్నారు.

తిథులేకాక కొన్ని నక్షత్రములును యుగాది నక్షత్రములుగా పరిగణింపబడుచుండెననుట భారతమునుండి తెలియుచున్నది.

"అభిజిత్ స్పర్ధమానాతు రోహిణ్యా కన్యసీ స్వసా,
ఇచ్ఛంతీ జ్యేష్ఠతాం దేవీ తప స్తప్తుం వనంగతా.
తత్ర మూఢోస్మి భద్రం తే నక్షత్రం గగనాచ్చ్యుతం,
కాలం త్విమం పరం స్కంద బ్రహ్మణా సహ చింతయ.
ధనిష్ఠాది స్తదా కాలో బ్రహ్మణా పరికల్పితః,
రోహిణీహ్యాభవ త్పూర్వం ఏవం సంఖ్యా సమాభవత్.
ఏవముక్తే తు శక్రేణ త్రిదివం కృత్తికా గతాః,
నక్షత్రం సప్తశీర్షాభం భాతి త ద్వహ్నిదైవతం."
భా. ఆర. 230-అ.

దీనిని నీలకంఠాచార్యు డిట్లు వ్యాఖ్యానించినాడు. "యస్య నక్షత్ర స్యాద్యక్షణే చంద్రసూర్య గురూణాం యోగః తద్యుగాదినక్షత్రం. తచ్చ పూర్వం రోహిణ్యభూత్. తదా అభిజిత్పతన కాలేషు ఏకస్యానై రహోరాత్రై ర్భగణస్య భోగాత్ కృతయుగాది నక్షత్రం ధనిష్ఠైవా భవదిత్యర్థః."

(చిన్న చెల్లెలయిన అభిజిన్నక్షత్రము రోహిణిజ్యేష్ఠాత్వానికి అసూయపడి తపస్సుచేయుటకు వనమునకు వెళ్లినట. కాని, ఆమె కృతార్థురాలు కాలేక పతితురాలైనది. అప్పుడు బ్రహ్మ ధనిష్ఠా నక్షత్రముతో కాలము ప్రారంభించెనట. రోహిణి కూడా పూర్వము ఆదినక్షత్రముగా నుండెను. ఏనక్షత్రము మొదటి క్షణమున చంద్రసూర్య గురువులకు యోగ ముండునో ఆ నక్షత్రము యుగాదినక్షత్ర మనబడునని నీలకంఠాచార్యులు వివరించిరి. ఈ యుగాది నక్షత్రము మొదట రోహిణిగా నుండెను. అప్పుడు అభిజిత్పతనకాల ములో ఒకనక్షత్రము తక్కువయైన అహోరాత్రములు కలు గుటవలన కృతయుగాది నక్షత్రము ధనిష్ఠగానే యయ్యెనని అర్థము.) దీనినిబట్టి మొదట రోహిణినుండి నక్షత్ర గణన ముండెననియు, అభిజిత్తుతో సహా 28 నక్షత్రము లుండుట వలన, రాశి పరిగణనమునకు సరిపడనందున అభిజిత్తును తొలగించి ఇరువదియేడుగా లెక్క సరిపెట్టిరనియు, ధనిష్ఠ నుండి నక్షత్రపరిగణనము జరిగెననియు స్పష్టమగుచున్నది.

యుగాది యను పండుగ యొకటి పూర్వకాలమునుండె నను నంతవరకే మనకీ ప్రమాణము లావశ్యకములు. ఈ యుగాదియను పదము, పండుగయును నేడు సంవత్స రాదికిని మనము వ్యవహరించుచున్నాము. ఈ సంవత్సరాది నిర్ణయమందును పెక్కు మతము లున్నవి. సంవత్సరాది వివిధములుగను కనిపించుచున్నది.

ఒకప్పుడు కార్తులనుబట్టి ఋతువుల నిర్ణయము జరుగు చుండెను. వేదాంగ జ్యోతిషకాలమున ధనిష్ఠా కార్తితో

ప్రారంభమైన శిశిర ఋతువుతో-మాఘపూర్ణిమనుండి రెండు నెలలతో-మొదటి ఋతువు, సంవత్సరము ప్రారంభమగుచుం డెను. ఇదే ఉత్తరాయణపుణ్యకాలమనియు పరాశర మతము. రామాయణములో చైత్రము పన్నెండవనెల. రాముడు ఋతువులన్నియు గడచి పన్నెండవనెలయగు చైత్రమున శుద్ధ నవమినాడు జన్మించినట్లు బాలకాండములో గలదు. "తతశ్చ ద్వాదశే మాసి చైత్రే నావమికే తిథౌ." దీనినిబట్టి వైశాఖ ప్రారంభమే రామాయణకాలమున సంవత్సరాది యగుచున్నది. మార్గశిర పుష్యమాసములున్న హేమంతములో వత్సరారంభమని కాత్యాని మతము. అమర సింహుడు అమరకోశము కాలవర్గములో "మార్గశీర్షే సహా మార్గ ఆగ్రహాయణికశ్చ సః" అనియు, "హేమంత శ్శిశిరో స్త్రియామ్" అనియు మొదట మార్గశిరమాసమును, హేమంతఋతువును పేర్కొనినాడు. మార్గశీర్ష మాసము నకు పర్యాయపదమైన 'ఆగ్రహాయణికః' అనుదానికి అగ్రము నందు హాయనముగలది అనగా సంవత్సరమంతయు ముందుం డునది యని యర్థము. విషువత్తులనుబట్టియును వత్సరాది పరిగణన ముండెడిది. ఈ విషువత్తుల నిర్ణయమునను పెక్కు మతము లున్నవి. కటక విషువత్కాలమునుండి దక్షిణాయ నము, మకర విషువత్కాలమునుండి యుత్తరాయణము ప్రారంభమగుననుట నేటి జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయము. కాని, పూర్వము ఆశ్లేషార్థము-సింహము-నుండి దక్షిణాయ నము, అభిజిత్తుతోసహా లెక్కకట్టిన ధనిష్ఠ ప్రథమపాదము నుండి-కుంభమునుండి-ఉత్తరాయణము పరిగణించబడెడివని,

ఇప్పుడది కటక మకర విషువత్తులకు మారినవని వరాహ మిహిరుడు బృహత్సంహితలో తెలిపినాడు.

"ఆశ్లేషార్ధాత్ దక్షిణ
ముత్తర మయనం తథా ధనిష్ఠాద్యం,
నూనం కదాచి దాసీత్
యేనోక్తం పూర్వశాస్త్రేషు.
"సాంప్రత మయనం సవితుః
కర్కటకాద్యం మృగాదితశ్చాన్యత్,
ఉక్తో భావో వికృతః
ప్రత్యక్షపరీక్షణై ర్వ్యక్తిః."

మన కొక సంవత్సరమైనఎడల దేవతల కొక దినమని జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయము. "మాసేన స్యా దహోరాత్రః పైత్రో వర్షేణ దైవతః." అని అమరకోశకారుడు చెప్పినాడు. అనగా మన నెల పితృదేవతలకు దినమగుననియు, మన సంవత్సరము దేవతలకు దినమగుననియు భావము. ఈ దైవతదినము మేషవిషువత్తునుండియు, రాత్రి తులావిషువత్తునుండియు ఒకానొకప్పుడు ఆరంభమగుచుండెననియు, ఇవియే ఉత్తర దక్షిణాయనములనియు, నేడు మకరకటకము లుత్తరాయణ దక్షిణాయనములని చెప్పువారు తమ వాదమున కుపపత్తిని చూపుటలేదనియు శ్రీ పత్యాచార్యుడు అన్నాడు.

"దినప్రవృత్తి ర్మరుతా మజాదౌ
తులాధరాదౌ చ నిశాప్రవృత్తిః,
యై రుచ్యతే తౌ మృగకర్కటాదౌ
అత్రోపపత్తిం ను సతే బ్రువంతి."

మనము ఒకానొకప్పుడు ఉత్తరధ్రువ ప్రాంతమునుండి బయలుదేరినారమను వాదమునకు మన సంవత్సరము దేవతలకు దినమగుననుట–మేష విషువత్తునుండి ఆరునెలలు పగలును, తులా విషువత్తునుండి ఆరునెలలు రాత్రియును అనుటకు ఉపస్కారకము. యజుర్వేదములో "మధుశ్చ మాధవశ్చ వాసంతికావృత్" అనగా మధువు, మాధవము అను నెలలు వసంతఋతువు–సంవత్సరారంభము అని యున్నది.

ఒకప్పుడు ఆశ్వయుజ పూర్ణిమ సంవత్సరాదిగా ఉండినది. మాఘ పూర్ణిమతర్వాత అష్టమినాడు "అష్టక" యను వ్రత మొకటి యాచరించబడుచుండెడిది. ఆనాడు కూడ సంవత్సరాదిగా పరిగణిత మయ్యెను. బౌద్ధుల వినయపిటకమునను ఈ అష్టకావ్రత ముల్లేఖింపబడినది. పాలీసాహిత్యమున "కౌముదీ చాతుర్మాసీయ క్షణ"మను నొక యుత్సవము గలదు. వాత్స్యాయనుడు దీనిని "కౌముదీ జాగర"మను నుత్సవముగా పేర్కొన్నాడు. సంహితలలోను, బ్రాహ్మణములలోను ఆశ్వయుజ పూర్ణిమ ప్రస్తావము కనిపించదు. కాని, గృహ్యసూత్రములలో ఈ పూర్ణిమకు ప్రాధాన్యము కనిపించుచున్నది. దీనితోనే నూతన సంవత్సర మారంభమగుచుండెను.

ఇట్లు సంవత్సరాది మార్గశిర పుష్య మాఘ ఫాల్గుణ చైత్ర వైశాఖ మాసములలో డేకుచు వచ్చినదనుట స్పష్టము. అనగా, ఆశ్వీజపూర్ణిమ, అమావాస్య, కార్తిక పూర్ణిమ, మార్గశిర పుష్యమాసములలో సంక్రాంతి, మాఘ పూర్ణిమ, మాఘ బహుళాష్టమి, వసంతపంచమి, ఫాల్గుణ

పూర్ణిమ, హోలీపండుగ, చైత్ర శుద్ధపాడ్యమి, వైశాఖ (మేష సంక్రాంతి), వైశాఖ పూర్ణిమ–ఇవి అన్నియు సంవత్సరాదులే. ఇట్లు మారుట కొక కారణ మున్నది. శతపథ బ్రాహ్మణము ననుసరించి వైదిక కాలమున చెరి నాలుగు మాసములుగల మూడు ఋతువులుగా సంవత్సర విభాగ ముండినది. ఈ ప్రత్యేక ఋతువు ప్రారంభముతో పాటు ప్రత్యేక కర్మలు ఆరంభమగుచుండెను. ఈ కర్మలు నాలుగు నెలలపాటు జరుగుచుండెను. ఈ నాలుగు నెలల క్రియాకలాపమునకు "చాతుర్మాస్య" మను వ్యవహారము వచ్చినది. ఈ నాలుగు నెలల ఋతువులలో ఒక ఋతువు–నేడును చాతుర్మాస్యమను కాలము–జ్యేష్ఠమాసములో నారంభించి నాలుగునెల లుండెడిది. ఆశ్వయుజమాసము నుండి ఆకాశము తెరపియిచ్చి, వెన్నెలలు పరగి నాలుగు నెలల వానముసుర్లు, చీకట్లు తొలగిపోవును. ఆశ్వయుజ కార్తీక మార్గశిర పుష్య మాసములు ఒక ఋతువు. మాఘ ఫాల్గుణ చైత్ర వైశాఖ మాసములు వసంతఋతువు. కనుక నే వసంత పంచమి మొదలు వైశాఖ వరకును వసంతాగమ సూచకముగా ఉత్సవములు జరుపుకొనుట. రామాయణమున సంవత్సరము వైశాఖముతో నారంభమగుటవలననే పంజాబీలు నేడు ఉత్తరాపథమున సూర్యమాన సంవత్సరాదికి "బైసాఖి" అనే వ్యవహారము కలదు. భారతమున చైత్ర వైశాఖ మాసములు వసంతఋతువని గణన కలదు.

ఋతువులు కాలధర్మమునకు సంబంధించినవి. కనుక సాయనములు; విషువత్తునుబట్టి కదలిపోవుచుండును. సూర్యుడు

తాను మండుచు ప్రపంచమును మండింపజేయుచుండగా మానవుడు తను లెక్కకట్టుకొనిన ఋతుపరివర్తనమునకు సంబంధము లేకపోవుటయు, ఋతువులు తన లెక్కలకు ముందు వెనుకలుగా వచ్చుటయు చూచి, సూర్యచారమును, తక్కిన గ్రహముల చారమును లెక్కలు కట్టినాడు. సూర్యుడు విషువత్తులో ప్రవేశించిన నాటినుండి లెక్కలు కట్టి రాసులు వింగడించుకొనినాడు. ఈ విధముగా నభోమండలము పన్నెండు భాగములయినది. ఆ రాసులతో మాస సంకేతమూ చేసుకొనినాడు. సూర్యుడు ఒక రాశినుండి మరియొక రాశికి ప్రవేశించుటకు దాదాపు 30, 31 దినములు పట్టును. చంద్రుని వృద్ధి క్షయములతో ఏర్పడిన నెలకును, సూర్యమానపు నెలకును క్రమముగా నెల వారావచ్చుట మొదలైనది. చంద్రమానమున 19 సంవత్సరములకు ఏడు అదనపు నెలలు చేర్చి రెంటు మానములను సమన్వయపరచుకొనినాడు. కనుకనే ప్రతి మూడవయేటను చంద్రమాన సంవత్సరమున ఒక్క నెల అధికమగుచుండును. ఈ సమన్వయమున మరియొక విషయమును తెలియవచ్చినది. రామాయణకాలమున వైశాఖ జ్యేష్ఠమాసముల మధ్యనున్న వసంత విషువత్తు భారతకాలమునకు చైత్ర వైశాఖ మాసములకు కదలి వెళ్లినది. అనగా భారతకా[illegible] విషువత్తు మృగశిరలో వచ్చి, తర్వాత కొన్ని శతాబ్దములకు అశ్విన్యాదికి చలించినదన్నమాట. క్రీస్తుశకము ఐదవ శతాబ్దమునందున్న వరాహమిహిరాచార్యుడు వసంత[illegible]వత్తు, తనకు కొన్ని శతాబ్దములకు ముం[illegible] దిక్కు చలించుట

గుర్తించినాడు. వేదాంగ జ్యోతిషకాలముకంటె ప్రాచీనమగు బ్రాహ్మణముల కాలమున వసంత విషువత్కాలము కృత్తికా నక్షత్రమున సంభవించుట పరిశీలించినాడు. వసంత విషువత్తు తన కాలమున అశ్విన్యాదిలో సంభవించుట గ్రహించి, అది ప్రాచీనమగు దేవమానదిన ప్రారంభమగు నుత్తరాయణపుణ్యకాలాదియను సంప్రదాయానుసారముగ అదియే వసంతకాలమనియును, వసంత విషువత్కాలమే వత్సరాదియనియు నిర్ణయించి, మాస ఋతు సామరస్యము సాధించినాడు. వరాహమిహిరాచార్యుని నిర్ణయము ననుసరించి మనము చైత్రమాసమునే వత్సరారంభముగ నిప్పటి నుండియు పండుగ చేసుకొనుచున్నాము. కాని, ధర్మసింధు నిర్ణయ సింధుకారు లన్నట్లు శుద్ధ పాడ్యమినుండి అమావాస్యతో ముగియు కాలమునే నెలగా పరిగణించుచున్నాము గనుక చైత్రశుద్ధ పాడ్యమినే సంవత్సరాదిగా మన్నించు ఆచార మేర్పడినది. భాస్కరాచార్యుడును 'సిద్ధాంత శిరోమణి' యను గ్రంథములో ఈ ఆచారమును సమర్థించినాడు.

"లంకానగర్యా ముదయాచ్చ భానోః
తస్యైవ వారే ప్రథమం బభూవ,
మధోః సితాదే ర్దిన మాస వర్షం
యుగాదికానాం యుగప త్ప్రవృత్తిః."

సూర్యుడు చైత్రమాస శుక్లపక్ష పాడ్యమినాడు లంకానగరమున ఉదయించుటవలన – భూమధ్యరేఖపై నుండుట వలన – ఆనాడే యుగాదుల దిన మాస వర్షారంభము ఒక్కే మారు సంభవించెనని దీని యర్థము.

నెల శుద్ధ పాడ్యమి నుండియే యెందుల కారంభము కావలయు ననుదానిని నిర్ణయసింధువు సుదీర్ఘముగ చర్చించినది. "పక్షయుగజ శ్చాంద్రో మాసః. స ద్వేధా; శుక్లాది రమాంతః, కృష్ణాదిః పూర్ణిమాంత శ్చేతి. తథా త్రికాండ మండనః :

"చాంద్రోపి శుక్ల పక్షాదిః కృష్ణాది ర్వేతి చ ద్వేధా,
కృష్ణపక్షాదికం మాసం నాంగీకుర్వంతి కేచన.
యే పీచ్ఛంతి న తేషా మ పీష్టో వింధ్యస్య దక్షిణే.

ఇతి. వింధ్యస్య దక్షిణే కృష్ణాదిని షేధా దుత్తరతో ద్వయో రభ్యనుజ్ఞా గమ్యతే. తత్రాపి శుక్లాది ర్ముఖ్యః. కృష్ణాది ర్గౌణః. శాస్త్రేషు చైత్రశుద్ధ ప్రతిపద్యేవ చాంద్రసంవత్సరారంభో క్తేః."

"చాంద్రమాసము రెండు పక్షములు గలది. ఆ చాంద్రమాసము రెండు విధములు. శుక్ల పక్షముతో నారంభించి అమావాస్యతో ముగియునది ఒకటి. కృష్ణ పక్షముతో ప్రారంభమై పూర్ణిమతో ముగియునది రెండవది. కృష్ణపక్షముతో ఆరంభమగు నెలను కొందరంగీకరించరు. కొందరు ఇష్టపడుదురు. అయినను వింధ్యకు దక్షిణమున కృష్ణపక్షముతో నారంభమగు నెలను అంగీకరించరు. కృష్ణపక్షాదిమాసమును అంగీకరించు ప్రాంతముననూ శుక్లాది మాసము ముఖ్యము; కృష్ణాది గౌణము. శాస్త్రములును చాంద్రమాన సంవత్సరము శుక్ల పక్షముతో నారంభమగునని నుడువుచున్నవి." అని భావము.

ఈ చర్చవలన చంద్రహీనదినమునుండి పరిగణితమగుచున్న మాసము క్రమముగ క్రమవృద్ధిని పురస్కరించుకొని చంద్రరేఖ గల దినమునుండి పరిగణితము కావలెనని వాదనుట నిశ్చయము.

ఈ ఉగాది పండుగ తొలిరూపము యుగాదియని తెలిసికొంటిమి. ఇది మనకు ప్రథమము, ప్రధానమునైన పండుగ. మనకేకాదు. మన పక్కింటి కర్నాటకులకును, పొరుగింటి మహారాష్ట్రులకును, చాంద్రమాసమును అనుసరించుచున్న మాలవీయులు మొదలగువారికిని ఇది నూతన సంవత్సరారంభము. యకారాదిపదముల యుచ్చారణము తెనుగువారి సంప్రదాయమునకు విరుద్ధము. కనుక ఉగాదియని రూఢమైపోయినది. కర్నాటకులు, మహారాష్ట్రులును నేటికిని 'యుగాది' యనియే ఉచ్చరింతురు.

ఈ యుగాది మహోత్సవ దినమునందు ఉషఃకాలమున నాంధ్రులు మంగళాభ్యంగస్నానము నొనరింతురు. సంపన్నులగువారు నాడు నూతన వస్త్రములను ధరింతురు. గృహబాహ్యాభ్యంతర ప్రదేశములను పుష్పపల్లవ తోరణములతో నలంకరింతురు. ఇంటి భవంతిలో మంటపము నిర్మించి ఆ సంవత్సర పంచాంగమును, తత్సంవత్సరాధిదేవతను షోడశోపచారములతో పూజింతురు. షడ్రసాత్మకమగు రసాయనమును సిద్ధపరచి వత్సరాధిదేవతకు నివేదనచేసి, సేవింతురు. ఈ రసాయనమును ఉగాది పచ్చడి, ఉగాది గొజ్జు అందురు. దీనిలో క్రొత్తబెల్లము, పచ్చిమిరపకాయలు, చింతపండు,

ఉప్పు, మామిడిపిందెలు, వేపపూత, గసగసాలు మున్నగునవి చేర్తురు. మధురామ్ల తిక్త కటు లవణ కషాయరసము లారును గల ఇవి వసంత ప్రారంభమున ప్రకృతి ప్రసాదించిన నూతన పదార్థములు. క్రొత్త చింతపండును నీటితో కలిపి, అందు బెల్లమునుగాని, చెరకు పాలనుగాని పోసి, సన్నని పచ్చిమిరప కాయల ముక్కలను, ఒకించుక లవణమును, సన్నని పూప మామిడి పిందెలను, గమ గమ పరిమళించు వేపపూతను వేసి గొజ్జుగా కలిపి, దానిలో గోఘృతము నభిఘారము చేయుదురు. షడ్రసోపేతమగు నీ రసాయనము సుఖదుఃఖ సమ్మిశ్రమగు మానవుని సంవత్సర జీవితమునకు ఉపలక్షణము. నాడు ఈ గొజ్జును సేవించుట మానవుడు సంవత్సరములో తన కనుభవమునకు రానున్న జీవితమునకు ఆనాడే యుపక్రమము గావించుటను సూచించును. ఈ గొజ్జులో నేయిని కలుపుట మానవుడు సుఖదుఃఖరూప ప్రవృత్తులందు అంటకుండవలయుననుటను విదితము చేయుచున్నది. ఇట్టి విశిష్ట గుణములుగల రసాయనము సేవించిన పిదప ఇష్టజనములో గూడి మృష్టాన్నము భుజించి సంతృప్తిగాంచెదరు.

భోజనాంతరము మూడు జాములు గడచిన పిదప స్వగృహముననో, గ్రామ దేవాలయముననో, చావడియందో సమావేశమై పంచాంగ శ్రవణము జరిపింతురు. సంవత్సరమందలి సుయోగ దుర్యోగములను, తమ తమ కందాయ ఫలములను, ఆయవ్యయములను—స్థూలముగా నా యేడాదియందలి తమ భావి జీవితక్రమమును తెలిసికొని తదనుగుణముగా ప్రవర్తించుట కానాడే సంకల్పము గావింతురు. కొన్ని

ప్రాంతములందు సాయంకాలము ఎడ్ల బండ్ల నలంకరించి పోటీ లలో పరువెత్తించుటయు గలదు.

ధర్మసింధుకారుడు "తైలాభ్యంగం సంకల్పాదౌ నూతనవత్సర నామకీర్తనా ద్యారంభం...... ప్రతిగృహం, ధ్వజారోహణం నింబపత్రాశనం వత్సరాది ఫలశ్రవణం నవరాత్రారంభః నవరాత్రోత్సవాది నిమిత్తాభ్యంగాదిశ్చ... కార్యః." (తలంటి పోసికొని, సంకల్పాదులలో నూతన సంవత్సరము పేరుచెప్పుట, ఇంటింట ధ్వజారోహణము, వేపాకు తినుట, వర్షాదుల ఫలశ్రవణము జరుపవలెను. ఇదియే నవరాత్రారంభము.) అని నాడు. నిర్ణయ సింధుకారుడును ఈ విధముగనే తెలిపినాడు. భవిష్యపురాణమున

"చైత్రే మాసి మహాబాహో పుణ్యా యా ప్రతిప త్పరా,
అస్యాం వై నింబపత్రాణి ప్రాశ్య సంశృణుయా త్తిథిమ్.
శకవత్సర భూపమంత్రిణాం
రసధాన్యేశ్వర మేఘపతీనామ్,
శ్రవణా త్పఠనాచ్చ వై నృణాం
శుభ తాం యా త్యశుభం సహ శ్రియాం."

(ధర్మరాజుతో ననుచున్న మాటలివి: మహాబాహో చైత్ర మాస శుద్ధపాడ్యమి పుణ్యమైనది. ఆనాడు వేపాకులు భుజించి తిథి నక్షత్రాదులను, శకమును, వర్షాద్యధిపతులను గురించి వినవలెను. ఇట్లు వినుటవలన మానవులకు అశుభ ములుగూడ శుభముగా పరిణమించును.) అనియున్నది.

ఈనాడు ఇంద్రోత్సవము ఒనరించవలెనని భారతములో గలదు. సామాన్యముగ ఉగాదినుండి రామనవమి వరకు రామనవరాత్రులును జరుపుదురు.

చాంద్రమాన సంవత్సరాది అతి ప్రాచీన మనుటకు ధర్మశాస్త్రములును ప్రమాణము. ధర్మశాస్త్రములలో చాంద్రసౌర సావన బార్హస్పత్య నాక్షత్ర మానములు చెప్పబడినను,

"స్మరే త్సర్వత్ర కర్మాదౌ చాంద్రం సంవత్సరం సదా,
నాన్యం యస్మా ద్వత్సరాదౌ ప్రవృత్తి స్తస్య కీర్తితా."

(కర్మలకు అంతటను చాంద్రమాన సంవత్సరమునే గ్రహించవలెను. మరొకదానిని గ్రహించరాదు. ఎందుకనగా, దానికే వర్షాదిలో ప్రవృత్తి యున్నది గనుక.) అని నిర్ణయించినారు. కనుకనే సౌరమానము వ్యవహారముననున్న ప్రాంతములయందును వైదికకర్మలకు చంద్రమానమే పాటించబడుచున్నది.

అగ్నిపూజకులగు పార్సీల సంవత్సరాది "నౌరోజ్" వసంతమాసమున దాదాపు మన ఉగాది దరిదాపులో వచ్చుటయు దీని ప్రాచీనతకు మరొక నిదర్శనము. పార్సీలు ఎప్పుడో ఆర్యులనుండి విడిపోయినవారు. వారును దీనిని పాటించుచున్నారనిన ఇది ఆర్యులును, పార్సీలును విడిపోకముందున్న యాచారమైయుండును. చాంద్రమాన సంవత్సరాదిని గురించి ఔరంగజేబు చక్రవర్తి తన కుమారుడగు మొఅజ్జమ్‌కు వ్రాసిన యొక లేఖలో "ఈదినము అగ్నిపూజ

కులగు పారశీకుల పండుగ. మఱియు నిది విక్రమాదిత్యుని రాజ్యాభిషేక దినమని కాఫరులైన హిందువులు విశ్వసించుచున్నారు. అంతేకాక యిది హిందూస్థానమున సంవత్సరాది." అని తెలిపినాడు.

ముస్లిములు—ఏదేశమువారైనను – చంద్రగతిని అనుసరించువారే. అధిక మాసములను పరిగణించి చంద్ర సూర్యమానములకు సామరస్యము కల్పించు సంప్రదాయము వారికి లేదు గనుక వారి పండుగలు ఒక్కసారి మన చైత్రమాసమునను, మరియొకసారి వైశాఖమాసమునను ఇట్లు సంవత్సరమున కొకనెలగా మారుచుండును.

చాళుక్యుల కాలమున మాత్రము మన ఆంధ్రదేశమున సౌరమానము అధిక వ్యాప్తిలో నుండెను. ఇప్పుడు మన దేశమున సౌరమానమును తమిళ, కేరళ, వంగ, పంజాబు, సింధు, అస్సాం వాసులు పాటింతురు. బార్హస్పత్య మానమును గుజరాతీలు, మార్వాడీలు మున్నగువారు నడపుచుకొందురు. "బార్హస్పత్యస్తు మాఘాదౌ" (బార్హస్పత్యమానము మాఘశుద్ధ పాడ్యమితో నారంభమగును) అని నిర్ణయసింధుకారు డనినాడు. కాని మార్వాడీలలో జైన సంప్రదాయమువారు దీపావళినుండి నూతన వర్షమును పాటింతురు. ఇది దీపావళిలో తెలిపిన ప్రాచీన కౌముదీ మహోత్సవ సంప్రదాయమైయుండును. మాఘముతో మొదలగుట పంటకారును సూచించును కదా! (దీనిని దీపావళిలో చూడుడు.)

వరాహమిహిరుడు వసంత విషువత్కాలమునుబట్టి ఋతుమాససామరస్యమును సాధించనేమో సాధించినాడు. కాని, శింశుమారచక్రము ఏడాదికి $50\frac{1}{4}$ వికలలమేర వెనుకకు తిరుగును. సూర్యచక్రము 360 డిగ్రీలు తిరుగుటకు 50 వికలలు శేషము ఉండగనే విషువత్కాలము సంభవించుచున్నది. ఇట్లు 72 సంవత్సరముల కొక డిగ్రీప్రకారము విషువత్కాలము 23 డిగ్రీలు వెనుకకువచ్చి నేడు ఉత్తరాభాద్ర రెండవ పాదమునకు చేరినది. అనగా, రెండు నెలలకు ముందే వసంతఋతువు ప్రారంభమగుచున్నదన్నమాట. కనుక వరాహమిహిరునివలె మనముకూడా దీనిని సంస్కరించుకొనవలసియున్నది.

---

# 3. శ్రీరామ నవమి

రామకృష్ణావతారములు శ్రీ మహావిష్ణువు సంపూర్ణావతారములని భారతీయ పురాణేతిహాసములు ఉద్ఘోషించుచున్నవి; భారతీయులును అట్లే నమ్ముచున్నారు. అందుచనను సీతారామలక్ష్మణులు అన్నివిధముల మన కాదర్శప్రాయులుగ కొలువబడుచున్నారు. పాతివ్రత్యమునకు సీతను, పితృవాక్య పరిపాలనమునకును, సత్యసంధతకును, ఏకపత్నీవ్రతమునకును రాముని, భాతృప్రీతికిని, పరదారవిముఖతకును సౌమిత్రిని మించినవారు భారత సాహిత్యమున లేరు. రామచంద్రుని గుణములను, రూపసంపదను వాల్మీకి ముక్తకంఠముగ పొగడెను. రామచంద్రుని చరిత్రమును మొదట వ్రాసిన వాడును అతడే. భారతీయసాహిత్యమున అదియే ఆది కావ్యమైనది. వాల్మీకి వర్ణించిన రాముని చూడుడు.

ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః,
నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ.
బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః,
విపులాంసో మహాబాహుః కంబుగ్రీవో మహాహనుః.
మహోరస్కో మహేష్వాసో గూఢజత్రు రరిందమః,
ఆజానుబాహు స్సుశిరాః సులలాట స్సువిక్రమః.
సమ స్సమవిభక్తాంగః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్,
పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః.

ధర్మజ్ఞః సత్యసంధశ్చ ప్రజానాంచ హితే రతః,
యశస్వీ జ్ఞానసంపన్నః శుచి ర్వశ్యః సమాధిమాన్.
ప్రజాపతిసమః శ్రీమాన్ ధాతా రిపునిషూదనః,
రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా.
రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా,
వేదవేదాంగతత్త్వజ్ఞః ధనుర్వేదే చ నిష్ఠితః.
సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్,.
సర్వలోకప్రియ స్సాధుః అదీనాత్మా విచక్షణః.
సర్వదాభిగతః సద్భిః సముద్ర ఇవ సింధుభిః,
ఆర్య స్సర్వసమ శ్చైవ సదైకప్రియదర్శనః.
సచ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః,
సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవా నివ.
విష్ణునా సదృశో వీర్యే సోమవత్ప్రియదర్శనః,
కాలాగ్ని సదృశః క్రోధే క్షమయా పృథివీసమః.
ధనదేన సమ స్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః,
రమయ త్యేష స గుణై రుదారై స్తై రిమాః ప్రజాః.
యస్మా దతో రామ ఇతి నామైతత్ తస్య విశ్రుతం.
(బాల – సర్గ 1 శ్లో 8 – 19).

ఈ శ్లోకములు సుగమములు గావున వివరింపనైతిని. ఇన్ని గుణముల ప్రోవు కనుకనే, ప్రజల నీ గుణములతో సంతోష పెట్టుచున్నందుననే రామునికి 'రామః' (రమయతి గుణైః ప్రజా ఇతి) అని పేరు వచ్చెనని వాల్మీకి విస్పష్టముగ వాకొనినాడు. ఇంతటి మహిమాన్వితుడు మనకే కాదు.

ప్రపంచమునందలి మానవాళికిని ఆదర్శప్రాయుడనుటలో ఆశ్చర్య మేమున్నది?

రామలక్ష్మణులను ఆదర్శ మూర్తులుగా పేర్కొనుట రెండు వేల ఏండ్లకుముందునుండియే కలదనుటకు హాలుని గాథాసప్తశతిలోని ఒక గాథను ఉదాహరించుచున్నాను.

దిఅరస్స అసుద్ధమణస్స
కులవహూా ణిఅఅ కుడ్డ లిహిఆఇం,
దిఅహం క హేఇ రామా
ణులగ్గ సోమిత్తి చరిఆఇం. 1–35
(దేవర స్యాశుద్ధ మనసః
కులవధూ ర్నిజక కుడ్య లిఖితాని,
దివసం కథయతి రామా
నులగ్న సౌమిత్రి చరితాని.)

పాపము! ఇంటిని గుట్టుగా పెట్టుకొను నొక యిల్లాలు తన యెడ మరది చెడుతలపుతోనుండుట గ్రహించి ఇంటి గోడపై వ్రాసిన రామానులగ్న సౌమిత్రి చరితమును ప్రతి దినమును నూరిపోయుచుండెనట. ఇంటి గోడలపై నీతి బోధకముగా రామకథ వ్రాయుచుండి రనిన దాని ప్రాబల్య మును గురించి చెప్ప నక్కర లేదు.

జైన, బౌద్ధమత గ్రంథములోని రామాయణ గాథలు వాల్మీకి రామాయణముతో కొన్ని పట్టుల భేదించుచున్నను, సత్యసంధాది గుణముల వర్ణనమున దారిదప్పుట లేదు. దీనిని బట్టి రామాయణ మతిప్రాచీన కాలమునుండి గౌరవింప

బడుచుండుట, అతిప్రాచీన గాథయు నగుట నిస్సందేహము. ఇది అతిప్రాచీన మనుటకు దక్షిణ అమెరికాలోని ఆదిమ వాసులగు రెడ్ ఇండియనులు ఏడాది కొకమారు సీతా రామోత్సవము జరుపుటయు, వారి సాహిత్యమున సీతా రామ గాథలకు సంబంధించిన పాటలుండుటయు ప్రబల మగు నిదర్శనమని పరిశోధకులు నుడువుచున్నారు. దీనిని దయానంద సరస్వతియే తెలిపిరి.

తన శీలసంపదతో మానవజాతికే కనువిప్పు కలిగించిన రామచంద్రుడు చైత్రశుద్ధ నవమినాడు అవతరించెనని రామాయణము తెలుపుచున్నది.

"తతోయజ్ఞే సమాప్తే తు ఋతూనాం షట్ సమత్యయుః,
తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ.
నక్షత్రే దితిదైవత్యే స్వోచ్చసంస్థేషు పంచసు,
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా విందునా సహ.
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్,
కౌసల్యా జనయ ద్రామం సర్వలక్షణ సంయుతమ్.
విష్ణో రర్ధం మహాభాగం పుత్ర మైక్ష్వాక వర్ధనమ్."
(బాల – సర్గ 18, $7\frac{1}{2}$–$10\frac{1}{2}$).

పుత్రకామేష్టి సమాప్తిచెందిన తర్వాత ఆరు ఋతువులు గడచినవి. పిదప పన్నెండవ నెలయగు చైత్రమాసమున నవమీ తిథినాడు, అదితిదేవతాకమగు పునర్వసు నక్షత్ర మున, ఐదు గ్రహములు ఉచ్చలోనుండగా, కటకలగ్న మున గురుడు చంద్రునితో కలసియుండగా, కౌసల్యాదేవి

జగన్నాథుడును, సర్వలోకారాధ్యుడును, సర్వలక్షణ సంయుతుడును, విష్ణువులో అర్ధభాగమగు మహాభాగుడునుఅగు రాముని ప్రసవించెను – అని ఈ శ్లోకముల తాత్పర్యము. రామావతార విషయమున హేమాద్రి అగస్త్యసంహిత లోని భాగము నిట్లుదాహరించెను:

"చైత్రే నవమ్యాం ప్రాక్ పక్షే దివా పుణ్యే పునర్వసౌ,
ఉదయే గురుగౌరాంశో్యః స్వోచ్ఛస్థే గ్రహపంచకే.
మేషే పూషణి సంప్రాప్తే లగ్నే కర్కటకాహ్వయే,
ఆవిరాసీ త్సకలయా కౌశల్యాయాం పరం పుమాన్."

ఈ రాముడు పదునొకండు వేల సంవత్సరములు రాజ్యము పాలించెననియు రామాయణము నాలుగుచోట్ల నుద్ఘోషించుచున్నది.

"దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ,
రామో రాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి."
(బాల 1–97.)

"దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ,
భ్రాతృభి స్సహిత శ్శ్రీమాన్ రామో రాజ్యమకారయత్."
(యుద్ధ 131–10.)

శ్రీరాముడు పూర్ణమానవుడుగా జీవించెను. అట్లయి నప్పుడు ఈ పదకొండువేలేండ్ల రాజ్యపాలనము విడ్డూరముగ కనిపించును. కనుక పండితులు పరిపరి విధముల వ్యాఖ్యలు చేసిరి. "శతం సహస్ర మయుతం సర్వ మానంత్య వాచకం" అని శతసహస్రాది పదములు బహుత్వ సూచకములని

కొంద రనిరి. కాలమానమున ప్రాచీనులు సంకేతములు వాడుట యాచారమనియు, వాల్మీకియును ఇట్టి సంకేతములనే వాడియుండుననియు కొందరు పండితు లనిరి. "తృతీయం దశ మిత్యాహుః చతుర్థం తు సహస్రకం." (తృతీయమనగా పది, చతుర్థమనగా వేయి) అను అభియుక్తోక్తివలన దశవర్ష సహస్రములనగా నలుబదియు, దశవర్ష శతములనగా ముప్పదియు–రెండును కూడగా డెబ్బదియనియు శ్రీ దుంపల రామిరెడ్డి యను పండితులొకరు చక్కని సమన్వయము చేసిరి. డెబ్బది సంవత్సరములు రాజ్యముచేయుట మానవాతీతము కాదు. పట్టాభిషేకమునకు పూర్వము ముప్పదియెనిమిది సంవత్సరములు గడచినవి. వానిని డెబ్బదితో కలిపిన నూట యెనిమిది యగును. నూటయెనిమిదేండ్లు జీవించుట, తర్వాత నూట పదునాలు సంవత్సరములు జీవించుటకు యత్నించుట ఆనాడు పలువురి సాధనగా తెలియును. (దీనిని కృష్ణాష్టమిలో చూడుడు.)

రామనవమినాడు ఉపవసించి, పూజా పురస్కారములు జరిపి, రాత్రి జాగరణ చేయవలెనని వ్రతగ్రంథములు ఆదేశించుచున్నవి. అగస్త్యసంహిత తెలిపిన తీరును సంగ్రహముగ నివేదింతును:

"రామనవమినాడుహరి రామావతారమెత్తెను గనుక ఈతిథి సర్వకామద. నవమినాడు ఉపవసించి, రాత్రి రామ సన్నిధిలో జాగరణము చేసి, దశమినాడు సంధ్యాదులు ముగించుకొని, చిత్తానుసారముగ భక్తితో రాముని పూజింపవలెను. బ్రాహ్మణ సంతర్పణచేసి, దక్షిణతో వారిని

సంతోషపెట్టవలెను. రామభక్తులకు గోదాన, భూదాన, తిల దాన, హిరణ్యదాన, వస్త్రాలంకార దానములు చేయవలెను. ఇట్లు రామనవమీ వ్రతమును చేయువారు అనేక పూర్వ జన్మ పాతకములను పోగొట్టుకొని, అంతమున విష్ణుపదమును బొందుదురు. సర్వవ్రతములలోను ఉత్తమమగు ఈ వ్రతమును ఆచరింపక ఇతరవ్రతములను చేయువారు ఫలములను పొందరు. రామనవమీ వ్రతమువలన పెక్కురహస్య పాపములను నశించును. రామనవమినాడు రామప్రతిమాదాన మొనర్పవలెను. దానివలన మోక్ష ప్రాప్తి కలుగును. ఈ ప్రతిమాదానము వలన కురుక్షేత్రమున సూర్య గ్రహణ సమయమున తులా పురుషదానాదులు చేయుటవల్ల కలుగు ఫలము లభించును."

రామప్రతిమను ఎట్లు నిర్మించవలెననునదియు, ఎట్లు దానముచేయవలెననునదియు లింగపురాణము నందును, రామార్చన చంద్రికయందును వివరింపబడినవి.

చైత్రశుద్ధ పాడ్యమినుండి రామనవరాత్రోత్సవము జరుపుదురు. ఈ తొమ్మిది దినములందును రామాయణ పారాయణము, రాత్రులందు రామకథాకాలక్షేపము జరుపుదురు. నవమినాడు రామ జననఘట్టము చదివి వినిపించి, పూజాదికము నిర్వర్తింతురు. వసంతర్తువు — ఎండ కాలము — అగుటవలన పానకము, పణ్యారము (వడపప్పు) ఆరగింపుచేసి ప్రసాదము పంచుదురు. దశమినాడు పట్టాభిషేక ఘట్టము పఠింతురు. చైత్ర శుద్ధ పాడ్యమినుండి చేసి నవరాత్రము జరుపవలెననియు, నవమితో నవరాత్రము ముగించవలెననియు ధర్మసింధుకారుడు తెలిపెను.

రామనవమి నుండి రామకోటి వ్రాయుట నారంభించి మరుసటి రామనవమికి ఆ వ్రతము ముగించు నాచారము కూడ గలదు.

"రామనామ లిఖే ద్యస్తు లక్షకోటి శతావధి,
ఏకైక మక్షరం పుంసాం మహాపాతక నాశనం."

రామనామము లక్ష, కోటి వ్రాసిన, ఒక్కొక అక్షరమే మహాపాతకములను నశింపజేయునని, శంకరుడు పార్వతికి చెప్పినట్లు భవిష్యోత్తర పురాణమున ఉమామహేశ్వర సంవాదమున వివరింపబడినది.

మన దేశమును ఏకతా సూత్రమున అనాది కాలము నుండి బంధించినది రామచరిత్రమే. అట్టి రామచరిత్రను తెలియని భారతీయుడు ఎవ్వడును ఉండడు. పసిపిల్లలకు సయితము రామకథ ఎంతో కొంత తెలియును.

"చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనం."

---

# 4. అట్లతదియ

ఆంధ్ర దేశమున ''అష్టాదశ వర్ణాలకు అట్లతదియ'' అను నానుడి కలదు. ఈ పండుగ భాద్రపద బహుళ తదియనాడు జరుపబడుచున్నది. ఈనాడు స్త్రీలు తెల్లవారు జాముననే లేచి, అభ్యంగస్నాన మాచరించి, వ్రేళ్ళకు గోరింట నాకు పెట్టు కొందురు. పిదప గవ్వలాట ఆడుదురు. ఊరిబైట తోటలకు అట్లు, బెల్లపట్లు, పెరుగన్నము తీసికొని వెళ్ళి వాని నారగించి, ఊయెల లూగుదురు. రాత్రి గౌరీపూజ చేసికొందురు.

ఈ పండుగ ప్రధానముగా స్త్రీల సౌభాగ్యమునకు చేయు పండుగయని తోచుచున్నది. శ్రావణ, భాద్రపద మాసములలో అవిధవానవమీ మున్నగు కొన్ని స్త్రీసౌభాగ్య కారకములగు వ్రతములు వ్రత గ్రంథములలో చెప్పబడినవి. కాని ఈ అట్లతద్దిని గురించిన విశేషములు కానరావు. హేమాద్రి పండితుడు

''చైత్రే భాద్రపదే మాఘే రూపసౌభాగ్యసౌఖ్యదం,
తృతీయావ్రత మేత న్మే కృష్ణ కస్మా న్నకీర్తితం''

చైత్ర భాద్రపద మాఘమాసములలో రూపసౌభాగ్య సౌఖ్యదమైన తృతీయావ్రతమును నాకెందులకు తెలుపలేదని యుధిష్ఠిరుడు కృష్ణుని పృచ్ఛించినట్లు, భవిష్యోత్తర పురాణము నుండి వ్రతమొకదానిని ఉదాహరించినాడు. భాద్రపద తృతీయ అనినాడే కాని, భాద్రపద బహుళ తదియ అని

స్పష్టముగా జెప్పలేదు. భాద్రపద శుద్ధ తృతీయనాడు చేయ వలసిన వ్రతములే పెక్కు చెప్పబడినవి. కాని, గుడతృతీయా వ్రతమను నొక వ్రతమును అతడు ఉదాహరించినాడు.

"గుడేన తుష్యతే దేవీ పార్వతీ సర్వమంగలా,
యావ త్పశ్యామి ప్రత్యూషం తావ ద్గౌరీచతుష్టయం.
జాతరత్నమయం తచ్చ మయా తత్పరివర్జితం,
ప్రస్థితా త త్సమాదాయ పరిక్షేప్తుం జలాశయే.
గుడాపూపా స్తు దాతవ్యా మాసి భాద్రపదే తు యా,
తృతీయా పాయసేనాపి వామదేవస్య ప్రీతయే."

గుడాపూపములు భాద్రపద తృతీయనాడు దేవికి ఆరగింపు పెట్టి జలాశయములలో విసర్జించవలెననియు, వామదేవుని ప్రీతికై పాయసమును సమర్పించవలెననియు ఈ వ్రతమున చెప్పబడినది. దీనియందును ఏ పక్షపు తృతీయయనునది స్పష్టముగ లేకపోయినను, గుడాపూపములను నైవేద్యమిడ వలెననుటవలన నేటి అట్లతదియయే కావచ్చునని తోచు చున్నది.

వర్షాకాలమున తేలికయగు పదార్థములు భుజింపవలె నని ఆయుర్వేద గ్రంథములు ఆదేశించుచున్నవి. అట్టి ఆదేశము నకు ఉపలక్షణముగా అట్లు ఆరగించు పండుగ ఏర్పాటుచేయ బడినదని తోచుచున్నది. వర్షర్తువు గనుక ఊరిబయటి తోట లలో ఊయల లూగుటలో గల ఆనందమును ఈ పండుగ నాడు అనుభవించుట తర్వాత తర్వాత ఆచారమై యుండును.

అట్లతదియనాడు మాలలు గోంతెమ్మ (కుంతి) పూజ చేయుదురు. దీనికొక గాథ చెప్పుదురు. భారత యుద్ధానంతరము ధర్మరాజు మృతులకు అంత్యక్రియలు జరుపుచు తర్పణము చేయుచుండగా, తర్పణోదకము లందుకొనుటకు కర్ణుని చేయి వచ్చెనట. ధర్మరాజు ఆశ్చర్యపడి ఇదేమియని వ్యాస మహర్షి ని ప్రశ్నించెను. "కర్ణుడు నీ జ్యేష్ఠసోదరుడు. అతనికిని తిలాంజలి యిమ్ము" అని వ్యాసర్షి సమాధానము చెప్పెనట. ధర్మరాజు మహర్షి మాటప్రకారమే చేసి, పిదప, నిజము చెప్పుమని తల్లియగు కుంతిని బలవంతపరచె నట. ఆమె కర్ణోత్పత్తి గాథను దుఃఖముతో తెలిపె నట. "ఈ సంగతిని ముందుగనే చెప్పియుండిన కర్ణునే రాజుగా చేసి, యుద్ధమే లేకుండ చేసియుందుము గదా! ఘోరమగు తప్పు చేసితివి. కనుక నీవు మాలల దేవతవు కమ్ము." అని ధర్మరాజు తల్లిని శపించెనట. నెలతల నోట నువ్వుగింజయు నానరాదనియును శాపమిచ్చె నట. అప్పటినుండి గోంతెమ్మ మాలల ఇలువేలుపయ్యెనట. స్త్రీలు రహస్యము దాచకపోవుటయు అప్పటి నుండియే నట.

ఈ గాథ అంతర్యమేమి యయినను, మాలపున్నమవలెనే, ఇదియును మహాలయ సంబంధియనియు, వర్షాధిదేవత పూజయనియు ఊహింపవచ్చును. (మాల పున్నమను గురించి మహాలయ పక్షములలో చూడుడు.)

---

# 5. అక్షయతృతీయ

వైశాఖ శుద్ధ తదియనాడు ఈ పండుగ చేయుదురు. ఈ దినమున చేయు జపహోమ పితృ తర్పణ దానాదులు అక్షయమగునని స్మృతి గ్రంథకారులు తెలిపిరి. ఇది కృత యుగమునకు ఆది యట.

"వైశాఖమాసస్య చ యా తృతీయా
నవమ్యసౌ కార్తిక శుక్లపక్షే,
నభస్యమాసస్య తమిస్రపక్షే
త్రయోదశీ పంచదశీ చ మాఘే."

అని వైశాఖశుక్లపక్ష తృతీయ కృతయుగాదియని విష్ణుపురాణాదులు చెప్పుచున్నవి. (యుగాదిచర్చను ఉగాదిపండుగలో చూడగోరినాను.) ఈ తృతీయ రోహిణీయుతమైన మిగుల పుణ్యప్రదయట.

"వైశాఖశుక్ల పక్షేతు తృతీయా రోహిణీయుతా,
దుర్లభా బుధచారేణ సోమేనాపి యుతా తథా."

అని నారదీయ వచనమును నిర్ణయామృతకారుడు ఉదాహరించెను.

ఈనాడు యుగాదిగనుక ఉదయముననే స్నానమాచరించి, ఉదక ఘటమును, గ్రీష్మఋతువున పండు పంటలను—యవలు, గోధుమలు, సెనగలు మున్నగువానిని—దధ్యోదనమును దానమొనర్పవలెనని, ఇట్లు చేసిన నరుడు శాశ్వత

ముగా శివలోకమున విరాజిల్లునని భవిష్యపురాణము, దేవీ పురాణము తెలుపుచున్నవి. ఈదినము పితాళ్ళకు పిండరహిత మైన శ్రాద్ధము చేయవలెను.

కొన్ని ప్రాంతములలో గౌరికి డోలోత్సవము, కృష్ణునికి డోలోత్సవము జరుపుదురు. ముత్తైదువులు, కన్యలు ఈ పూజలలో పాల్గొందురు. పూజానంతరము పండ్లు, మిఠాయిలు, నానవేసిన సెనగలు వాయనమిత్తురు.

ఈనాడు వ్రతధారులు ఉప్పును మాని చక్కెర కలిపిన పేలపిండి భుజంతురు. బదరీనారాయణమందిర ద్వారము ఈనాడే తెరుతురు. అంతవరకు మంచు పేరుకొని అగమ్యముగా నుండును. హృషీకేశమున యాత్రికులు స్నానమాచరించి భరతమందిరమున 108 మార్లు ప్రదక్షిణ మాచరింతురు. కొందరీనాడు పూర్తిగా నుపవసింతురు.

ఈదినమున ఛత్రము, పాదరక్షలు, గోవు, భూమి, కాంచనము, వస్త్రములు, ఉదక పూర్ణ ఘటము దానమిచ్చుట మహాపుణ్యప్రదమని భవిష్యోత్తరమున నుడువబడినది. ఈ దినమున చేయబడిన హోమము, దానము, పితృదేవతలకు, దేవతలకు చేయు పూజ క్షయము పొందదు గాన ఇది అక్షయతృతీయ యనబడెనని కృష్ణుడు ధర్మరాజునకు చెప్పెనట.

"అస్యాం తిథౌ క్షయ ముపైతి హుతం న దత్తం
తేనాక్షయేతి కథితా మునిభిస్తృతీయా,
ఉద్దిశ్య య త్సుర పితౄన్ క్రియతే మనుష్యైః
తచ్చాక్షయం భరత భారత సర్వమేవ."

దీనికొక కథయును చెప్పబడినది : పూర్వమొక నిర్ధనుడగు వైశ్యు డుండెను. అతడు మిగుల నుత్తముడు, ప్రియంవదుడు, సత్యవృత్తి. ధనము లేక కుటుంబ వ్యాకులములు ముసరినను పుణ్యాఖ్యానములు వినుటయం దాసక్తికల వాడయియుండెను. అతడొకనాడు రోహిణీబుధ యుక్తమైన వైశాఖ శుద్ధ తృతీయ నాడు చేయు స్వల్పదానమైనను అక్షయ ఫలప్రదమని చెప్పగా విని, గంగలో స్నానమాచరించి, పితరులకు తర్పణముచేసి, ఇంటికివచ్చి, ఉదక పూర్ణ ఘటములను, యవగోధుమ చణకములను, పేలపిండిని, దధ్యోదనమును, చెరకు పాలను దక్షిణతోసహ యథాశక్తిగా బ్రాహ్మణులకు దానమిచ్చెను. కుటుంబాసక్తిచిత్తయగు భార్య వలదన్నను వినినవాడు కాడు. ఈ ఫలమువలన మరు జన్మమున అతడు కుశావతీనగరమున క్షత్రియుడై జనించెను. అప్పు డతనికి సంపద అక్షయమయ్యెను. అతడు పెక్కు యజ్ఞములు ఒనర్చి, పెక్కు దానములు చేసెను. అంత చేసినను అతని ధనము తరుగ లేదు.

ఈ పండుగ ఋతువునకు సంబంధించినదనుట స్పష్టము. యుగాదియనుటను బట్టియు రోహిణీయుతము ప్రశస్తమనుటనుబట్టియు ఒకప్పుడిది సంవత్సర ప్రారంభదినముగా నుండెననియు నూహింపవచ్చును. (రోహిణియందు వసంత విషువము సంభవించు గాథలను శివరాత్రి చర్చలో చూడగోరినాను.)

---

# 6. ఏరువాక పున్నమ

జ్యేష్ఠ శుద్ధ పున్నమను ఏరువాక పున్నమ యందురు. ఇది కృషీవలుల పండుగ. ఏరువాక యనగా దుక్కి ప్రారంభము. ఈ పున్నమనాడు కృషీవలులు ఉదయమున ఎడ్లను కడిగి, వాని కొమ్ములకు రంగులుపూసి, గజ్జెలు, గంటలు, మున్నగు నగలతో అలంకరింతురు. పిదప ఎద్దులు కట్టు గాటిని ధూపదీప నైవేద్యములతో పూజించి, ఎడ్లకు పొంగలి పెట్టుదురు. సాయంకాలము నాగండ్లను, గొర్రులను ఎర్రమంటి పట్టెలతోను, రంగులతోను అలంకరించి భుజముపై నిడుకొని, మంగళ వాద్యములతో ఎడ్లను ఊరేగించుకొనుచు తమ పొలములకు వెళ్లుదురు. అచ్చట నాగండ్లను పూజించి దుక్కి ప్రారంభము చేయుదురు. ఊరివాకిట గోగునారతో జేసిన తోరణ మొకదానిని గట్టి, దానిని చేరుకోలలతో గొట్టి యెవ్వరికి దొరికిన పీచును వారు తీసికొని పోవుట యొక యాచారము. ఇట్లు చేయుటవల్ల పనులకు మేలుకలుగునని కృషీవలుల నమ్మకము.

దేశమంతటను జరుగు ఈ వ్యవసాయ ప్రారంభము నాటి పూజను వ్రత గ్రంథకారులు ఎందులకో తెలుపలేదు. హేమాద్రి మొదలగు వారు జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమనాడు వట సావిత్రియను వ్రతమును తెలిపినారు. వృషోత్సర్గము వంటి వ్రతము తెలుపబడినదిగాని వ్యవసాయప్రారంభమును, సకల జీవాధారమును సస్యఫలాధారమునునగు ఈ పండుగ

పరిగణింపబడ లేదు. హేమాద్రి ఈనాడు జరుపవలసిన పద్మపురాణోక్తమగు పుత్రకామవ్రతమను నొకవ్రతము తెలిపినాడు. ఇది సస్యారంభమునకు నుపలక్షణము కాబోలును!

కాని, ఈ సంప్రదాయము అతిప్రాచీన కాలము నుండియు ప్రజల ఆచరణమున నున్నట్లు తెలియుచున్నది. వర్షర్తువు ఆరంభం కాగానే నేటి కృషీవలులవలె వైదిక కాలము నను దుక్కి ప్రారంభమగుచుండినట్లు ఋగ్వేదములో గలదు (6–32). నాగలి కదల్చుటకుముందు కృషీవలులు క్షేత్రపాలుని సంబోధించుచు మంత్రములు పఠించుచుండిరి.

విష్ణుపురాణమున ఏరువాక 'సీతాయజ్ఞ' మనబడినది. శక్రపూజ చేయవలెనని గోపవృద్ధు డొకడు చేసిన సూచనను ప్రత్యాఖ్యానము చేయుచు కృష్ణు డిట్లనెను :

"మంత్రయజ్ఞపరా విప్రా సీతాయజ్ఞా శ్చ కర్షకాః,
గిరియజ్ఞా స్తథా గోపాః ఇజ్యోస్మాభి ర్గిరి ర్వనే."
(2–16–9)

"'బ్రాహ్మణులకు మంత్రజపమే యజ్ఞము; కర్షకులు ఏరువాక యజ్ఞము చేయుదురు. గోపాలురు గిరియజ్ఞపరులు. కనుక మనము గిరినే పూజింతము – గిరియజ్ఞ మొనర్తము."

ఈ సీతాయజ్ఞ మెప్పుడు జరుపుచుండిరో స్పష్టముగా లేకపోయినను, వర్షర్తు ప్రారంభములో జరుపుచుండుట సహజము.

పాలీ ప్రాకృత సాహిత్యమున ఏరువాకను "వప్పమంగల దివస" అనుచున్నట్లు జాతక కథలనుండి తెలియుచున్నది. వప్పమంగలదివస మనగా, బీజావాపమంగల దివస మన్న మాట. శుద్ధోదనమహారాజు ఆనాడు కపిలవాస్తులో లాంఛనముగా ఒక బంగారు రంగు నాగలిని కర్షకులకు అందజేయు వాడని 'లలిత విస్తరమున' గలదు. చీనాభాషలోని బౌద్ధ గ్రంథములలో ఈ పండుగ వైభవోపేతముగా జరుపబడు చుండెననియు, రాజధానియగు కపిలవాస్తులోను ఏరువాక ప్రారంభమగు చుండెననియు తెలుపబడినది.

హాలుని గాథాసప్తశతిలో ఏరువాకను వర్ణించు చక్కని ఒక గాథ గలదు:

"ఫలహీ వాహణ పుణ్ణాహ
మంగలం లంగలే కుణంతీఏ,
అసఈ అ మణోరహ
గబ్భిణీయ హత్థా థరహరంతి." 2–65

(కార్పాసీక్షేత్ర కర్షణ
పుణ్యాహ మంగలం లాంగలే కుర్వత్యాః,
అసత్యాః మనోరథ గర్భిణ్యాః
హస్తౌ థరథరాయేతే.)

ఒక కులటకు ఏరువాకనాడు పత్తిచేనిలో నాగలిని పూజించు చున్నప్పుడు, మనస్సులో ఏవియేవియో ఆలోచనలు గుబురు కొని చేతులు వణకినవట.

ఈ వర్ణనమున జ్యేష్ఠ పూర్ణిమనాడే ఏరువాకయని నిర్దేశము లేకపోయినను, ఏరువాకనాడు వ్యవసాయసాధనముల పూజ జరుపబడుచుండెననుట స్పష్టముగదా! ఈ ఆచారము బహుకాలమునుండి వచ్చుచున్నది గనుక హోలీ పండుగను గ్రహించి వైదికముద్ర వేసినట్లు దీనిని కూడ 'హోలాకాధికరణ న్యాయమూలసిద్ధము'గా శాస్త్రకారులు గ్రహించినట్లు తోచుచున్నది. జైమిని న్యాయమాలలో హోలాకాధికరణమను హోలీచర్చలో "ఉద్వృషభయజ్ఞాదయ ఉదీచ్యైః. జ్యేష్ఠ మాసస్య పౌర్ణమాస్యాం బలీవర్దా నభ్యర్చ్య ధావయంతి. సోయ ముద్వృషభయజ్ఞః." అని వివరించబడినది. అనగా ఉత్తరప్రాంతమువారు ఉద్వృషభయజ్ఞమును చేయుదురు. జ్యేష్ఠ పూర్ణిమనాడు ఎడ్లను పూజించి పరుగెత్తించెదరు. అదియే ఉద్వృషభయజ్ఞము.

న్యాయమాలలో నిది ఔత్తరాహులు చేయు పండుగయయినట్లు పేర్కొనబడినప్పటికిని, వర్షర్తువు ఆరంభము కాగానే దక్షిణదేశమంతటను సాగుచుండెననియే మనమూహింపవచ్చును. కృష్ణరాయలు వర్షాకాలమును దుక్కసాగుటను కడుమనోహరముగా వర్ణించినాడు.

"కాలునిదున్న నందినయి
గంటలు దున్నక మంటినా మహా
కాలుని నంది దున్ననయి
కర్దమ మగ్నత లేక మంటిననా

హాలికు లెన్నడుం దెగని
        యారుల చేలును జొడుమళ్లనుం
గా. లలి నేరుసాగి రిల
        గల్గు పసింగొని పేద మున్నగన్."

4–124.

వరజుబడి రొంపి ద్రొక్కుం
జరణంబుల బెనగి పసిడిచాయ కడుపులం
బారి సీరుకట్టె లమరెను
బిరుదులు హాలికులు దున్న బెట్టిరొ యనగన్."

4–125.

---

# 7. నాగపంచమి

నాగపూజ మనదేశమున అతిప్రాచీనకాలమునుండి ఆచరణలోనున్న పండుగ. ఇది సంవత్సరమున పెక్కుమారులు జరుపబడుచున్నట్లు వ్రతగ్రంథములలో గలదు. ఆంధ్ర దేశమున శ్రావణ శుద్ధ పంచమినాడును, కార్తిక శుద్ధచవితి నాడును ముఖ్యముగా జరుపుదురు. మొదటిదానిని నాగపంచమి యనియు, రెండవదానిని నాగులచవితి యనియు నందురు.

నాగపంచమినాడు జరుపవలసిన విధులను హేమాద్రి స్కాందపురాణమునందలి ప్రభాసఖండమునుండి యిట్లుదాహరించినాడు :

"శ్రావణే మాసి పంచమ్యాం శుక్లపక్షే తు పార్వతి,
ద్వార స్యోభయతో లేఖ్యా గోమయేన విషోల్బణాః.
.................
పూజయే ద్విధివ ద్వీరలాజైః పంచామృతై స్సహ.
.................
విశేషత స్తు పంచమ్యాం పయసా పాయసేన చ."

శివుడు పార్వతి కిట్లు తెలుపుచున్నాడు : "ఓ పార్వతీ! శ్రావణమాసమున శుక్లపంచమినాడు ద్వారముల కిరుప్రక్కలయందును పేడతో సర్పచిత్రములను వ్రాసి పూజింపవలెను. చతుర్థినాడు ఒక్కపొద్దుండి పంచమినాడు బంగారుతో గాని, వెండితో గాని, కర్రతో గాని, మట్టితో గాని ఐదు పడగల పామును చేయించవలెను. లేక పసుపుతో గాని,

చందనముతోగాని ఐదుతేక, ఏడుపాముల చిత్రములు గీయవలెను. విధిప్రోక్తముగా లాజలతోను, పంచామృతముతోను, గన్నేరు, సంపెంగ, జాజి మున్నగు పూవులతోను, ఈనాగపంచకమును పూజింపవలెను. పిదప ఘృతపాయస మోదకములతో బ్రాహ్మణులను సంతృప్తిపరచవలెను. పిదప అనంతాది నాగరాజులను ధ్యానించవలెను. నాగుల నెప్పుడును భక్తితో పూజించవలెను. పంచమినాడు పాలు, పాయసముల నారగింపు పెట్టవలెను. ఆదినము పగలుగాని, రాత్రిగాని భూమిని త్రవ్వరాదు.''

భవిష్యపురాణమున నాగదష్టవ్రతమను నొక వ్రతము చెప్పబడినది. దానిని హేమాద్రి యిట్లు తెలిపినాడు.

సుమంతు రువాచ :–

నాగదష్టో నరో రాజన్ ప్రాప్య మృత్యుం వ్రజ త్యధః,
అధో గత్వా భవే త్సర్పో నిర్విషో నాత్ర సంశయః.

శతానీకః :—

నాగదష్టః పితా యస్య భ్రాతరో దుహితా పిచ,
మాతా పుత్రో థవా భార్యా కుర్యా త్కిం త ద్వదస్వ మే.
మోక్షాయ తస్య విప్రేంద్ర దానం వ్రత ముపోషణం,
బ్రూహి మే ద్విజశార్దూల య ద్భవే త్త త్కరో మ్యహం.

సుమంతుః :—

ఉపోష్యా పంచమీ సమ్యక్ నాగానాం బలవర్ధనీ,
సమైక మేకం తూవచ్ఛ విధానం శృణు భారత.

శ్రావణే మాసి పంచమ్యాం శుక్లపక్షే నరాధిప,
సాపి పుణ్యతమా ప్రోక్తా గ్రాహ్యా సా గతికామ్యయా.

"రాజా పాము కాటు తిన్న నరుడు మరణించిన పిదప పాతాళ లోకమునకుబోయి విషరహితుడైన సర్ప జన్మ పొందును. ఈ విషయమున సందేహము లేదు." అని సుమంతుడు నుడువగా, శతానీక మహారాజు మిగుల విచారపడి, "పాము కరచిన వాని తండ్రి, సోదరులు, కుమార్తె, తల్లి, పుత్రుడు, భార్య అతని మోక్షప్రాప్తికేమి చేయవలెను? ఏ వ్రతమాచరింప వలెను? ఏ ఉపవాసము చేయవలెను విప్రేంద్రా?" అని ప్రశ్నించును. "పంచమి నాగులకు బలవర్ధనమైనది. చతుర్థి నాడు ఒక్కపొద్దుండి, పంచమినాడు నాగపూజ చేయవలెను. ఇట్లు సంవత్సరము చేసి శ్రావణ శుక్ల పంచమిని విశేషముగ పూజాపురస్కారము లొనర్పవలెను. ఆ పంచమి పుణ్యతమ మైనది; సద్గతిదాయిని." అని సుమంతుడు తెలిపెను.

ఇక కార్తికమాసమున వచ్చు నాగులచవితిని గురించి శ్రీనాథుడు కాశీఖండమున

"చలి ప్రవేశించు నాగులచవితినాడు
మెఱయు వేసవి రథసప్తమిదివసమున
అచ్చుసీతు ప్రవేశించు పెచ్చుపెరిగి
మార్గశిరపౌషమాసాల మధ్యవేళ."

అని తెలిపినాడు. ఈ పండుగ కూర్మపురాణమున నున్న

యట్లు హేమాద్రి పేర్కొనినాడు. ఈనాడు నాగపూజ చేసిన వారిని విషములు బాధించవట.

"విషాణి తస్య నశ్యంతి న తం హింసంతి పన్నగాః."

స్కందపురాణమునను కార్తిక శుక్ల పంచమినాటి వ్రతము వివరింపబడినది. దీనిని పంచమినాడాచరింపవలెనని వరాహపురాణమున గలదు. దీనిని శాంతివ్రతమందురు.

"శాంతివ్రతం ప్రవక్ష్యామి శృణు ష్వైకమనా నృప,
యేన చీర్ణేన శాంతిః స్యాత్సర్వదా గృహమేధినః,
పంచమ్యాం శుక్లపక్షస్య కార్తికే మాసి పార్థివ,
ఆరభ్య వర్షమేకంతు భుంజీయా దమ్లవర్జితం.
నక్తంతు పూజయేద్దేవం హరిం శేషోపరిస్థితం."

తక్కిన నాగవ్రతములను సంగ్రహముగానైన తెలుపుట అప్రస్తుతము గాదు.

చైత్రశుద్ధ పంచమినాడు నాగపూజ. దీనిని స్మృతికౌస్తుభకారుడు తెలిపినాడు. దేవీపురాణము ఇట్లు తెలిపినది.

"పంచమ్యాంపూజయేన్నాగానసంతాద్యాన్మహోరగాన్.
క్షీరం సర్పిస్తు నైవేద్యం దేయం సర్వసుఖావహం."

దీనిని హేమాద్రి గణపతి దమనపూజలో భాగమనినాడు. మత్స్యపురాణమున ఈ నాగప్రతిమల లక్షణమిట్లు చెప్పబడినది.

"నాగాశ్చైవతు కర్తవ్యాః ఖడ్గఖేటకధారిణః,
అధఃసర్పాకృతి స్తేషాం నాభే రూర్ధ్వంతు మానుషీ.
ఫణాశ్చ మూర్ధ్నికర్తవ్యాః ద్విజిహ్వాబహవో సమాః."

నాభికి దిగువన సర్పాకృతియు, నాభికిపైన మానుషాకృతియు గలవిగా సర్పమూర్తులను రచించవలెను. ఫణములను బేసి సంఖ్యలో తలపై కల్పింపవలెను. ఖడ్గము, డాలు వీనిచేత నుంచవలెను.

వైశాఖ శుద్ధ చవితినాడు నాగచతుర్థి. ఈ దినమున సుబ్బరాయని పూజచేసినవారికి సర్పభయ ముండదు.

శ్రావణ పౌర్ణిమనాడు సర్పబలి. ఉపాకర్మాదులు సమాప్తిచెందిన తర్వాత ఒక కుండలో పేలపిండిని పోసుకొని దానిని ఉట్టిలో పెట్టుకొని గరిటతో "సర్పదేవజనేభ్య స్స్వాహా" అని హోమము చేయవలెనని స్మృతి కౌస్తుభ కారుడు తెలిపినాడు. "శిక్యస్థదర్వ్యా కలశా వాదాయ కలశ నిహిత సక్తుభి ర్దర్వీం పూరయిత్వా" అని విధించినాడు.

భాద్రపద శుద్ధ పంచమినాడు నాగదష్టోద్ధరణ పంచమీ వ్రతము. భవిష్యోత్తర పురాణమున నిది చెప్పబడినది. దీనినే శాంతి పంచమీవ్రతమని భవిష్యపురాణము తెలిపినది.

మార్గశిర శుద్ధ పంచమినాడు నాగపూజ. ఇది "దాక్షిణాత్యానాం ప్రసిద్ధా" అని ధర్మసింధుకారుడును, స్మృతి కౌస్తుభకారుడును తెలిపిరి.

"శుక్లా మార్గశిరే పుణ్యా శ్రావణే యా చ పంచమీ,

స్నానదానై ర్బహుఫలా నాగలోకప్రదాయినీ.''
అని స్కాందమున తెలుపబడినది.

ఫాల్గున శుద్ధపంచమినాడు అనంత పంచమీవ్రతము. ఇది స్కాందపురాణ ప్రభాసఖండమున నుడువబడినట.

నాగపంచమినాడు ప్రజలు శిరస్స్నానమాచరించి ఉదయము సర్పవిగ్రహములకు పాలు, కొబ్బెర, గిన్నము, పాయసము ఆరగింపు చేయుదురు. పిదప పుట్టలయొద్దకు వెళ్లి ప్రత్తితో వస్త్రములవంటివి, యజ్ఞోపవీతముల వంటివి చేసి పుట్టల నలంకరించి, పూజించి పుట్టలలో పాలుపోసి ప్రదక్షిణ నమస్కారముల నాచరింతురు. ప్రతి గ్రామమునందును, వేప చెట్టు మూలముననో, అశ్వత్థ మూలముననో నాగవిగ్రహము లుండును. వాని కీనాడు పూజలు జరుగును. బాలబాలికలు కొబ్బెర గిన్నెలను చిత్ర విచిత్రముగా నలంకరించి, వాని మధ్యన బొజ్జము వేసి రెండు దారములు కట్టి త్రిప్పుట కొన్ని ప్రాంతముల యాచారము. సాయంకాలమున తోటలకో, ఊరిబయటి యడవులకో వెళ్ళి చెట్లకొమ్మలకు త్రాళ్లు వ్రేలాడగట్టి యుయ్యాల లూగుదురు. ఈనాడు స్త్రీ పురుషులు చాల నాత్మీయతతో ప్రవర్తింతురు.

నాగపంచమిని గురించి కొన్ని ప్రాంతములలో కొన్ని కథలు ప్రచారమున నున్నవి. వానిలో రెండుదాహరించుచున్నాను.

పూర్వ మొక కాపుండెను. అత డొకనాడు పొలము దున్నుచుండగా, నాగేటి కర్రు ఒక బొరియలో దిగబడి

పోయెను. ఆ బొరియలోనున్న నాగుబాము పిల్లలు చచ్చెను. తల్లి నాగు వచ్చిచూడగా తన పిల్లలన్నియు మరణించియుండుటయు, నాగేటి కర్రకు నెత్తురుమరక లుండుటయు చూచి రోషావేశమున ఆ కాపువాని యింటికి వెళ్ళి అతనిని సకుటుంబముగా కరచి చంపివేసెను. కాని అంతటితో దాని కోపము చల్లారలేదు. పెరయూర కాపురము చేయుచున్న అతని యొక కుమార్తెనుకూడా చంపనెంచి అచటికి వెళ్లెను. అప్పుడామె ఫణిరాజగు నాదిశేషుని పూజించుచుండెను. కనుక ఆ తల్లిపాము ఆమె శేషపూజ ముగించువరకును వేచియుండ వలసి వచ్చెను. ఆలోగా పూజానిమిత్తము తొమ్మిది నాగ వంశములను వ్రాసిన పీఠముపైనున్న చందనపు గిన్నెలో పడగముంచి, పక్కనున్న పాలనుతాగి, పేలాలను మింగెను. దానితో తల్లిపాము ఆరాట మడగెను. పిమ్మట ఆ కూతురు ఎదుట పడగవిప్పి నిలబడి, ఆమె ధ్యానమునుండి కనులు విప్పగానే, "నీ వెవరి కూతురవు ?" అని ప్రశ్నించెను. ఆమె తెలియజేయగా, తానామె తల్లిదండ్రులను, అన్నదమ్ములను చంపివేసితినని తెలియజేసెను. కూతురు మిగుల చింతించి, వారిని మరల బతికించుమని కోరగా, అది ఆమెకు కొంచె మమృత మిచ్చెను. ఆమె తన తండ్రియింటికి పరుగెత్తి వెళ్ళి మరణించినవారినోట అమృతము చిలికించి, మరల బ్రతికించుకొనెను.

అప్పటినుండి శ్రావణశుద్ధ పంచమినాడు పొలములు దున్నుట, కూరగాయలు తరుగుట, వంటలు వార్పులు

నిషిద్ధములయినవి. నాగరాజుకు పాలు నివేదించవలెను. ఈ నియమ మిప్పటికినీ పాటించబడుచున్నది.

రెండవ కథ యిది: పూర్వమొక బ్రాహ్మణుడుండెను. ఆతనికి ఏడుగురు కోడండ్రుండిరి. కడపటి కోడలు తప్ప, తక్కిన వారందరును ఒకమారు తమ తమ పుట్టినింటికి పోయిరి. కడపటి కోడలికి తలిదండ్రులు లేరు. కొన్ని దినముల పాటయినను పిలుచుకొని వెళ్ళి తమయొద్ద నుంచుకొను బంధువులును లేరు. ఆమె పరమభక్తురాలు. కనుక నాగరాజగు ఆదిశేషుడే తనకు దిక్కని చెప్పుకొనుచుండెను. ఆమె భక్తికి సహస్రఫణుడగు ఆదిశేషుడు కరుణించి, ఒక వృద్ధ బ్రాహ్మణుని రూపము ధరించి, మామగారియొద్దకు వచ్చి, తానామె మేనమామ ననియు, ఆమెను తన యింటికి పంపవలెననియు కోరెను. ఇంతకాల మీ మేనమామ యేమయ్యెనని మామగా రాశ్చర్యపడసాగెను. అప్పుడు వృద్ధుడు కోడలినే జ్ఞాపకము చేసుకొమ్మని బ్రతిమాలెను. ఆమె అత్తగారి ఆరడితో విసిగి వేసరినది గనుక, ఆతడు తన మేనమామయే యని మామగారిని ఒప్పించెను. తర్వాత ఆ వృద్ధుడు ఆ కోడలిని పిలుచుకొని వెళ్ళి, కొంత దూరము పోయిన తర్వాత ఒక ఎలుక కలుగువద్దకు వెళ్ళి, నిజరూపముధరించి, ఆమెను తన పడగపై ఎక్కించుకొని నాగలోకమునకు కొనిపోయెను. ఆమె కొంతకాలము ఆదిశేషునియింట, బంధుమిత్రులతోపాటు నివసించెను. ఆమెను ఎవ్వరును కరవగూడదని నాగరాజు కఠినముగ శాసించెను.

కొంతకాలమునకు ఆదిశేషునిభార్య ప్రసవించెను. పాము పిల్లలన్నియు ఇంటినిండ ప్రాకదొడగెను. ఒకనాడు ఆ కోడలు ఒక బరువగు ఇత్తడి దీపమును పట్టుకొని నడచుచుండగా, దారికడ్డముగ పారాడు పాము పిల్లలను చూచి భయపడి దీపమును జారవిడువగా పెక్కు పిల్లలకు గాయములు తగిలెను; కొన్నిటికి తోకలు తెగెను.

మరి కొంతకాలమునకు ఆదిశేషుడు ఆమెను అత్తగారింటికి పంపివేసెను. ఇంతలో శ్రావణ మాసము వచ్చెను. కోడలు శుక్లపంచమినాడు ఒక పీటపై నాగులరూపములు తీర్చి పూజచేసెను. ఆనాడే, కాకతాళీయముగ తోకలు తెలిన నాగుబాములు తమ విరూపమునకు కారణమేమని తల్లి నడిగెను. ఇత్తడిదీపము పడుటవలన నట్లయ్యెనని తల్లి సమాధానము చెప్పెను. దానితో ఆ పాములన్నియు రెచ్చిపోయి, కసితీర్చుకొనుటకయి ఆమె యింటికివచ్చి ఆమెకు కాటువేయుటకై పొంచియుండెను. కాని, ఆమె ఆ వికలాంగములగు తమను రక్షించుమని భగవంతుని ప్రార్థించుట విని, దయపుట్టి, తమ దుష్టచింతను మాని, నైవేద్యమునకై యుంచిన పాలును, పేలాలను ఆరగించి, పాలగిన్నెలో రత్నహారమొకటి వదలిపెట్టి మరలిపోయెను. ఆమె సకలైశ్వర్యములతో తులదూగసాగెను.

నాగపూజనుగురించి పురాణములలో చెప్పిన విషయములు ఇదివరకే ఉదాహరించితిని. భవిష్యత్పురాణమునందలి

ఆనందపంచమీ వ్రతమునగల యొక గాథతో నీ విషయము ముగింతును.

సుమంతువు శతానీకునికిట్లు చెప్పెను. "రాజా! నాగులకు పంచమి మిగుల నిష్టమైనది. వానికి ఆనందము వృద్ధి జేయునది. పంచమినాడు నాగులకు గొప్ప ఉత్సవము. వాసుకి, తక్షకుడు, కాలియుడు, మణిభద్రుడు, ధృతరాష్ట్రుడు, ఐరావతుడు, కర్కోటకుడు, ధనంజయుడు మున్నగు నాగములు ప్రాణుల కభయమిచ్చి, సదా ప్రాణముల కాపాడును. పంచమినాడు నాగులను పాలతో నభిషేకించు నరుల కులమునకు ఈ మహాసర్పము లభయమిచ్చును. తల్లి శాపమున నగలును రాత్రియు వాని యొడలు మండుచుండును. పాలతో నభిషేకించిన వానికి శాంతి కలుగును. వానికి పాలు దుర్లభము."

"తల్లి వారి నెందులకు శపించెను? శాపోద్దేశమేమి? దాని విమోచన మెట్లయ్యెను?" అని శతానీకుడు ప్రశ్నింపగా సుమంతు విట్లు నుడివెను.

"పూర్వము సముద్రమునుండి అశ్వరాజమగు ఉచ్చైశ్శ్రవము జనించెను. దాని యొడలంతయు తెల్లన. ఒకప్పుడు దానిని నాగమాతయగు కద్రువ చూచి తన సవతియగు వినతతో 'సముద్రమునుండి పుట్టిన ఈ అశ్వరత్నమును చూచితివా! తెల్లని యొడలికి నల్లనితోక.' అని యనెను. ' వినత ఆ మాటలు విని నవ్వి 'ఈ గుర్రము అంతటా తెల్లనిదే. నల్లనిదీ కాదు; ఎర్రనిదీ కాదు. నీకు దానితోక నల్లగ నెట్లు కనిపిం

చెను ?'. అని మందలించెను. 'నేను గుడ్డిదానను. నాకు నల్లగా కనిపించినది. నీకు రెండుకండ్లూ ఉన్నవి. అంతా తెల్లనిదైన పందెము వేయుము.' అని కద్రువ హెచ్చరించెను. 'నీవు దానితోక నల్లనిదని చూపిన నేను నీకు దాసిగా నుందును. చూపనిచో నీవు నా దాసి కాగలవు.' అని వినత సమాధానమిచ్చెను. వారిద్ద రిట్లు పందెము వేసికొని, కోపముతో వెడలిపోయిరి.

''పిదప కద్రువు కుట్రపన్నెను. తన కుమారులను పిలిచి, 'ఉచ్చైశ్శ్రవము తోకను అంటిపెట్టుకుని దానిని నలుపు చేయుడు. పెద్దక్కయయిన వినతను ఓడింతము.' అని కోరెను. వారందులకు అంగీకరింపలేదు. దాని కామె క్రోధ సమాకులయై 'కొంతకాలమునకు జనమేజయుడను రాజు ఇతరదుష్కరమగు సర్పయాగము చేయును. దానిలో మీరందరును అగ్నిపాలపడి కాలిపోవుదురు గాక!' యని శపించెను.

''శప్తులైన కద్రు పుత్రులందరును చింతాక్రాంతులై యుండ లోక పితామహుడగు బ్రహ్మ ప్రత్యక్షమై 'శ్రావణ శుక్ల పంచమినాడు సర్పయాగ మాగిపోవును. అక్కడ మీకు నంచుపెనువాడు కలుగును. వానివలన నానందము జనించును.' అని చెప్పి తన లోకమున కరిగెను. నాగులును నిజనివాసమునకు బోయెను. కనుక నే రాజా! నాగులకు హర్ష కారణముగా బ్రహ్మయొసగిన ఈ పంచమి సత్పురుషుల కిష్టమైనది. నాగముల నీనాడు పూజించవలెను.

"తస్మాదియం మహారాజ! పంచమీ దయితా సతాం,
నాగనాం హర్ష జననీ దత్తా వై బ్రహ్మణా పురా."

ఈ పురాణగాథలను పరిశీలించినను, వానిలోని పూజా కాలమున పఠించు

"విసృజ్య నాగాః ప్రీయంతాం యే కేచిత్ పృథివీతలే,
హిమాచలే తు యే వింధ్యే యేం తరిక్షే దివి స్థితాః.
యే నదీషు సముద్రేషు హ్రదేషు చ సరస్సు చ,
యే వాపీషు తడాగేషు తేభ్య స్సర్వేషు వై నమః."

మొదలగు ధ్యానశ్లోకములను విమర్శించినను పాముల భయము ప్రాచీనుల కెంతటిదో మనము గ్రహించగలము. అందుచేతను శ్రావణమాసము వర్షాకాలము. వానచినుకులు పడగనే పుట్టలనుండి, బొరియలనుండి పాములు వెలికివచ్చును. కనుక వానకాలమున వాని భయ మమితము. కనుకనే శ్రావణమాసమున ఈ పూజ ప్రాధాన్యము వహించియుండవచ్చును. ఈ పూజాతత్త్వమరయుటకు కొంత చరిత్రను తిరుగవేయుదము గాక!

పాములు పంటలను అభివృద్ధి పరచుననియు, పుత్ర సంతానమును ప్రసాదించుననియు అతి ప్రాచీనకాలము నుండియు ప్రజలు విశ్వసించుచుండినట్లు మానవ జాతుల ప్రాచీనచరిత్రములు తరచినచో తెలియగలదు. "పాములు భూమిలో బొరియలలో నుండుటవలన వానికి పంట లతో సంబంధము కల్పించుటలో ఆశ్చర్యము లేదు. నీరు

భూమిలో నుండును. ఆ నీటిని ప్రసాదించునవి పాములు, అవి ఆగ్రహించిన నీటిని పై కుబుకకుండ అడ్డగించగలవను మూఢ విశ్వాసమును ప్రాచీన కాలములో నుండెడిది. కనుక సర్ప మును పంటలకు అధిష్ఠాన దేవతగా ప్రాచీనకాలమున నమ్ము చుండిరి. అట్లే క్రమముగా సర్పము భూమిలోని నిధికి కాపలా దారను భావమును కలిగెను. బురదలోను, చిత్తడి నేల లోను అవి కనిపించుటవలనను, వానిగతి నీటి పారుదలవలె వంకర టింకరగా నుండుటవలనను వానికి జలసంబంధము పూర్తిగా స్థాపితమయ్యెను.'' పంటలను అభివృద్ధి పరచు దేవత సంతానము కలిగించకుండునా ? కనుక కాలక్రమమున నాగదేవత సంతానదాయినిగను ఆరాధింపబడ జొచ్చెను. ఈ భావములు ప్రబలిన కాలమున మహామాయా మతాను యాయు లందరును, అన్ని దేశములలోను దేవీ పూజతో పాటు నాగపూజనుకూడా చేయువాడగిరి. (మహామాయా దేవి పూజాచర్చను నవరాత్రములలో చూడగోరినాను.)

మొహంజోదారో శిథిలములలో అధఃకాయము నాగము, ఊర్ధ్వకాయము మానవముగాగల నాగచిత్రాలు గల ముద్రలును, యోగి ప్రక్కన పడగయెత్తి యాడుచున్న సర్పములున్న ముద్రలును లభించినవి. దీనినిబట్టి సర్పపూజ నము అనార్య సంస్కృతి చిహ్నముగానుండి, క్రమముగా వైదిక ముద్ర పొందినట్లు గోచరించును. ఈ చర్చకు ముందు విదేశములలోని సర్ప సంస్కృతిని గురించి సంక్షేపముగా తెలుసుకొందము.

నాగదేవత వర్ష దేవతయని ప్రాచీనకాలమున విశ్వాస ముండెడిది. ఈజిప్టులో సస్య దేవతయగు 'రన్నుత్' అను దేవతకు సర్పము ప్రతీకముగా పరిగణింపబడుచుండెను. భూదేవతయగు 'సేవ్' నాగరాజని నమ్ముచుండిరి. ఈ దేవత శిరస్సు సర్పశిరస్సువలె నుండెడిది. బాబిలోనియా సుమేరులో గ్రామముల, క్షేత్రముల యెల్లలలో నాగప్రతిమలున్న రాళ్లను పాతిపెట్టుచుండిరి. ఈ నాగశిల గ్రామదేవతయగు 'నిన్నీ' అనుదేవతకు ప్రతినిధిగా భావింపబడు చుండెను. ఎన్‌లీన్ సతియగు నిన్‌లీల్ బాబిలోనియను సుమేరియను పురాణ ములలో స్వర్గ (ఉసుంగల్) మర్త్యలోకములలోను సర్ప నాగినిగా వర్ణించబడినది.

సైప్రస్ ద్వీపమున 'పఫోస్' అను దేవతకు చిహ్నమొక స్తంభము. దాని చుట్టును సర్పరూపాలు చెక్కబడి యుండి నవి. నసోస్ రాజమందిరములలో దేవతల చుట్టును నాగ సర్పములు చెక్కబడి యున్నవి. కార్ఫ్యూలోని ఒక ప్రాచీన దేవాలయమున లభించిన ఆర్టిమిస్ విగ్రహము చేతిలో సర్ప మున్నది.

ప్రాచీనకాలమున యూదులును, అరబ్బులును పాములను కూపాధిష్ఠాన దేవతలుగా భావించుచుండిరి. పాములు నదులను, వాగులను ప్రవాహములలో నింపగల వనియు, ఎండించను గలవనియు వారు విశ్వసించుచుండిరి. శామ్ దేశమున పాముల పేరునుబట్టి నదులకు పేరుపెట్టు నాచార ముండెను.

గ్రీసులో 'భూమి పుత్రుడగు' సర్పముతో పంటలకు సంబంధమున్నట్లు విశ్వాసముండెను. పాములు ఆస్ క్లేపి యస్‌కు ప్రతినిధులుగా భావించబడుచుండెను. దేవాలయ ములలో వాని పోషణమును జరుగుచుండెను. పూజాపుర స్కారములును నిర్వర్తించబడుచుండెను. వాని యోగ క్షేమము లరయుటకు కన్యకలు నియమితలగుచుండిరి. విశేషసమయములలో వారు దిగంబరలై పాములతో పాటు శయనించవలసియుండెను. ధరిత్రీ మాతయగు 'గెయియా' కుమారుడగు 'పైథన్' స్వరూపము పన్నగ స్వరూపమే. గ్రీస్ ప్రాచీన రాజధానియగు ఏథెన్స్ నగరదేవత ఏథినీ దేవాలయమున కొన్ని పాములను పోషించెడివారు.

మనదేశమున అమరావతీస్తూప శిల్పములలో మహాఫణామండితములైన సర్పముల ప్రతిరూపము లున్నవి. దుర్గాదేవి పరివారమున ఒక సర్పము కూడ గలదు. పరమ శివుని తలపై నాగరాజు పడగవిప్పి యాడుచున్నట్లు శిల్పము లున్నవి. అతని వింటినారి వాసుకి. శేషుడు కట కాద్యలంకారము. విష్ణువునకు పాము పాన్పు. వినాయకునికి సర్పము ఆభరణము, యజ్ఞోపవీతమును. కుమారస్వామి వాహనమయూరముకాళ్ల సర్పములు చుట్టుకొనియున్నవి. ఇట్లు ప్రాచీనకాలమున మహామాయామతము వ్యాపించిన దేశములయం దంతటను సర్పపూజ వ్యాపించినట్లు తోచు చున్నది.

దేశమున నింతగా వ్యాపించిన ఈ నాగపూజ ఋగ్వేద కాలమున నున్నట్లు కానరాదు. ఋగ్వేదమున అహిదష్టుల

చికిత్సకోసము 'మధువిద్యా' చర్చ గలదు. తైత్తిరీయ సంహితలో అశ్వమేధయజ్ఞ ప్రస్తావమున హవిస్సుగా 'లోహితాహి'ని, 'వాహస' సర్పమును ప్రేల్చవలెనని సూచన గలదు. కాని అథర్వణవేదమున పెక్కు పాముల పేర్లు లభించుచున్నవి; దొంగలనుండి తప్పించుకొనుటకు సర్పయంత్ర ధారణము సూచించబడినది. సంహితలలో నాగపూజన ప్రసక్తి కాన రాదు. బ్రాహ్మణములలో అక్కడక్కడ సర్పములను సంతోషపెట్టవలెనని నిర్దేశము గలదు. తర్వాతి శ్రౌత, గృహ్యసూత్రములలో నాగబలి విధించబడినది. దీని ప్రకారము శ్రావణపూర్ణిమ మొదలు మార్గశిరమాసము వరకును ప్రతిదినమును సాయంకాలము చేతితో తడిపిన పేల పిండి పాములకు బలియిచ్చుపద్ధతి కలదని తెలియుచున్నది. ఈ విషయమున స్మృతికౌస్తుభకారుడు చెప్పిన దాని నిటి వరకే వివరించితిని.

ఈ పరిశీలనములనుబట్టి సంహితాకాలమున ఆర్యులు సర్పములకు మిగుల భయపడుచుండిరనియు, క్రమముగా వానిని సంతోషపెట్టుట ప్రారంభమై పూజించసాగిరనియు, అనంతరము ఈ ఆచారము నైటికాచారమున మిళితమై పోయెననియు తోచుచున్నది. దానినే పురాణములు చిలవలు పలవలుగా చెప్పినవి.

'నాయాధమ్మ కహావో' అను జైనగ్రంథమున సర్పపూజ నాగయత్తా (నాగయాత్ర) గా పేర్కొనబడినది. ఇక్ష్వాకువంశజుడగు ప్రతిబుద్ధియను రాజు, ఆయన ధర్మ

పత్ని పద్మావతి నెమలియీకల కుంచెతో నాగదేవతా విగ్రహమును తుడిచి, సుగంధజలములతో అభిషేకించి ధూపదీపనైవేద్యము లిచ్చిరట.

ఈ నాగులు సర్పజాతికాదనియు, సర్పములు జాతీయచిహ్నములుగా గల ప్రాచీనానార్యజాతి ప్రజలనియు, వారి యాచారము క్రమముగా మనవైదిక ధర్మమున ప్రవేశించెననియు కొందరు చరిత్రకారు లనుచున్నారు.

"కాశ్మీరదేశపు సరిహద్దులోని – ముఖ్యముగా చీనాబ్, రావీనదుల మధ్యనగల–పర్వతప్రాంతమున మహాభారతమున పేర్కొనబడిన నాగజాతివారి మిగులు బాగులు ఇంకను గలదు. అప్పటివలె ఇప్పుడును ఇక్కడ నాగదేవతలు– భయంకర సరీసృపములని కాని, ప్రాచీనుల చిహ్నములని కాని కాక, నాగసర్పము జాతీయచిహ్నముగను, సూర్యుడు ప్రధానారాధ్య దైవముగను కలిగి, దేవత్వము పొందిన ప్రాచీనరాజులుగా – పూజింపబడుచున్నారు. వీరు తమను నాగులని చెప్పుకొనరు. వీరి తెగపేరు 'తక్ష'. అలెగ్జాండర్ మిత్రుడగు టాక్సిలస్ 'తక్షక' అను తెగవాడు. నాగదేవాలయములు పాముల పేరున నిర్మింపబడుటలేదు. ఈ తెగలోని ప్రాచీన నాగరాజులపేర నిర్మింపబడుచున్నవి. శేష వాసుకి తక్ష కర్కోటక పృథు మున్నగు నాగరాజులందరును మానవరూపములతో ఆరాధింపబడుచున్నారు." అని ఫెర్గూసన్ వ్రాసిరి.

ఈ నాగజాతివారే మొట్టమొదట బౌద్ధమతమును స్వీకరించినవారని, వీరు క్రీస్తు పూర్వము ఏడవశతాబ్దిలో మగధరాజ్యము నాక్రమించుకొనియుండిరని, కావున మగధ రాజులగు నాగులే మొదట బౌద్ధు లయిరనియు, దస్యులను వారును మొదట బౌద్ధమతమును స్వీకరించిరనియు, నాగులు, దస్యులు కాశ్మీర గాంధార తక్షశిల మొదలగు దేశములం దుండిన అనార్యజాతులవారనియు ఫెర్గూసన్ నిర్ణయించిరి. వారు బౌద్ధమతము స్వీకరించిన పిదప కూడ తమ ప్రాచీన పూజావిధానమును మానలేక స్థూపములపైనను నాగరాజ విగ్రహములను చెక్కించిరని ఆయన అభిప్రాయపడిరి. నాగార్జునకొండ అమరావతి శిల్పములలో నాగరాజుల విగ్రహములు కోకొల్లలు.

రాజస్థాన్ చరిత్రకారులగు జేమ్స్‌టాడ్ నాగు లను వారు ఒక ప్రాచీన జాతివారేగాని సర్పమాత్రులుకారని సిద్ధాంతీకరించియున్నారు. వారి వివరణ మిది: "సిరియా దేశమున సూర్యారాధనమునకై స్థాపించిన స్తంభముపై సర్పప్రతిమలు చెక్కబడినవి. అదేవిధముగ చిత్తోడ్‌లోని ఏకలింగస్వామి విగ్రహముచుట్టును పాము చుట్టియున్నది. ఇదే విధముగ ఇటలీ ప్రాచీన రాజధానియగు పాంపేనగర మందు పురాతనమగు 'ఇసిస్' దేవాలయమున నొక లింగము చుట్టును పామున్నది. ప్రాచీన భారతదేశమున 'ఇందు' వంశము వారు పన్నగధ్వజులు, యాదవులు గరుడధ్వజులు. ఈ రెండు తెగలవారికిని చాలకాలము వైర మండెను.

ఇదియే మహాభారతమున నాగగరుడ వైరగాథగా వర్ణిత మైనది. నాగధ్వజులే నాగజాతివారు. వీరికి పాండవులతో వైర ముండెను. ప్రాచీనకాలమున బహుదేశములలో సర్పములకు ప్రాధాన్య ముండెను. ఈజిప్టులో హర్మిన్ దేవునికిని, గ్రీస్‌లో మర్క్యూరీ దేవునికిని సర్పము ప్రధాన భూషణము."

మరియొకచోట వారిట్లు చింతించుచు వ్రాసిరి. "'నాగపూజారహస్యము వంటి విషయముకన్నను నేటిపండితుల దృష్టిని ఇతర విషయములు ఆకట్టినవి. ఈ రహస్యము నాగరకతారూపమున మిగిలియున్నను, జాతి రూపముగ మిగిలియున్నను పరిశీలించవలసియున్నది. అమెరికాలోని అనాది జాతులవారు నాగులను దుష్టులుగాను, పర్షియాలోని మాగీ తెగవారు నాగులను మానవ శత్రువులుగాను (అహిమానులుగను) భావించెడివారు. రాజపుత్రులు నాగులను రాక్షసులుగా పరిగణించుచుండెడివారు. సిథీ తెగలో బయలుదేరిన ఈ నాగపూజ జరదుష్ట్రిమతమునందును, ఈజిప్టుపురాణములయందును, గ్రీకుల ప్రాచీనగాథలలోను వ్యాపించినది. జైన బౌద్ధుల సంప్రదాయములు తక్షుల భూమిలో జనించినవి."

మనదేశములోని పలు ప్రాంతములలో ఒకప్పుడు ఈ నాగజాతివారు వ్యాపించియుండిరనియు, నాగపూర్, ఛోటా నాగ్‌పూర్ మొదలగు నగరముల పేర్లును, సంస్కృతియు ఆవ్యాప్తికి నిదర్శనములని విమర్శకు లభిప్రాయపడుచున్నారు. భారతకాలమునకు ముందే ఆర్యానార్య సంక

రము ప్రారంభమయ్యెను. భీముడు హిడింబను పెండ్లాడెను. అర్జునుడు ఉలూపిని పెండ్లాడెను. ఉలూపి నాగకన్యక; హిడింబ రాక్షసి. ఆస్తీకుడు నాగజాతీయుడు. ఆయన తండ్రి జరత్కారుడు బ్రాహ్మణుడు. నేడు అస్సాం ప్రాంతమునందున్న నాగులు ఆటవికులే. ఈ వివాహాదులతో సంబంధమేర్పడిన తర్వాత ఆస్తీకుడు జనమేజయుని ప్రార్థించి నాగజాతి వధను ఆపుటయు, పరస్పరము సంస్కృతివినిమయము జరుగుటయు సంభవించినదని తోచుచున్నది. శ్రీహర్షుని నాగానందముగూడ నాగగరుడజాతుల వైరమును సమయించుటకేర్పడిన ప్రయత్నమునకు సాహిత్యరూపము.

“ఈరానులోని నేటి సీస్థాన్ అనునది ప్రాచీనమందలి శీష్ లేక శేష్ అను నాగజాతిస్థానమనబడెను. నేటి ఖుర్దిస్తాన్ పౌరాణిక కద్రూనాగరాణి నివాసస్థానమనవలెను. తక్షక జాతివారే తక్షశిలను నిర్మించిరి.” అని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు తెలిపియున్నారు.

నాగజాతిపై అత్యాచారములకు స్వస్తి జరిగిన దినమని కాబోలు నాగపంచమి, నాగులచవితి పండుగలు ఆచరణకు వచ్చినవి.

“తస్మాదియం మహారాజ! పంచమీ దయితా సదా,
నాగానాం హర్షజననీ దత్తా వై బ్రహ్మణా పురా.”

అను భవిష్యత్పురాణ వాక్యమును మన మిట్లన్వయించుకొందము. కాలక్రమమున ఈ ఉత్సవములో సర్పభయమును

మిళితమై, ఋతు పరివర్తన సూచకముగా వైద్యకగ్రంథ ములు తెలుపు పాలు, పేలాలు మొదలగు లఘ్వాహార సేవన విధానమును చేరి నేటి నాగపంచమి - సర్పపూజా మాత్ర ముగా - పర్యవసితమైయుండును.

ప్రాచీనసంప్రదాయానుసారము ఈ పండుగ నేడు అన్ని ప్రాంతములయందును మహోత్సాహమున జరుపబడు చున్నది. ఉత్తరప్రదేశమున, వానలు కురిసి ఎటుచూచి నను పాములే కనిపించు శ్రావణ మాసముననే నాగపంచమి ఆచరించబడుచున్నది. వంగదేశములోను, ఛోటా నాగ పూర్ ప్రాంతములోను వర్షర్తువులో 'సర్పరాజ్ఞి' మన సాదేవి పూజలు జరుపబడుచున్నవి. రాజస్థానమున పురాణ యుగపు పీపా, తేజాజీ మున్నగు నాగరాజుల సంస్మరణము, నాగపూజలు జరుగును. ఇక దక్షిణాపథమున నాగప్రతిష్ఠలు సంతానార్థముచేయుట అందరెరిగినదే.

నాగపంచమినే వైష్ణవ సంప్రదాయానుయాయులు గరుడ పంచమి యందురు. ఇది గరుడ పురాణమున పేర్కొన బడినది.

---

# 8. కృష్ణజయంతి

రామకృష్ణావతారములు మహావిష్ణువు సంపూర్ణావతారములుగా భావింపబడుచున్నవి. కృష్ణావతారము దశావతారములలో నెనిమిదవది. కృష్ణచరిత్రము హరివంశ భాగవత విష్ణుపురాణములలో విపులముగా నున్నది; అబాలగోపాలము ఎరిగినదే గనుక మరల వివరించుట చర్వితచర్వణము.

ఈ మహానుభావుడు లోకోత్తర సుందరమూర్తిగను, మహాబలపరాక్రమశాలిగను, రాజనీతి నిపుణునిగను, తత్త్వవేత్తగను వర్ణింపబడినాడు. కృష్ణునిపై నున్నంత సాహిత్యము ప్రపంచమున నేభాషలోను లేదనవచ్చును. కృష్ణుడు ప్రపంచమునకు ప్రసాదించిన గొప్ప గ్రంథము భగవద్గీత. దీనిని తర్వాతి తత్త్వవేత్తలు, మతాచార్యులు ప్రస్థానత్రయములో నొకదానినిగా గౌరవించిరి. రాజనీతిశాస్త్రజ్ఞుడగు నితడు మనదేశమునకు—మనదేశమునకే అననేల, ప్రపంచమునకే—ప్రసాదించిన పాలనవిధానము కేంద్రప్రభుత్వపద్ధతి. అప్పుడు మనదేశము కంసుడు, నరకాసురుడు, కాలయవనుడు, శిశుపాలుడు, దుర్యోధనుడు మొదలగు రాజుల పాలనమున ముక్కలు ముక్కలుగా నుండెను. ఎవరికివారు చక్రవర్తులమని, రాజాధిరాజులమని చెప్పుకొనుచు దుష్పరిపాలనము సాగించుచు, లోభమున రాజ్యవిస్తరణమునకు కడంగుచుండిరి. బహురాజకము అరాజకమునకు దారితీయుననియు, కేంద్రపరిపాలనము ఆవశ్యకమనియు గుర్తించిన



శ్రీకృష్ణుని వేణుగానము

కృష్ణుడు తాను రాజ్యాధికారము కోరక, ధర్మచింతగలవాడని అప్పటి వారందరును నమ్మిన ధర్మరాజు పాలనమున కేంద్ర పరిపాలన విధానమున దేశముండుట సమంజసమని నిర్ణయించి క్రమముగ తక్కిన బలదర్పితులగు రాజులను పాండవులచే హతులనుచేసి ధర్మరాజు నభిషేకించి, కేంద్రపరిపాలనమునకు నాందిపలికెను. ఇట్టి పద్ధతిని ప్రపంచమున తొట్టతొలుత ఆచరణలో పెట్టించినవాడును కృష్ణుడే.

ఈ మహామహుని జన్మదినోత్సవము శ్రావణ బహుళాష్టమియందు జరుపబడుచున్నది. అష్టమినాడు రోహిణి నక్షత్రమున రాత్రి యుద్భవించెను గనుక అష్టమినాడు పగలంతయు నుపవసించి సాయంకాలమున కృష్ణవిగ్రహము నూరేగించుటయు, జననసూచకముగా ఉయ్యాలలు కట్టి యూడించుటయు, సద్యఃప్రసూతయగు దేవకి మంచముపై నొరిగి కృష్ణునికి పాలిచ్చుచున్నట్లున్న విగ్రహములను అలంకరించి పూజించుటయు గలదు. కృష్ణుడు బాల్యమున వ్రేపల్లెలో పెరిగినప్పుడు చేసిన దుండుడుకు చేష్టలకు నిదర్శనముగా, వీథులలో ఉట్లుపెట్టుట, మరునాడు వాటిని కొట్టుటమున్నగు వినోదములు దేశమంతటను జరుగును.

కృష్ణాష్టమిని గురించి వ్రతగ్రంథములలో విపులముగు చర్చగలదు.

"తథా భాద్రపదే మాసే కృష్ణాష్టమ్యాం కలౌ యుగే,
అష్టావింశత్తిమే జాతః కృష్ణో సౌ దేవకీసుతః."

కల్యబ్దములు ఇరువదియెనిమిదవ సంవత్సరమున భాద్రపద బహుళాష్టమిని కృష్ణుడు జనించెనని కల్పతరుకారుడు బ్రాహ్మ వచనము నుదాహరించెను. భాద్రపదమాసమనగా ఇప్పటి శ్రావణ బహుళ పక్షముతో నారంభమగు బహుళ పక్షాది మాసమనుట. భాద్రపద మాసమున కృష్ణపక్షమున వచ్చు అష్టమి రోహిణీ నక్షత్రయుక్తమైనచో 'జయంతి' యని వ్యవహృతమగునని వహ్నిపురాణమున గలదు.

"కృష్ణాష్టమ్యాం భవేద్యత్ర కలైకా రోహిణీ యది,
జయంతీ నామ సా ప్రోక్తా ఉపోష్యా సా ప్రయత్నతః."

జయంతి యనునది జ్యోతిశ్శాస్త్ర పరిభాష. క్రమముగ నిదియే ప్రతి మహాపురుషుని జన్మదినమునకు వ్యవహృతమైనట్లు తోచుచున్నది. జయంతి రాత్రివాచకమని బ్రహ్మాండపురాణమున గలదు. కొందరు తిథికిని, కొందరు నక్షత్రమునకును ప్రాధాన్య మిచ్చుటవలన ఈ పండుగను జరుపుటలో 'కొంత ముందు వెనుకలును' కలవు. రోహిణీయుతమగు అష్టమి శ్రావణ భాద్రపద మాసములలో ఎప్పుడైనను వచ్చుననియు, భాద్రపదమున తప్పదనియు వశిష్ఠ సంహితయందు గలదు.

"శ్రావణే వా నభస్యే వా రోహిణీసహితాష్టమీ,
యదా కృష్ణా నరైర్లబ్ధా సా జయంతీతి కీర్తితా.
శ్రావణే న భవేద్యోగో నభస్యే తు భవేద్ధ్రువం."

ఈ జయంతినా డుపవసించి కృష్ణుని పూజించిన సకలపాపములు తొలగునని పురాణము లుద్ఘోషించుచున్నవి. ధర్మార్థ

కామమోక్ష ప్రాప్తియు, మహాజయము కలుగునని స్కంద పురాణమున చెప్పబడినది. ఈ జయంతీవ్రత మాచరింపని వారు మహాపాపమును పొందుదురనియు, యమపాశములలో చిక్కుకొందురనియు, మరుజన్మమున పాములై పుట్టుదురనియు, క్రూరరాక్షసులుగా జనింతురనియు స్కాందాది పురాణములు హెచ్చరించినవి.

"శ్రావణే బహులే పక్షే కృష్ణజన్మాష్టమీవ్రతం,
న కరోతి నరో యస్తు భవతి క్రూరరాక్షసః."

ఈ కృష్ణాష్టమినాడు చంద్రునికి అర్ఘ్యమివ్వవలెననియు, బంగారుతోగాని, వెండితోగాని ద్వాదశాంగుల విస్తారమగు చంద్రబింబము సిద్ధపరచి వెండి, బంగారు పాత్రలలో దాని నుంచి, పూజించి అర్ఘ్య మివ్వవలెననియు, అట్లుచేసిన సర్వ కామముల పొందునని భవిష్యోత్తరమున గలదు.

"క్షీరోదార్ణవ సంభూత అత్రినేత్ర సముద్భవ,
గృహాణార్ఘ్యం శశాంకేదం రోహిణ్యాసహితో మమ.
జ్యోత్స్నాపతే నమస్తుభ్యం జ్యోతిషాంపతయే నమః,
నమస్తే రోహిణీకాంత అర్ఘ్యం నః ప్రతిగృహ్యతాం."

అని ధ్యానించుచు అర్ఘ్య మీవవలెనని యున్నది. పిదప కృష్ణునికి పూజచేయవలెనట.

ఈ చంద్రార్ఘ్య ప్రదానమునుబట్టి నాకు తోచున దేమన, మొట్టమొదట కృష్ణాష్టమి కేవలము జ్యోతిశ్శాస్త్రజ్ఞులు నిర్ణయించిన సకలాభీష్టదయగు జయంతీ రాత్రిగానే

పరిగణించబడినదనియు, తర్వాతనే కృష్ణజన్మ కథకు ప్రాధా న్యము వచ్చినదనియును.

కృష్ణుని రాజనీతిజ్ఞతకు, స్పష్టవాక్కునకు ఉద్యోగ పర్వమున కర్ణునితో సలడనిన మాటలను ఇట మచ్చున కుదాహరింతును. "ఇక ఏడుదినముల కమావాస్య వచ్చును. ఆనాడు యుద్ధము ప్రారంభమగునుగాక!" యని యన్న మాటలివి :

"బ్రూయా త్కర్ణ ఇతో గత్వా ద్రోణం శాంతనవం నృపం,
సౌమ్యోయం వర్తతే మాసః సుప్రాపయవసేంధనః.
సర్వౌషధి వనస్ఫీతః ఫలవా నల్పమక్షికః,
నిష్పంకో రసవత్తోయో నాత్యుష్ణశిశిర స్సుఖః.
సప్తమా చ్చాపి దివసా దమావాస్యా భవిష్యతి,
సంగ్రామో యుజ్యతాం తస్యాం తా మాహుశ్శక్ర
దేవతాం."

"ఓ కర్ణా! ఇక్కడినుండి నీవు వెళ్ళినపిదప భీష్మ ద్రోణ కృపులతో నామాటగా నిట్లనుము. ఈ మాసము (కార్తిక మాసము) సౌమ్యమైనది. పశుగ్రాసము, వంటచెరకు సులభముగా లభింపగలవు. చెట్టుచేమతో పచ్చగ నున్నది. పంటలకాలము. ఈగలు మున్నగు ఈతిబాధలు లేవు. బురద ఆరిపోయి ప్రయాణానుకూలముగను, సమశీతోష్ణమై, మంచి నీరు దొరకు సమయముగను నున్నది. ఇక ఏడునాళ్ళ కమావాస్య: అది ఇంద్రదేవతాకమైన దినము. ఆనాడు యుద్ధమారంభమగును గాక!"

ఈ వాక్యములను ఇతనియుద్ధ తంత్రజ్ఞత; రాజనీతి వై శారద్యము, స్పష్టవాక్యత విశదమగును.

కృష్ణుడు పూర్ణాయుస్సుతో నుండెనని ఇతిహాస పురాణములు తెలుపుచున్నవి. హరివంశ, విష్ణుపురాణ, భాగవతములు అతడు 125 ఏండ్లు జీవించెనని వర్ణించినవి.

''యదోర్వంశే వతీర్ణస్య భవతః పురుషోత్తమ,
శరచ్ఛతం వ్యతీతస్య పంచవింశాధికం విభో.''

ఓ పురుషోత్తమ! నీవు యదువంశమున నవతరించి, 125 సంవత్సరములు గడచినవి. ఇక వైకుంఠమునకు విచ్చేయుము–అను భాగవత శ్లోకమునుబట్టి ఇతడు 125 సంవత్సరములు జీవించెననియున్నను ఛాందోగ్యోపనిషత్తునుబట్టి 116 సంవత్సరములు జీవించెనని పరిశోధకులు నిర్ణయించిరి. ఛాందోగ్యమున మృత్యువును ఎదిరించి పెక్కేండ్లు జీవించుటకు పురుషయజ్ఞము చేయవలెనని విపులమగు చర్చ గలదు. ఆయజ్ఞమును చేయువాడు మరొక జిజ్ఞాసకు పోడనియు, మృత్యువును అదలించగలడనియు గలదు. పురుషయజ్ఞమనగా – నేననునది అనశ్వరము, అమరము అని గ్రహించుటయే.

''ఏతద్ధస్మవై తద్విద్వా నాహ మహిదాస ఐతరేయః సకిం మ ఏత దుపతపసి యో హ మనేన న ప్రేష్యామితి సహషోడశం వర్షశత మజీవ త్సహషోడశం వర్షశతం జీవతి య ఏవం వేద.'' (3–6–7)

దీని యర్థమిది : ఈ యజ్ఞమును తెలుసుకొనిన వాడయిన ఇతరుడనువాని కుమారుడగు మహీదాసుడు వ్యాధిని చూచి యిట్లనెను. "నన్నెందులకు బాధించుచున్నావు ? నేను నీతో చావను." ఇట్లతడు వ్యాధినెటర్చి, జయించి 116 సంవత్సరము లున్నాడు. ఈ యజ్ఞమును తెలుసుకొన్నవాడు నూటికిపైన పదునారు సంవత్సరములు జీవించును."

ఈ పురుషయజ్ఞమును కృష్ణుడు తెలుసుకొనెనని ఛాందోగ్యమున మూడవ ప్రపాఠకమున పదునేడవ ఖండమున నొక మంత్రము గలదు.

"తద్ధైత ద్ఘోర ఆంగిరసః కృష్ణాయ దేవకీపుత్రా యోక్త్వోవా చాపిపాస ఏవ స బభూవ సోంతవేలాయా మేత త్త్రియం ప్రతిపద్యే తాక్షితమ స్యచ్యుతమసి ప్రాణసంశిత మసీతి తత్రైతే ద్వే ఋచౌ భవతః," (3–17–6)

"ఆంగిరస వంశుడగు ఘోరుడను ఋషి దేవకీపుత్రుడగు కృష్ణునికి ఈ విద్య నుపదేశించెను. కృష్ణుడు పదప మరియొక జిజ్ఞాసకు పోలేదు. అంత్యకాలము సమీపించినపుడు 'నీవు అనశ్వరుడవు, మార్పులేనివాడవు, ప్రాణముల కన్నను మధురమైనవాడవు' అని ఈమూడు మాటలను చెప్పవలెను......" ఈ దేవకీపుత్రుడు భారతకథలోని దేవకీపుత్రుడే యనుట సహేతుకము. అట్లయిన ఇతరుని కుమారుడగు మహీదాసునివలె నీ దేవకీపుత్ర కృష్ణుడును అమర విద్యను ఉపాసించిన వాడగుటవలన నూట పదునారు సంవత్సరములు జీవించెనని యూహింపవచ్చును. ఇట్లు దీర్ఘ జీవిత

మును ప్రసాదించు నీ విద్యకు అందరును అర్హులు కారు. "అథ య త్తపో దాన మార్జవ మహింసా సత్య వచన మితితా అస్య దక్షిణాః." (3-7-4)

ఈ యజ్ఞమునకు తపస్సు, దానము, ఆర్జవము, అహింస, సత్యము అనునవి దక్షిణ లట. అనగా ఈ గుణములన్నియు నున్నవాడే దీర్ఘ జీవి యగు ననుట. శ్రీ కృష్ణుడును పలువురు కవులు వర్ణించినట్లు జారుడు, చోరుడును కాక, ఈ గుణములు కలవాడు కనుకనే పురుష యజ్ఞవిద్యకు అర్హుడై యుండును. కృష్ణుని చరితములోని పెక్కు విషయములు గుప్తమగు జ్యోతిశ్శాస్త్ర విషయములని, ప్రజాసామాన్యమున కర్థము కానందున అసార్థము కల్పింపబడినది తరచిన మీాదట తెలి యును. నరకుడు చెరపట్టిన 16 వేల రాజకన్యలను కృష్ణుడు పెండ్లాడుట అట్టిది. (దీని చర్చను దీపావళిలో చూడుడు.)

కృష్ణునిచరితము పరమ పవిత్రమైనదనియు, వేద ములలోని కృష్ణ, అర్జున, రాధా మున్నగు మాటల అర్థములు వేరై యుండగా, కేవల శబ్దసామ్యముతో వానిని పౌరాణి కులు తర్వాతి విషయములతో జోడించి కథారూపమున వ్రాసి పెక్కు చిక్కులు కలిగించిరనియు పండిత రఘునం దనశర్మగారు 'వైదిక సంపత్తి' అను ఉద్గ్రంథమున వ్రాసిరి. వారి వాదమును సంగ్రహముగ నుదాహరింతును :

"ఋగ్వేదమున రాధా, కృష్ణ, అర్జున మున్నగు పద ములు కనిపించుచున్నవి. స్తోత్రం రాధానాం పతే (1-30-29),

గవా మపవ్రజం బృధి (1-10-7), దాసపత్నీ రహిగోపా అతిష్ఠత (1-32-19), తమేత దాషారయః కృష్ణాసు రోహిణీషు (8-63-13), కృష్ణా రూపాణి అర్జునా విలోమదే (10-21-3), త్వం సృచక్షో వృషభానుపూర్వీః కృష్ణాస్వగ్నే అరుషో విభాహి (అధర్వ వేదము 3-15-3). వీనిలో గో, వ్రజ, గోప, వృషభ, రోహిణీ, కృష్ణ, అర్జున పదములు కనిపించుచున్నవి. వీనికి పురాణగాథలలో కనిపించు వ్యక్తుల పేర్లతో సంబంధ మెంతమాత్రమును లేదు. ఇవి యన్నియు ఆకాశమున కలిగిన సన్నివేశములే. ఇవియే పురాణములలో అన్యథాకరించబడినవి.

"అహశ్చ కృష్ణ మహ రర్జునం" (ఋ 6-9-1). అనగా రెండును దినము పేర్లే. దిన రాత్రము లన్నమాట. రాధ యనగా ధనము; అన్నము. గో అనగా కిరణము. వ్రజము కిరణస్థానము. ద్యౌః ఆకాశము.

"అహం మను రభవం సూర్యశ్చాహం
కక్షీవా ఋషి రస్మి విప్రః,
అహం కుత్స మార్జునేయం న్యృంజే హం
కవి రుశనా పశ్యతా మా. (ఋ 4-26-1).

ఇది శుక్రుని వక్రగతి మేమేయని ఆకాశమునందలి ఆగ్నేయ శక్తులు తెలుపు ఋక్కు. వేదమున నక్షత్రముల గతిని కావ్య మందురు. 'పశ్య దేవస్య కావ్యం.' కనుక సూర్య

కిరణములు, వర్షము, గ్రహములు, గ్రహగతి, విద్యుత్తు మున్నగు వాని శబ్దసామ్యమునుబట్టి పౌరాణికులు కథలు కల్పించి మూలతత్త్వమును మరుగు చేసినారు.

ఈ వాదమున ఎంతో సత్యమున్నదనియే నా అభిప్రాయము. ప్రకృత మనుసరామః. కృష్ణుడొక మహాపురుషుడు, కృష్ణావతారతత్త్వము విశదమగుటకు శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు రచించిన 'కృష్ణావతారతత్త్వము' అను గ్రంథము పఠింపుడు.

"వందే బృందావనచరం వల్లవీజన వల్లభమ్,
జయంతీ సంభవం ధామ వైజయంతీ విభూషణమ్."

---

# 9. చాతుర్మాస్యము

చాతుర్మాస్య మనగా నాలుగు నెలల కృత్యము. వైదికకాలమున ఒకప్పుడు నాలుగు నాలుగు నెలల ఋతువులు మూడే పరిగణమున నుండెను—వర్షర్తువు, హేమంతము, వసంతము. వానకాలముతోనే సంవత్సర ప్రారంభమగునను పరిగణనమును ఒకప్పు డుండెను. కనుక, సంవత్సరమునకును వర్షమనియే పేరు వచ్చెను. ప్రతి ఋతువు ప్రారంభమగుటతోపాటు ప్రత్యేక యజ్ఞయాగాదులు ఆరంభింపబడుచుండెను. ఈ పద్ధతిప్రకారము ఫాల్గున పూర్ణిమనుండి వైశ్వదేవ యజ్ఞమును, ఆషాఢ పూర్ణిమనుండి వరుణ ప్రఘాసయజ్ఞమును, కార్తిక పూర్ణిమనుండి సాకమేంధ యజ్ఞమును జరుపవలెనని శతపథ బ్రాహ్మణమున గలదు. ఇతరులు ఇతర క్రియలుగూడ జరుపుచుండిరి. క్రమముగ వర్షర్తు చాతుర్మాస్యమే నడపుట ఆచారమైనది.

ఈ చాతుర్మాస్యము ఆషాఢ శుక్లైకాదశితో ప్రారంభమై కార్తీక శుక్ల ద్వాదశితో సమాప్తమగును. ఆషాఢ శుక్లైకాదశి ప్రథమైకాదశి. దీనినిబట్టిగూడ ఒకప్పుడు వర్షర్తువే వర్షప్రారంభమని యూహింపవచ్చును. ఈ ఏకాదశినాడు విష్ణువు క్షీరాబ్ధిలో శేషపర్యంకముమీద శయనించునని పురాణములు తెలుపుచున్నవి. (ఈ చర్చను ఏకాదశిలో చూడగోరినాను.) ఈ వ్రతమును ఏకాదశినుండి కాని, కటక

సం|క్రాంతినుండికాని, ఆషాఢ పూర్ణిమనుండి కాని ఆరంభింప వచ్చును. ఇట్లు వ్రత మాచరించిన సంవత్సర కృతపాపము లన్నియు తొలగునని భారతవచనము. చేయనియెడల సంవత్సర పాతకమును కలుగునట.

"ఆషాఢే తు సితేపక్షే ఏకాదశ్యా ముపోషితః,
చాతుర్మాస్యవ్రతం కుర్యా ద్యత్కించి న్నియతో నరః,
వార్షికాం శ్చతురో మాసా న్వాహయేత్కేనచి న్నరః,
వ్రతేన నోచే దాప్నోతి కిల్బిషం వత్సరోద్భవం."

చాతుర్మాస్య వ్రతవిధానమునుగురించి స్కాంద, భవిష్యోత్తరాది పురాణములలో విపులముగా గలదు. శ్రావణమాసమున కూరలను, భాద్రపదమాసమున పెరుగును, ఆశ్వయుజ మాసమున పాలును, కార్తీకమాసమున పప్పుపదార్థములను వదలపెట్టి భుజింపవలెను.

"శ్రావణే వర్జయే చ్ఛాకం దధి భాద్రపదే తథా,
దుగ్ధ మాశ్వయుజే మాసి కార్తికే ద్విదలం త్యజేత్."

అని భవిష్యపురాణమున గలదు. స్కాందమున చాతుర్మాస్య కల్పమున నిట్లున్నది. "చాతుర్మాస్య మందరికిని నిత్య వ్రతము. నిమ్మ, రాజమాషములు, ముల్లంగి, ఎఱ్ఱముల్లంగి (గాజర్), గుమ్మడి, చెరకు-భుజింపరాదు.

"చత్వార్యేతాని నిత్యాని చతురాశ్రమ వర్ణినామ్,
ప్రథమే మాసి కర్తవ్యం నిత్యం శాకవ్రతం నరైః.

ద్వితీయే మాసి కర్తవ్యం దధివ్రత మనుత్తమం,
పయోవ్రతం తృతీయేతు చతుర్థేతు నిశామయ.
ద్విదలం బహుబీజంచ వృంతాకంచ వివర్జయేత్,
నిత్యా న్యేతాని విప్రేంద్ర వ్రతా న్యాహు ర్మనీషిణః.
జంబీరం రాజమాషాంశ్చ మూలకం రక్తమూలకం,
కూశ్మాండం చేక్షుదండంచ చాతుర్మాస్యే త్యజే ద్బుధః."

క్రొత్త ఉసిరిక, చింత, గుమ్మడి మున్నగువానిని త్యజించి, పాత ఉసిరికను సంపాదించి భుజింపవలెను. ఇది కాయ శోధనము.

"విశేషా ద్బదరీం ధాత్రీం కూష్మాండం చింత్రిణీం త్యజేత్,
జీర్ణధాత్రీఫలం గ్రాహ్యం కథంచి త్కాయశోధనం."

పైని వివరణమునుబట్టి వర్షాకాలమున అపథ్యాహారమును మాన్పించి, ఆరోగ్యపరిరక్షణమే ఈ వ్రత పరమార్థమని స్పష్టమగుచున్నది. ఈ వానకారంతయు బురదకును, క్రిమి కీటకాలకు పుట్టినిల్లు. కనుక రోగములు క్రొత్తవి పుట్టుకొని వచ్చుట సహజము. పురాణేతిహాసములు వర్జ్యములని చెప్పిన పదార్థములన్నియును త్రిదోష ప్రకోపనములే. కనుక వెలుపలికి కదలక తమ ఉనికిపట్టులలోనే యుండి మితపథ్యాహార ముతో కాలము గడపుట పాడియని చెప్పుటకే ఈ వ్రతము నిర్ణయించబడియుండును.

భీష్ముడు శేషధర్మములలో చాతుర్మాస్యము స్త్రీలకే ముఖ్య మనినాడు. పురుషులే వెలుపలికి పోనప్పుడు స్త్రీలు ఇల్లు కదల వీలగునా ? అయినను ఇది అందరు ఆశ్రమవాసుల

కును ముఖ్యమని పురాణములు తెలుపుచున్నవి. ముఖ్యముగ సన్న్యాసులు దీనిని ఆచరించుచున్నారు.

బుద్ధుడు చాతుర్మాస్య వ్రతమాచరించుచుండినట్లు జాతక కథలలో పెక్కుచోట్ల నుడవబడినది. బౌద్ధులు చాతుర్మాస్య సమాప్తిలో కార్తిక పూర్ణిమనాడు గొప్ప ఉత్సవము జరుపుచుండిరి. దీనిని జాతక గ్రంథములలో కత్తిక నక్ఖత్త, కత్తికరత్తి, కత్తికఛన అని పేర్కొనిరి. రాజగృహము, వారణాసి, అవంతి మున్నగు మహానగరములలో ఈ చాతుర్మాస్య సమాప్త్యుత్సవము సప్తాహము జరుగుచుండెను. రాత్రులలో నగరమును దీపమాలికలతో దేదీప్యమానముగ అలంకరించుచుండిరి. ప్రజలు తమ కష్టములు తొలగి, ఆరోగ్యము చెడనందులకు యక్షరాజగు చిత్తుని పూజించుచుండిరి. సుందరమగు వస్త్రములు ధరించి రాజమార్గములలో విహరించుచుండిరి.

జైనులు అహింసావ్రతమును అతి ముఖ్యముగా పాటించువారు గాన చాతుర్మాస్యవ్రతమును నేటికిని నియమ నిష్ఠలతో ఆచరించుచున్నారు. పూర్వము ఆషాఢ, కార్తిక, ఫాల్గునమాసములలో అష్టాహ్నికీ పూజయను నొక పూజను జరుపుచుండినట్లు బృహత్కథాకోశమను జైనగ్రంథముభూమికలో వివరింపబడినది. ఈ చాతుర్మాస్యమున జైనులు స్నానోత్సవము నొకదానిని మిగుల వైభవముతో నడపుచుండిరి. దీనిని 'చాతుమ్మాసియ మజ్జణాయ ఉస్సవ' అనియనిరి.

---

# 10. ఏకాదశి

ఏకాదశి యనగా ప్రతిపక్షమునను పదునొకండవ తిథియని యర్థము. ప్రతినెలయందును రెండు ఏకాదశులు వచ్చును. సంవత్సరము పొడవునను ఇట్లు ఏకాదశులు ఇరువదినాలుగు. ఈ ఏకాదశు లన్నియును మనకు ముఖ్యమైనవి. ఏకాదశియందు హరికీర్తన ప్రధానముగా చేయబడునుగాన దీనికి హరివాసరమనియు వ్యవహార మేర్పడినది.

శిష్టులు ఏకాదశియం దుపవాసవ్రతమును కఠినముగా నాచరించుచున్నారు. దశమినాడు రాత్రి నిరాహారుడై ఏకాదశియందు నీరుకూడా పుచ్చుకొనక ద్వాదశినాడు ఉదయము పారణయొనర్చి, ద్వాదశినాడు రాత్రియును నిరాహారుడై యుండవలెను. అప్పటికిగాని ఏకాదశీవ్రతము సంపూర్ణము కాదు. ఏకాదశీవ్రత మొనర్చువాడు సూర్యచంద్రగ్రహణములలో భూరిదానము లొసర్చిన పుణ్యమును, అశ్వమేధ యజ్ఞ ఫలమును, అరువదివేల సంవత్సరముల తపఃఫలమును పొందునని స్మృతులు, పురాణములు తెలుపుచున్నవి. ఏకాదశినా డుపవసించుట బ్రాహ్మణులకు భూమినిచ్చి దానమిచ్చుటకంటెను, విద్యార్థులకు వేదవిద్యాదానము చేయుటకంటెను ఉత్తమమైనదని పురాణేతిహాసములు ఉద్ఘోషించుచున్నవి.

ఏకాదశినాడు ఉపవసింపక భుజించువాడు మహాపాపములు పొందుననియు పురాణములు హెచ్చరించుచున్నవి.

"ఏకాదశ్యాం న భుంజీత పక్షయో రుభయో రపి" అని పెక్కు స్మృతులు చెప్పినవి. అట్లుపవసింపలేనివారికి వాయు పురాణము ప్రత్యామ్నాయములు చెప్పినది.

"న క్తం హవిష్యాన్న మనోదనం వా
ఫలం తిలాః క్షీర మథాంబు చాజ్యం,
య త్పంచగవ్యం యదివాపి వాయుః
ప్రశ స్త మత్రో త్తర ము త్తరంచ."

ఉపవాసము చేయలేనప్పుడు వాయుభక్షణము, అది చేత కానప్పుడు పంచగవ్యము, లేక నేయి, నీరు, పాలు, నూవులు, పండ్లు తినవచ్చును. అదికూడ సాధ్యముకానప్పుడు ఉడుకని పదార్థము, లేక హవిష్యాన్నము తినవచ్చును. అవియును తిని ఉపవసించలేనివాడు న క్తభోజనము – ఒక్క పొద్దు – చేయవచ్చును. ఇది ఆపన్నులకోసము. సాధారణ ముగా వ్రతమందరును చేయవలయుననుట. ఏకాదశినాడు భుజించువాడు చాంద్రాయణవ్రతముచేసినగాని ఆపాపము పోదని హెచ్చరించిరి. ఒకనాడు బ్రహ్మకపాలమునుండి చెమట బొట్టొకటి క్రిందపడె నట. దానినుండి ఒకరాక్షసుడు పుట్టి "ప్రభూ నాకు నివాసము చూపుము" అని కోరెనట. బ్రహ్మ "ఓయీ ! నీవు ఏకాదశినాడు భుజించువారి శాల్యన్నపు మెతుకులలో నివసించుము. పిదప వారికడుపులలో క్రిములుగా మారుము" అనెనట. అందువలననే దక్షిణాపథమున ఏకా దశినాడు వరియన్నము తినకుండుట యాచారమైనది—అని యొకగాథ.

ఏకాదశి ప్రాముఖ్యమును తెలుపు రుక్మాంగదుని కథ యందరెరిగినదే, కనుక సంగ్రహముగా తెలుపుచున్నాను. పూర్వము రుక్మాంగదుడను ఒక రాజుండెను. అతడు తన రాజ్యమున ప్రజ లందరును ఏకాదశీవ్రతము నాచరించునట్లు కట్టడచేసెను. జనులు రాజాజ్ఞ ధిక్కరించక వ్రతము పాలింపగా, పాపకర్మలు తక్కువై యమునికి పనిలేకపోయెను. స్వర్గలోకము పుణ్యకర్ములచే కిటకిటలాడ సాగెను.

యముడు ఏమియు పాలుపోక తనమంత్రియగు చిత్రగుప్తునితో నాలోచించి రుక్మాంగదుని వ్రతమును భంగపరచుటకు ఒకయుక్తి పన్నెను. అది ఏమనగా – రంభ మోహినీ వేషమున వెళ్లి రుక్మాంగదుని వ్రతభ్రష్టుని చేయవలె ననుట. ఆ పన్నుగడమేరకు రంభ మోహినీ వేషధారిణియై రుక్మాంగదుని పురమునకు బోయెను. రుక్మాంగదుడు అపుడు వేటకై యడవికి పోయియుండెను. రంభ యడవిలో నొకచోట అతనికి మోహనరూపమున కనిపించి ముగ్ధుని చేసెను. రుక్మాంగదుడు ఆమెను పెండ్లాడుమని కోరెను. దాని కామె తనకు అన్నివేళల వశవర్తియై యుండినచో పెండ్లాడెదనని చెప్పగా, రాజు అంగీకరించి, పెండ్లాడి తన నగరుకు పిలుచుకొనిపోయెను.

ఆమె అతని వ్రతభ్రష్టునిచేయుటకే వచ్చినది గనుక ఒక ఏకాదశినాడు తనతో భోగింపుమని అతనిని కోరెను. ఆతడు తెల్లబోయి ఒల్లననగా, తనకు చేసిన శపథమును ఆమె జ్ఞాపకముచేసెను. కాని రాజు ఆమెకు ఏకాదశినాడు

మిథునకర్మ నిషిద్ధమనియు, తానామాట తలపెట్టజాలననియు, మరేపనినైన చేయుదుననియు నచ్చజెప్పెను. రాజు లొంగు బాటుకోసమే వేచియున్న రంభ "అట్లయిన నీ కుమారుని సంహరించి నాకిమ్ము." అని కోరెను. రుక్మాంగదుడు ఆడి తప్పని వాడు గనుకను, నిసువుకంటె ఏకాదశినే గొప్పగా నెంచువాడు గనుకను తనకుమారుని తలను కత్తితో నరుక బోనుండగా, విష్ణువు ప్రత్యక్షమై రుక్మాంగదుని భక్తిని కొని యాడి, మోహిని కృత్యమును వివరించెను; అంతమున మోక్షమును ఒసంగెను.

ఏకాదశీ ప్రాధాన్యమును గురించి మరియు కొన్ని గాథలు గలవు. ఒక్కొక్క ఏకాదశికి నొక్కొక్క పురాణ కథయును గలదు.

పూర్వము కుంభుడను రాక్షసు డుండెను. వానికుమా రుడు మృదుమన్యుడను వాడు శివునిగూర్చి పెక్కుతపము లాచరించి, ఏ స్త్రీ పురుషులనుండియు మరణము పొందకుండ వరము బడసెను. కాని, అయోనిజయగు స్త్రీనుండి మరణము తప్పదని శివుడు వానికి తెలిపెను. అయోనిజ యెన్నడును కలుగదను విశ్వాసమున ఆ రాక్షసుడు మదించి, త్రిమూర్తు లను, ఇంద్రాదిదేవతలను జయించి, వారిలోకముల నాక్ర మించెను. త్రిమూర్తులు తమ భార్యలు సావిత్రి లక్ష్మి పార్వతులతో పరుగిడిపోయి ఒక ఆమలక వృక్షము తొర్రలో దాగుకొనిరి. వారందరు ఆ తొర్రలో ఇమిడిపోయినందువల్ల కలిగిన ఒరపిడి కొక కన్య యుదయించెను. ఇంతలో ఆ దాన

వుడు త్రిమూర్తులను తరుముచు ఆచెట్టువద్దను వచ్చి, వారు కానరాకపోగా తొర్రను పరిశోధింపనుండెను. అంతలో ఆయోనిజయగు నాకన్య తొర్రనుండి వెలువడి ఆ దానవుని సంహరించెను. ఆమెయే ఏకాదశి. కనుక సకలపాపవినాశము నిమిత్తము ప్రతిపక్షమున వచ్చునొకొండవనాడు ఆమె సంస్మరణముగా ఉపవసించుట ఆచారమైనది.

భవిష్యోత్తరపురాణగాథ యిట్లున్నది. కృతయుగమున తాళజంఘు సుతుడగు మురుడను దానవుడు వరబలమున విర్రవీగుచు బ్రహ్మరుద్రేంద్రాది దేవతలను హింసించుచు, వారిని వారిలోకములనుండి తరుమగొట్టెను. వారు దిక్కులేక విష్ణువును శరణుజొచ్చిరి. విష్ణువు వారి మొర విని, వారి కభయమిచ్చి, మురాసురునితో యుద్ధమునకు తలపడెను. వేయేండ్లు వానితో ద్వంద్వయుద్ధముచేసినను, వాడు పరాజితుడు కాలేదు. విష్ణు వలసిపోయి సింహావతీగుహ గుహయందు దాగుకొనెను. మురాసురుడు అతనిని వెదకికొనుచు, ఆ గుహ సమీపించెను. విష్ణువు సంకల్పమాత్రమున అతని శరీరమునుండి ఒక కన్యక యుద్భవించెను. ఆమె ఆ దానవునితో యుద్ధముచేసి సంహరించెను. ఆమెయే ఏకాదశి. విష్ణువు సంతుష్టుడై ఆమెను వర మడుగు మనెను. "నేను సర్వకాలమును మీకు ప్రియగా నుండవలెను. సర్వ తిథులలోను నేను ప్రముఖగా పూజింపబడవలెను. నాతిథియందు భక్తితో ఉపవసించువారికి మోక్షము లభింపవలెను." అని ఆ కన్య

మూడవ వరము లడిగెను. విష్ణువు వల్లెయనెను. అప్పటినుండి ఏకాదశీ వ్రత మాచరణలో నున్నది.

మిత పథ్యాహారమును గురించి వైద్యక గ్రంథములు పెక్కు విధముల విపులీకరించినవి. ఉపవాసము–లంఘనము–పెక్కు రోగములకు పరమౌషధము. ఉపవాసము కామమును అరికట్టును. ఉద్రేకములను ఉప్పొంగనీయదు. ఇంద్రియము లను నిగ్రహించును. మనస్సును, శరీరమును పరిశుద్ధము చేయును. మానవునికి పరమశత్రువైన జిహ్వాచాపల్యము నకు అంకుశమువంటిది ఉపవాసము. ఉపవాసము జీర్ణకోశ మును, శ్వాసకోశములను శోధించును. కాచుటవలన కాంచ నము పరిశుద్ధమగునట్లు ఉపవాసమువలన కాయము పరిశుద్ధ మగును. దీనిని గుర్తించియే మన పెద్దలు నిత్యజీవితమునను దీనిని ఆచరణలో పెట్టి, దీని గొప్పదమును తెలుపుటకు పురాణగాథల నదికియుందురు. ఏమైనను ఏకాదశీవ్రతము అతిప్రాచీనకాలమునుండి వచ్చుచున్న ఆచారము.

ఆషాఢ శుక్లపక్షైకాదశి మొదలు కార్తిక శుక్లైకా దశివరకు చాతుర్మాస్యము. కనుక చాతుర్మాస్యము ప్రారం భపు ఏకాదశిని–ఆషాఢ శుద్ధైకాదశిని – ప్రథమైకాదశి యందురు. ఇదియును, కార్తిక శుక్లైకాదశియును, మార్గశిర శుద్ధైకాదశియును అతిముఖ్యములనియు విశ్వసించుచున్నారు. నిర్ణయసింధువును అనుసరించి వానిని సంగ్రహముగా నుదా హరింతును.

ఆషాఢశుద్ధము – ప్రథమైకాదశి. దీనినే శయనైకాదశియనియు నందురు. ఈనాటినుండియే చాతుర్మాస్య మారంభమగును. పూర్వము ఒకప్పుడు సంవత్సరమునకు నాలుగు నెలలుగల మూడు ఋతువులే పరిగణించబడు చుండెను. అట్లే వర్షర్తువునుండి సంవత్సరాది పరిగణించబడు చున్నందున ఈ ఏకాదశి ప్రథమైకాదశి – మొదటి యేకాదశి యయ్యెను. ఈనాటినుండి విష్ణువు క్షీరాబ్ధియందు శయనించునుగాన శయనైకాదశియును అయినదట. విష్ణువనగా రవియే. అంతవరకును ఉత్తరదిక్కుగానున్న రవి ఈనాటినుండి దక్షిణదిక్కుగా – దక్షిణాయనమగుటవలన–వాలునట్లు కాన వచ్చుటచే విష్ణువు శయనించినాడని మన పూర్వులు ప్రజల కొరకై కథలుగా చెప్పిరి. ఈనాడు గోపద్మవ్రత మాచరించ వలెనని వ్రతగ్రంథములు నుడువుచున్నవి. ఆ వ్రత విధాన మిది :

ఆషాఢ శుద్ధైకాదశి మొదలు కార్తిక శుక్లద్వాదశి వరకును ప్రతిదినమును ఆవులకొట్టమును పరిశుద్ధముచేసి, అలికి ముగ్గులిడి, యలంకరించి బియ్యపుపిండితో ముప్పది మూడు పద్మములు తీర్చి, గంధపుష్పాక్షతలతో పూజించి, ప్రదక్షిణ నమస్క్రియలు చేసి, పద్మము లెన్నియున్నవో అన్ని అపూపములను, వాయనములను బ్రాహ్మణుల కీవలెను. కొట్టమునడుమ మండపము కట్టి విష్ణువు నందుంచి యారాధింప వలెను. గోవును పూజింపవలెను.

పద్మపురాణమున నీ వ్రతమునుగురించి ఈ కథ గలదు. ఒకనాడు నారదుడు ద్వారకకు కృష్ణుని జూడవచ్చెను. కృష్ణు డతనిని పూజించి, లోకవృత్తాంతమేమని యడుగగా అతడు "మహానుభావా నీకు తెలియని దేమున్నది ? అయినను ధర్మ రాజు సదస్సులో జరిగిన వింతను పేర్కొందును." అని యిట్లు చెప్పసాగెను. "యముడు కొలువుదీరియుండెను. ఆ కొలు వునకు యక్ష రాక్షస పన్నగులు, దేవగంధర్వాదులు వచ్చి యుండిరి. తమ భేరులకు మనుష్యులచర్మము కావలెనని వారు యమునితో ననిరి. చాతుర్మాస్య వ్రతమును, సంక్రాంతి వ్రతమును చేయని మానవభామల చర్మ మొలిచి తెండని యముడు తన భటుల నాజ్ఞాపించెను. యమభటులు తమ యేలిక ఆనతి మేరకు భూలోకమున ప్రవేశించిరి. ఇదియే ఇప్పటి వర్తమానము."

నారదుని మాట విని కృష్ణుడు వెంటనే ద్వారకా నగరి లోనిస్త్రీలందరును గోపద్మకమును, చాతుర్మాస్య వ్రతమును ఆచరించవలెనని దండోరా వేయించెను. కృష్ణుడు ప్రత్యేక ముగా ఈ వ్రతమును తన చెల్లెలగు సుభద్రకు తెలిపెను. ఆమె అన్న మనసెరిగి ఆ వ్రత మాచరించెను. ఇట్లుండగా యమభటులు ద్వారకలో ప్రవేశించి మొట్టమొదట రాచ నగరుకే వచ్చి, సుభద్రనే "నీచర్మము మా దేవత రండోళ్లు కప్పుటకు కావలెను" అని కోరిరి. ఆమె నిర్భయముగా వారిని పసులకొట్టమునకు తీసుకొనివెళ్ళి తాను గోపద్మవ్రతము చేయుచుండుటను చూపెను. ఇంతలో అచటికి విష్ణుదూతలు

వ్రతప్రభావమువలన వచ్చి, యమదూతలను చావమోదిరి. యమదూతలు క్షతగాత్రులై కాలికి బుద్ధి చెప్పి, తమ రాజగు యముని శరణుజొచ్చిరి. అతడు అంతయు తెలిసికొని, శివకేశవుల వ్రతమాచరించువారి సమీపమునకు పోవలదని తన భటులను శాసించెను.

ఈ కథనుబట్టి శయనైకాదశి సూర్యుని దక్షిణాయనమును తెలుపునదియనియు, వర్షాకాలము ప్రారంభమగుట వలన క్రిమికీటకాదులు ఎక్కువై రోగములు పుట్టించి యమునికి పని కల్పించునుగనుక తన్నివారణార్థము పరిసరాలను పరిశుభ్రముగా నుంచుకొని, తమజీవిక కాధారములగు పశువులను-ముఖ్యముగ గోవులను - గౌరవించుట ప్రధానమనియు స్పష్టమగుచున్నది. భవిష్యోత్తరములోని మురాసురునివధ కథలో విష్ణువు సింహావతియను గుహయందు దాగుట యనగా సూర్యుడు సింహరాశి గతుడగుటయనియు, అతని శరీరమునుండి కన్య యుద్భవించుటయనగ కన్యారాశి రాగానే క్రిమికీటకాదులు, బురద మొదలగు నుత్పాతములు శమించుటయనియు పరమార్థమని యనుకొందును.

ఆషాఢబహుళము - కామికైకాదశి. ఈ ఏకాదశి నాడు దేవీ సనాథుడగు పురుషోత్తముని పూజింపవలెను. నవనీతదానము, మిష్టాన్నభోజనము ముఖ్యము. ఇది అభీష్ట ఫల సిద్ధికరి.

ఈ రెండు ఏకాదశులందును పండరిక్షేత్రమున గొప్ప ఉత్సవములు, భక్త సంతర్పణములు జరుగును. ముఖ్యముగ

ప్రథమైకాదశియందు పెద్ద జాతర జరుగును. సతీసక్కూ-బాయి చరిత్రము అందరెరిగినదే. ఆమె ముక్తిపొందినది ప్రథమేకాదశియందేనని 'సంతలీలామృత పురాణ' మను మహారాష్ట్ర భక్తచరిత్రము తెలుపుచున్నది. ఆ మహాసాధ్వియెడ, మహాభాగవతురాలియెడ భక్తిసూచకముగా నీ ఉత్సవము జరుపుచున్నారు.

శ్రావణశుద్ధము- పుత్రదైకాదశి. దీనినే లలితైకాదశి యందురు. ఈనాడు ఛత్రతాంబూలదానము శ్రేష్ఠము. మహిజిత్తనురాజు ఈవ్రతమాచరించి సంతానము బడసెను. వానకాలము గనుక ఛత్రతాంబూల దానములోని సొగసును పాఠకులు గ్రహించియే యుందురు.

శ్రావణ బహుళము - అజైకాదశి. దీనినే ధర్మప్రభైకాదశి యనియు నందురు. తిలపిష్ట మూష్యపాత్ర దానము ప్రశస్తము. పూర్వము హరిశ్చంద్రుడు రాజ్యమును, సతీసుతులను పోగొట్టుకొని ఈవ్రత మాచరించి మరల అన్నిటిని సంపాదించెనట.

భాద్రపదశుద్ధము - పరివర్తనైకాదశి. యోగనిద్ర చెందిన విష్ణుమూర్తి రెండు నెలలపిదప ఈనాడు పక్కకు పొర్లుదినము. కనుక దీనిని పరివర్తనైకాదశి అందురు. విష్ణుమూర్తి పరివర్తన మనగా సూర్యునిగతియే.

భాద్రపద బహుళము - ఇందైకాదశి. దీనిని ఇందిరైకాదశి యనియు నందురు. గోదానము, సక్తు (పేలపిండి)

దానము ప్రశస్తము. వానకాలము గనుక తేలికగా జీర్ణమగు నాహారమనుట. ఇంద్రసేనుడను రాజు యమలోకమున బాధ పడుచుండగా, అతని కుమారుడు ఈ వ్రతమాచరించి తండ్రికి ఉత్తమగతులు కల్పించెనట.

ఆశ్వయుజశుద్ధము – పాపాంకుశ ఏకాదశి. కదళీ ఫలములు, లడ్లు దానముచేయవలెను. ఆశ్వయుజమున సెనగలు పండి వచ్చును. కనుక ఆ ఋతువు వంటక మనుట. నేడు కొన్ని ప్రాంతములలో దీపావళికి తప్పక లడ్లు వండుటయును కలదు.

ఆశ్వయుజబహుళము – రమైకాదశి. పనసపండ్లు, బెల్లము దానమిచ్చుట ప్రశస్తము. ఈ ఏకాదశి వ్రతమాచరించి శోభనుడనురాజు స్వర్గమును పొందెనట.

కార్తికశుద్ధము–ప్రబోధిన్యేకాదశి. దీనినే ఉత్థానైకాదశి యనియు నందురు. ఈనాటితో చాతుర్మాస్యవ్రతము సమాప్తమగును. విష్ణువు మేల్కొనును. అనగా రవి, ఉత్తరాయణము సమీపించుటవలన, దక్షిణమునుండి కొంచె ముత్తరమునకు మొగ్గినట్లు – పైకిలేచినట్లు కాన్పించును. ఇదియే మేల్కొనుట. ఈనాడు ఉపవసించుటవలన మరు జన్మములో గొప్పవైభవము కలుగునని కార్తీకమాహాత్మ్యమున నున్నది.

పూర్వము మయపురమున దేవశర్మయను బ్రాహ్మణుడుండెను. ఆయనకు గుణవతియను కుమార్తె యుండెను.

ఆమెను అతడు తన తండ్రి శిష్యుని కొకనికిచ్చి వివాహము చేసెను. ఒకనాడు ఆ శిష్యుడు పూజానిమిత్తము కుశపుష్పములు తేబోగా ఒకరాక్షసు డతనిని చంపివేసెను. గుణవతి విధవ యాయెను. ఆమె ఈ ఏకాదశినాడు ఉపవసించి, సనియమముగా ప్రత్యూదయము గంగాస్నానమాచరించుచుండెను. విష్ణువు ప్రీతుడై ఆమెను విమానములో తనలోకమునకు గొనిపోయెను. ఆమె మరుజన్మమున సత్యభామయై కృష్ణుని పత్నియాయెను. ఆమెభర్త అక్రూరుడుగను, తండ్రి సత్రాజిత్తుగను జన్మించిరి.

దీనినే భీష్మైకాదశి యనియు నందురు. (దీనిచర్చను భీష్మైకాదశియందు చూడగోరినాను.)

కార్తీక బహుళము – ఉత్పత్త్యైకాదశి. ఈనాడు మురాసురుని హరించిన కన్య విష్ణుశరీరమునుండి జనించినందున దీనికీ పేరు వచ్చినదట.

మార్గశిరశుద్ధము–మోక్షైకాదశి. దీనినే వైకుంఠైకాదశి యందురు. మోక్షైకాదశి యనగా రవికిపట్టిన ఆరునెలల చీకటి వదలినదన్నమాట. "మాసానాం మార్గశీర్షోహం" అని గీతాచార్యుడు మార్గశిరమాస వైశిష్ట్యము చెప్పుటవలన ఆనెలయందలి శుక్లపక్షమున సంభవించు నీ ఏకాదశికిని ప్రాధాన్యమధిక మయినది. ఇది దాదాపు ఉత్తరాయణారంభ కాలము. దీనిని ముక్కోటి ఏకాదశియనియు నందురు. ముక్కోటియనునది ముప్పైమూడుకోట్లు అనుదాని సంగ్రహరూపమని పెద్దలందురు. ముప్పదిమూడుకోట్ల దేవతలు ఈ

నాప భూమికి దిగివత్తురట. అనగా దేవతలకు మన ఆరు నెలలు పగలు, మరి యారు నెలలు రాత్రి కదా! రాత్రియగు దక్షిణాయనము వెళ్లినంతగా, చీకటిపోలగ సూర్యుడు - వైకుంఠుడు-ముక్తుడుకాగా, దేవతలును చీకటిపోయి, వెలు తురునకు వత్తురన్నమాట. అనగా వారికి పగలు ప్రారంభ మయినదన్నమాట. విష్ణ్వాలయములలో నీనాడు ఉత్తరముననున్న నొకద్వారము తెరచియుంతురు. ఆళ్లవారుజామున దేవదర్శ నము చేసికొనుటకు ఈ ద్వారమునుండి వెళ్లవలెను. దీనిని వైకుంఠద్వార మందురు. దీనినుండి వెళ్లినవారికి మోక్షము తప్పదని భక్తుల విశ్వాసము. వైష్ణవఆళ్వారులలో ఒకరగు నమ్మాళ్వారు ఈనాడే పరమపదించినందునను దీనిని వైష్ణ వులు విశేషముగా పరిగణింతురు. శ్రీరంగము తిరుపతి మున్నగు వైష్ణవక్షేత్రములలో ఈ ముక్కోటిఏకాదశి గొప్ప ఉత్సవము. ఈ వైకుంఠద్వారమనునది సూర్యుని ఉత్తరా యణ ప్రవేశచిహ్నమని వేరుగ చెప్పబనిలేదు. శివాలయ ములలో నీసంప్రదాయము లేదు.

మార్గశిరబహుళము - విమలైకాదశి. అంధకారములు తొలగిన దనుట. దీనిని సఫలైకాదశియనియు నందురు. పూర్వము మాహిష్మంతుడనురాజునకు లుంపుడను కుమారు డుండెను. అతడు దేశభ్రష్టుడై ఈ ఏకాదశినాడు ఏమియు లభింపనందున గత్యంతరములేక ఉపవసింపవలసెను. అయి నను అతనికి సత్ఫలములు లభించెను.

పుష్యశుద్ధము – నందైకాదశి. దీనిని పుత్రదైకాదశి యనియు నందురు. పూర్వము సుకేతుడను నరపాలుడు ఈనా డుపవసించి, వ్రతమాచరించి తత్ఫలముగా పుత్రుని బడసెనట.

పుష్యబహుళము – కల్యాణ్యేకాదశి. దీనిని షట్తిలై కాదశియనియు నందురు. నూవులను ఆరురీతులుగా నుపయో గించుటవలన దీనికీపేరు వచ్చినది. స్నానముచేయు జలము లలో నువ్వులు కలుపుట, తెలకపిండితో శరీరము రుద్దు కొనుట, నువ్వులను తినుట, మంచినీటియందును నువ్వులు కలుపుట, తిలదానము, తిలలతో దేవపూజచేయుట – ఈ ఆరును చేయుటవలన షట్తిలైకాదశి యాయెను. శీతనివా రకముగు నీక్రియలను పాఠకులు గ్రహించియే యుందురు.

మాఘశుద్ధము – కామదైకాదశి. దీనిని జయైకాదశి యనియు నందురు. ఈనాడు చిమ్మిలితో గోవు ఆకారమును తీర్చి దానముచేయుట ప్రశస్తము. పుష్పదంతుడను గంధ ర్వుడు ఇంద్రసభలో నాట్యమాడుచు సుందరియగు తన సతిని చూచి అడుగులుతప్పగా ఇంద్రుడు కోపించి వారిని రాక్షసులు కండని శపించెను. వారు ఈ ఏకాదశినాడు భుజించుట కేమియు దొరకనందున ఉపవసించి శాపవిముక్తు లగుదురు.

మాఘబహుళము – జయైకాదశి. దీనిని విజయైకాదశి యనియు నందురు. పాదరక్షలదానము ప్రశస్తము. రాముడు లంకాప్రవేశమునకై సముద్రముపై సేతువు నిర్మించుట ఈ నాడేనని కొందరనినారు. రామాయణమున గోవిందరాజీయ

వ్యాఖ్యనుబట్టి "ఫాల్గునే ప్రాయోపవేశః. ఫాల్గునశుద్ధ చతుర్దశ్యాం లంకాదాహః" అని యున్నది. ఫాల్గునమున రాముడు లంకను చేరజాలక సముద్రతీరమున ప్రాయోపవేశ మొనర్చెననియుండగా, జయైకాదశినాడు వారధికట్టుట యెట్లో సమన్వయము కుదురుట లేదు.

ఫాల్గునశుద్ధము – ఆమలక్యేకాదశి. దీనినే ఆమలకైకాదశి యనియు నందురు.

ఫాల్గునబహుళము – సౌమ్యైకాదశి. దీనినే పాపమోచన్యేకాదశి యనియు నందురు. పూర్వము మేధావియను మహర్షి తపమాచరించుచుండగా మంజుఘోషయను నప్సరస అతని తపస్సును భంగపరచెను. ఆతడు ఆమెను శపింపగా, ఆమె ఈ ఏకాదశీవ్రత మాచరించి పాపవిముక్త యాయెనట.

చైత్రశుద్ధము – దమనైకాదశి. దీనినే కామదైకాదశియనియు నందురు. లలితుడను గంధర్వుడు తనధర్మము సరిగా నిర్వర్తింపనందున రాక్షసుడుగా శపింపబడె, భార్యయగు లలిత దమనైకాదశినాడు వ్రతమాచరించుటవలన శాపవిముక్తి పొందెను. ఈ ఏకాదశిని అనైధవ్యైకాదశియనియు నందురు.

చైత్రబహుళము – బహులైకాదశి. దీనిని వరూధిన్యేకాదశియనియు నందురు. ఈనాడు ఉపవసించినవారు వేయి గోవులను దానమిచ్చిన ఫలము పొందుదురు.

వైశాఖశుద్ధము – మోహిన్యేకాదశి. ఈనాడు, పాదరక్షలు, పాలు, చల్లని పదార్థములు దానము చేయవలెను.

పూర్వ మొక వైశ్యుడు చెడుతిరుగుళ్లతో తనధనమంతయు కోల్పోయి, గృహబహిష్కృతుడై, అడవుల బడిపోయి, అట ఒక మునీశ్వరుని ఉపదేశమున ఈ వ్రత మాచరించి, తొల్లి యట్ల సంపన్నుడాయెను.

వైశాఖబహుళము – సిద్ధైకాదశి. దీనిని అపరైకాదశి యనియు నందురు. ఛత్రోపానద్దానము ప్రశస్తము.

జ్యేష్ఠశుద్ధము – త్రివిక్రమైకాదశి. దీనిని నిర్జలైకాదశి యనియు నందురు. జలకుంభములు, పరమాన్నము, నేయి, ఛత్రము దానము చేయుట ప్రశస్తము. మండుటెండలకు తగిన దానము. భీమసేనుడుకూడ నీ నా డుపవసించి అన్నియేకాదశీ వ్రతముల ఫలమును పొందెనట. భీముడు బండెడు తిండి తినువాడు. ఉపవాస మెట్లాచరించును? ఎట్లైనను ఈనాడు మాత్రము నీరుకూడ త్రాగక ఉపవాసముండిన చాలునని కృష్ణుడనెనట. కనుక నిది నిర్జలైకాదశి యాయెను. వేసవిని దప్పి హెచ్చు. అయినను నీరుచుక్కైన త్రాగక ఉపవసించుట విశేషమనియే దీనికీ పేరయి యుండును.

జ్యేష్ఠబహుళము–యోగిన్యేకాదశి. దీనిని పాపనాశని యనియు నందురు. యష్టికాచందన దానము ప్రశస్తము. శివపూజకు పూలుతెచ్చుటకు నియమితుడైన కుబేరభృత్యు డొకడు భార్యాలోలుడై తనపనిలో ఏమరెనట. కుబేరుడు వానిని కుష్ఠరోగివి కమ్మని శాప మిచ్చెను. వాడీ వ్రత మాచరించి రోగవిముక్తు డాయెను.

ఈ ఏకాదశీవ్రత కథలును పురాణములలోను, వ్రత గ్రంథములలోను వివిధములుగా నున్నవి.

ఇక ఇది హరివాసరమగుటకు కారణ మేమియో చర్చింతము. విష్ణువన్నను, హరి యన్నను పూర్వము సూర్యునికే పర్యాయములు. శయనైకాదశి, పరివర్తనైకాదశి, ఉత్థానైకాదశి, వైకుంఠైకాదశి, సఫలైకాదశి యనునవన్నియు సూర్యుని చారముతో సంబంధము గలవి. అనగా సూర్యచారముతో మార్పును తెలుపునవి యగుట ప్రధానముగా సూర్యదినములు. సూర్యపర్యాయములగు విష్ణుహర్యాది పదములు మరొక దేవతకు – విష్ణువునకు – వ్యవహృతము కాగనే ఈ ఏకాదశులును హరివాసరము లాయెను. పిదప పురాణకథలు కల్పింపబడినవని నేను భావించుచున్నాను. పరిశోధకులు పరిశీలింతురుగాక !

―――




భీష్మ అంపశయ

# 11. భీష్మైకాదశి - భీష్మాష్టమి

భీష్మాచార్యుని దెలియనివా రుండరు. ఇతడు భారత వీరులలో మణిపూస. ఇతడు చేసిన భయంకరమగు ప్రతిజ్ఞ వల్లనే 'భీష్మ ప్రతిజ్ఞ'యను నానుడి యేర్పడినది. ఇతడు కురువంశరాజగు శంతనునికి గంగాదేవియందు జనించినవాడు. తన దండ్రి సత్యవతియను కన్యను కోరగా, తాను రాజ్యమును వదలుకొని ఆజన్మము బ్రహ్మచర్య మవలంబింతునని భీష్మ ప్రతిజ్ఞ యొనర్చి ఆ కన్యను తెచ్చి తన తండ్రికిచ్చి వివాహము చేయించిన పితృభక్తుడు. ఇతడు స్వచ్ఛందమరణము గలవాడు. భారతయుద్ధమున ఇతడు సేనానియై పదిదినములు యుద్ధముచేసి, పదునొకండవనాడు శిఖండిబాణములతో నేల గూలి, అంపశయ్యపై పడిపోయెను. అది దక్షిణాయనము గనుక ఉత్తరాయణమువరకును వేచియుండి, ఉత్తరాయణము రాగానే తనువు చాలించెను.

ఇత డంపశయ్యపై ఒరిగినది కార్తిక శుక్లైకాదశి యనియు, మాఘశుద్ధాష్టమినాడు ప్రాణత్యాగము చేసెననియు హేమాద్రి మున్నగు వ్రతగ్రంథకారులు తెలిపియున్నారు. ఈ సందర్భమున భీష్మపంచకమను నొక వ్రత మాచరింపవలె ననియు తెలిపియున్నారు. ఈ వ్రతము కార్తీక శుద్ధ ఏకాదశినాడు ప్రారంభించి ఐదుదినము లాచరించవలెనని తెలిపినారు. కనుక ఈ ఏకాదశికి భీష్మైకాదశి యనియు వ్యవహార

మేర్పడినది. నారదీయ పురాణమునుండి హేమాద్రి ఈ వ్రతము నిట్లు తెలిపినాడు :

వ్రతములలో నే వ్రత ముత్తమమైనదని నారదుడు బ్రహ్మనడుగగా, "భీష్మపంచకమను వ్రతము ఉత్తమమైనది. దీనిని సాక్షా ద్వ్యాసుదేవుడే భీష్మునకు తెలిపెను." అని బ్రహ్మ వివరించెను. కార్తికశుక్లైకాదశినాడు ఉదయము నదిలోగాని, చెలమలలోగాని స్నాన మాచరించి, పితరులకు తర్పణాదిక మాచరించి, శాలిగ్రామ హరిని పూజింపవలెను. అతనిని పంచగవ్యముతో నభిషేకించి, పరమాన్నము నివే దించి గోమయము పుచ్చుకొని రాత్రి భూమిపై పరుండ వలెను. ఇట్లు ఐదు దినములు వ్రత మాచరించవలెను. రెండవ నాడు బిల్వ పత్రితో పూజించి గోమూత్రమును పుచ్చుకొన వలెను. మూడవనాడు గుంటగలగరతో పూజించి పాలు స్వీక రింపవలెను. చతుర్థదినమున గన్నేరుపూలతో పూజించి పెరుగు పుచ్చుకొనవలెను; మరేమియు పుచ్చుకొనరాదు. ఐదవనాడు – పూర్ణిమనాడు–హోమ మాచరించి, పిదప ఒక ధర్మరాజు విగ్రహమును ఇనుముతో చేసి, దానిని నూవుల రాశి పైనుంచి, ధర్మరాజును పూజించి, దానము చేయవలెను. పిదప బ్రాహ్మణ సంతర్పణ మాచరించి పంచగవ్యము స్వీక రించి రాత్రి భుజింపవలెను. నాలుగు దినములు ఉపవసింపలేని వాడు, శాకాహారము గైకొనవచ్చును.

ఈ వ్రతమును అందరును ఆచరించవలెను. అపుత్రకులు ఆచరించిన పుత్రవంతు లగుదురట – సంవత్సరములోగనే.

"అపుత్రేణ ప్రకర్తవ్యం సర్వదా భీష్మపంచకం,
మథిత్వా పాపపురుషం వర్షమధ్యే సుతం లభేత్."

భీష్ముడు కార్తిక శుక్లైకాదశినాడు అంపశయ్యపై పడినను మాఘ శుద్ధాష్టమిని ఉత్తరాయణము వచ్చిన తర్వాత అసువుల బాసెనని ఇదివరకే తెలిపితిని. నిర్ణయ సింధువు మొదలగు వ్రత స్మృతి గ్రంథములలో మాఘ శుక్లాష్టమిని భీష్మునికి తర్పణము చేయవలెనని నిర్దేశము కలదు.

"మాఘమాసే సితాష్టమ్యాం సలిలం భీష్మతర్పణం,
శ్రాద్ధంచ యే నరాః కుర్యుః తే స్యుః సంతతి భాగినః."

మాఘమాస శుక్లాష్టమినాడు భీష్మునికి తర్పణ మాచరించి శ్రాద్ధ మొనర్చినవారికి సంతానము కలుగునని పద్మపురాణ మున నున్నది. భారతమున భీష్మున కీనాడు జలాంజలి యొసగిన సంవత్సరము చేసిన పాపము తత్క్షణమే నశించును—అని కలదు.

"శుక్లాష్టమ్యాన్తు మాఘస్య దద్యాద్భీష్మాయయోజలం,
సంవత్సరకృతం పాపం తత్క్షణా దేవ నశ్యతి."

అన్ని వర్ణములవారును ఈ మంత్రముతో తర్పణముచేయవలెనని నిర్ణయసింధుకారుడు తెలిపినాడు.

"భీష్మ శ్శాంతనవో వీరః సత్యవాదీ జితేంద్రియః,
ఆభి రద్భి రవాప్నోతి పుత్రపౌత్రోచితాం క్రియాం.
వైయాఘ్రపాదగోత్రాయ సాంకృత్యప్రవరాయ చ,
అపుత్రాయ దదా మ్యేత జ్జలం భీష్మాయ వర్మణే."

భీష్మునకు తర్పణము చేయనివారు సంవత్సరమంతయు సంపా
దించిన పుణ్యమును కోల్పోదు రనియు మదనరత్న మను
గ్రంథమున గలదు.

ఈ ఐదునాళ్ళును ఉపవసింపవలెననుట, పంచగవ్య
ప్రాశనమే చేయవలెననుట, బిల్వపత్రి, గుంటగలగర, గన్నేరు
పూలతో పూజింపవలెననుట, యమపూజాదికము జరుపవలె
ననుట చూడగా నివన్నియు వైద్యకమునకు సంబంధించినవిగా
తోచును. "కార్తికస్యాంతిమ పక్షః మార్గశీర్షస్య చాదిమః,
యమదంష్ట్రా సమాఖ్యాతా..." అని వైద్యగ్రంథములు
హెచ్చరిక. కార్తికమాస ద్వితీయపక్షము, మార్గశిర ప్రథమ
పక్షము యమునికోరలట. కనుక జాగరూకతతో వ్యవహరించ
వలెనని హెచ్చరిక. ఇక్కడ బహుళ పక్షాది మాసమును
గ్రహింపవలెను. ఆ రెండుపక్షములును మిగుల మెలకువతో
నుండవలెననుట కుపలక్షణముగా నీ ఐదునాళ్ళును ఆచరణలో
వచ్చియుండునేమో ! తర్వాత భీష్మశరతల్పశయనగాథ
ఆయుర్వేద విధితో జోడించబడియుండును.

సంవత్సరమునకు 360 దినములు మొదలు పరిగణింప
బడినవి. పిదప ఐదుదినములు చేర్చబడినవి. ఆ ఐదు దిన
ముల చేర్పును సూచించుటకు ఈ వ్రత మేర్పడినదని
కొందరు విద్వాంసులు తెలుపుచున్నారు.

మాఘ శుద్ధ సప్తమి రథసప్తమి. ఒకప్పుడు ఆనాడు
ఉత్తరాయణము ఆరంభమయి యుండెను. (ఈ చర్చను 'రథ
సప్తమి' లో చూడగోరినాను.) భీష్ముని కాలమునకు మకర

సంక్రాంతినాడుకాక రథసప్తమితో ఉత్తరాయణము మొదలగుచుండెనేమో! మరునాడే భీష్ముడు అసువులు బాసెను.

ఇక భీష్ముడంపశయ్యపై నొరిగినది కార్తిక శుద్ధైకాదశిని కాదనియు, మార్గశిర శుద్ధైకాదశినియనియు వాదమున్నది. వ్రతగ్రంథములలో కార్తిక శుక్లైకాదశియనియే గలదు. వ్రతచూడామణిలో నిట్లున్నది: శరతల్పగతుడగు భీష్ముడు ధర్మరాజుకు రాజధర్మములను, దానధర్మములను, మోక్షధర్మములను తెలిపిన పిదప కృష్ణుడు ప్రీతుడై "భీష్మాచార్యా నీవు ధన్యుడవు. ధర్మమును వినిపించినావు. కార్తికైకాదశినాడు నీవు జలముకోరగా, అర్జునుడు బాణమువదలి పాతాళగంగను తెచ్చెను. ఆ జలముతో నీ అంగములు నేటివరకు పరితుష్టములైనవి. కనుక పూర్ణిమవరకు (ఏకాదశినుండి) సకలజనులు నీకు అర్ఘ్యమిత్తురుగాక!" అని యనెను.

"ఏకాదశ్యాం కార్తికస్య యాచితంచ జలం త్వయా,
అర్జునేన సమానీతం గాంగం బాణస్య వేగతః.
తుష్టాని తవ గాత్రాణి తస్మా దద్య దినావధి,
పూర్ణిమాంతం సర్వలోకా స్తర్పయం త్వర్ఘ్యదానతః."

కాని భీష్ముడు తన ప్రాణోత్క్రమణ సమయమున ధర్మరాజుతో నిట్లనినాడు :

"దిష్ట్యా ప్రాప్తోసి కౌంతేయ సహామాత్యో యుధిష్ఠిర,
పరివృత్తోహి భగవాన్ సహస్రాంశు ర్దివాకరః.

అష్టపంచాశతం రాత్ర్య శ్శయాన స్యాద్య మే గతాః,
శరేషు నిశితాగ్రేషు యథా వర్ష శతం తథా.
మాఘోయం సమనుప్రాప్తో మాస స్సౌమ్యో యుధిష్ఠిర,
త్రిభాగ శేషః పక్షోయం శుక్లో భవితు మర్హతి.''
(అనుశాసనిక పర్వం, అధ్యా-168).

''యుధిష్ఠిరుడా, అమాత్య సహితుడవై దైవవశమున ఇక్కడికి వచ్చినావు. సహస్రాంశువగు దివాకరుడు ఉత్తరాయణమునకు మరలినాడు. ఈవాడిమొనలుగల అంపశయ్యపై పడుకొనియున్న నాకు ఏబదియెనిమిది రాత్రులే నూరేండ్లుగా నయినవి. మాఘమాసము వచ్చినది. ఇది సౌమ్యమగు మాసము. శుక్ల పక్షము. మాసమును నాలుగుభాగములు చేసిన, ఒకభాగము గడచి, మూడుభాగములు మిగిలియున్నది. అనగా అష్టమి.''(సౌమ్యశ్చాంద్రః. మాసస్య చతుర్భాగకరణే, సార్ధస ప్తతి ర్భాగత్వాత్ అష్టమ్యర్ధస్యా సతీతత్వేన ప్రథమ భాగస్య విద్యమానత్వాత్ త్రిభాగ శేషతో భవితు మర్హతీ త్యర్థః - నీలకంఠీయము) ఈలెక్క ప్రకారము మాఘశుద్ధాష్టమినుండి ఏబదియెనిమిది దినములను తీసివేసిన మార్గశీర్ష శుక్లైకాదశి యగును. ఆదినముననే భీష్ము డంపశయ్యపై పరుండెనని నిర్ణయమగుచున్నది. కాని శ్రీకృష్ణుడు మొదలగువారు భారతయుద్ధానంతరము యుద్ధమున మరణించిన వారందరికిని అంత్యవిధులు నిర్వర్తించిన పిదప నెలదినములు గంగాతీరమున నుండిరి.

తత్ర తే సుమహాత్మానో న్యవసన్ పాండునందనాః,
శౌచం నిర్వర్తయిష్యంతో మాసమాత్రం బహిః పురాత్.
(శాం. 1-2.)

పిదప శ్రీకృష్ణుడు యుధిష్ఠురునితో పాటు భీష్ముని చూడవచ్చి నపుడు భీష్మునితో

''పంచాశతం షట్చ కురుప్రవీర
శేషం దినానాం తవ జీవితస్య,
తత శ్శుభైః కర్మఫలోదయైస్త్వం
సమేష్యసే భీష్మ విముచ్య దేహం.''
(శాంతిపర్వము. అ. 51-14)

అన్నాడు. దీనిభావ మేమన ? ఓకురువీరుడా నీజీవిత శేష మిక ఏబదియును ఆరుదినములు మాత్రమే. పిదప నీవు దేహమును వదలి శుభకర్మ ఫలోదయమును పొందుదువు.—ఉత్తమగతులను పొందుదువు. తిక్కనయును

''అనఘ యినుడింక యేబదియాఱు దివస
ములకు దాను త్తరాయణమున జరింప
బోడగు నీవప్డు దేహంబు విడిచి యేగు
దపునరావృత్తి పదమున కభిమతముగ.''
(శాం. ఆ-2. ప-115.)

దీనినిబట్టి పంచాశతం షట్చయనగా నేబదియారు దినములు గనుక, గంగాతీరమునుండి పాండవాదులు తరలి భీష్మునికడకు వచ్చిన యేబదియారు దినములకు – అనగా

శరతల్పగతుడైనది మొదలు ఎనుబదియారు దినములకు మరణించెనని లెక్కవచ్చుచున్నది. ఆనుశాసనికపర్వములో భీష్ముడు తాను ఏబదియారు దినములే కదా అంపశయ్యపై పడియున్నాననెను. కనుక అతని వాక్యమునకును శాంతి పర్వమునందలి కృష్ణవచనమునకు విరోధమేర్పడుట చూచి భారతవ్యాఖ్యాతయగు నీలకంఠాచార్యుడు 'పంచాశతం షట్చ' యనుదానికి ముప్పది-యని యర్థము చెప్పినాడు. ఆభాగము నిట నుదాహరించుచున్నాను.

"పంచాశతం షట్చేతి. తవ జీవితసంబంధినాం టనానాం శేషం పంచ షట్చ పంచవార మావర్తితాః షడితిరీత్యా త్రింశతిరితి జ్ఞేయం. తావదేవ ఆశతం శతావధి యద్దినానాం శతేన కర్తుం శక్యం తత్త్రింశతాం కర్తుం శక్య మిత్యర్థః. అష్ట పంచాశతం రాత్ర్యః శయానస్యా ద్య మే గతః ఇతి భీష్మో వక్ష్యతి. తత్ర త్రింశ దతఃపరం శిష్టాః, అష్టావింశతిః ఇతః పూర్వం వ్యతీతాః. తథాహి. భీష్మస్య శరతల్ప శయనానంతరం అష్టా దినాని యుద్ధం. తతో దుర్యోధనాశౌచం యుయుత్సోః షోడశదినాని. తేన సహ పురం ప్రవిశతాం పాండవానా మపి తావంతి దినాని గతాని. పంచవింశే సర్వేషాం శ్రాద్ధదినం. షడ్వింశే పురప్రవేశః. సప్తవింశే రాజ్యాభిషేకః. అష్టావింశే ప్రకృతి సాంత్వనం, ఆభ్యుదయికం దానంచ. ఊనత్రింశే భీష్మంప్ర త్యాగమనం తద్దిన మారభ్య త్రింశతిర్దినానీతి జ్ఞేయం."

దీనియర్థమిది : పంచాశతంషట్ అనగా నీజీవితసంబం
మైన దినముల శేషమిక ఐదుచే హెచ్చించబడిన ఆరు అన
లెక్కగా గ్రహించవలెను. ఈ ముప్పదిదినములే 'ఆశతం'
శతావధి. పందదినములలో చేయదగినది ముప్పది దినమ
లలో చేయదగునని యర్థము. అనగా ముప్పదితో కలిసి
ఇరువదియెనిమిది యని యర్థము. ఏబది ఎనిమిది దినములుగ
పడియున్నానని భీష్ము డనును. ఇదివరకు ఇరువదియెనిమి
దినములు గడచినవి. ముప్పది దినములు మిగిలియున్న
అదియెట్లన : భీష్ము డంపశయ్యపై శయనించిన పిదప ఎనిమి
దినములు యుద్ధము. పిదప యుయుత్సువునకు దుర్యోధను
మరణాశౌచము పదియారుదినములు. అతనితో పాటు పు
ప్రవేశ మొనర్చిన పాండవులకును అన్నిదినములే గడచిన
ఇప్పటికి మొత్తము ఇరువదినాలుగు దినములు. ఇరువదియై
దవ దినమున అందరికిని శ్రాద్ధము. ఇరువదియారవ దినము
పురప్రవేశము. ఇరువదియేడవ దినమున ధర్మరాజు పట్టా
షేకము. ఇరువదియెనిమిదవ దినమున ప్రజలను సమాధా
పరచుట, అభ్యుదయముకోరి దానము. ఇరువది తొమ్మిద
దినమున భీష్మునియొద్దకు వచ్చుట. ఆదినమునుండి ముప్ప
దినము లని ఎరుగవలెను.

ఈకారణమువల్ల భీష్ముని శరతల్పశయనము మార్గశి
శుద్ధైకాదశినాడే యని నిశ్చితమగుచున్నది. వ్రతగ్రంథము
లెక్కయేమో విచార్యము. అయినను గంగాతీరము
పాండవులు నెలదినము లుండిరి యనుదానికి సమన్వయవ

కుదురుటలేదు. వారుండినది ఇరువది రెండుదినములే యని, నీలకంఠాచార్యుని వ్యాఖ్యనుబట్టి తెలియుచున్నది. మరి, మూలములోని వాక్యములకు పూర్వాపరసమన్వయ మెట్లో!

భీష్ముడు మరణించునాటికి దాదాపు 170 ఏండ్ల వయసు గలవాడని, అప్పటికి ధర్మరాజునకు కనీసము ఎనుబది యేండ్లుండెనని పరిశోధకులు తెలుపుచున్నారు. ఇట్టి దీర్ఘజీవి, బ్రహ్మచర్య వ్రతనిష్ఠుడు, జ్ఞాననిధియగు భీష్మునికి పూజలను నేడు బ్రాహ్మణులు మాత్రము చేయుదురు.

---

# 12. శ్రావణపూర్ణిమ - రాఖీపూర్ణిమ

ఋతువుల ననుసరించి ప్రతి కార్యమును ప్రారంభించు మన పూర్వులు విద్యారంభమునకును ఒక కాలమును నిర్ణయించుకొని అనుసరించుచుండిరి. ఆ విద్యారంభ కాలమే శ్రావణ పూర్ణిమ. ఈనాడు ద్విజులు అధ్యాయోపాకర్మ జరుపుచుండిరి. అధ్యాయోపాకర్మయే నేడు ఉపాకర్మయని సంగ్రహరూపమున వ్యవహరింపబడుచున్నది. అధ్యాయోపాకర్మయనగా వేదాధ్యయన ప్రారంభము. అధీయతే యః సోధ్యాయః=వేదః, తస్యోపాకర్మ=ఉపక్రమః అని శాస్త్రకారులు దీనికి వ్యుత్పత్తి చెప్పిరి. ఇది నూతనాధ్యయనమే కాక ధారణాధ్యయనమును. ధారణాధ్యయనమనగా, ధారణకోసము ఆవృత్తివేయుట.

ఈ వేదోక్తకర్మ ద్విజులందరికిని నియతమైనను నేడు బ్రాహ్మణులే హెచ్చుగా అనుసరించుచున్నారు. వారీనాడు ప్రాంతఃకాలముననే లేచి నిత్యకర్మయగు ప్రాతస్సంధ్యావందనము చేసి, అధ్యాయోపాకరణోత్సర్జనాంగభూతమైన 'కామోకార్షీత్' జప మాచరించెదరు. "కామోకార్షీత్, మన్యురకార్షీత్, కామః కరోతి, నాహం కరోమి, కామః కర్తా, నాహం కర్తా, కామః కారయితా, నాహం కారయితా, ఏష తే కామ కామాయ స్వాహా!" అనునది కామోకార్షీజ్జపము. శ్రావణపూర్ణిమ నూతనాధ్యయనకాల మయినట్లే, ఇది వరకు జరిగిన దానిలోని లోపములకు ప్రాయశ్చిత్తముగాను

నిర్వ ర్తించబడునది కావున "నేను చేసిన లోపములన్నియు కామక్రోధము లనువానివలన చేసినవే. లోపములు కలిగించునది కామమే. నేను చేసెడివాడను గాను, చేయించెడివాడను గాను" అని ఆత్మపరిశీలనముచేసికొను మంత్ర మిది. ఈ మంత్రమును 108 మార్లు జపించిన పిదప, మధ్యాహ్నము అందరును కలసి నదికో చెరువునకో పోయి, స్నానాదికృత్యములు ముగించి నూతన యజ్ఞోపవీతమును, మౌంజ్యాజినములను ధరింతురు. ఉపనయన కర్మయే సంగ్రహముగ నొనర్త రనవచ్చును. పిదప కాండఋషి తర్పణము ఆచరించి, వేదాధ్యయనోపక్రమునకు చిహ్నముగా ప్రతి వేదమునందలి ఆద్యంత ఋక్కులను, ఉపనిషత్తుల ఆద్యంతవాక్యములను పఠింతురు. పిదప ఇంటికి వచ్చి, అధ్యయనహోమ మాచరింతురు. మరుసటినాడు ఉపాకర్మాంగభూతముగా 1008 మార్లు గాయత్రీజపమును చేయుదురు; గాయత్రీహోమమును చేయుటయును కలదు.

ఈ నూతన విద్యారంభ మిప్పుడే యనుటకు ప్రమాణమేమి యను ప్రశ్న యుదయించును. వర్షర్తువునుండి చాతుర్మాస్యవ్రత మారంభమగును. వానలవలన ఎచటికి వెళ్లుటకును అవకాశముండదు. జ్యేష్ఠమాసమున ఏరువాక సాగి రెండు నెలలకు సస్యములు మొలకెత్తుచుండును. అప్పుడు చదువు సంధ్యలకు తీరికయైయుండును. కనుకనే గృహ్యసూత్రకారులును, స్మృతికారులును దీనిని విధించియుందురు. పారస్కర గృహ్యసూత్రమున నిట్లున్నది. "అథాతో

అధ్యాయోపాకర్మ. ఓషధీనాం ప్రాదుర్భావే, శ్రవణేన శ్రావణ్యాం పౌర్ణమాస్యాం శ్రావణస్య పంచమ్యాం, హస్తే న వా.'' అనగా ఓషధులు మొలకెత్తిన తర్వాత శ్రవణ నక్షత్రయుక్త శ్రావణమాస పూర్ణిమనాడుగాని, శ్రావణ పంచమియందుగాని, హస్తానక్షత్రముగలనాడు గాని వేదాధ్యయనారంభము చేయవలె ననుట. నిర్ణయసింధుకారుడు ప్రయోగపారిజాతమునుండి శౌనకవచనము నిట్లుదాహరించినాడు.

''అథాత శ్శ్రావణే మాసే శ్రవణర్క్ష యుతేదినే,
శ్రావణ్యాః శ్రావణే మాసి పంచమ్యాం హస్తసంయుతే.
దివసే విదధీతైత దుపాకర్మ యథోచితం,
అధ్యాయోపాకృతిం కుర్యా త్తత్రౌపాసన వహ్నినా.''

ఈ వేదప్రారంభమును ఆయాశాఖలవారు ఆయా సూత్రములననుసరించి విధవిధములుగా జరుపుకొనుచున్నారు. సామవేదులు వినాయకచవితినాడు ఉపాకర్మజరుపుకొనుట మనము పరిశీలించవలెను. ఆనాడు హస్తానక్షత్రము వచ్చును. వినాయకుడు విద్యాధిదేవతగా పరిగణించబడుట 'వినాయకచవితి'లో చర్చించబడినది. ఆనాడును వేదాధ్యయనోపక్రమము చేయుట ప్రాచీనాచారమైనట్లు స్పష్టము.

వేదాధ్యయనము ఆరంభించి నియతముగాచేసి, ముగించవలసిన కాలమును మనువు ఇట్లు తెలిపినాడు :

''శ్రావణ్యాం ప్రౌష్ఠపద్యాం వా ప్యుపాకృత్య యథావిధి,
యుక్తశ్ఛందాం స్యధీయేత మాసా న్విప్రోర్ధపంచమాన్.

పుష్యేతు ఛందసాం కుర్యాత్ బహి రుత్సర్జనం ద్విజః,
మాఘశుక్లస్య వా ప్రాప్తే పూర్వాహ్ణే ప్రథమేహని,
యథాశాస్త్రంతు కృత్వైవ ముత్సర్గం ఛందసాం బహిః,
విరమే త్పక్షిణీం రాత్రిం యద్వా ప్యేక మహర్నిశమ్,
అతఊర్ధ్వంతు చ్ఛందాసి శుక్లేషు నియతః పఠేత్,
వేదాంగాని రహస్యంచ కృష్ణపక్షేషు సంపఠేత్."

శ్రావణ మాసమునందుగాని, భాద్రపద మాసమునగాని విధిప్రోక్తముగా ఉపాకర్మ ప్రారంభించి నాలుగున్నర నెలల పర్యంతము వేదాధ్యయనము చేయవలెను. పిదప పుష్య మాసమునగాని, మాఘ శుక్ల ప్రతిపత్తునగాని (శ్రావణమున ప్రారంభించిన పుష్యమునను, భాద్రపదమున ప్రారంభించిన మాఘమునను) ఉత్సర్జనము – అధ్యయనవిరమణము – చేసి, రెండు పగళ్లు ఒక రాత్రిగాని ఒక్క పగలు రాత్రిగాని విశ్రాంతి తీసుకొని, పిదప శుక్లపక్షమున వేదములు, కృష్ణ పక్షమున వేదాంగములు పఠించవలెను. సార్ధపంచమాసాః అనగా ఐదవనెలలో సగముగల నాలుగు నెలలు (అర్ధః పంచమో యేషు) అని వ్యుత్పత్తి. ఇది ప్రారంభము మాత్రమే కాక ధారణకోసము జరుపవలెనని గోభిలు డిట్లు నుడివి యున్నాడు.

"ఉపాకర్మోత్సర్జనంచ వనస్థానా మపీష్యతే,
ధారణాధ్యయనాంగత్వాత్ గృహిణాం బ్రహ్మచారిణాం."

పైన పేర్కొన్న ప్రమాణములనుబట్టి బ్రాహ్మణాదిద్విజులు శ్రావణ పూర్ణమనుండి నూతన యజ్ఞోపవీతములు ధరించి

నాలుగైదు నెలల పాటు నిరంతరము వేదములను ఆవృత్తి వేయుచుండిరనియు, అదిక్రమముగా నేడు లాంఛనప్రాయముగా మిగిలినదనియు స్పష్టము.

ఈ ఉపాకర్మ శ్రావణమాసమునగాని, భాద్రపద మాసమునగాని జరుపవలెనని యుండుటనుబట్టి హస్తానక్షత్రమునకు ప్రాధాన్యమిచ్చిన కొందరు హస్తాసహితమైన భాద్రపద శుద్ధ చతుర్థిని గ్రహించిరి. దీనికి కారణము గణపతి విద్యాధినాథుడు అగుటవలననే. కొందరు విద్యాధి దైవత నక్షత్రము ఉదయించిననాడే అధ్యయన ప్రారంభము కావించుచుండిరి. నేటికిని సామవేదులు ఉపాకర్మమును వినాయకచవితినాడే యాచరించుచున్నారు.

పూర్వము వేదకర్మములను ఆచరించునపుడు తప్ప తక్కిన సమయములలో యజ్ఞోపవీతము నిరంతరము ధరింపబడెడిది కాదు. కనుక వేదాధ్యయన ప్రారంభమునకు దీక్షపూనుటకై నూతన యజ్ఞోపవీతధారణము ఆచారముగా నేర్పడి యుండును. పిదప నీ ఆచారమే కంకణ మాత్ర ధారణముగా పర్యవసించి, ఇతర వర్ణములలో రక్షాబంధన కర్మగా నేర్పడియుండును. రక్షాబంధనము ఈనాడు ఆచరించుటవలన దీనికి రక్షాపూర్ణిమ, రాఖీపూర్ణిమ అను వ్యవహారమును ఏర్పడినది.

ఈ రక్షాపూర్ణిమనుగురించి హేమాద్రి భవిష్యోత్తరమునుండి ఒక గాథను తెలిపినాడు. ధర్మరాజు కృష్ణునితో "ఆ రక్షాబంధన మెట్టిది ? దాని విధానమేమి ? అది ఒక

మూరు కట్టుకొనగానే మానవుడు సంవత్సరమంతయు దుష్ట ప్రేత పిశాచములకును అధృష్యుడు ఎట్లగును? అది సకల రోగములను, అశుభములను ఎట్లు పోగొట్టును?'' అని ప్రశ్నించెను. కృష్ణు డిట్లు వివరించెను.

''ఓ పాండవశార్దూలా! ఆ ప్రాచీనేతిహాసము వినుము. ఇంద్రుని విజయముకోసము ఇంద్రాణి అతనికి రక్ష కట్టినది. పూర్వము ఒకప్పుడు పన్నెండు సంవత్సరములపాటు ఘోరముగా దేవాసుర యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో ఇంద్రుడు పూర్తిగా పరాజితుడై సహచరులతోపాటు స్వర్గమును వదలి ప్రాణత్రాణ పరాయణుడై అమరావతిలో తల దాచుకొనెను. దానవరాజు మూడులోకములు జయించి, తన్నందరును కొలువవలెనని ఆనతిచ్చెను. దానితో సకల కర్మలు నష్టమయ్యెను. దేవపూజ మూలబడియెను. ఉత్సవాలే ఆగిపోయెను. ఇట్లు ధర్మనాశముకాగా, సురపతి బలము తగ్గిపోయెను. అదిచూచి దానవులు అతనిని అమరావతిలోను తరుముకొని వచ్చిరి. అప్పుడు అతడు బృహస్పతివద్దకు వెళ్ళి 'గురూత్తమా! దానవులు ఇక్కడకూడా తరుముకొని వచ్చినారు. ఇక్కడ నిలవలేకున్నాను. వెలుపలికి పరిగెత్తిపోలేను. కానున్నది కాక మానదు. కనుక యుద్ధము చేయదలచినాను. యుద్ధముచేయుచు మరణించుటయే మేలు. అంతవరకే బ్రహ్మవ్రాత అనుకొందును. ఆచార్యా! నాకు జయమగుగాక యనుము. దానవులతో రణమాచరింతును. ఎల్లకాలమూ పొగరాజుచున్నట్లు ఉండుటకన్నను, ఒక్కక్షణ



విజయదశమి (బొమ్మల కొలువు)

కాలము వెలుగుట మేలు. దేవైశ్వర్యము కర్మాధీనమైనది; పౌరుషమే కర్మ. కనుక నేను ఆ కర్మాచరణకు పూనుకొందును. శ్రేయస్సు తప్పక కలుగగలదు' అని విన్నవించినాడు. ఆ మాట విని బృహస్పతి ఇట్లనినాడు : 'ఓ పురందర! ఇప్పుడు పరాక్రమమునకు కాలము గాదు. కోపము వదలుము. కాలదేశ వర్తమానములను ఎరుగని పనులు చెడిపోవును. అదియొక యనర్థము.' ఇంద్రుడది విని 'బ్రహ్మన్! మాట లెక్కువగా ఎందుకు ? నేను తప్పక యుద్ధము చేయుదును.' అనెను.

''వారిద్దరిట్లు సంభాషించుకొనుచుండగా, శచీదేవి యింద్రునితో నిట్లనెను. 'నేటి ఉదయము పర్వదినము. నేను మీకు రక్షకట్టుదును. దానివలన మీకు జయము కలుగును.' ఆ మాటకు ఇంద్రుడు అంగీకరించెను. పిదప పౌలోమి పౌర్ణమాసి ఉదయము మంగళకార్యములు జరిపి ఇంద్రుని కుడిచేతి మణికట్టుకు రక్షాపోటలికను (రక్షపొట్లము) కట్టెను. ఇంద్రుడు ఆ రక్షను కట్టుకొని, బ్రాహ్మణులు స్వస్తివాచనము పలుకుచుండగా ఐరావతమునెక్కి, దానవుల సైన్య శిబిరముకడకు వచ్చి తనపేరు ప్రకటించి, శత్రువులపై బాణవర్షము కురిపించెను. అకస్మాత్తుగా ముట్టడించిన యింద్రుని చూచి, రాక్షసులు హర్షించి ఎదురుదాడి జరిపిరి. ఇంద్రుడు తన వజ్రాయుధమును వారిపై విసిరెను. దానితో దానవులందరును భయపడి, యముడే పైనపడెనని పలాయితులై కొందరు సముద్రమును, కొందరు గుహలను, కొందరు అడవు

లను చొచ్చిరి. పిదప శక్రుడు స్వర్గమున ప్రవేశించి యథా పూర్వముగా త్రైలోక్య రాజ్యమును పాలింపసాగెను.

"ఇంద్ర పరాజితులైన దానవులు దుఃఖముతో తమ గురువగు శుక్రాచార్యునికడకు వెళ్ళి తమ పాటవిధని దూషించిరి. శుక్రాచార్యుడు వారి నూరడించి, 'ఇప్పుడు శక్రునితో మనకు సంధి పొసగదు. శచీదేవి అతనిని అజేయునుగా చేసినది. రక్షాబంధన ప్రభావము వల్లనే శక్రుడు దానవేంద్రుని జయించెను. ఒక్క సంవత్సరము ఓపిక పట్టుడు; శ్రేయస్సు లభించగలదు.' అని ఆశీర్వదించెను. దానవులు తమ ఆచార్యుని మాటలు విని నిశ్చింతులై కాలమును పరీక్షించుచు నుండిరి. ధర్మరాజా! రక్షాబంధ ప్రభావ మిది. నీకు తెలియ జేసితిని."

యుధిష్ఠిరుడు ఆ మాటలు విని "అయిన, ఈ రక్షా బంధము ఏ తిథినాడు, ఎప్పుడు చేయవలెను. తెలుపుము." అని మరల నడిగెను. "ధర్మరాజా! ఆకాశము మేఘావృతమై యుండగా, భూమి శాద్వలావృతమై యుండగా, శ్రావణ మాసమున పూర్ణిమనాడు ఉదయమున శ్రుతి స్మృతి హిత ముగా స్నాన మాచరించి, దేవ పితృ కార్యములను, ఉపా కర్మను, ఋషి తర్పణమును నిర్వహించి, అపరాహ్ణమున రక్షాపోటలిని (పొట్లమును) అక్షతలు ఆవాలు మున్నగు వానితో సిద్ధపరచవలెను. ఈ రక్షాద్రవ్యపోటలిని పట్టువస్త్ర ములతోగాని, ఇతర వస్త్రములతోగాని సిద్ధపరచవచ్చును. పిదప గృహ మధ్యప్రదేశమును అలికి అలంకరించి పీఠముపై

రక్షను పెట్టి, పూజించి, పురోహితునితో కట్టించుకొనవలెను. "ఓ రక్షాబంధనమా, మహాబలవంతుడగు దానవేంద్రుని నీవు కట్టివేసితివి. కనుక నేను నిన్ను కట్టుకొనుచున్నాను.'

యేన బద్ధో బలీ రాజా దానవేంద్రో మహాబలః,
తేన త్వా మభిబధ్నామి రక్షే మాచల మాచల."

అని కట్టుకొనవలెను. దీనిని అన్ని వర్ణములవారును కట్టుకొనవచ్చును. ఇట్లు రక్షాబంధము కట్టుకొనువారు సంవత్సరము వరకును సుఖముగా నుందురు."

ఈ రాఖీకట్టు నాచారము మొగలాయిరాజుల కాలమున స్త్రీల రక్షణకోసము రాజపుత్రులు చేసిన ఏర్పాటని కొందరు తెలిపిరి. "చిత్తూరు మహారాణియగు కర్ణావతి తన కోటను గుజరాతు నవాబగు బహదూరుషా ముట్టడింపగా దననురక్షింపుమని ఢిల్లీ చక్రవర్తిగానుండిన హుమాయూను పాదుషాకు రక్షాబంధన మంపి ప్రార్థించెను. అత డా ప్రార్థన మంగీకరించి, ఆమెను సోదరిగా భావించి బహదూర్ షాను దరిమివైచెను. నాటినుండి ఈ యాచారము మన దేశమున బహుప్రాంతముల ప్రబలెను." అని శ్రీ ప్రతాపరెడ్డిగారు వ్రాసిరి. కాని, ఈ రక్షాబంధనవ్రతమును రుద్రమదేవి సమకాలికుడైన యాదవరాజు మహాదేవుని ఆస్థానమున సమస్త కరణాధీశ్వరుడగు హేమాద్రి పండితుడు వ్రతఖండమున పేర్కొనుట వలన హుమాయూనుకు ముందునుండియే యున్నదనుట స్పష్టము. అంతియేకాక యమద్వితీయయందు భ్రాతృపూజచేయు నాచారము గలదు. (దీనిని దీపావళిలో

చూడుము.) హేమాద్రి చెప్పుటవలననే కాబోలు తర్వాతి ప్రతగ్రంథకారులును దీనిని పేర్కొనినారు.

"ఇదం రక్షాబంధనం నియత కాలత్వాత్ భద్రావర్జ్య గ్రహణాదినేపి కార్యం హోలికావత్."—హోలిపండుగవలెనే దీనిని నిషేధములేవియులేక చేయదగును—అని నిర్ణయసింధు కారు డన్నాడు.

ధర్మసింధుకారుడును "అథ రక్షాబంధన మస్యామేవ. పూర్ణిమాయాం భద్రారహితాయాం త్రిముహూర్తాధికోదయ వ్యాపిన్యాం అపరాహ్ణే ప్రదోషేవా కార్యమ్." అని విధించినాడు.

ఈ ధర్మశాస్త్రవచనములనుబట్టి అతి ప్రాచీనకాలము నుండియే ఈ ఆచారము గలదె ననవచ్చును. కాని, భవిష్యోత్తరగాథవలన ఇది విజయకారకమని మాత్రమే విదిత మగుచున్నది; చెల్లెలి ప్రసక్తి లేదు. భాతృద్వితీయనాడు సోదరి సోదరుని పూజించుట యుండనే యున్నది. విజయము కోరి రక్షాబంధన మొనర్చుకొనుట, క్రమముగా ఇతరులు, అందును భార్య మున్నగు స్త్రీలు పురుషులకు కట్టు నాచారముగా మారి, అనంతరము భాతృద్వితీయవలెనే భాతృపూజనముగా పర్యవసితమయియుండును. పిదప రాజపుత్రవనితల ద్వారా బహుళ ప్రచారమందిన దనవచ్చును.

మహారాష్ట్ర కర్నాటక ప్రాంతములలో సముద్రతీరవాసులు శ్రావణపూర్ణిమ పండుగను విశేషముగ జరుపుదురు. సముద్రమును పూజించి నారికేళములను సమర్పింతురు.

అందువలన ఆ ప్రాంతములలో దీనికి నారికేళపూర్ణిమ-నార్లీ పూర్ణిమ యని వ్యవహారమేర్పడెను.

పాల్కురికి సోమన దీనిని పండితారాధ్యచరిత్రలో 'నూలిపున్నమ' యనెను. నూలి పున్నమ యనగా "జందేల పున్నమ." నూల్ – అనగా యజ్ఞోపవీతము. ('పూనూల్' తమిళమున జన్నిదము.) మలహణునికథలో ఇది ప్రయోగింప బడినది. అతనిని వేశ్యమాత దెప్పినప్పటి సందర్భమిది.

"వీరభద్రునియాత్ర వెలదులు పోవ
హారముల్ రోయిడి యరిగె మాబిడ్డ
యంగుళీయక మమ్మి యా శివరాత్రి
జంగమారాధనం బంగన సేసె
ఇంతులు మెచ్చ వసంతోత్సవంబు
గాంత సేసెను హస్త కటకంబు లమ్మి
తరళాక్షి ముందటి దవనపున్నమను
సరిపిణి రోయిడి గురుకట్నమిచ్చె
నూలి పున్నమనాడు నూపురం బమ్మి
బాలభక్తుల కొప్ప బండువుసేసి
పదకంపు రోయిడి పడతి దివ్వెలకు
మదనారికిని దీపమాలిక నెత్తె.
ఇదె వచ్చె బులివలె నీ శివరాత్రి
ముదిత రోయిడబుచ్చె ముత్తెంపు సరుల
నెన్నడు వెట్టంగ నున్నాడ విట్లు
సన్నయేనాటను సతివెట్ట గలదె ?" (పండిత – ३–60)

ఈ ద్విపదలలోని నూలిపున్నమ, దివ్వెలలను పరిశీలింపుడు.

# 13. మహాలయ పక్షము

భాద్రపదమాస కృష్ణపక్షమును మహాలయ పక్ష మందురు. ఈపక్షమున పితృదేవతలకు తర్పణ శ్రాద్ధ కర్మ లాచరించుటవలన దీనిని పితృపక్షమనియు నందురు. ఈ పక్షమున అన్నివర్గములవారును తమపెద్దలు మరణించిన తిథిని బట్టి ఆయాతిథులలో తర్పణశ్రాద్ధ కర్మలు ఒనర్తురు. మంత్రపూర్వకముగ గొందరును, అమంత్రకముగ నితరులును జరుపుదురు.

మహాలయ మనగా గొప్పవినాశము లేక మరణము. మహాన్ ఆత్యంతికో లయోయత్ర=మహాలయః అని వ్యుత్పత్తి. ఉత్తరాయణము దేవతలకాలము గనుక ఉత్తమకాలమనియు, దక్షిణాయనము పితృకాలము గనుక అశుభకాలమనియు మన పూర్వుల విశ్వాసము. అంతేకాక ఆషాఢమునుండియే-కటక సంక్రమణమునుండియే - ప్రారంభమగు దక్షిణాయనము వానలు బురదలతో, చిమ్మచీకటితో భయంకరముగను, అశుభముగను తోచుటలో ఆశ్చర్యములేదు. అందుచేతను భాద్రపదమాసమున అంతటను జలమయముగా కనిపించుచుండగా, మహావినాశ మనుకొనుటలో - మహాలయము ప్రాప్తించినదనుకొనుటలో ఆశ్చర్యము అంతకన్నను లేదు. కనుక ఈ పక్షమున అందరకును శ్రాద్ధతర్పణములు చేయవలయుననియు, వారిని సంతృప్తిపరచిన, తమకు ప్రళయము గడచుననియు భావించియుందురు. అందువలన వృద్ధమనువు చెప్పినట్లు

"ఆషాఢీ మవధిం కృత్వా పంచమం పక్ష మాశ్రితాః,
కాంక్షంతి పితరః క్లిష్టాః అన్న మ ప్యన్వహం జలం."

ఆషాఢమాసము రెండవపక్షము మొదలు ఐదవపక్షము వరకు పితరులు చాల కష్టపడుచు అన్నోదకాలు కాంక్షింతు రనియు, కనుక మహాలయపక్షమున ప్రతిదినమును శ్రాద్ధము జరుపవలెననియు ననిరి.

"కన్యాగతే సవితరి యా న్యహాని చ షోడశ,
క్రతుభి స్తాని తుల్యాని దేవో నారాయణో హరిః."

అని హేమాద్రి అనెను. సూర్యుడు కన్యారాశిగతుడై నప్పుడు పదునారుదినములును – భాద్రపద పూర్ణిమ మొదలు ఆశ్వయుజ ప్రథమవరకును – యజ్ఞదినముల వంటివి. కనుక అతిపవిత్రము లయినవి. దీనికి అధిదేవత నారాయణుడు అని దీనిభావము. ఈమహాలయపక్షము 'దినేదినే గయాతుల్యము' గనుక ప్రతిదినమును గాని, ఒకనాడు గాని శ్రాద్ధము చేయ వలెను. అట్లుచేసినవారి పితరులు సంవత్సరము వరకును సంతృప్తు లగుదురని స్కాందపురాణము నాగరఖండమున గలదు.

"ఆషాఢ్యాః పంచమే పక్షే కన్యాసంస్థే దివాకరే,
యో వై శ్రాద్ధం నరః కుర్యా దేకస్మి న్నపి వాసరే.
తస్య సంవత్సరం యావత్ సంతృప్తాః పితరో ధ్రువమ్."

కన్యా తులారాసులలో సూర్యు డున్నప్పుడును వృశ్చికరాశి వచ్చువరకును ప్రేతపురి శూన్యముగానుండునని,

అందరును అన్నముకోరుచు తమ ఇండ్లచుట్టును తిరుగుదురని, భారతమున గలదు.

"యావచ్ఛ కన్యా తులయోః క్రమా దాస్తే దివాకరః,
శూన్యం ప్రేతపురం తావ ద్వృశ్చికం యావ దాగతః."

వృశ్చికమాసము వెళ్లినతర్వాత దేవతలతోసహా నిట్టూర్చి శాప మిచ్చి వెళ్లిపోవుదురట.

"వృశ్చికే సమతిక్రాంతే పితరా దేవ తైస్సహా,
నిశ్శ్వస్య ప్రతిగచ్ఛంతి శాపం దత్వా సుదారుణం."

అని బ్రాహ్మవచనము. ఈ దినములలో శ్రాద్ధకర్మ చేయుపద్ధతియు ప్రత్యేకముగా చెప్పబడినది. పంచమినుండి కాని, అష్టమి మొదలుకొనికాని, దశమి మొదలుకొనిగాని శ్రాద్ధకర్మ చేయవలెను. అందునను మఘాయుక్త త్రయోదశి శ్రేష్ఠతమ అని నాగరఖండమున గలదు.

"ఉత్తరా దయనా ద్రాజన్ శ్రేష్ఠం స్యా ద్దక్షిణాయనమ్,
యామ్యాయనా చ్చతుర్మాసం తత్ర సుప్తేతు కేశవే.
ప్రోష్ఠపద్యాః పరః పక్షః తత్రాపిచ విశేషతః,
పంచమ్యార్ధ్వం చ తత్రాపి దశమ్యార్ధ్వం తతోఽస్యతి,
మఘాయుక్తా తు తత్రాపి శ్రేష్ఠారాజన్ త్రయోదశీ."

ఈత్రయోదశిని నిత్యముగా శ్రాద్ధకర్మ కార్యమని ఈ నాడు మధువు, మాంసము కూరగాయలు, పాలు, పాయసము మున్నగువానితో తమను సంతృప్తిపరతురని పితృదేవతలు కాచుకొని యుందురని అని వశిష్ఠుడు తెలిపినాడు.

"మధుమాంసైశ్చ శాకైశ్చ పయసా పాయసేన చ,
ఏష నో దాస్యతి శ్రాద్ధం వర్షాసుచ మఘాసుచ."

మనుస్మృతిలోను ఈ త్రయోదశీశ్రాద్ధము విశేషముగా పేర్కొనబడినది :

"యత్కించి న్మధునా మిశ్రం ప్రదద్యాత్తు త్రయోదశీం,
తద ప్యక్షయ మేవ స్యా ద్వర్షాసు చ మఘాసుచ."

తేనెను ప్రత్యేకముగా పేర్కొనుట విశేషము. కాని మాంసాహారమును బ్రాహ్మణులు వేలసంవత్సరముల క్రిందటనే వదలుకొనిరి గనుక ఇప్పటి శ్రాద్ధములలో మాంసము ప్రసక్తియే లేదు. అమావాస్య - హస్తానక్షత్రయుక్తమగు మహాలయఅమావాస్య-అనగా చంద్రసూర్యులిద్దరును హస్తా నక్షత్రముననున్న అమావాస్య - గజచ్ఛాయ యనబడును. ఈనాడు చేసిన శ్రాద్ధము విశిష్ట మనిరి. హేమాద్రి యిట్లను చున్నాడు:

"హంసే కరస్థితే యాతు అమావాస్యా కరాన్వితా,
సా జ్ఞేయా కుంజరచ్ఛాయా ఇతి బోధాయనో బ్రవీత్."

గజచ్ఛాయ యనగా

"వనస్పతిగతే సోమే ఛాయా యా ప్రాఙ్ముఖీ భవేత్,
గజచ్ఛాయాతు సాప్రోక్తా తస్యాంశ్రాద్ధంప్రకల్పయేత్."

ఈ గజవీథినిగురించి వినాయకచవితిలో కొంత తెలిపితిని. కొన్ని నక్షత్రములున్న మండలమును గజవీథి యందురు.

అట్టి నక్షత్రములతో గూడిన చంద్రసూర్యులచ్ఛాయను గజచ్ఛాయ యనిరి. ఈ గజచ్ఛాయ సంవత్సరమున కొక మారు అదియును భాద్రపదమున, త్రయోదశినుండి అమావాస్యవరకు సంభవించును గనుక, చీకటిలో చిమ్మచీకటికి ఉపలక్షణముగా భావించబడియుండును.

ఈ శ్రాద్ధమును భాద్రపదశుద్ధ పౌర్ణమాసినాడును జరుపవలెనని ధర్మశాస్త్రగ్రంథములు తెలుపుచున్నవి. ఈనాడు వసు రుద్రాదిత్యస్వరూపులగు పితరులకు శ్రాద్ధ మొనర్పవలెనని చెప్పిరి. ఈనాడు నాందీముఖులగు పితరులకు మాత్రమే చేయవలెనని బ్రహ్మాండ, మార్కండేయ పురాణములలో గలదు.

"నాందీముఖానాం ప్రత్యబ్దం కన్యారాశి గతే రవౌ,
పౌర్ణమాస్యాం తు కర్తవ్యం వరాహవచనం యథా."

నాందీముఖులన నెవరు - అను ప్రశ్న యుదయించును.

'పితా పితామహ శ్చైవ తథైవ ప్రపితామహః,
త్రయో హ్యశ్రుముఖా హ్యేతే పితరః పరికీర్తితాః.
తేభ్యః పూర్వతరా యేచ ప్రజావంత స్సుఖైధితాః.
తే తు నాందీముఖాః నాందీ సమృద్ధి రితి కథ్యతే."

పిత, పితామహుడు, ప్రపితామహుడు - వీరుముగ్గురు సదా అశ్రుముఖులు - పితరు లనబడుదురు. వారికి పూర్వులు నాందీముఖు లనబడుదురు. నాందియనగా సమృద్ధియని బ్రాహ్మవచనము. ఈ పూర్ణిమనాడు తప్ప మరియొక పూర్ణిమ

నాడు పిండప్రదానము నిషిద్ధమనియును ధర్మశాస్త్రజ్ఞులు తెలిపిరి. గార్గ్య డిట్లు తెలిపెను.

"పౌర్ణమాసీషు సర్వాసు నిషిద్ధం పిండపాతనమ్,
వర్జయిత్వా ప్రౌష్ఠపదీం యథాదర్శః తథైవ సా."

ఈ భాద్రపద పౌర్ణమి అమావాస్యవంటిదట. ఈ ఆచారమును నేడు తక్కినవర్ణములవారు జరుపుచున్నారు. దీనిని మహాలయ పూర్ణిమ అనిరి. మహాలయ పూర్ణిమయే 'మాలపున్నమ' అయినది. ఈ మాలపున్నమను గురించిన కథ యొకటి వ్యాప్తిలో నున్నది. దానిని శ్రీ ప్రతాపరెడ్డిగారు గ్రంథస్థము చేసిరి. దానిని సంగ్రహముగా దెలుపుచున్నాను.

జోకరయ్యయను తెలగయువకుడు ఒక మాలపిల్లను మరిగి దానియింట ప్రతిదినమును మద్యమాంసములు మెక్కుచు కాలము గడపుచుండెనట. జోకరయ్య ఒకనాడు మాంసము దినుచు తన్ను కనుగొనుట కెవరో వచ్చుచున్నారను భయమున ఎముకను మ్రింగబోయి, అది గొంతులో గ్రుచ్చుకొనగా మరణించెను. అతని శవమును అతనిబంధువులు కులముచెడినవాడని కోపముతో ఒక నీళ్లెండిన గుంటలో పారవేసిరట. జోకరయ్య స్వర్గమునకు బోయెను. అక్కడ అంతకుముందే వినాయకుడు వేంచేసియుండెను. మర్త్యలోక విశేషములేమి యని ఇంద్రు డతని నడిగెను. వినాయకుడు తన పొట్ట తడవుకొనుచు వర్షములు పంటలు సమృద్ధిగ నున్నవని యనెనట. దానితో ఇంద్రుడు వర్షము బిగియబట్టెను. ప్రజలందరును భయపడిరి. ఇంతలో

జోకరయ్యా స్వర్గమునకు బోయెను. ఇంద్రుడు వినాయకుని అడిగినట్లే అతనిని అడిగెను. జోకరయ్యా భూలోకమున వానలు లేవనియు, ప్రజలు తిండిలేక మలమల మాడుచున్నారనియు, తనను నోటిలో ఎముక కుక్కి—చంపి ఎండినగుంటలో పారవేసిరనియు చెప్పెనట. ఇంద్రునికి దయకలిగి, బిగియబట్టిన వర్షములను మరల వదలెను. లోకమున వర్షములు కురిసెను. ఇట్లుపకారము చేసినందున జోకరయ్యాను కొన్ని తెగలవారు పూజింతురు. జోకరయ్యా మాలపిల్లను ప్రేమించి మాలవాడైనందున ఈ పౌర్ణమికి 'మాలపున్నమ' యని పేరు వచ్చెను.

"పౌరాణికులొకటి కల్పించిన ప్రజలు పది కల్పింతురు. ఈకథకు మూలము కేవలము పుక్కిటి పురాణమే. ఇది కల్పితము, అబద్ధము." అని శ్రీ ప్రతాపరెడ్డిగారీ కథను ఖండించిరి. కాని, ఇది శక్రపూజకు సంబంధించిన కథయని నా యనుమానము. శక్రఅనుపదమే శకరయ్యా, జకరయ్యా, జోకరయ్యా యని యపభ్రంశమయిన దనుకొందును. భాద్రపద మాసమున వర్షములు కురిసిన పిదప ఇంద్రునియెడ కృతజ్ఞత చూపుటకే భాద్రపద పూర్ణిమనాడు ఈ పండుగ చేయుచుండిరని తోచుచున్నది. భాద్రపదమాసమున కొన్ని శక్రోత్సవములను ధర్మశాస్త్రకారులు చెప్పుటవలన జోకరయ్యా కథ శక్రోత్సవ సంబంధియనియే నిర్ణయించవచ్చును. హేమాద్రి భాద్రపదపూర్ణిమనాడు వరుణవ్రతము చెప్పినాడు. ఇది విష్ణుధర్మమున గలదు.

"ప్రోష్ఠపదా_త్త ధారణ్యా సంపూర్ణే శశిలక్షణే,
సంపూజ్య వరుణం దేవం గంధమాల్యాన్నసంపదా."

మార్కండేయపురాణమున ఆశ్వయుజపూర్ణిమయందు శక్రవ్రతముచేయవలెనని కలదు. విష్ణుధర్మోత్తరమునను నుడువబడినది.

"ఆశ్వయుజ్యాం స పూర్వాంతు పౌర్ణమాస్యాం నరో భువి,
సోపవాసః సురేంద్రం చ దేవం సంపూజయే _త్తతః."

భాద్రపదశుక్ల ద్వాదశియందు శక్రధ్వజోత్థాపనము చేయవలెనని అపరార్కవచనము.

"ద్వాదశ్యాం తు సితే పక్షే మాసి ప్రోష్ఠపదే తథా,
శక్ర ముత్థాపయే ద్రాజా విశ్వశ్రవణ వాసవే."

ఈ ప్రమాణములనుబట్టి భాద్రపదమాసము మొదలు ఆశ్వయుజ పౌర్ణమివరకును–లేక పౌర్ణమితో ముగియు నెలయయిన భాద్రపద పూర్ణిమ మొదలు ఆశ్వయుజ పూర్ణిమవరకును శక్రపూజ వాడుకలో నుండియుండునని, దాని అపభ్రంశ రూపమే జోకరయ్య పూజయని, ఏరువాక పున్నమవలె నిది కృషి ప్రధానమగు కొన్ని తెగలలో మాత్రమే మిగిలియున్న దని నా అభిప్రాయము.

ఈ శక్రోత్సవము అతిప్రాచీనకాలమునుండి యున్న దని స్పష్టమగుచున్నది. ఋగ్వేదమునను ఇంద్రధ్వజోత్సవము ఉల్లేఖింపబడిసదని బార్నెట్ మున్నగు పాశ్చాత్య పండితులు తెలుపుచున్నారు. కాని, నాయనాచార్యులు

మున్నగు వ్యాఖ్యాతలు ఈ విషయమును తెలుపలేదు. అయితే, జైన గ్రంథములలో ఇంద్రధ్వజోత్సవము పెక్కు-చోట్ల ఉదాహరింపబడినది. 'భగవతీసూత్ర' మను గ్రంథమున "ఇందలట్ఠి" ఉత్సవము ప్రస్తావించబడినది. చేదిరాజగు వసువు దీనిని ప్రారంభించినట్లు మహాభారతమున గలదు.

"ఇంద్రమాలేతి విఖ్యాతం ధన్య మప్రతిమం మహత్,
యష్టించ వైష్ణవీం తస్మై దదౌ వృత్రనిషూదనః.
ఇష్ట ప్రదాన ముద్దిశ్య శిష్టానాం ప్రతిపాలనీం,
తస్యాః శక్రస్య పూజార్థం భూమౌ భూమిపతి స్తదా.
ప్రవేశం కారయామాస గతే సంవత్సరే తదా,
తతః ప్రభృతి చాద్యాపి యష్ట్యేః క్షితిపస త్తమైః,
ప్రవేశః క్రియతే రాజన్ యథా తేన ప్రవర్తితః."

(ఆది, 63.)

చేదిరాజగు వసువుకు ఇంద్రుడు ఇంద్రమాల అను గడను ఇచ్చెను. దాని పూజను, ఇంద్రపూజను ఆరాజు మరుసటి సంవత్సరమునుండి ప్రవేశపెట్టెను. అప్పటినుండి ఇప్పటివరకును ఆ ఇంద్రధ్వజ మనుగడను రాజులు చేదిరాజు స్థాపించిన దినముననే స్థాపించుచున్నారు.—అని దీని భావము.

భవిష్యపురాణమున ఈ ఇంద్రధ్వజ వర్ణనము విస్తృతముగానున్నది. మద్ది, బూరుగు, కడిమి మొదలగు చెట్ల కర్రలతో చేసిన ఈ శక్రధ్వజమును పూజాపురస్కారములతో పాటు ప్రతిష్ఠించవలెనని, ఈ ధ్వజము 20, 22 హస్తముల ప్రమాణమున నుండవలెనని వివరించబడినది. ఈ ప్రతిష్ఠ

భాద్రపద కృష్ణపక్ష ద్వాదశినాడట. ఈ విషయమున మాత్రమే భవిష్యపురాణోక్తి విష్ణు ధర్మోత్తర, అపరార్క వచనములతో భేదించుచున్నది. రామాయణమున ఈ ఇంద్ర ధ్వజ స్థాపన ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమనాడు జరుపవలెనని యున్నది. హరివంశమున ఈ ఉత్సవము శరత్కాలమున జరుపవలెననియు, ఇంద్రోపేంద్రుల నిద్దరిని పూజింపవలె ననియు నున్నది. ఇంద్రోత్సవమునందే స్వర్గమున తొలిసారి నాటకము ప్రదర్శితమయినట్లు భరత నాట్యశాస్త్రమున నున్నది.

ఇంద్రధ్వజోత్సవము విదేశములయందును మరియొక తీరున ఆచరించబడుచుండుటవలన దీని ప్రాచీనత్వము, కృషి ప్రధానత్వము మరియు ధ్రువమైనవి. ఇది నేటి 'మే పోల్' అను ఉత్సవముగా మారిపోయినదని పరిశోధకులు అను చున్నారు. మేపోల్ పూజనము స్త్రీల వంధ్యాత్వదోషమును తొలగించుననియు, పశువులకు పాడి హెచ్చించుననియు యూరోప్‌లోని కొన్ని దేశములలో విశ్వాస ముండెను. జర్మనీ దేశమున మే 1 వ తేదీన అశ్వశాలలలోను, గోశాలలలోను విడివిడిగా ఈ స్తంభము నాటుట యుండెడిది. కర్షకులలో ఈ విశ్వాస మున్నందువలననే ఐర్లెండులోను మే నెల ప్రారంభ మున ఇంటి ముందొక పచ్చికొమ్మ వ్రేలాడగట్టెడువారు. ఇంగ్లండు ఉత్తరభాగమున మే నెల 1 వ తేదీ రాత్రి యువతీ యువకులు వాద్యములు వాయించుచు, శృంగనాదములు చేయుచు, జయ జయారవములు చేయుచు, అడవులకు వెళ్ళి,

చెట్లకొమ్మలు నరికి, వాటిని పూలదండలతో అలంకరించి, తెల్లవారగనే తిరిగివచ్చి, ఇండ్లముందు నాటుచుండిరి. జర్మనీ, ఫ్రాన్సు దేశముల మధ్యనగల ఆల్సెన్‌లో మే 1 వ తేదీన చెట్లకొమ్మలు చేతపట్టుకొని ఊరేగు ఆచార ముండెను. ఈ ఊరేగింపు ముందుగా ముఖమునకు మసిపూసుకొని ఒకవ్యక్తి 'మేపోల్' ను పట్టుకొని నడిచెడివాడు.

ఈ కారణములవలన జోకరయ్య ఉత్సవము శక్రోత్సవమే కాని, మరియొకటి కాదు.

శ్రావణమాసమున కేరళమున నడచు 'ఓణం' పండుగ యును శక్రోత్సవమే యనుకొందును. ఇది వారికి సంవత్సరాది వంటిది. ఈ ఓణం పండుగ భాద్రపదమాసమున శ్రవణ నక్షత్రమునాడు గాని, శ్రావణపూర్ణిమనాడు గాని, కొంచెము తర్వాత గాని వచ్చును. ఓణమనగా శ్రోణ, శ్రవణనక్షత్రము. పశ్చిమ సముద్రతీరమున మిక్కుటముగా వానలు కురియు ప్రాంతము కేరళము. వర్షాకాలమున అచట జలమయమై, జల ప్రళయముగా కానవచ్చును. సంవత్సరములో అత్యధిక కాలముండు ఋతువు వర్షర్తువే. కనుక జలాధిదేవత పండుగగా నిది అచట వ్యాప్తిచెందినది. దానిని సంగ్రహముగ తెలిసికొందము.

కేరళమున ఈ ఓణం ఉత్సవము—దానికి తొమ్మిది దినములు ముందుగా హస్తానక్షత్రమునుండియే అనగా—వినాయక చవితినుండియే ప్రారంభమగును. తర్వాత మూడుదినములును

జరుగును. ఈ ఓణం ఉత్సవము బలిచక్రవర్తి రాజ్యమును గొనియాడుటకు చేయబడుచున్నదని కేరళవాసు లందురు. ఈ బలిచక్రవర్తికి తిరుక్కాకర్రైయనుచోట ఒక సుందరుడైన బాలుడు కనిపించెనట. అతడు ఏడ్చుచుండెను. బలిచక్రవర్తి అతనికి పండ్లు, మిఠాయిలు మున్నగునవి యిచ్చి, సమాధాన పెట్టజూచెనట. కాని ఆబాలుడు కపటి, మాయావి - వానిని ఒప్పుకొనువాడేనా? మూడడుగులు భూమి కోరెనట. రాజు సరి యనగానే ఆబాలుడు విశ్వరూపము దాల్చి, ఒక అడుగుతో మహాబలిరాజ్యమును, రెండవయడుగుతో ఆ రాజ్యముపైని ఆకాశమును ఆక్రమించి మూడవయడుగు పెట్టుటకు ఎడ మేది ?-యని యడిగెనట. రాజు ఆశ్చర్యపడి, విష్ణువే తన కిట్లు ప్రత్యక్షమయ్యెనని నిశ్చయించుకొని తన తల యొగ్గెనట. ఈ కథ జరిగినది ఓణం దినమున.

అయిన, బలిచక్రవర్తివంటి ఉత్తమపాలకుడు పతన మగుట దుఃఖకరమయియుండ, ఉత్సవములు చేయుటయేమి?- అని సందేహము కలుగవచ్చును. తాను పాతాళలోకమునకు పోవు దినమున ఉత్సవములు జరుపవలెనని బలిచక్రవర్తి కోరె నట. అట్లేయని విష్ణువు వరమిచ్చెనట. అంతేకాక, మహాబలి తన ప్రజలందరును సుఖముగా నున్నారా? లేదా యని యరయుటకు మరల భూలోకమునకు వచ్చుననియు కేరళీ యుల విశ్వాసము. అతడెప్పటికైన తిరిగివచ్చిన సంతోషపడు గాక యని ఈ ఉత్సవము జరుపుచున్నారనియును వీ రందురు.

ఓణంపండుగ సమీపించగానే కేరళీయులు తమ ఇండ్లను తోరణాదులతో అలంకరింతురు. బంకమంటితో విష్ణు విగ్రహమునుచేసి పూజింతురు. ఉత్సవము పదిదినములు జరుగును. మొదటినాడు బియ్యమును నేంద్రంగాయి (పెద్ద అరటికాయ) ముక్కలతో కలిపి వండి ఆరగింపు పెడుదురు. ఉత్సవములలో విష్ణు భజనలతో గొబ్బితట్టుటయును గలదు. దీనిని తప్పట్టికళి యందురు. అనగా తప్పట్లఆట. ఓణం పండుగనాడు నేంద్రంగాయి (పెద్ద అరటికాయ) కూర అత్యావశ్యకము. ఆనాడు పరస్పరము నూతన వస్త్రాది బహుమతులు చేసికొందురు. పూజలు, విందు అయినపిదప ఆ సాయంకాలమున యువకులందరును ఒకచోట చేరి కృతకయుద్ధము చేయుదురు. దీనిని పడక్కళి, లేక కయ్యక్కళి యందురు. అనగా కయ్యపుఆట యని యర్థము. ఇది పండుగకు 10 దినములనుండి, తర్వాత మూన్నాళ్లవరకు జరుగును. ఇది ఆటయే యయినను యువకులు తమ భుజబలమును, సాముగరిడీల శక్తిని ప్రదర్శించు స్పర్ధతో నుందురు గనుక ప్రమాదములును సంభవించుచుండును. ఓణం తర్వాత మూడవనాడు గెలుపోటములు నిర్ణయింతురు. దీనిలో గెలుచుట గొప్ప గౌరవముగా భావించబడును. ఆనాటి సాయంకాలమున విష్ణు విగ్రహమును పల్లకిలో ఊరేగించుకొని వెళ్లి నదిలోనో, తటాకముననో విసర్జింతురు.

ఈ ఉత్సవము హస్తనక్షత్రమునుండి – అనగా వినాయక చతుర్థి నుండి పదమూడుదినములు – శ్రవణద్వాదశి తర్వాత పౌర్ణమి వరకును జరుగుట చూడగా, శ్రవణద్వాదశినాడే వామనజయంతియును వచ్చుటయు, శక్రపూజలో ఇంద్రోపేంద్రులను పూజించవలెనని వ్రతగ్రంథములు సూచించుటయును చూడగా, ఓణం పండుగయు ఇంద్రోత్సవమనుట తప్పుకాదు.

---

# 14. నవరాత్రోత్సవము

నవరాత్రి మనగా తొమ్మిది రాత్రులు. తొమ్మిది రాత్రులు జరుగు పూజలను నవరాత్ర మందురు. ఈ నవరాత్రము నాల్గు విధములుగా జరుపబడుచున్నది. చైత్రశుద్ధ పాడ్యమినుండి రామనవరాత్రము, దేవీనవరాత్రము, వినాయకచవితినుండి గణపతి నవరాత్రము, ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినుండి నవమివరకు దేవీనవరాత్రము. చైత్ర శుద్ధ మున జరుగు నవరాత్రమునను, ఆశ్వయుజ శుద్ధమున జరుగు నవరాత్రమునను, దేవీపూజలు గావింపబడును గనుక దీనిని దేవీనవరాత్రము లందురు. పదవనాట విజయదశమి.

"తత్ర చైత్రశుక్ల ప్రతిపది వత్సరారంభః...అస్యామేవ ప్రతిపది దేవీ నవరాత్రారంభః...పారణాది విశేష నిర్ణయః శారదా నవరాత్రవ ద్బోధ్యః." చైత్రశుక్ల పాడ్యమి నుండి దేవీనవరాత్రారంభము. పారణాది విశేషముల నిర్ణయము శారదానవరాత్రులవలెనే తెలియునది – అని నిర్ణయసింధుకారుడు తెలిపినాడు. అయినను పలు ఉప పురాణములలోను, వ్రతగ్రంథములలోను శరన్నవరాత్రము లకే ప్రాధాన్య మీాబడినది.

"ఆశ్వినే శుక్లపక్షే తు కర్తవ్యం నవరాత్రకం,
ప్రతిపదాదిక్రమేణైవ యావద్ధి నవమీ భవేత్."

ఆశ్వయుజశుద్ధ పాడ్యమి మొదలు నవమివరకును నవరాత్రో త్సవము జరుపవలెను - అని ధౌమ్యవచనము.

"ఆశ్వినే మాసి సంప్రాప్తే శుక్లపక్షే విధే స్తిథిం,
ప్రారభ్య నవరాత్రం స్యా ద్దుర్గాపూజ్యా తు తత్ర వై."

ఈ నవరాత్రమున దుర్గను పూజించవలెనని రుద్రయామళమున నుడువబడినది. దేవీపురాణమునను ఈ విధముననే నుడువబడినది. ఈ కారణమున నవరాత్రమనిన శరత్కాలాదిని వచ్చు దేవీనవరాత్రమునకే రూఢమైనది.

ఈ నవరాత్రవ్రతమును తొమ్మిది దినములపాటు చేసుకోలేనివారు మూడురాత్రులు, ఐదురాత్రులు, ఏడు రాత్రులు, ఒకరాత్రియును ఆచరింపవచ్చును. భవిష్యపురాణమున నిట్లున్నది: "త్రిరాత్రం వాపి కర్తవ్యం సప్తమ్యాది యథాక్రమం." మూడు రాత్రులనిన సప్తమినుండి, పంచరాత్రమనిన పంచమినుండి, ఏడు రాత్రులనిన తృతీయనుండి, ఏకరాత్రమనిన అష్టమినాడుగాని, నవమినాడుగాని జరుపవలెనని ధౌమ్యుడనినాడు.

ఈ దేవీపూజ తొమ్మిది రాత్రులు జరుపవలెననుటకును, దేవియుత్పత్తినిగురించియు మార్కండేయపురాణములోని దేవీమాహాత్మ్య వర్ణనమున నిట్లు గలదు:

పూర్వము సురథుడను రాజుండెను. అతడు ఒకమారు యుద్ధమున శత్రురాజులతో నోడింపబడి అడవులకు పారిపోయెను. అచ్చట మేధయను ఒక ముని యాశ్రమమునకు

వెళ్లి తన మంత్రి విశ్వాసఘాతుకతవలన తనకు ఓటమి కలిగె నని తెలుపుకొనెను. మునీశ్వరుడు ఆతనిని ఆదరించి తన పర్ణశాలలో ఆశ్రయ మిచ్చెను. కాని రాజు చాల ఉద్విగ్నుడగుటవలన ఆయాశ్రమమునందే అటునిటు తిరుగుచు, సమాధి యను వైశ్యుని చూచెను. ఇల్లు వాకిలివదలి ఇట ఎందుకున్నావని రాజు వేసినప్రశ్నకు సమాధి తాను మిగుల ధనవంతుడననియు, తన సతీసుతులు మోసముచేసి తనను వెడలగొట్టిరనియు, అంతటి ద్రోహము చేసినను తనకు వారిపై మమకారము పోలేదనియు ననెను. రా జతని మమతకు ఆశ్చర్యపడెను. పిదప వారిద్దరును మునీశ్వరుని కడకు జనిరి. తనకు తీరని అపకారముచేసిన వారియెడను సమాధికిగల ప్రీతికి కారణము వివరింపుడని రాజు మునీశ్వరుని కోరెను. విష్ణుశరీరజయయిన మహామాయయే యిట్లు ప్రజలకు మమకారము కలిగించుచుండునని మునీశ్వరుడు సమాధాన మిచ్చెను. ఆమె అవతారములు పెక్కు గలవనియు, కొన్నిటిని మాత్రము తాను తెలుపగలనని యిట్లు నుడివెను :

"ఒకానొక కాలమందు విష్ణువు చెవిలోని గుబిలి నుండి మధుకైటభులను ఇరువురు రాక్షసులు పుట్టిరి. విష్ణువు యోగనిద్రలోనుండగా, వారు బ్రహ్మాదులకు కంటకులయిరి. వారిని సంహరించుటకు విష్ణువును మేల్కొలుపవలసినదిగా మహామాయను బ్రహ్మ ప్రార్థించెను. ఆమె అట్లే చేసెను. విష్ణువు మేల్కొని ఐదువేలేండ్లు వారితో పోరాడినను వారిని జయించలేకపోయెను. అప్పుడు మహామాయ వారిని మాయామోహితులనుగా

చేసెను. వారు ముగ్గురై బలదర్పములతో మహావిష్ణువు తమతో అంతకాలము పోరాడినందులకు మెచ్చి వరముకోరుమని అతనితో ననిరి. విష్ణువు సరియేయని వారి మరణమును కోరెను. వారు అట్లు వంచితులైరి. ఆ సమయమున భూమి జలమయముగ నుండెను. కనుక నీరు లేనిచోట తమను చంపుమని వారు కోరిరి. విష్ణువు వారిని నడుములవరకు ఎత్తి అంతరాళమున చంపెను. విష్ణువున కట్లు విజయము చేకూర్చిన మహామాయ పదితలలు, పదికాళ్ళు గలది. నల్లని దేహకాంతి గలది. కనుక మహాకాళి యనబడెను. ఇది మాయాదేవి మొదటి యవతారము.

మాయాదేవి రెండవ యవతారమున మహిషాసురమర్దని నా బరగెను. ఒకప్పుడు మహిషముఖుడగు నొక అసురుడు బలదర్పమున దేవతలందరిని జయించెను. దేవరాజగు ఇంద్రుడు స్వర్గమునుండి పారిపోయి బ్రహ్మతో తమ యిడుమలు చెప్పుకొనెను. బ్రహ్మ వారితోపాటు విష్ణువుద్దకును, శివుని యొద్దకును వెళ్ళి మొరయిడెను. వారిరువురు కోపోద్దీపితులుకాగా వారి నోటినుండి మంటలు వెలువడెను. దేవతలందరును మంటలు కక్కిరి. ఈ మంటలనుండి యొక మహాశక్తి యుద్భవించెను. ఆమె సింహవాహనయై ముమ్మారు ప్రయత్నించి మహిషాసురుని సంహరించినది. ఈమెకు మహాలక్ష్మియనియును పేరు గలదు.

మూడవ యవతారమున ఆమెకు మహాసరస్వతియని పేరు. శుంభ నిశుంభలను రాక్షసులు దేవతలను జయించి, హిమాలయములకు వెళ్లి దేవినిగురించి తప మాచరించిరి. ఒక

నాడు పార్వతీదేవి గంగాస్నానముచేయుటకు వచ్చినపుడు, ఆమె దేహమునుండి యొక దివ్యసుందరి ఉద్భవించెను. శుంభు డామెను మోహించి తనను పెండ్లాడవలసినదని సుగ్రీవుడను వానిని ఆమెయొద్దకు రాయబారమంపెను. దానికామె అంగీక రించలేదు. దానికి శుంభుడు కోపించి ధూమ్రలోచనుడను తన సేనానిని, కొంత సైన్యమును పంపి, ఆమెను పట్టితెండని ఆజ్ఞాపించెను. ఆమె ఆ రాక్షససైన్యమును చంపివేసెను. ఆమె వాహనమగు సింహముకూడ పలువురిని హతమార్చెను. పిదప నతడు మరికొంత సైన్యముతో చండముండులను వారిని పంపెను. ఆమె సింహముపై అధిరోహించి యుండుటను వారు చూచి, ఆమెపై బడిరి. ఆమె ముఖము కోపముతో కంది పోయెను. అప్పుడామె ఫాలమునుండి రుండమాలాధరయు, వ్యాఘ్రాజినాంబరయు, దీర్ఘజిహ్వయు, కాలమేఘచ్ఛా యయు, అరుణాక్షియునగు కాళియను దేవత ఉద్భవించెను. ఆమె రాక్షససైన్యమును రూపుమాపవొడగెను. అదిచూచి ఆగ్రహముతో చండముండులు ఆమెను డీకొనిరి. ఆమె చండుని శిరస్సును ఛేదించి, ముండుని శూలముతో నంత మొందించెను. ఆమె వారిద్దరి శిరస్సులను దేవికి కానుకగా నిచ్చెను. ఆమె ఆమెకు చాముండయను బిరుదమిచ్చి ఈ పేరుతో నీవు పూజింపబడుదువని శాసించెను. చండముండు లిరువురు నిట్లు నశింపగా, శుంభ నిశుంభు లిరువురును పెద్ద సైన్యముతో చాముండతో తలపడిరి. వారివెంట రక్తబీజు డను వాడును యుద్ధమునకు వచ్చెను. రక్తబీజుని యొంటి నెత్తు రెన్నిబొట్లు పడునో అందరు రాక్షసులు పుట్టుదురు.

కాళికాదేవి అతని రక్తము క్రిందపడకుండ త్రాగివేయుచు, వానిని సులభముగా చంపివేసెను. రక్తబీజుని మరణముతో శుంభనిశుంభుల బలము సన్నగిల్లెను. దేవి వారిని వధించెను.

నాల్గవ యవతారమున దేవి నందునియింట నందయను పేరున జన్మించెను. కంసు డామెను చంపుటకు పైకి విసరగా, ఆమె తప్పించుకొని యెగిరి, "నీ ప్రాణశత్రువు నందునింట సుఖముగా పెరుగుచున్నాడు" అని చెప్పి యదృశ్య యయ్యెను.

ఐదవ యవతారమున ఆమెకు రక్తదంతియని పేరు. ఒక రాక్షసుని ఆమె చీల్చివేయుటవలన దంతములు రక్తసిక్తములాయెను. ఈ కారణమున ఈ పేరు కలిగెను.

ఆరవ యవతారమున ఆమె శాకంభరియను పేరు దాల్చెను. ఒకప్పుడు ఘోర క్షామ మేర్పడి వంద యేండ్లవరకు ప్రజలను బాధించెను. అప్పుడు ప్రజలకు శాకములు ఫలములు ప్రసాదించుటవలన ఈమెకు శాకంభరియను వ్యవహార మేర్పడెను.

ఏడవ అవతారమున ఆమె దుర్గముడు లేక దుర్గుడనే రాక్షసుని వధించుటచేత దుర్గయనియు, ఎనిమిదవ యవతారమున మాతంగియనియు, తొమ్మిదవ యవతారమున భ్రామరి యనియు పేరుపొందెను. అరుణుడను రాక్షసుని భ్రమరముల (తుమ్మెదల) సాహాయ్యముతో చంపినందున భ్రామరియను పేరు కలిగెను.

ఇట్లు దేవి యవతారముల విస్తృత వర్ణనములును, శిల్పశాస్త్ర గ్రంథములలో రూపలక్షణములును విరివిగా గలవు.

ఈ దేవీపూజ సాత్త్వికి, రాజసి, తామసి యని మూడు విధములు. జపయజ్ఞములు, నిరామిషమగు నైవేద్యము–వీనితో జరుగునది సాత్త్వికపూజ. బలులు, సామిష మైన నైవేద్యము గలది రాజసపూజ. జపయజ్ఞములులేక సురామాంసా ద్యుపహారములుగలది తామసపూజ. ఉత్తర భారతమునందు, ముఖ్యముగ వంగరాష్ట్రమున అజమహిషా దుల బలులతో నీ పూజ రాజసతామస విధానముల జరుప బడును. అయినను క్రమముగా నీ విధానము ప్రచారము నుండి తొలగుచున్నది. సాత్త్విక విధానము ననుసరించియే దేశమంతటను దేవీపూజ జరుగుచున్నది. ఇంకను దేశభేద మునుబట్టి వివిధపద్ధతులు ఏర్పడినవి. సామాన్యపూజన పద్ధతి యిది :

దేవ్యారాధకుడు ఆశ్వయుజశుద్ధ పాడ్యమినాడు తా ననుసరించు విధానమునుబట్టి దీక్షవహించి కలశస్థాప నము కావించి దేవీమూర్తినం దావాహనము చేయును. అది మొదలు నవమినాటి రాత్రివరకు దీక్షతో దేవీపూజనము కావించును. ఆ రాత్రియే దీక్ష పరిసమాప్తమగును. శ్రీచక్ర పూజయు నిందు ప్రధానాంగమగుట ఒక్కొ-క్క-చో గలదు. ఈ తొమ్మిది దినములును కన్యకాపూజగాని, సుమంగలీపూజ గాని జరుగును. హోమాదులతో, విశేషపూజావిధులతో నీ నవరాత్రి పూజావిధానము ముగియును. దశమినాడు ఉద

యము దేవీప్రస్థానము జరుపుదురు. ఇట్టి సంప్రదాయము వేరు వేరు తెగల ననేకములు గలవు. తొమ్మిది రాత్రులును పూజాదులు చేయనివా రనుసరించదగు పద్ధతుల నిదివరకే తెలిపితిని. హేమాద్రి మున్నగు వ్రతకల్పకారులు చెప్పిన దాని సారాంశముగా ధర్మసింధుకారు డిట్లు తెలిపినాడు :

"మూల నక్షత్రమున – సప్తమినాడు సరస్వతీపూజ జరుపవలెను. మూలమున దేవిని ఆవాహనచేసి, పూర్వాషాఢ యందు పూజించి, ఉత్తరయందు బలియిచ్చి, శ్రవణమున విసర్జనము చేయవలెను.

"మూలేన స్థాపనం దేవ్యాః పూర్వాషాఢాసు పూజనం,
ఉత్తరాసు బలిం దద్యాత్ శ్రవణేన విసర్జయేత్.

పుస్తకములను పెట్టి వానియందు సరస్వతి నావాహింప జేయవలెను. అష్టమియందును, నవమియందును హోమాదులొనర్పవలెను. సాత్త్వికవిధానమున కూష్మాండాదులతో బలి నీయవలెను. నవమినాడు రాజులు లోహాభిసారికమను కర్మ చేయవలెను. లోహాభిసారికమనగా ఛత్రచామరాది రాజచిహ్నములను, గజాశ్వాది వాహనములను, చాపఖడ్గాద్యాయుధములను పూజించుట. దశమినాడు విసర్జనము, దేవీప్రస్థానము జరుపవలెను. ప్రతిదినమును కన్యకాపూజ జరుపవలెను."

హేమాద్రి రాజులు చేయవలసిన ఛత్ర, అశ్వ, ధ్వజ, గజ, పతాకా, ఖడ్గ, వర్మ, దుందుభి, చాప, శంఖ, చామర, ఛురికా, కనకదండ, సింహాసన మంత్రములను భవిష్యోత్తర పురాణమునుండి విపులముగా నుదాహరించినాడు.

ఈ నవమిని మహానవమియనికూడ అందురు. దీనికి కారణమును భవిష్యోత్తర పురాణ మిట్లు తెలుపుచున్నది.

"నవమ్యాం తు మహారాజ దేవదానవ రాక్షసైః,
గంధర్వై రురగై ర్యక్షైః పూజ్యతే కిన్నరై ర్నరైః.
అన్యైరపి మహీపాలైః సృష్టి పూర్వం ప్రకీర్తితా,
పూజితేయం పురా దేవై స్తేభ్యః పూర్వతరై శ్శుభైః.
అశ్వయుక్ శుక్ల పక్షస్య అష్టమీ మూలసంయుతా,
సా మహానవమీ నామ త్రైలోక్యేపి సుదుర్లభా.
కన్యాగతే సవితరి శుక్లపక్షేష్టమీ తు యా,
మూలనక్షత్ర సంయుక్తా సా మహానవమీ స్మృతా."

'ఆశ్వయుజ శుద్ధ అష్టమి మూలనక్షత్ర యుక్తమగునాడు, దాని తర్వాతి నవమినాడు దేవిని అందరును పూజించిరి గనుక మహాష్టమి, మహానవమియను ప్రసిద్ధిని పొందినవని కృష్ణుడు ధర్మరాజుతో అనినాడని పై శ్లోకముల తాత్ప ర్యము. ఈ మహానవమి యనుపదము క్రమముగా నప భ్రష్టమై ఆంధ్ర కర్నాటక ప్రాంతములలో "మహార్నవమి" యని వ్యవహరింపబడుచున్నది.

పైన పేర్కొనిన పూజావిధానమును బట్టియు, పురాణముల కథనమును బట్టియు నవరాత్రోత్సవ మంతయును– విజయదశమితో సహా–క్షత్రియుల యుత్సవమనియే స్పష్ట మగుచున్నది. అయినను తమ తమ వృత్తులలో అభ్యుద యమును, జయమును ఆశించువారందరును తమ తమ వృత్త్య

ప్రకరణములను పూజించు నాచార మేర్పడినది. కాని, కొంచెము ఆలోచించి చూడగా దీని మూలమును వ్యవసాయము, వర్షా ప్రభావముననియే తోచును.

శరదృతువునకు వెనుక నున్నది వర్ష ఋతువు. వానలు పడి దేశమంతయు కర్దమమయమై, చీమలు దోమలు, ఈగలు మున్నగు ఈతిబాధలును, రోగముల బాధయును ఈ ఋతువు నందు ఇనుమడించును. బురద దున్నలకు ప్రియము కదా! 'దున్నపోతుమీద వాన కురిసినట్లు' అను నానుడియే యున్నది. వానయే వానికంత యిష్టమైన బురద మరింత యిష్టము. దేవి యవతారములలో మహాకాళి విష్ణువు చెవి గుబిలినుండి పుట్టిన మధుకైటభులను వధించుట, రక్తబీజుని రక్తమును త్రాగివేసి సంహరించుట, మాతంగి యగుట, భ్రామరియగుట, మహిషాసురుని చంపుట–ఇవియంతయు మానవుడు తన పరిసరప్రకృతిని, తనను ధిక్కరించిన మహిషాది జంతువులను, మధుకీటక భ్రమరాది ఈతిబాధలను, అంటరాని తనమువంటి–మాతంగులవంటి–మురికిని జయించు గాథగా తోచుచున్నదని నా అభిప్రాయము. దీనికి బలముగా దేవీ భాగవత వచనములను ఉదాహరించవచ్చును. "శరద్వసంత ఋతువులలో నానా ప్రకారములగు రోగములు వ్యాపించును. కనుక ఈ ఋతువులకు యమదంష్ట్రములని పేరు. ప్రజలకు ఆయురారోగ్యములు కలిగించుటకు ఈ రెండు ఋతువుల ప్రారంభమునను నవరాత్రవ్రతము నాచరించవలెను." (3–30–41, 42.)

భారతీయుల నిత్యజీవితముతో పెనవేసుకొనిపోయిన ఈ దేవి ఎవరు? వివిధరూపములతో శిల్పశాస్త్రమునకే మూలకారణమైన ఈ దేవి ఎవరు?

దేవీపూజ అత్యంత ప్రాచీనమైనదని తోచుచున్నది. భారతదేశమునందే కాక ఇతర దేశములయందును సృష్టి కారిణియగు దేవి ఆరాధన జరుపబడుచుండెనని చరిత్రలు చెప్పుచున్నవి. అనాదికాలమున భగవంతుని పురుషునిగా భావించుటకంటె శక్తి స్వరూపిణిగ భావించుటయే పరిపాటిగ నుండెను. ఐదువేల సంవత్సరముల క్రిందటి సింధులోని మొహంజోదారో (మహింజోదడో), పంజాబులోని (నేటి పశ్చిమ పాకిస్తాన్‌లోని) హడప్పాల శిథిలాలను పరిశీలించగా, ఆ నగరనివాసులు సృష్టి సంహార్త్రియగు మహామాయ ఉన్నట్లు విశ్వసించుచుండెడి వారనియు, సృష్టి రహస్యమునకు ప్రత్యక్ష నిదర్శనమగు శివలింగమును పూజించెడివారనియు తెలియుచున్నది. తర్వాత తర్వాత ఈ దేవి నామధేయము ఆదిశక్తియని వ్యాప్తికి వచ్చినది. ఈ దేవికి వారు భయపడు చుండిరనియు, దేవీ విగ్రహములు విరివిగా లభించుటవలన ఇంటింటను పూజించెడివారనియు అనుమానము కలుగు చున్నది.

ఈ దేవీపూజనము భారతదేశమునందలి పశ్చిమ ప్రాంత మునకు మాత్రమే పరిమితము కాలేదు. నైల్ నదిమొదలు సింధుతీరమువరకు వ్యాపించియుండెనని పురాతత్త్వవేత్తలను చున్నారు. సింధు, పంజాబులలో మాత్రమే కాక, మెసపొటే

మియా, బెలూచిస్తాన్ (నేటి పాకిస్తాన్), ఈరాన్, ఈజిప్టు, పాలస్తీనా, సైప్రస్, క్రీట్, బాల్కన్ దేశాలు, శామ్ దేశములలో ఈ మతప్రభావము విశేషముగా నుండెను. ఆసియా మైనరు, మధ్యధరా సముద్రతీర దేశములలో ఈ దేవత ప్రక్కన మరియొక దేవతను నెలకొల్పుచుండిరి. ఈ దేవతలకు వివిధ దేశములలో విభిన్న నామధేయము లుండెను. పశ్చిమాఫ్రికాలో టానిట్, తత్పుత్రుడు; ఈజిప్టు (మిసర్)లో ఐసిస్, హోరస్; ఫినీషియాలో అస్టారోథ్, తమ్ముజ్; ఆసియా మైనరులో కైబీల్, ఐటిస్; గ్రీస్‌లో రీఆ, జిఉస్. పేర్లు ఏమియుండినను ఆదిమానవుల కల్పనలో సామ్యమున్నది. అన్ని దేశములలోను ఆదిదేవి కుమారిగా పరిగణింపబడు చుండెను. కాలక్రమమున ఆ దేవి అయోనిజుడగు మానస పుత్రుని సృష్టించును. ఆతడు ఆమెకు సహచరుడో, పతియో యగును. ఇద్దరి సంయోగమువలన దేవతలు, స్థావర జంగమ ములు ఉద్భవించును.

ప్రాచీను లిట్లూహించిరనుటకు హడప్పాలో లభించిన ఒక మట్టిదిమ్మమీది నగ్న ప్రతిమను ఉదాహరణముగా పేర్కొనుచున్నారు. ఈ నగ్న ప్రతిమ ఒక స్త్రీది. ఈమె తలక్రిందుగా శీర్షాసనము వేసినట్లు నిలబడి, పైన కాళ్ళను చాలినంతగా పారజాపినది. ఈమె గర్భాశయమునుండి చెట్లు చేమలు పుట్టినట్లు చిత్రించబడినది.

ఈ భావనయే శాక్తమతమునకు దారితీసినది. మన దేశమునందలి ఈ శాక్తమతము, తాంత్రికమతము ప్రాగైతి

హాసిక కాలమున పశ్చిమాసియాలో వ్యాపించిన మహా మాయా మతమును పోలియున్నవి. శాక్తుల సంప్రదాయము ప్రకారము పరాశక్తి ప్రకృతి; ఈమె సనాతన పురుషుని సంసర్గమున విశ్వసృష్టి కావించును. ఈమె శివునికి దేవియయి నను, అతనికి మూలకారణము. కనుక అతనికంటె శక్తిమంతురాలు. ఈమె సకల దేవతాశక్తి స్వరూపిణి. ఈమె సృష్టి కారిణి, సృష్టిహారిణి కూడ. అందువలననే ఈమె మహామాయ. ఈ మహామాయాపూజా ప్రతీకములే నేడు మన దేశమున వ్యాపించిన దుర్గాదిశక్తి పూజలు.

వేదకాలమున దేవతలకన్న దైవములకే ఎక్కువ ప్రాముఖ్యమున్నను అదితి, ఉషస్సు, పృథ్వి, వాక్కు మున్నగు స్త్రీదేవతల సూక్తములును కలవు. ఋగ్వేదమున రాత్రి సూక్తమున, దేవీసూక్తమున, అధర్వవేద పరిశిష్ట మనబడు దేవ్యధర్వ శీర్షమున దేవీప్రసక్తి యున్నది. రాత్రి సూక్తమున రాత్రిరూపిణియగు దేవత సృష్టించిన జగత్తు ఉల్లేఖింపబడినది. దేవీసూక్తమున జగత్పితయగు ఆకాశ మును, సమస్త జగత్తును సృష్టించిన కథ తెలుపబడినది. దేవ్యధర్వ శీర్షములో "నావలననే ప్రకృతి పురుషాత్మక మగు జగత్తు ఉద్భవించినది." అని దేవియే స్వయముగ తెలి పినది. కాని ఈమెమాత్రము "అజా, ఏకా, అమర్త్యా." ఈమె ఈ జగత్తును సృష్టించిన పిదప జీవరాసుల కోరికలను పూరించుటకు ధనధాన్యములను సమృద్ధిగ నిచ్చుచుండు ననియు; అసురనాశయిత్రియనియు, సమస్త దేవతల శక్తి

సమాహార స్వరూపిణియనియు దేవ్యథర్వ శీర్షము నుడువుచున్నది. రాత్రి సూక్తమున దేవి అవిద్యానాశినిగను, కర్మ ఫల దాత్రిగను, భవసాగరతరణ నౌకగను వర్ణితయయినది. దీనినిబట్టి అనాది మానవులు భావించినట్లుగనే వేదఋషులును పరాశక్తిని, జగదుత్పత్తి స్థితిలయకారిణిని, శత్రుభయకారిణిని, ముక్తిదాయినిని దర్శించిరని చెప్పవచ్చును. ఈ భావనలే పురాణములలో విపులముగా నయినవని తోచుచున్నది.

తర్వాతికాలమున బ్రాహ్మణములలో దేవీ స్వరూపములు కానవచ్చుచున్నవి. కేనోపనిషత్తున హైమవతియగు ఉమనుగూర్చి ప్రస్తావన యున్నది. మాండూక్యోపనిషత్తులో కాళీ కరాళీ దేవతల ప్రస్తావన కలదు. శతపథ బ్రాహ్మణమున త్ర్యంబక యాగవర్ణనమున అంబికాదేవి రుద్రుని సోదరిగా వర్ణింపబడినది. సాంఖ్యాయన గృహ్యసూత్రమున భవానీ రుద్రాణుల పేర్లు ఉన్నవి. హిరణ్యకేశి గృహ్యసూత్రమున శూలగవయజ్ఞమున రుద్రదేవుని పత్నికై హోమ మాచరించవలెనని సూచించబడినది. తైత్తిరీయారణ్యకమున "కాత్యాయనీ చ విద్మహే కన్య కుమారి ధీమహి తన్నో దుర్గిః ప్రచోదయాత్" అని కాత్యాయని, కన్యకుమారి, దుర్గి అను పేర్లు ఉల్లేఖింపబడినవి.

రావణ సంహారమునకై రాముడు దేవిని ఆరాధించినట్లు పురాణములు చెప్పుచున్నను, ఈవిషయము రామాయణమున కనిపించదు. ఉమాదేవి చర్చమాత్రమే కలదు. (ఈ విషయమై విజయదశమియందలి విపుల చర్చను చూడగోరి

నాను.) మహాభారతమున రెండుమార్లు దుర్గాదేవి స్తుతించ బడినది. హరివంశపురాణమున ఆర్యాస్తవమున దుర్గ "శబరై ర్బర్బరై శ్చైవ పుళిందై శ్చైవ సేవితా." అని కీర్తించ బడినది. బాణాసురుని బందెలో ఉన్న అనిరుద్ధుడు ఆర్యాస్తవము చేసినట్లును చెప్పబడినది.

అనార్య జాతులు పూజించుటవలననే కాబోలు దుర్గాదేవికి ఉషస్, పృథ్వి మొదలగు దేవతలకున్నంత ప్రాచుర్యము లేకపోయియుండును. దుర్గాదేవి మొదట సృష్టికర్త్రి యయినను సంహారకారిణియు నగుటవలన క్రమముగా యుద్ధదేవతగా పరిగణిత యాయెను. రామచంద్రుడు దేవిని ప్రార్థించి రావణుని సంహారించెనను గాథ తర్వాత కల్పితమై యుండును.

స్మృతులయందును, పురాణములందును దుర్గాదేవి తామసదేవతగా ఉల్లేఖింపబడినది. పద్మపురాణమున గౌరీ దేవిచర్చ గలదు. మత్స్యపురాణమున దశభుజయగు కాత్యాయని వర్ణితమైనది. దేవి రురుదానవుని పుత్రుడగు దుర్గుడను వానిని సంహారించుటవలన దుర్గయనుపేరు పొందెనని స్కందపురాణములోని కాశీఖండమున దుర్గాపద వ్యుత్పత్తి వివరింపబడినది. లింగపురాణమున దేవి రుద్రుని వామాంగమునుండి యుద్భవించి, పిదప దక్షపుత్రియయినట్లు కథ గలదు.

వరాహపురాణమున దేవ్యుత్పత్తి యిట్లు సూచుపబడినది: సింధుద్వీపుడను రాజు ఇంద్రుని పరిమార్చగల పుత్రుని

బడయుటకు తపస్సు చేయదొడగెను. ఇతడు పూర్వజన్మ మున త్వష్టపుత్రుడు. అప్పు డింద్రుడతనిని సముద్రపునురగతో కొట్టి చంపియుండెను. ఆ జన్మపు కసిచే ఈ జన్మమున రాజు తపస్సుచేసి యింద్రుని జయింపగోరుచుండెను. కాలక్రమ మున వేత్రవతీనది మానవాకృతి దాల్చి, సింధుద్వీపుని కడ చేరెను. వారిద్దరికిని వేత్రాసురుడను పుత్రుడు కలిగెను. ఇతడు ప్రాగ్జ్యోతిష పురాధినాథుడు. ఇతడు వయసు వచ్చిన తర్వాత ప్రపంచమునే గడగడ లాడింపదొడగెను. దేవత లందరు భయమంది బ్రహ్మకడ మొర పెట్టుకొనిరి. బ్రహ్మ అప్పుడు ధవళాంబర, కిరీటిని, సింహవాహిని, అష్టభుజయగు నొక దేవిని మనస్సుతో సృష్టించెను. ఆమె వేత్రుడు మొదలగు అసుర లందరిని చంపెను. దేవతలందరు ఆమెను పొగడిరి. బ్రహ్మ కోరికపై ఆమె హిమాలయమున వసింపసాగెను. ఆపదనుండి విడివడిన ప్రజలు అప్పటినుండి నవమినాడు దేవీపూజ చేయ దొడగిరి.

కూర్మపురాణమున హిమవత్పుత్రియగు ఉమయొక్క జనన వృత్తాంతము చెప్పబడినది.

వామనపురాణమున రంభాసుర పుత్రుడగు మహిషా సురుని జన్మవృత్తాంతము, రంభాసురుని చితినుండి రక్తబీజుని ఉత్పత్తి, దేవతల సమష్టిశక్తితోపాటు కాత్యాయనముని తేజస్సు కలియుటవలన కాత్యాయని ఆవిర్భావము, ఆమెకు అష్టాదశభుజములు, వింధ్యాచలవాసము కలుగుట, మహి షాసురునివధించిన పిదప హరపాదపద్మముల లీనయగుట మొదలగు గాథ గలదు.

నారద, భవిష్యపురాణములలో దేవీపూజాక్రమము విస్తృతముగా కలదు. మార్కండేయ పురాణమునందలి గాథ మొదటనే తెలిపితిని.

శ్రుతి స్మృతి పురాణములయందే కాక, సంస్కృత ప్రాకృత సాహిత్యములయందును దేవీపూజాప్రసక్తి మిక్కిలిగా గలదు. రెండువేల యేండ్లనాటి గాథాసప్తశతిలో ఆర్యాదేవీ మందిర ప్రస్తావన గలదు.

"గహావఇణా ముఅస్సైరిహ
ఢుండుఅ దామం చిరం వహేఊణ,
వగ్గసఆఇం ణేఊణ
ణవరిఅ అజ్జాఘరే బద్ధం. (2-72)
(గృహపతినా మృతస్సైరిభ
బృహద్ఘంటా దామ చిర మూఢ్వా,
వర్గశతాని నీత్వా
అనంతర మార్యా గృహే బద్ధం.)

ఒక కర్షకునియింట దున్నపోతుచచ్చినది. దాని గంటల పట్టెడను పట్టుకొని అతడు పెక్కు పశువులసంతలకు వెళ్లి, దానికి తగిన దున్నపోతు దొరకనందున, దానిని ఆర్యాగృహమునకు చేర్చెనట. కావ్యనాటకములలో దేవీప్రసక్తిలేనివి మిగుల తక్కువ.

ఈదేవియే మాతయై, సప్తమాతృకలై వెలసినది. సప్తమాతృకలు పెక్కుశాసనములలోను వర్ణితలైనారు. అమరకారుడును :

"బ్రాహ్మీ మాహేశ్వరీ చైవ కౌమారీ వైష్ణవీ తథా,
వారాహీ చైవ చేంద్రాణీ చాముండా సప్తమాతరః"

అని సప్తమాతృకలను నిర్వచించెను. ఈమెయే వింధ్యవాసిని. ఈమెకు 'చోరసేనా నమస్కృతా, కిరాతీ' మున్నగు అనార్య నామములును కలవు. దుర్గాసురునితో పోరాడినప్పుడు దేవి వింధ్యాచలమును ప్రధానావాసముగా చేసుకొనెనట. కనుక ఆమెకు వింధ్యవాసినియను నామధేయ మేర్పడెనని స్కాంద పురాణగాథ. ఈమెయే కాళీదేవి. కాళిదేవి సాంఖ్యాయన గృహ్యసూత్రమున మాత్రము స్మరించబడినది. ఇతరత్ర లేదు. ఇందువలన కాళీమున్నగు దేవతలు ఆర్యులకు ముందున్న వారి ఆరాధ్యదేవతలై క్రమముగా ఆర్యదేవతలుగా పరిగణిత లయిరని యూహింపవచ్చును.

ఈ దేవీమాహాత్మ్యము బౌద్ధముమీదను ప్రసరించక పోలేదు. మహాయాన సంప్రదాయమున తారాదేవియను దేవత గలదు. ఈమె వైదికమతము నందలిశక్తిని పోలుచున్నది. టిబెట్టు, చైనా, ఇండోచైనా మున్నగు బౌద్ధమత దేశాలలో తారాదేవి విగ్రహములు కానవచ్చుచున్నవి.

దేవీనవరాత్రము యుద్ధపుపండుగ గనుకనే విచిత్ర వేషములు వేసికొనుట, దానికి ప్రతీకముగ బొమ్మల కొలువులు తీర్చుట మొదలగు వినోదములు ఆచారమున వెలసినవి. ఈ నవరాత్రము పురుషులకు పారమార్థికముగ నెంత ముఖ్యమో స్త్రీలకు లౌకికముగా నంత ముఖ్యము. పురుషులు పాడ్యమినాటినుండి కలశస్థాపనాదులు కావించి పూజాపుర

స్కారాదులతో దేవి నారాధించి కృతార్థులగునట్లే స్త్రీలును బొమ్మలతో కొలువు తీర్చి వేడుకలతో వినోదములతో నానందించుచు కృతార్థులగుదురు.

నవరాత్రమునకు మాసము ముందునుండి స్త్రీల సంరంభము ప్రారంభమగును. ఇది యేటేట చేయుపండుగ గావున దీనికి వలసిన బొమ్మలు మొదలగు పరికరములన్నింటిని స్త్రీలు సేకరించి భద్రపరచి యుంచుకొందురు. వానిని వెలికి తీసి దుమ్ముదులిపి నూతనాలంకార శోభితములను గావింతురు. క్రొత్తవానిని కూడా సంపాదించుకొందురు. ఇందులకై కొంతసొమ్మును ఏడాది పొడుగునను దాచియుంచుకొందురు. ఇంటినంతయు పరిశుభ్రముచేసి గృహమధ్య భాగమును రంగులకాగితములు, పూతలు మొదలగువానితో, తోరణాదులతో నలంకరింతురు. బల్లలు మొదలగువాని నంతస్తులుగా నమర్చి వానిపై శుభ్రవస్త్రములను పరచి బొమ్మలను శ్రేణులు తీర్చియుంచెదరు. వీని నమర్చుటలో స్త్రీలు తమకుగల విద్యాసంస్కారములను, లోకజ్ఞతను, కళాభిరుచిని ప్రదర్శింతురు. ఈ అలంకరణము ఒక గృహిణి చేతిలో కన్న ఇంకొక గృహిణి చేతిలో మెరుగులు చిమ్ముచుండును. ఆదినముల స్త్రీలు సర్వస్వతంత్రలు. వారిపనుల కడ్డమాక లుండవు. వారి యుత్సాహమునకును, అలంకారమునకును మేరయుండదు.

స్త్రీలు తమ రచనాకౌశలము సాటి గృహిణుల మెప్పును పొందవలెనను నాశతో ఇరుగుపొరుగుననే కాక

దూరప్రదేశములనున్న చుట్టములు, చెలులునగు నిల్లాండ్రను పేరంటమునకు బిలుతురు. పాటలతో పద్యములతో గొంత తడవు, తమతమరచనా విన్యాసములను గూర్చిన చర్చలతో గొంతతడవు పుచ్చి, చందనతాంబూలములతో, యథాశక్తి భక్ష్యఫలాదులతో సత్కరించి పంపుదురు. వచ్చినవారంద రును తమరచనను మెచ్చుకొనిరా ఆ యిల్లాలి యానందము సముద్రమును మించును. ఇంకను అనేకవిధములగు పూజలు, ఉత్సవములు, వినోదములు ఈదినములలో జరుగుచుండును.

"తన్నో దుర్గిః ప్రచోదయాత్"

# 15. విజయదశమి

నవరాత్రోత్సవము వెనువెంటనే ఆశ్వయుజ శుద్ధ దశమినాడు మనము జరుపుకొను పండుగ విజయదశమి. దీనిని దసరాయనియు, దశరాయనియును వ్యవహరించుట గలదు. ఇది శరన్నవరాత్రమునకు మకుటాయమానమగునది, మిగుల ముఖ్యమైనది యగు పండుగ.

ఈ దినము పగలు ప్రజలు ఇష్టదేవతల నర్చించి సాయంకాలము మహోత్సాహముతో నందరును మేళతాళములతో నూరేగుచు, నూరు వెడలి, పొలిమేర దాటి, అట శమీవృక్షమును పూజించి, మరల నదేయుత్సాహమున గ్రామమున ప్రవేశించి, పెద్దలకు నమస్కరించి యాశీర్వాదము లందుకొందురు. నమస్కరించుటకు ముందు జమ్మిపత్రి పెద్దలకిచ్చి,

"శమీ శమయతే పాపం శమీ శత్రువినాశనీ,
అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శినీ."

అను శ్లోకము పఠింతురు. శమీపూజ, సీమోల్లంఘనము ఈ పండుగనాడు ముఖ్యములు. ఉత్తరదేశమున రావణ కుంభకర్ణుల బుట్టబొమ్మ లొనర్చి, ఊరేగించి, మైదానమున వానిని నెలకొల్పి, వానిని కాల్చి వినోదింతురు. దీనిని రామలీల యందురు. పూర్వపు సంస్థానములలో—ముఖ్యముగా మైసూరున జరుగుదసరా వేడుకలు, దర్బారులు అందరెరిగినవియే.

ఈ దశమిని విజయదశమియనుటకు కారణము పురాణములును, వ్రతగ్రంథములును పలువిధములుగ జెప్పుచున్నవి. కాళికాపురాణములో నిట్లున్నది: "మహానవమినాడు రావణుడు నిహతు డయ్యెను. దేవతలు రాముని యెడ తమ కృతజ్ఞత ప్రకటించుకొనుటకు విశేషపూజ జరిపిరి. దశమినాడు ఆమెను వీడ్కొలిపిరి. కనుక ఇది విజయదశమి అయినది."

దేవీపురాణమున ఈ విసర్జనోత్సవ మిట్లు వివరింపబడినది.

"తతః ప్రాతః పూజయిత్వా దశమ్యాం విధిపూర్వకం,
సంప్రేషణంతు కర్తవ్యం గీతవాదిత్ర నిస్స్వనైః."

ఉదయము దేవిని పూజించి గీతవాద్య ధ్వనులతో వీడ్కొలుపవలెను.

"తత స్సంప్రేషణం కుర్యా ద్దశమ్యాం శాబరోత్సవైః."
శాబరోత్సవములతోను వీడ్కొలుపవలెను. శాబరోత్సవము లనగా పూర్వము రావణవధ సంతోషమున జరుపుకొనుచుండెడి ఉత్సవములు. అనగా, శబరులవలె ఆకులు అలములు కట్టుకొని, బురద బూడిదవంటివి పూసుకొని అశ్లీలములు పలుకుచు చేయు నృత్యములు. 'వర్షక్రియా కౌముది'లో ఈ శాబరోత్సవ మిట్లు వర్ణించబడినది.

"భేరీ ఝాంకారాలు ప్రయోగించుచు, శంఖములు, కొమ్ములు మొదలగు వాద్యములు వాయించుచు, బురద, దుమ్ము విసరుకొనుచు, విశృంఖలముగా బూతులు పలుకుచు,

అసభ్య గీతములు గానముచేయుచు ఈ ఉత్సవము జరుపబడు గాక! పరస్పరము బురద జిమ్ముకొనకపోయిన దేవి అసంతుష్టురాలు కాగలదు.''

బృహద్ధర్మ పురాణములోను ఈ ఉత్సవమిట్లు చేయవలెనని నుడువబడినది. గృహిణులను ప్రసన్నురాండ్రుగా చేయవలెననికూడా తెలుపబడినది.

ఈ కారణమువలన దేవి విజయముపొంది వెడలిపోవు సమయమునకే విజయమను సంప్రదాయ మేర్పడినదనియు, ఆ విజయ సమయముగల దశమి విజయదశమియనియు ఊహించవచ్చును. ఈ ఊహకు బలముగా ధర్మశాస్త్రజ్ఞుల ప్రమాణములును గలవు.

''ఆశ్వినస్య సితే పక్షే దశమ్యాం తారకోదయే,
సకాలో విజయోనామ సర్వకామార్థసాధకః.''

ఆశ్వయుజ శుక్లదశమి సాయంకాలము నక్షత్రోదయ వేళను విజయ మందురు. ఆ సమయము సర్వకామార్థ సాధకము—అని చింతామణికారు డన్నాడు.

నారదు డిట్లు చెప్పుచున్నాడు :

''ఈష త్సంధ్యా మతిక్రాంతః కించి దుద్భిన్న తారకః,
విజయోనామ కాలోయం సర్వకార్యార్థ సిద్ధిదః.
సూర్యోదయే యదా రాజన్ దృశ్యతే దశమీ తిథిః,
ఆశ్వినే మాసి శుక్లేతు విజయాం తాం విదు ర్బుధాః.''

రాజా! కొంచెము సాయంకాలము దాటి, నక్షత్రము లప్పు డప్పుడే పొడగట్టుచున్నట్టి కాలమును విజయమందురు. అది సకల కార్యసిద్ధిని కలిగించును. ఈ సిద్ధిని గురించి ధర్మసింధు విట్లు తెలుపుచున్నది :

"అత్రా పరాజితా పూజనం, సీమోల్లంఘనం, శమీ పూజనం, దేశాంతర యాత్రార్థినాం ప్రస్థానంచ హితం. తత్పూజా ప్రకారస్త్వపరాహ్ణే గ్రామా దీశాన్యాం దిశి గత్వా శుచిదేశే భువ ముపలిప్య చందనాదినా ష్టదళ మాలిఖ్య.... పూజా నమస్కారాం తే...తత స్సర్వే జనాః గ్రామా ద్బహి రీశానదిగవస్థితాం శమీం గత్వా పూజయేయుః.సీమోల్లంఘ నంతు శమీపూజనా త్పూర్వం పశ్చా ద్వా కర్తవ్యం. రాజా త్వశ్వ మారుహ్య సపురోహితః సామాత్యః శమీమూలం గత్వా వాహనా దవరుహ్య స్వస్తివాచన పూర్వకం శమీం సంపూజ్య... ప్రదక్షిణం కుర్యాత్. శమ్యలాభే అశ్మంతక పూజా." దశమినాడు అపరాజితా పూజనము, సీమోల్లంఘ నము, శమీపూజ చేయవలెను. దేశాంతరము వెళ్ళువారు ఈనాడు బయలుదేరవలెను. ఈ పూజ చేయుటకు అపరాహ్ణ మున గ్రామమునకు ఈశాన్య దిక్కునకు వెళ్ళి అట శుచి ప్రదేశమున భూమిని అలకి చందన కుంకుమములతో అష్టదళ పద్మమును రచించి పూజానమస్కారములు చేయవలెను. పిదప జనులందరును గ్రామముపొలిమేర దాటి ఈశాన్య దిక్కునన్న శమీవృక్షముకడకు వెళ్ళి పూజించవలెను. ఈ సీమోల్లంఘనము శమీపూజకు తర్వాతనైనను, మొదట

నైనను జరుగవచ్చును. రాజు గుఱ్ఱమెక్కి పురోహితా మాత్యులతో పాటు శమీవృక్షముకడకు వెళ్లి గుఱ్ఱముదిగి స్వస్తివాచన పూర్వకముగా శమీవృక్షమును పూజించవలెను. అప్పుడు

"శమీ శమయతే పాపం శమీ లోహిత కంటకా,
ధరిత్ర్యర్జునబాణానాం రామస్య ప్రియవాదినీ.
కరిష్యమాణ యాత్రాయాం యథాకాలం సుఖం మయా,
తత్ర నిర్విఘ్నకర్త్రీ త్వం భవ శ్రీరామపూజితే."

అని ధ్యానమొనర్పవలెను. ఓ శమీ నీవు పాపము శమింపజేయు దానవు. ఎఱ్ఱటి ముండ్లున్నదానవు. అర్జునుని బాణములు ధరించినదానవు. రామునికి ప్రియమగు మాటలు పలినదానవు. నేను జరుపబోవు యాత్ర నిర్విఘ్నముగా జరుగునట్లు ఓ శ్రీరామ పూజితా, అనుగ్రహించుము — అని ఈ ప్రార్థనము. శమీవృక్షము లేనప్పుడు అశ్మంతకమును పూజించవలెను. ఈ చెట్టు ఆకులు రెండు బంగారునాణెములు అతికించినట్లు అందముగ నుండును. ఈ అశ్మంతకమును

"అశ్మంతక మహావృక్ష మహాదోష నివారణ,
ఇష్టానాం దర్శనం దేహి శత్రూణాంచ వినాశనం."

అని ప్రార్థించవలెను. పిదప రాజు శత్రువు బొమ్మను సిద్ధపరచి శస్త్రముతో కొట్టవలెను.

అనంతరము జమ్మిచెట్టు మొదలునందున్న మట్టిని తేవలయునేకాని, జమ్మిపత్రిని తేకూడదని ధర్మసింధుకారుడు

శాసించినాడు. ("ప్రాకృతా శ్శమీ శాఖా శ్ఛిత్వా ఆనయంతి తన్నిర్మాల్యం.")

దేశాంతరము వెళ్లువారు ఈనాడు చంద్రాదిగ్రహానుకూల్యము లేకపోయినను వెళ్లవచ్చునని స్మృతి గ్రంథకారులనినారు.

"ఆశ్వయుక్ శుక్ల దశమీ విజయాఖ్యా ఖిలే శుభా,
ప్రయాణే తు విశేషేణ కిం పునః శ్రవణాన్వితా."

హేమాద్రి ఈ అపరాజితా దశమీ పూజనమును అధర్వణ గోపథ బ్రాహ్మణములో నుడివినట్లు వివరణతో తెలిపినాడు.

"ఆశ్వినస్య సితే పక్షే దశమ్యాం సర్వరాశిషు,
సాయంకాలే శుభా యాత్రా దివా విజయలక్షణః.
ఏకాదశో యో ముహూర్తో విజయః పరికీర్తితః,
తస్మిన్ సర్వైః విధాతవ్యా యాత్రా విజయకాంక్షిభిః."

ఈ దశమినాడు విజయయాత్ర తప్పక చేయవలెనని భృగువు చెప్పినాడు.

"దశమీం య స్సముల్లంఘ్య ప్రస్థానం కురుతే నృపః,
తస్య సంవత్సరం రాజ్యే నక్వాపి విజయో భవేత్."

దశమిని దాటినమీదట ఏరాజు ప్రస్థాన మొనరించునో అతనికి సంవత్సరము పొడవునను విజయము లభించదని స్కాందపురాణములో చెప్పబడినది. శ్రవణనక్షత్రయుక్త దశమినాడు శ్రీరాముడు విజయయాత్రకు బయలుదేరెనుగనుక కార్యసిద్ధి

కోసము, దేశాంతర యాత్రకోసము ఆనాడు సీమోల్లంఘనము చేయవలెనని కల్పకోక్తి.

"శ్రవణర్క్షం యదా కాలే సా తిథి ర్విజయాభిధా,
శ్రవణర్క్షేతు పూర్ణాయాం కాకుత్ స్థః ప్రస్థితో యతః.
ఉల్లంఘయేయు స్సీమానం తద్దినర్క్షే తతో నరాః."

ఈ ప్రమాణములన్నిటిని చూచ ఈ విజయదశమి క్షత్రియుల పండుగయని, క్షత్రియులు విజయయాత్రకు బయలుదేరు కాలమునకు ఉపలక్షణముగా నేర్పడినదని నిర్ణయించవచ్చును. దీని నించుక చర్చింతిము :

దసరా ఉత్సవముల సమయమునకు చాతుర్మాస్యము ముగియును. శరదృతువు రమణీయమై యుండును. జలసమృద్ధి నలువైపుల నిండారియుండును. దారి బురదచూరి ప్రయాణమున కనుకూలముగ నుండును. వరదలు వాగులు నదులు ప్రవాహవేగము తగ్గి దాటుట కనువుగానుండును. కనుకనే శివాజీ సైనికులు దసరా పండుగవరకు పొలము పుట్రచూచుకొనుచు నుండెడివారట. అన్ని పనులును పూర్తియయి, కోతలుమాత్రము మిగిలియుండును. ఆ పనిని వృద్ధులు, స్త్రీలు, బాలురు చేయుచుండిరి. కనుక దసరావేళకు యుద్ధయాత్రకు బయలుదేరుటకు సిద్ధముగా నుండెడివారట. అయిన, మనుస్మృతిలో "మార్గశీర్షే శుభే మాసి యాయాద్యాత్రాం మహీపతిః." (శుభమగు మార్గశీర్ష మాసమున రాజు యుద్ధయాత్రకు బయలుదేరవలెను.) అని యుండగా, ఆశ్వయుజమాసమున యాత్రాప్రసంగ మేమిటని ప్రశ్న

యుదయించవచ్చును. మార్గశిరమాసము ఉత్తమ యాత్రా కాలమని మనువు అభిప్రాయమనియు, ఇతరత్ర ఆశ్వయుజ మాసమే ఉద్దిష్టమనియు పండితుల నిర్ణయము.

ఈ విజయదశమి పండుగ ఎప్పటినుండి యెట్లు ప్రారంభ మయ్యెనో నిశ్చయముగా చెప్పలేము. కాలికా పురాణ మున చెప్పిన విషయము నిదివరకే తెలిపితిని. రామచంద్రుడు రావణునిపై ఈనాడే దండు వెడలెను; ఆర్యులు పలుమారు విజయదశమినాడు దండు వెడలి జయముపొందిరి; అందువల ననే విజయదశమి ఆనాటినుండి జాతీయోత్సవమయినది. — అని కొందరు నుడువుదురు.

జగదంబ మహిషాసురుని సంహరించి ప్రజలను బాధా విముక్తులను చేసినది ఈనాడే గనుక విజయదశమి పండుగ ఏర్పాటయ్యెనని మరికొంద రనిరి.

రావణునిపై దండు వెడలిన గాథయేకాక మరియొక గాథయును గలదు. బృహద్ధర్మ పురాణమున నిట్లున్నది : విష్ణువు ఆషాఢ శుద్ధైకాదశినాటికి శేషశయ్యపై నిద్రించును. ఆనాటినుండి దక్షిణాయన మారంభమగును. ఈ దినములలో దేవతలందరును నిద్రించుచుందురు. శరత్కాలము దక్షిణాయ నాంతర్గతమే కదా! దేవియును ఈ సమయమున నిద్రించు చుండును. లంకలో రామరావణయుద్ధము జరుగుచున్న ప్పుడు రావణుని బలపరాక్రమములు చూచి దేవతలందరును వెరగందిరి. ఈ పరిస్థితిలో వారందరును రామచంద్రునికి విజయము కలిగించుటకు దేవిని ప్రార్థించిరి. దేవి కుమారీ

రూపమున వారికి సాక్షాత్కరించి, రెండవనాడు బిల్వవృక్షముపై నిద్రించు దేవిని మేల్కొలుపుడని ఆదేశించి అదృశ్యయామెను. ఆమీదట బ్రహ్మ

"రావణస్య వధార్థాయ, రామస్యానుగ్రహాయ చ,
అకాలే... ... ..."

రావణవధము కొరకును, రాముని అనుగ్రహించుటకును అకాలములో దేవిని మేల్కొలిపెను. ఆసమయముననే బ్రహ్మ ఆశ్వయుజ శుక్ల నవమినుండి రావణ మరణమువరకు దేవిని పూజించుటకును అనుమతిపొందెను. అది మొదలు స్వర్గమర్త్యలోకములలోని వారందరును ఆశ్వయుజమాసమున దేవిని పూజింప నారంభించిరి. ఆసమయమున దేవి నవమినాటి తృతీయ ప్రహరమున రావణుని వినాశము కాగలదనియు, దశమినాడు రామచంద్రుడు విజయోత్సవము ఆచరించుననియు పలికెను. అప్పటినుండి దుర్గాపూజా సమయమున పూజకులు

"రావణస్య వధార్థాయ రామస్యానుగ్రహాయ చ,
అకాలే బ్రహ్మణా బోధో దేవ్యా స్త్వయి కృతః పురా.
అహ మప్యాశ్రితః షష్ఠ్యాం సాయాహ్నే బోధయా మ్యహం."

"ఆనాడు రావణవధార్థము, రామానుగ్రహార్థము బ్రహ్మ నిన్ను అకాలమున మేల్కొలిపెను. నేను కూడ ఈ షష్ఠీనాడు సాయంకాలము నిన్ను అకాలమున మేల్కొలుపుచున్నాను." అని యనుట పరిపాటి యయినది. ఈ కారణము

నను విజయదశమి రామపరమే యనుచున్నారు. "అర్జునస్య ధనుర్ధారీ. రామస్య ప్రియదర్శినీ" అను శమీపూజా మంత్రములోను రాముని సంబంధముండుటయు దీనికి ప్రబల నిదర్శనము. రాముడు రావణ విజయానంతరము అయోధ్యకు వెళ్ళుటకుముందు శమీపూజ చేసెననియు వ్రతగ్రంథములు తెలుపుచున్నవి.

ఈ దశమినాడు పూర్వమంతటను బలనీరాజనోత్సవము జరుపబడుచుండెను. రాజ్యపాలకులు తమసేనాదళములను పర్యవేక్షించి, సైనికులను అభినందించుచుండిరి. దేవి రావణ వధానంతరము భూలోకమును వదలివెళ్ళిన పిదప స్వర్గమున శాంత్యభ్యుదయములకోసము ఇంద్రుడు ఈదశమినాడు దేవ సేనకు నీరాజనము జరిపెనని కాలికా పురాణమున గలదు. బహుశః ఈ సంప్రదాయమును అనుసరించియే ప్రాచీనకాలమున జైత్రయాత్రల సందర్భమున రాజులు సైన్యసహితులై బయలు వెడలు ఆచారమేర్పడియుండును – అని ఒక పరిశోధకుడు వ్రాసెను. దీనికి హరివంశమున నిట్లు ప్రమాణము గలదు.

"నీరాజయిత్వా సైన్యాని ప్రయాంతి విజిగీషవః,
అన్యోన్య రాష్ట్రాభిముఖాః పార్థివా విజిగీషవః.
(2–17–34)

రఘుమహారాజు విశ్వజిద్యాగ మొనర్చి, మృణ్మయ పాత్రావశేషుడాయెను. అప్పుడు వరతంతు శిష్యుడైన కౌత్సుడు పదునాలుగుకోట్ల బంగారు నాణెములు గురువునకు

దక్షిణయిచ్చు సంకల్పముతో, ఆధనమును రఘు మహారాజును వేడవచ్చెను. రఘువు రిక్తహస్తుడని ఎరిగి ఆశీర్వదించి మరలిపోవుట కుద్యుక్తుడయ్యెను. కాని కౌత్సుని రిక్తహస్తములతో పంపుటకు రఘు మహారాజు ఒప్పక స్వర్గముపై దండెత్తుట కాలోచించుచుండ, కుబేరుడు అతని ధనాగారమున సువర్ణవృష్టి కురిపించెను. రఘువు కౌత్సునికి కావలసినంత యిచ్చి, తక్కినది నగరప్రజలకు పంచియిచ్చెను. అట్లు పంచియిచ్చినది ఆశ్వయుజ శుద్ధదశమినాడు కనుక ఈ సంఘ్యకు మూల మిదియని కొందరనుచున్నారు.

"అర్జునస్యధనుర్ధారీ" లేక "ధరిత్ర్యర్జునబాణానాం" అని శమీపూజామంత్రమున అర్జునుని ప్రస్తావముండుటవలన భారతమునకు విజయదశమితో సంబంధమున్నట్లు కొందరనుచున్నారు. పాండవులు అజ్ఞాతవాసము చేయుటకై విరాటుని రాజధానికి బయలుదేరుటకు ముందు తమ ధనుర్బాణాద్యాయుధములను కట్టకట్టి జమ్మిచెట్టుపై దాచి మారువేషములతో విరాటుని రాజధానిని ప్రవేశించిరి. పిదప ఉత్తరగోగ్రహణ కాలమునకు తమ ప్రతిజ్ఞాపాలనకాలము పూర్తికాగా, అర్జునుడు జమ్మిచెట్టును పూజించి తన ఆయుధములను గ్రహించి శత్రువులను ఓడించెను-ఇది భారతగాథ.

భారతమున దేవీప్రస్తావము రెండుమార్లు వచ్చినది. వారు విరాటు రాజధానిని ప్రవేశించుటకు ముందు యుధిష్ఠిరుడు దుర్గను ప్రార్థించెను. ఇది మొదటిసారి. కురుక్షేత్రమున కృష్ణుని సూచనపై అర్జునుడు చేసిన దుర్గాస్తుతి రెండవది.

విజయదశమి పండుగకు మూలకారణములని చెప్పు పండుగులలో ముఖ్యమైనవి రామాయణ భారతగాథలని తేలినది. వానిలో రామాయణకుగల సంబంధ మెట్టిదో విమర్శింతము.

ఉపపురాణములన్నియు నిట్లు ఉద్ఘోషించుచున్నను రామాయణమున దుర్గాదేవిప్రస్తావమే లేకపోవుట ఆశ్చర్యకరము. కాని, అక్కడక్కడ తపోధన, లోకనమస్కృత, హిమవన్మేనాదేవుల పుత్రిక యగు ఉమనుగురించిన ప్రస్తావము మాత్రము కలదని ఇదివరకే తెలిపితిని. రామాయణపు ప్రసిద్ధ పాఠములలో దేవిసహాయమున రాముడు రావణుని చంపినట్లు లేదు. అగస్త్యముని సూచనపై ఆదిత్యహృదయమును పఠించి రావణుని సంహరించెనని యున్నది. కాని, ఉపపురాణములగు దేవీభాగవతము, కాలికాపురాణము, బృహద్ధర్మపురాణము వంటివానిలోను, లింగపురాణములోను, హేమాద్రి వ్రతఖండముననుు, వర్షక్రియా కౌముదివంటి వ్రతగ్రంథములందును దేవీబోధనము ఉదాహరించబడినది. సహస్రాబ్దులుగా ఈమంత్రముతోనే పూజకులు ఆశ్వయుజ మాసమున దేవిని ఉద్బోధించుచున్నారు. నారదపురాణమున విజయదశమినాడు సీతారాములను పూజింపవలెనని యున్నది.

దేవీపూజలు జరుగని ప్రాంతములలో విజయదశమినాడు రావణకుంభకర్ణులవధ జరుపు ఆచారమున్నది. ఈరామలీలోత్సవములలో కాలికా వేషధారులును పెక్కుమంది

పాల్గొనుచు కత్తులు, కటారులు త్రిప్పుచు వెళ్లుట చూడ నగును. ఈ పరోక్ష కారణములేగాక, ప్రత్యక్ష కారణము లును విజయదశమితో రామునికిగల సంబంధమును నిరూపించు చున్నవి :

రాముడు వాలి వధానంతరము సుగ్రీవునకు పట్టముగట్టి, కిష్కింధలో వేచియుండెను. ఇంతలో శరదృతు వారంభ మాయెను. అప్పు డతడు సీతావిరహ మగ్గలము కాగా పరిపరివిధముల బరితపించుచు, ఆఋతువు తమకు విజయ యాత్ర కనుకూలమని లక్ష్మణునితో నిట్లనెను.

"సూర్యాతప క్రామణ నష్టపంకా
భూమి స్సముత్పాదిత సాంద్ర రేణుః,
అన్యోన్యవైరేణ సమాయుతానా
ముద్యోగకాలో ద్య నరాధిపానామ్."

"అన్యోన్యబద్ధ వైరాణాం జిగీషూణాం నృపాత్మజ,
ఉద్యోగ సమయ స్సౌమ్యః పార్థివానా ముపస్థితః.
ఇయం సా ప్రథమా యాత్రా పార్థివానాం నృపాత్మజ."
(కిష్కింధా).

లక్ష్మణా! ఎండకాయుటవల్ల బురద ఆరిపోయి, భూమిపై దుమ్ము రేగుచున్నది. పరస్పరవిద్వేషామర్షములు గల రాజుల కిది విజయయాత్రాసమయము. ఓ రాజకుమార! పరస్పరద్వేషముతో జయాకాంక్షులగు రాజులకు సౌమ్యమగు విజయప్రయత్నసమయ మాసన్నమైనది. రాజకుమారుడా! ఇది రాజులకు మొదటియాత్ర - అని. ఈ రామవాక్యముల

కనుగుణముగనే హనుమంతుడును సుగ్రీవున కుపదేశించు సందర్భమున "ప్రాప్త ముద్యోగకాలంతు నావైషి హరి పుంగవ!" ఓవానరశ్రేష్ఠుడా విజయయాత్రాసమయము సమీపించినది. నీవీ విషయమును తెలియకున్నావు. రాముడు క్షోభించుకొనును–అని మందలించెను. పిదప సుగ్రీవుడు తెలివి తెచ్చుకొనియు, లక్ష్మణుని కోపమునకు భయపడియు తన సైన్యము పది దినములలో నాయత్తము కావలెననియు, అట్లు సన్నద్ధులుకాని సైనికులు దురాత్ములు, రాజశాసన దూషకులు గనుక వధార్హులనియు చాటించెను.

"అహోభి ర్దశభి ర్యేహి నాగచ్ఛంతి మమాజ్ఞయా,
హన్తవ్యా స్తే దురాత్మానో రాజశాసన దూషకాః."

ఇట్లు రామచంద్రుడు ఆశ్వయుజమాసమున రావణ వధార్థము దండువెడలెనని పై రామాయణ ప్రమాణముల వలన నిరూపింపవచ్చును. "ఇయం సా ప్రథమా యాత్రా పార్థివానాం నృపాత్మజ" అని ఇది ప్రథమయాత్రయని రాము డనుటవలన మార్గశిర మాసమున మనువుచెప్పినట్లు మరియొక దండయాత్రకు విరోధమేమియును లేదు.

కాని, రాముడు దండయాత్ర వెడలినది విజయదశమి యని యనుకొనిన, ఉపపురాణములలోని ఆశ్వయుజ శుద్ధ నవమి రావణవధమను కథనమునకు సమన్వయమెట్లు అను శంక కలుగును. రాముడు ఆశ్వయుజ మాసమున సైన్యోద్యోగ మాచరించి, ఫాల్గునామావాస్యయందు రావణ వధము జరిపెననియు, చైత్రశుద్ధ ప్రతిపత్తున రావణదహన

సంస్కారము జరిగిన మీదట విదియనాడు విభీషణునికి పట్టాభి షేకముచేసి, తదియనాడు లంకనుండి బయలుదేరి, షష్ఠినాడు అయోధ్యచేరెననియు రామాయణ వ్యాఖ్యయగు గోవింద రాజీయమున స్పష్టపరుపబడినది. (ఈ విషయము దీపావళి కథనమున విపులముగ చర్చించబడినది. చూడుడు.) కనుక మనము రావణవధము రామాయణముననుసరించియే జరిగినట్లు భావించినను "శ్రవణర్క్షే తు పూర్ణాయాం కాకుత్స్థః ప్రస్థితో యతః" అను కల్పోక్తినిబట్టి కూడ విజయదశమి నాడు విజయయాత్రయేగాని, విజయము జరుగలేదనియు, దేవ్యుపాసకులగు తాంత్రికుల ప్రాబల్యమువల్లను, శక్తిపూజః సహస్రాబ్దములుగ ప్రజాసామాన్యమున వేళ్లుతన్ని యుండుట వలనను దేవిని రాముడు ఆరాధించినట్లు ప్రచారము కలిగి యుండవచ్చుననియు సమన్వయ పరచుకొనవచ్చును. దీనితో విజయదశమి రామాయణకాలమునుండియే శుభదాయక మగు యాత్రాకాలముగా జనాదరము పొందినదని నిర్ణయించ వచ్చును. విజయయాత్ర క్రమముగా, ప్రజాసామాన్య దృష్టిలో సామాన్య కార్యసాధక పర్యటనమునకు, దేశాం తర గమనమునకును అన్వితమైన ట్లూహింపవచ్చును. విజయోత్సాహమున వైరిరాజుల బుట్టబొమ్మలుచేసి కాల్చి వేయుట సైనికులలో పరిపాటి. అది క్రమముగా సీమోల్లంఘ నానంతరము వైరిరాజుల ప్రతిమలనుచేసి శస్త్రప్రయోగము చేయు నాచారమునకును, రామలీలలవంటి బుట్ట బొమ్మల దహనమునకును దారితీసినదై యుండవచ్చును.

ఇక భారతగాథను పరిశీలింతము. భారతగాథతో విజయదశమి కేమియు సంబంధము లేదని శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారు మిగులచర్చించిన తర్వాత నిరూపించినారు. వారి నిరూపణసారాంశ మిట దెలుపుదును.

ఉత్తరగోగ్రహణము విజయదశమినాడు జరిగినట్లున్న జనశ్రుతికి విరుద్ధముగా భారతమున ప్రమాణములు కనిపించుచున్నవి.

"ఆదాత్సుం గాః సుశర్మాథ కృష్ణపక్షస్య సప్తమీం,
అపరే దివసే సర్వే రాజన్ సంభూయ కౌరవాః.
అష్టమ్యాం తే హ్యగృహ్ణంత గోకులాని సహస్రశః."

అనగా, రాజా! సుశర్మ కృష్ణపక్షసప్తమినాడు పసులను పట్టెను. మరుదినము అష్టమిని కౌరవులందఱును కలిసి గోకులసహస్రమును పట్టిరి—అని తాత్పర్యము. దీనినిబట్టి ఉత్తరగోగ్రహణము కృష్ణపక్షపు అష్టమినాడు జరిగినదిగాని, శుద్ధదశమినాడు కాదని నిర్ణీతము గదా! కావున విజయదశమికిని ఉత్తరగోగ్రహణమునకును సంబంధము లేదు.

పాండవులు దాచిన తమ యాయుధములను మరల తీసుకొనినప్పుడు శమీపూజచేసిరనుట విజయదశమినాడే యను వాదమును పొసగదు. ఎందుకనగా, శమీపూజ విజయదశమినాడు చేసినట్లు ప్రమాణము లేదు. అభిమన్యుని మరణ సమయమునకు ఉత్తర ఏడునెలల చూలాలు. యుద్ధము కార్తికామావాస్యయందు ప్రారంభమాయెనని కర్ణునితో కృష్ణుడనిన మాటలవలన దెలియుచున్నది :

"బ్రూయాత్కర్ణ ఇతో గత్వా ద్రోణం శాంతనవం కృపం,
సౌమ్యో௨యం వర్తతే మాసః సుప్రాపయవసేంధనః.
సర్వౌషధీ వనస్ఫీతః ఫలవా నల్పమక్షికః,
నిష్పంకో రసవత్తోయో నాత్యుష్ణశిశిర స్సుఖః.
సప్తమా చ్చాపి దివసా దమావాస్యా భవిష్యతి,
సంగ్రామో యుజ్యతాం తస్యాం తా మాహు శ్శక్ర
దేవతాం."

"ఓ కర్ణా! నీ విక్కడినుండి వెడలి ద్రోణ భీష్మ కృపాచా ర్యులతో నిట్లు పలుకుము. ఈనెల మిగుల సౌమ్యముగ నున్నది. పశుగ్రాసము వంటచెరకు సులభముగా దొరకును. అడవులన్నియు సకలౌషధులతోను ఫలములతోను నిర్భర ముగా నున్నవి. ఈగల బాధ లేదు. ఈదరగాలి లేదు. నీరు తేరి రుచికరముగా నున్నది. వాతావరణము ఎండయును, చలి యును అంతగా లేక సుఖముగా నున్నది. నేటికి ఏడవ దినము అమావాస్య. ఇంద్రదేవతాకమైన తిథి. ఆనాడు యుద్ధము జరుగుగాక!" ఈ లెక్కనుబట్టి ఉత్తరాభిమన్యుల వివాహము వైశాఖమాసమున జరిగియుండవలెను. కనుక శమీపూజచేసి గుప్తమగు నాయుధముల గ్రహించుట యంతకుముందే జరిగియుండవలెను. అంతకుముందే యనిన ఒకటి రెండు నెలలకు మించియుండుననుటకు వీలులేదు. కావున చైత్రమాసమునందో, వైశాఖమాసమునందో చేసి యుందురు. అందువలన విజయదశమితో విజయునికిగాని, పాండవులకుగాని సంబంధ మేమియును లేదు. కాని రామచం

ద్రుడు శరత్కాలములో దండయాత్ర వెడలుటయును, భారత ఘోరరణము కార్తికమాసమున శరదంతమున జరుగుటయును, శమీపూజన మంత్రములలో 'అర్జునస్య ధనుర్ధారి' అని యుండుటవలనను, అర్జునుని పేరులలో నొకటగు 'విజయ' శబ్దము దశమితో చేర్చి పలుకుటవలనను సామాన్య ప్రజలు విజయపదము జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయపు పారిభాషికపదము – విజయకాలసూచకమగు పదము – అని తెలియక భారత కథలో దాని నంటగట్టిరనియు నిశ్చయించుకొనవచ్చును.

ఆచార్య కాకా కాలేల్కర్ విజయదశమినాటి సీమోల్లంఘనమును కడుచక్కగ వ్యాఖ్యానించినారు.

''విజయదశమి పండుగలో చాతుర్వర్ణ్యముల సమైక్యము సంధానింపబడినది. బ్రాహ్మణుల సరస్వతీపూజ, విద్యారంభము, క్షత్రియుల శస్త్రపూజ, అశ్వగజాదినీరాజనము, సీమోల్లంఘనము, వైశ్యుల కృషి, నాల్గవ వర్ణము వారి సేవ ఈ పండుగలో వ్యక్తమగుచుండును. గ్రామీణులు నవరాత్రములో బంగారు తురాయివంటి ధాన్యపు కంకులను తెంపి, తమ తలపాగలలో చెక్కుకొని, నూతన వస్త్రములను ధరించి వాద్యధ్వనులతో సీమోల్లంఘనము చేయుచున్నప్పుడు చూపరులకు దేశ పరాక్రమము నంతటిని ప్రదర్శించుటకు బయలువెడలిరా అనునట్లు తోచును. పూర్వము కూలికి పోరాడు పద్ధతి లేదు. కర్షకులే వీరసైనికు లగువారు. కర్షకు డన్న క్షేత్రపతి, అనగా క్షత్రియుడు. ఈ పరిస్థితిలో

కృష్యుత్సవము క్షాత్రోత్సవముగా మారుట చారిత్రక ముగా సమంజసము. క్షత్రియుల ముఖ్యకార్యము స్వదేశ రక్షణము. దీనికి ముందుగా—శత్రువు తన దేశమున ప్రవే. శించి దేశమును పాడుచేయుటకు ముందుగానే—తానై సీమోల్లంఘన మాచరించి, శత్రుభూమిలో ఎదుర్కొని పోరాడుట. వీరోచితమను భావన ఏర్పడి యుండెను. కాని, కొంచె. మాలోచించిన సీమోల్లంఘనము వెనుక సామ్రాజ్యభావము దాగియున్నదని స్పష్టము కాగలదు. తన దేశపు హద్దును దాటి, పొరుగు దేశమున పడి అక్కడి ధనధాన్యములను లూటీచేసి. తెచ్చుటలో ధర్మభావము కన్నను మహత్వాకాంక్ష కొంచె మెక్కువ. ఇట్లు లూటీచేసి తెచ్చిన ధనము తన యొద్దనే యుంచుకొనిన నేటి క్షాత్ర ప్రకోపము (మిలిటరిజం), వైశ్య ప్రకోపము (ఇండస్ట్రిలిజం) మిళితమై భయంకర పరిస్థితి ఉత్పన్నము కావచ్చును. ప్రభుత్వము, ధనిత్వము ఒకచోట నున్నప్పుడు రాక్షత్వమునకు ఆహ్వానమిచ్చుటకు ప్రత్యేకావశ్యకత యుండదు. కనుక దసరానాడు ఇట్లు లూటీచేసి. తెచ్చిన బంగారును స్వజనమునకు చూరయిచ్చుట గొప్ప ధార్మిక విధిగా పెద్దలు నిర్ణయించిరి... ఇట్లు విజయదశమి. పండుగపై పెక్కు సంస్కారముల, సంస్కృతుల, విశ్వాసముల అవగుంఠనములు ఉన్నవి. కృషిమహోత్సవము క్షాత్రమహోత్సవ మాయెను. సీమోల్లంఘనము దిగ్విజయ. ముగా పరిణమించెను.''

ధర్మసింధుకారుడు ''అత్రాపరాజితా పూజనం, సీమోల్లంఘనం, శమీపూజనం'' అని అపరాజితాపూజను,

శమీపూజను ప్రత్యేకముగా పేర్కొనుట మనము శ్రద్ధతో గమనించవలసిన విషయము. ప్రాచీనకాలమున–ఋగ్వేదకాలమున – ఆర్యులకు 'అపరాజితాదేవి' ముఖ్యమగు దేవతగా నుండెను. అపరాజితయనగా పరాజయము పొందనిది. కౌటిల్యుడు తన అర్థశాస్త్రమున అపరాజితాదేవితోపాటు అప్రతిహత, జయంత, వైజయంత అను దేవతలను పేర్కొనినాడు. అప్రతిహత యనగా అడ్డులేనిది. జయంత యనగా జయశీలమైనది. వైజయంత అనగా విజయము నిచ్చునది. ఈ దేవతల పేర్లన్నియు విజయమును సూచించునవియే యనుట చరిత్రచర్వణము. వైదికకాలపు ఈ అపరాజితాదేవి కాలక్రమముగా క్షత్రియుల జయాధిష్ఠానదేవి యైనది. క్షత్రియులు విజయాభిధయగు దశమినాడు అపరాజితను పూజించుట యాచారమైనది.

''యా పూర్ణా నవమీయుక్తా తస్యాం పూజ్యా పరాజితా,
క్షేమార్థం విజయార్థంచ ప్రసిద్ధ విధినా నరైః.
నవమీ శేష సంయుక్త దశమ్యా మపరాజితా,
దదాతి విజయం దేవీ పూజితా జయవర్ధనీ.''

అని పురాణ సముచ్చయమున నుడువబడినది. పూర్ణనవమినాడుగాని, నవమీశేషముగల దశమినాడుగాని అపరాజితను పూజించిన విజయము సిద్ధించునని దీని యభిప్రాయము. అపరాజితా ధ్యాన శ్లోకములును నీ యర్థమునే ప్రతిపాదించుచున్నవి.

"చారుణా ముఖపద్మేన విచిత్ర కనకోజ్వలా,
జయాదేవీ శివేభక్తా సర్వాన్కామాన్ ప్రదాతు మే.
కాంచనేన విచిత్రేణ కేయూరేణ విభూషితా,
జయప్రదా మహాభాగా శివభావిత చేతసా.
విజయాచ మహాభాగా దదాతు విజయం మమ,
హారేణ సువిచిత్రేణ భాస్వత్కనక మేఖలా,
అపరాజితా రుద్రరతా కరోతు విజయం మమ."

అని ప్రార్థించి పసుపుగుడ్డపేలికలో గరిక, ఆవాలు కట్టి వలయముగా చేసి,

"సదాపరాజితే యస్మాత్ త్వం లతా సూత్తమా స్మృతా,
సర్వకామార్థ సిద్ధ్యర్థ్యం తస్మాత్త్వాం ధారయామ్యహం."

"నీవు లతలలో ఉత్తమమైన దానివి. సకలార్థ సిద్ధికొరకు నిన్ను ధరించుచున్నాను." అని కుడిదండకు కట్టుకొనవలెనని పూజా విధానములో నున్నది. అపరాజితను లతలలో నుత్తమమైన దానివని యనుటవలన, దేవత్వ మారోపించుటవలన, ఆరోగ్యసౌభాగ్యముల నిమిత్తము తెగడతీగను పిల్లల దండలకు కట్టు నేటి యాచారము వంటిది పూర్వమును ఉండెనేమో!

అపరాజితయను నోషధిని పిల్లలకు రక్షాబంధనముగ గట్టు నాచార ముండినట్లు శాకుంతలమున ఏడవ యంకమున సింహాదమనుని వృత్తాంతమున గలదు. జాతకర్మ సమయమున మారీచ భగవానులు సింహాదమనునికి ఒక రక్షాకంకణము

కట్టిరి. దాని పేరు అపరాజితయను నోషధి. (సేయం అపరా-
జితా నామ ఓషధిః.) తలిదండ్రులుగాని, సింహాదమనుడు
గాని తక్క నేలబడిన దీనిని మరెవ్వరును తాకరాదు. తాకి-
నచో పామై కరచును. (సర్పో భూత్వా దశతి.) దీనికి నిదర్శ-
నము కనిపించినదని తాపసులు దుష్యంతునికి తెలుపుదురు.
కనుక, కాళిదాసుని నాటికే అపరాజితాదేవి అపరాజితా-
మూలికగా ఆరాధింపబడుచుండెనని తెలిసినది. ఈ పేరు
సూర్యక్రాంత, విష్ణుక్రాంత మున్నగు మూలికలకును కాల-
క్రమమున వాడుకయాయెను.

ఈ అపరాజితయను నామము కొంతకాలమునకు జమ్మి-
చెట్టునకును పర్యాయమైయుండును. జమ్మి అగ్నిగర్భయను-
నమ్మకము ప్రాచీనులలో నుండెను. తక్కిన యన్నివృక్షముల
కన్నను త్వరగా నిప్పును పుట్టించుచేవ జమ్మిలో నుండుట-
వలన నీ విశ్వాస మేర్పడియుండును. నిప్పు పుట్టించు అరణ్యుప
కరణమగుటవలనను, నిప్పు పరాక్రమమునకును, వైరమును
ప్రతీకమగుటవలనను, అపరాజితయను పేరబరగిన లత
మరుగయిపోవుటవలనను కొంతకాలమునకు శమీపూజ యేర్ప-
డినదని భావించవచ్చును. "తత్ర నిర్విఘ్నకర్త్రీ త్వం భవ
శ్రీరామపూజితే, ధారి ణ్యర్జునబాణానాం" అను వాక్యము
లను అపరాజితా దేవీపరముగా నన్వయించిన మన సందేహ
ములు పెక్కు తీరిపోవును. రామచంద్రుడు దేవిని పూజించి
నట్లు ఉపపురాణములును, జనశ్రుతియు నున్నది. అర్జునుడును
కురుక్షేత్రమున దుర్గాదేవిని ధ్యానించెను. ఆమె అపరాజిత యే
యను అభేదాధ్యవసాయముతోను, జమ్మిచెట్టుపై పాండవులు

తమ యాయుధములను దాచిరనుటతో కలుపుటవలనను ఈ వాక్యములు శమీధ్యాన శ్లోకములలో చేరిపోయియుండును. తర్వాత తర్వాత అపరాజితా శమీపూజలు రెండును వాడుకలో స్థిరపడిపోయినవి: అపరాజితాపూజ తర్వాతికాలములో శక్తిపూజగా మారినది.

అపరాజితాపూజనము పిదప ఖంజకమును—కాటుక పిట్టను చూడవలెననియు వ్రతనిర్ణేతలు నుడివిరి.

"నీలగ్రీవ శుభగ్రీవ సర్వకామ ఫలప్రద,
పృథివ్యా మవతీర్ణోసి ఖంజరీట నమోస్తుతే."

"త్వం యోగయుక్తో మునిపుత్రకస్త్వం
సంద్ళశ్యతా మేహి శిఖోద్గమేన,
సంద్ళశ్యసే ప్రావృషి నిర్గతాయాం
త్వం ఖంజనాశ్చర్య నమో నమస్తే."

కాటుక పిట్టకు నీరు పడదు. కనుక వర్షర్తువు తర్వాత ఆకాశము మేఘనిర్ముక్తమైన పిదపనే అది వెలుపలికి వచ్చును. తన పరిసర జంతుజాలము చర్యలనుబట్టి కాలజ్ఞానము సంపాదించుటకు ఆదిమానవుడు చేయుచుండిన కృషి కిది తార్కాణము. ఈ విజ్ఞానము క్రమముగా నాచారమై, వర్షాకాలము గడిచినదనియు, పూర్తిగా జలకర్దమాది భయము తొలగినదనియు నిర్ణయించుటకు నుపలక్షణముగా మారెననియు తోచుచున్నది.

మధ్యకాలమున వివిధ ప్రాంతములలో విజయదశమ్యు త్సవము జరుపుచుండిన విధమును సూక్ష్మముగ తెలిపి ఈ చర్చను ముగింతును.

మధ్యకాలమున దేశమంతటను ముస్లిముల పరిపాలనము ప్రబలుచుండినదనుట అందరెరిగినదే. దాని నెదుర్కొనుట అవసరమాయెను. దక్షిణాపథమున విజయనగరరాజ్యస్థాపన జరిగెను. ఆ రాజ్యము చలువవల్ల మూడు నాలుగు వందల సంవత్సరములవరకు మన సంస్కృతి నిరాఘాటముగా వర్ధిల్లినది. విజయనగరసార్వభౌముల కాలమున నవరాత్రోత్సవములు మహావైభవముతో జరుగుచుండెడివి. తొమ్మిది దినములును అఖండముగా దేవీపూజ జరుగుచుండెను. రాత్రులలో వందలకొలది గొర్రెలును, దున్నలును బలియగుచుండెడివి. ఈ దినములలోనే శస్త్రాస్త్రముల, ఛత్రచామర హస్త్యశ్వ మకుట సింహాసనముల పూజలు జరుగుచుండెడివి. చక్రవర్తి కొలువుదీరి ప్రజల యోగక్షేమముల నరయుచుండెను. ప్రేక్షకుల మనోరంజనమునకై వివిధ వినోదములు జరుపబడుచుండెను. సామంతులు చక్రవర్తికి జోహార్లొనర్చి కానుకలు సమర్పించుచుండిరి. నట్టువకత్తెలు నాట్యమాడుచుండిరి. మల్లులు మల్లయుద్ధము ప్రదర్శించుచుండిరి. సూర్యుడస్తమించగానే వేలాది కాగడాలు వెలిగెడివి. బాణసంచా కాల్చబడెడిది. విజయదశమినాడు వెడలు జనుల ఊరేగింపు పొగడ్తకు మించియుండెను. మొదట రథముల శ్రేణులు, పిదప అలంకృతమైన ఏనుగుల బారులు, పిదప గుర్రముల వరుసలు, తర్వాత వేదపారాయణ మొనరించు బ్రాహ్మణుల పంక్తులు,

బంగారు బెత్తములు ధరించిన సేవికల కాపలాలో వెళ్ళు చున్న కన్యకాజనగణము – ఊరేగింపు కన్నులను మిరుమిట్లు గొలుపుచుండెను. పేజ్ అను పోర్చుగీసు యాత్రికుడు (1522) ఇట్టి విజయదశమ్యుత్సవమును విజయనగరమున తిలకించి "ఆహా! ఇది స్వప్నమా? మిథ్యాకల్పనమా? మృణ్మయమైన ఈ ధరణిలో ఈ అనవద్యసౌందర్య మెక్కడిది?" అని యబ్బుర పడినాడు.

దసరాపండుగ రాయల యాస్థానములోను, సామంతుల యాస్థానములందును మహావైభవముగ జరుగుచుండిన. ఈపండుగను గురించి అబ్దుల్ రజాక్ అను సమకాలిక చరిత్రకారుడు వ్రాసిన విషయముల యనువాదమును శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారి మాటలలో ఉదాహరించుచున్నాను :

"చక్రవర్తి తమపాలెగాండ్రను, నాయకులను, అందరిని తననగరానికి పిలిపించుకొనుచుండెను. మూడు నాలు నెలల ప్రయాణము చేయునంతటి దూరదేశపు సామంతులును వచ్చెడివారు. 1000 ఏనుగులకు రంగులువేసి అలంకరించి పండుగదినములలో మైదానమున నిలిపెడివారు. అందమైన ఒక పెద్ద మైదానములో అయిదారంతస్థుల బంగ్లాలుండెడివి. అన్నియంతస్థులలోను గోడలపై చిత్తరువులు వ్రాయబడియుండెను. మనుష్యులు, జంతువులు, నత్తలు కూడ చిత్రింపబడెను. ఆ చిత్తరువులు అతిసుందరమై కళాకాంతులతో శోభనిచ్చెను. అదే మైదానములో స్తంభాలతో కూడిన తొమ్మిది అంతస్థుల మేడ యుండెను. అది

సాటిలేని అందచందాల మేటి మాలె. చక్రవర్తి సింహాసనము తొమ్మిదవ యంతస్థుపై నుండెను. ఇది చాల పెద్ద సింహాసనమై, సువర్ణమయమై, రత్నాలతో నిండినదై యుండెను. దాని అందాన్ని, అలంకరణాన్ని చూచి ప్రేక్షకులు ముగ్ధులగుచుండిరి. ఆసింహాసనముపై ఆసీనుడై చక్రవర్తి దసరా వేడుకల నవలోకించెడివాడు. ఆయుత్సవము మూడు దినములు జరుగుచుండెను. వేషగాండ్ర వినోదాలు, గారడీ వారి ప్రదర్శనాలు, భోగమువారి ఆటపాటలు చక్రవర్తి యెదుట ప్రదర్శింపబడుచుండెను.'

"'పీస్ అనువాడిదే యుత్సవమును విపులముగా వర్ణించినాడు. పై విషయములతోపాటు మరికొన్ని యిట్లు తెలిపినాడు. 'జట్టీలు కుస్తీలను ప్రదర్శించిరి. రాత్రులందు బాణసంచాలను కాల్చుచుండిరి. అందు నానావిగ్రహాలు, వాటి నుండి పటపటమను బాణాలు ఆకాశాని కెగిరి పగులుచుండెను. కాళీశక్తికి నవరాత్రులలో ప్రతిదినము 24 దున్నపోతులు, 150 మేకలు బలియిచ్చుచుండిరి. తుది దినమునాడు 250 దున్నలను, 400 మేకలను బలియిచ్చుచుండిరి. ప్రతిదినమును బ్రాహ్మణులు దేవీపూజ చేసిరి. గుర్రాల నలంకరించి ఊరేగించిరి'."

నేడు హంపీశిథిలములలో 'మహార్నవమి దిబ్బ'యొకటి. దాని రెండంతస్థులు మాత్రమే మిగిలియున్నవి. అబ్దుల్ రజాక్ చెప్పిన తొమ్మిదంతస్థులమేడ ఇదే.

శ్రీ శాలటోర్ గారు తమ 'సోషల్ అండ్ పొలిటికల్ లైఫ్ ఇన్ ది విజయనగర ఎంపైర్' అను గ్రంథమున నవ రాత్రి బలినిగురించి యిట్లు వ్రాసిరి. "ఒకమారు రాయలు వేటకు వెళ్లి ఒక కారెనుబోతును పట్టుకొనివచ్చెను. అది ఏనుగంతటిది. దాని కొమ్ములు తోకమొదలును తాకునంత పొడవుగ నుండెను. దానిని నవరాత్రోత్సవమున దేవికి బలియివ్వవలెనని రాయల యభిలాష. బలియిచ్చునప్పుడు బలిపశువుమెడ ఒక్క వ్రేటుకే తెగవలెననుట ఆచారము. కనుక ఆ కారెనుబోతును నరకుటకు నాయకులెవరును సాహ సించలేకపోయిరి. అప్పుడు రాయల నమ్మినబంటు విశ్వనాథ నాయకుడు లేచి తనకటారి సవరించి ఒక్క వ్రేటున దానిశిరము ఖండించెను."

జహాంగీర్ కాలమున మానసింహుడు విద్రోహియగు ప్రతాపాదిత్యుడను వంగసామంతుని జయించిన పిదప (1605) అతని కులదేవతయగు యశోహరేశ్వరీమూర్తిని అపహరించు కొని వెళ్లి అమేర్‌లో ప్రతిష్ఠించెనట. దానికి నేటికిని వంగ పూజకులు తమకల్పము ప్రకారము పూజాదులు నిర్వర్తించు చున్నారు.

శివాజీకాలమునాటిగాథను ఇదివరకే తెలిపితిని. అప్పుడు భవానీపూజ మహావైభవముతో నడుచుచుండెడిది.

1742 లో భాస్కర్ పంత్ వంగదేశముపై దాడి జరి పెను. మరుసటి సంవత్సరము ఆతడు దుర్గాపూజ నిర్వహించు చుండగా మహానవమినాటిరాత్రి సూబేదార్ అలీవర్దీఖాన్

అకస్మాత్తుగ తన సైన్యముతో మరాఠీలపై పడెను. మహా రాష్ట్రులు వెనుతగ్గవలసివచ్చెను.

మేవాడ్ లో దుర్గాపూజ వింతగా జరుపబడుచుండెను. దేవీమూర్తికి మారు ఖడ్గపూజ జరుపబడుచుండెను. 'ఖాండా' (ఖండపరశువు) పూజ జరుపబడుచుండెను. దీనిని విశ్వకర్మనుండి మేవాడ్ రాజ్య మూలపురుషుడగు బాప్పారావ్ పొందెనని ప్రథ కలదు.

నేడు దక్షిణభారతమున – తమిళ దేశములోను, కన్నడదేశములోను–నవరాత్రులలో తాటుపూసుకొని వికార వేషములతో నాడువారిని, వారిమధ్యన దేవీ వేషమున నున్న వారిని చూడవచ్చును. ఈ వేషములు మహిషాసురమర్దని, కన్యకాపరమేశ్వరి కృత్యములకు వ్యాఖ్యానములవంటివి.

ఆధునికదృష్టితో నిదియంతయు జూచితిమేని ఈపూజల కంతయును మూలకారణము ప్రకృతియే యను భావ మేర్పడును. ప్రకృతియొక్క నిరంతర పరిణామమునకు పరమావధిగా రూపొందినవాడు మానవుడు. వానిజీవితమునకును ప్రకృతికిని నిత్యసంబంధము గలదు. ఆదికాలమున మానవుడు వివిధరూపములనున్న ప్రకృతినే యారాధించుచు తనవాంఛితములను పొంది కృతకృత్యు డగుచుండెను. రానురాను ప్రకృతియందు దివ్యత్వ మారోపితమైనది. ఇంకనురాగా, ఆ దివ్యత్వము వైవిధ్యము నొందినది. అట్టిప్రక్రియతో నేర్పడిన దేవతలే దుర్గ, సరస్వతి, లక్ష్మి. ధైర్యోత్సాహములకు

దుర్గ, విద్యావిజ్ఞానములకు సరస్వతి, సంపత్సమృద్ధులకు లక్ష్మి అధిష్ఠాన దేవతలుగా భావింపబడిరి.

"షడృతువులలో శరదృతువు ప్రకృతి రమణీయమై యుండును. సస్యసమృద్ధి, జలసమృద్ధి నలువైపుల నిండారి యుండును. వ్యవసాయరూపమైన తన చిరపరిశ్రమమంతయు సఫలము కాగలదన్న విశ్వాస మప్పుడు మానవున కేర్పడును. ఆసమయమున వానియానంద మనంతము. తనయం దప్పటికి నెలకొనియున్న ధైర్యోత్సాహములు, విద్యావిజ్ఞానములు, సంపత్సమృద్ధులు ఇంకను అధికరించవలెనను వాంఛతో ఆదినములలో తదధిష్ఠాన దేవతలను పూజించి, పండుగలు కావించుకొని, తన శరీరబలమును, ఆయా విద్యలయందు తనశక్తి సామర్థ్యములను, తనసంపత్సమృద్ధులను పరిశీలించి పరిరక్షించుకొనును. వాని నింకను పెంపొందించుకొను వెరవుల నిర్ణయించును."

# దీపావళి

దీపావళి పండుగ కడుముచ్చట గొల్పునది; ఆబాల వృద్ధము ఆనందతన్మయులను జేయునది; సేతుశీతనగపర్యం తము జనప్రియమైనది.

ఇది ఆంధ్రదేశమందును, దక్షిణ భారతదేశమం దంతటను మూడునాళ్ల పండుగ. ఆశ్వయుజ బహుళ చతు ర్దశి, అమావాస్య, కార్తికశుద్ధపాడ్యమి – ఈమూడు నాళ్లును కలసి సమగ్రమైన దీపావళి పండుగ. ఈమూడు దినములలో మొదటిది నరకచతుర్దశి, రెండవది దీపావళి అమావాస్య, మూడవది బలిపాడ్యమి. ఉత్తరభారతమున దీనిని ఐదునాళ్లు జరుపుకొందురు. ఆశ్వయుజ బహుళ త్రయోదశి, చతుర్దశి, అమావాస్య, కార్తికశుద్ధ పాడ్యమి, విదియ – ఇవి ఐదు దినములు. మొదటినాడు ధనత్రయోదశి, ధన్ తేరస్ లేక యమత్రయోదశి; రెండవదినము నరకచతుర్దశి; మూడవ దినము దీపావళి, నాల్గవదినము బలిపాడ్యమి, ఐదవదినము భ్రాతృద్వితీయ లేక యమద్వితీయ.

ఈపండుగను ఆచరించు విధానము వ్రతగ్రంథములలో నిట్లు చెప్పబడినది: "త్రయోదశినాటిరాత్రి అపమృత్యు నివారణార్థము నూనెతో దీపమును వెలిగించి దానిని పూజించి ఇంటికెదుటి వెలుపలిభాగమున నుంచవలెను. దీనికి యమదీప మని పేరు. ఇది యముని యనుగ్రహము సంపాదించుటకై చేయునది. చతుర్దశినాటిరాత్రి తృతీయ యామానంతరము

నరకభయ నివారణార్థము అభ్యంగ మంగళస్నానము చేయ వలెను. సర్వసామాన్యగణనము ప్రకారము ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమనాడు అశ్వినీనక్షత్రము రావలెను. అట్లువచ్చిన ఆశ్వయుజ బహుళ చతుర్దశినాటికి స్వాతీనక్షత్రము వచ్చును. ఒక్కొక్కసమయమున స్వాతీనక్షత్రము వెనుకముందులుగ వచ్చుటయు గలదు. చతుర్దశి, అమావాస్య, పాడ్యమి యను నీ మూడుదినములలో నేనాడు స్వాతీనక్షత్రము వచ్చునో ఆ నాడు అభ్యంగస్నానము చేయవలెను. అది సకలైశ్వర్య దాయకము. ఈచతుర్దశినాడు నూనెలో లక్ష్మి, నీటిలో గంగ అధివసించి యుందురు. కనుక చతుర్దశినాడు ఉదయాత్పూర్వమే చంద్రోదయసమయమున తలంట్లు పోసుకొన వలెను. ఈ సమయమున ఉత్తరేణు, సార, తగిరిస ఆకులను తలమీద త్రిప్పుకొని పారవేయవలెను. పిదప యమతర్పణము ఆచరించి నరకుని ఉద్దేశించి నాలుగువత్తులతో దీపము దానముచేయవలెను. ఆ దినము భోజనమున మినప ఆకులతో కూరవండుకోవలెను. సాయంకాలము దేవాలయములలోను మఠములలోను దీపములు వెలిగించవలెను.

మరునాడు అమావాస్య. ఆదినమునను ప్రత్యూషకాలముననే అభ్యంగస్నాన మాచరింపవలెను. ఆస్నానమున పంచత్వక్కులను – మర్రి, మామిడి, అత్తి, జువ్వి, నేరెడుచెట్ల పట్టలను – నీటవేసి, ఆనీటితో స్నానము శుభదాయకము. ప్రదోషకాలమున దీపదానముచేసి ఉల్కలను (కొరువులను) త్రిప్పవలెను. అనంతరము అలక్ష్మి నిరాసార్థము లక్ష్మీపూజ

గావింపవలెను. దేవాలయములందును, చతుష్పథములందును, శ్మశానములందును, నదులయందును, కొండలమీదను, వృక్షమూలములందును, పశువుల కొట్టములందును, ఇండ్ల ముంగిళ్లయందును దీపములను దీపవృక్షములను వెలిగించ వలెను. కర్రలతో చెట్లవలెకట్టి వానిమీద దీపముల నుంతురు. అవి దీపవృక్షము లనబడును. దేవాలయములలో కొన్నింట ఇత్తడితో చేసిన దీపవృక్షము లుండును. ఆకులతో దొన్నెలు కట్టి వానియందు దీపములనుంచి నదులలో, చెరువులలో, కొలనులలో, నూతులలో తేలవిడువవలెను. ఇతరస్థలముల యందును వరుసగా దీపముల నుంచవలెను. నూతన వస్త్ర ములను ధరించవలెను. అన్నార్థులకు ఇష్టమృష్టాన్నదానము చేయవలెను. పగలు భుజించక రాత్రిభోజనము చేయవలెను, అర్ధరాత్రివేళ ఊరిలోనుండు స్త్రీలు చేటలు, తప్పెటలు వాయించుచు సంబరముతో అలక్ష్మిని (జ్యేష్ఠాదేవిని, పెద్ద మ్మను) ఇండ్లనుండి తరిమివేయవలెను. పిదప ఇంటిభవంతిలో ముగ్గులు తీర్చి బలిచక్రవర్తిని స్థాపించి పూజించవలెను. పాడ్యమినాడు బలిచక్రవర్తి యుత్సవము చేయవలెను. బలి పాడ్యమినాడు ఉదయము జూదమాడవలెను. నాడు జూదీ మున జయము పొందినవారికి ఆ సంవత్సరమంతయు జయప్ర దముగ నుండును. పిదప గోవర్ధనపూజ చేయవలెను. గోవుల గవిసెనలు, పాలుపిదుకు పాత్రలు మున్నగువానిని పూజించ వలెను. ఆవులను అలంకరించి యథేష్టముగా నాడనివ్వవలెను. విదియనాడు యమద్వితీయ లేక భ్రాతృద్వితీయ. ఆదినము

తనయింట భోజనము చేయరాదు; చెల్లెలియింటనో, చెల్లెలు లేనియెడల చెల్లెలవంటివారి యింటనో భుజించవలెను. యమునాదేవి యీదినముననే తనసోదరుడగు యమునికి విందుచేసినది. అన్నలకు చెల్లెండ్రకు వస్త్రాభరణాదులు బహూకరించవలెను.''

వ్రతగ్రంథములలో నిట్లున్నను, ఈపండుగ నాచరించుటలో పెక్కుగాథ లున్నవి. వానిలో ప్రధానములయిన వివి: 1. నరకాసురవధ. 2. బలిచక్రవర్తి రాజ్యదానము. 3. శ్రీరాముడు రావణసంహారానంతరము అయోధ్యకు తిరిగి వచ్చి భరతునితో సమావేశమగుట (భరత్ మిలాప్). 4. విక్రమార్కచక్రవర్తి పట్టాభిషేకము.

1. నరకాసురసంహారగాథ భారతదేశమందంతటను ప్రచారములో నున్నది. ఈకథ భాగవతమునను, హరివంశమునను విపులముగ జెప్పబడినది. దాని సంగ్రహమిది:— విష్ణుద్వేషియగు హిరణ్యాక్షుడు భూదేవి నపహరించుకొని పోయి సముద్రమున డాగెను. విష్ణుదేవుడు వరాహరూపము ధరించి సముద్రమున ప్రవేశించి వానిని సంహరించి భూదేవి నుద్ధరించెను. ఆ యసాధారణ పరిస్థితియందు భూదేవికిని, వరాహరూపియగు విష్ణుదేవునికిని కలిగిన సంబంధముచే భూదేవి గర్భమును ధరించెను. ఆ గర్భము వృద్ధియగుకొలది కాఠిన్యము వహించి ప్రసవముకాక భూదేవికి బాధకలిగించెను. అపుడు విష్ణు వామెకు ప్రత్యక్షమై ''నీ గర్భమున

జనించువాడు లోకోత్తర బలపరాక్రమ సంపన్నుడై లోకోప కారి కాగలడని భీతిల్లిన బ్రహ్మాది సురలు నీకీబాధను కలి గించిరి. యుగచతుష్టయ మిరువదేడుమారులు గడచి ఇరువదెనిమిదవ పర్యాయము జరుగనుండ; అందు త్రేతా యుగమున నేను రావణవధార్థము రాముడనుపేర నవతరిం తును. నేను రావణుని సంహరించిన పిదప నీవు కుమారుని ప్రసవింపగలవు. అంతవరకు శిశువు నీ గర్భముననే యుండ గలదు. అందువలన నీకెట్టిబాధయును కలుగబోదు. నీవు భీతి నొందకుము.'' అని యూరార్చి అంతర్ధాన మందెను. అది మొదలు భూదేవి కృశోదరియయి సామాన్యయువతి వలె నుండెను.

పూర్వోక్తక్రమమున యుగచతుష్టయములు గడచిన పిదప త్రేతాయుగమున జనకమహారాజు యజ్ఞభూమిని దున్నుచుండగా భూగర్భమునుండి యొక కుమారి జనించెను. భూదేవి ప్రత్యక్షమై ఆ కుమారికి సీతానామధేయమిడి జన కునకు పుత్రికగా నొసగి ''ఈమె కారణముగా రావణవధ జరుగగల''దని తెలిపి ప్రతిఫలముగా నాతడు తనకొక యుప కారము కావింప ప్రతిన చేయగోరెను. జనకు డట్లు చేయ నంగీకరించి ప్రమాణము చేసెను.

రావణవధానంతరము సీత జనించిన చోటనే భూమి యందుండి యొక కుమారుడు పుట్టెను. విష్ణువు భూదేవికి దర్శనమిచ్చి ''కుమారుని జనకున కప్పగించి పదునారేండ్ల ప్రాయమువరకు పోషింపగోరుము. అతడు నీ కుపకారము

చేసెదనని మాట యిచ్చియున్నాడు - గదా! అతడు తప్పక పోషించును. మనుష్యస్త్రీరూపమున నీవును వానికడనే యుందుము. పదునారేండ్ల ప్రాయమున వాడు సకల సంపత్సమృద్ధమగు రాజ్యమును బడయగలడు.'' అని చెప్పి యదృశ్యుడాయెను.

భూదేవి యర్ధరాత్ర సమయమున నతిరహస్యముగా జనకునికడ కేగి యెల్ల వృత్తాంతమును వినిపించెను. జనకుడును యజ్ఞభూమి కేగి యచ్చటనున్న కుమారు నింటికి గొనివచ్చి వానిని స్వపుత్రనిర్విశేషముగా పెంచుచుండెను. భూదేవియు మానవకాంతారూపము ధరించి, అంతఃపురముననుండి ధాత్రియై వాని పోషణమున జాగరూకత వహించియుండెను.

జనకుడు తొలుత చూచినపుడు బాలుని శిర మొక మృతమానవ శిరస్సుపై నుండినందున వానికి నరకుడను నామ మిడి క్షత్రియోచిత సంస్కారముల నొనరింపించెను. ఆ కుమారుడు గౌతమపుత్రుడగు శతానందునితో క్రమముగా విద్యనభ్యసించి వినీతుడయ్యెను; బలపరాక్రమములతో నొప్పారుచు శస్త్రాస్త్ర ప్రయోగములందు కడు కుశలుడయ్యెను; పదునారేండ్ల ప్రాయమునకు వాడజేయపరాక్రముడై జనకునికి భీతి గొలుపుచుండెను.

నరకునకు పదునారేండ్లు నిండుట కింకను మూడు మాసములుండ భూదేవి జనకునితో రహస్యముగా, ''రాజోత్తమా! నీవు నీ మాట చెల్లించితివి. నీ పోషణమున నా కుమారుడు సకల శ్రేయోభివృద్ధులు గాంచెను. వాడు నిన్ను

వీడిపోవు సమయ మాసన్నమైనది. వానికి సెలవిచ్చి పంపుము.'' అని చెప్పి ఆయన అంగీకారము బడసి, నరకునితో ''కుమారా! గంగానదికడకు బోవుదము రమ్ము. అక్కడ నీ జనకుని జూపెదను. ఈ జనకమహారాజు నీ జనకుడు కాడు. పాలక జనకుడు.'' అని పలికి వానిని దోడ్కొని మాయారూపముతో గంగానదీ తీరమునకుబోయి నిజరూపము ధరించి అతనికి స్వజననాది వృత్తాంతమును వినిపించెను. విష్ణు వపుడు ప్రత్యక్షమై భూదేవిసమక్షమున ''నీకు సకల సంపదలతో తులదూగు రాజ్యము సిద్ధముగా నున్నది. దాని పేరు కామరూపదేశము. ప్రాగ్జ్యోతిషనగరము రాజధానిగా దానిని పరిపాలింపుము. ఇదిగో ఈ శక్త్యాయుధమును గ్రహింపుము. ప్రాణాంతక స్థితియందు తప్ప దీనిని ప్రయోగింతువేని నీ ప్రాణములకే ముప్పు వాటిల్లును. సాధువుల నెప్పుడును బాధింపకుము. చిరంజీవివై మనుము.'' అని నరకునికి హితోపదేశము కావించి శత్రుదుర్భేద్యమును, అపూర్వమును నగు నొక దివ్యరథముగూడ నిచ్చి భూదేవితోగూడ నంతర్ధానమందెను. నరకు డటనుండి ప్రాగ్జ్యోతిషమునకు బయలుదేరెను.

బ్రహ్మదేవుడు తొలుత నక్షత్ర సృష్టి కావించిన ప్రదేశమునకు ప్రాగ్జ్యోతిషమని పేరు కలిగినది. ఆ నగరము రాజధానిగా ఘటకుడను కిరాతరాజు కామరూపదేశమును పాలించుచుండెను. వానిని జయించి నరకుడు దానికి రాజయ్యెను. విదర్భరాజపుత్రి మాయాదేవి వానికి పట్టమహిషి యయ్యెను.

వాడు సౌజన్యముతో బహుకాలము రాజ్యముచేసెను. జనక మహారాజును వాని సేవలుగొనుచు ప్రాగ్జ్యోతిషపురమున కొంతకాల ముండెను.

ద్వాపరయుగమున బాణుడను రాక్షసుడు జనించెను. వాడు కడు దుర్జనుడు. వానితో నరకునికి చెలిమి కలిగెను. తన్మూలమున క్రమముగా నరకుడును మిగుల లోకోపద్రవ కారి యాయెను.

వశిష్ఠు డొకనాడు ప్రాగ్జ్యోతిషపురమున నెలకొని యున్న కామాఖ్యాదేవి నారాధింపబోయెను. నరకు డాయన దేవాలయమునకు బోకుండ ఆలయము తలుపులు మూయించెను. ఆయన కుపితుడై "నీవు మదగర్వితుడవై సజ్జనావమానము మితిమీరి చేయుచున్నావు. నీ జన్మదాతచేతనే నీకు మరణము సంప్రాప్తము కాగలదు. నేను నీవు మరణించిన తర్వాత వచ్చి దేవి నారాధింతును. నీ మరణపర్యంతము దేవి స్వకీయపరివారముతోగూడ నీ నగరమును త్యజించి స్థలాంతరమున నివసింపగలదు." అని శపించి వెడలిపోయెను.

నరకుడు వశిష్ఠ శాపభీతుడై బాణాసురుని యుపదేశమున బ్రహ్మదేవు నుద్దేశించి యుగ్రమగు తపము చేసెను. ఆయన ప్రసన్నుడై దర్శనమీయగా ఆయనవలన తనకు సురాసురలచేత చావు లేకుండునట్లు వరమును బడసెను; వరగర్వితుడై యది మొదలుకొని యింకను దుష్కార్యముల నాచరించుచుండెను. భగదత్తుడు మొదలగు కుమారుల

తోడను, మురుడు మొదలగు సేనానులతోను గూడి ఇంద్రాది దేవతలను జయించెను; ఋషులను బాధించెను; పదునారు వేల రాజకన్యలను చెరగొనెను. ఇంద్రజనని యగు దితి యొక్క కుండలముల నపహరించెను. నానాటికిని మితిమీరు చుండిన వాని బాధలను సహింపజాలని ఇంద్రాది దేవతల ప్రార్థనమున ద్వాపర యుగాంత్యకాలమున భూభారహరణార్థ మవతరించిన విష్ణుదేవుడగు కృష్ణుడు వానిని సంహరింప కామ రూపమునకు వెళ్లెను. "మీరు కన్యాజనము నుద్ధరించుటకు వెళ్లుచుండ నేను ఇంట నుండను. నరకాసురునితో నేనును పోరాడుదును. మీరు నాకు సాయపడుడు." అని సత్యభామ కృష్ణుని గోరెను. శ్రీకృష్ణుడు దాని కంగీకరించెను. శ్రీకృష్ణునికిని నరకుని బలమునకును ఘోరమగు పోరు కలిగెను. శ్రీకృష్ణుడు మొదట నరకాసురుని సేనాపతియగు మురాసురుని, పిదప నాతని కుమారుని సంహరించెను. నరకు డది సహించక కృష్ణునితో తలపడెను. అప్పుడు సత్యభామ అద్భుతగిలి నరకు నితో పోరెను. ఇరువురకును ఘోరయుద్ధము జరిగెను; సత్య భామ మిగుల నలసిపోయెను. అదిచూచి కృష్ణుడు ఆమెకు బాసటగా నిలచి నరకాసురుని సంహరించెను; రాజకన్యల చెర విడిపించెను.

ఆశ్వయుజ కృష్ణ చతుర్దశినాటిరాత్రి రెండుజాములకు తరువాత నరకాసుర సంహారము జరిగినది. నరకుని పీడ వదలు టచే ఆనందపరవశులైన లోకులు శేషించిన యా రాత్రి భాగముననే, మరుదినముననే మహోత్సవములు జరుపు.

కొనిరి. ఆ యుత్సవదినములు రెండును వరుసగా నరక చతుర్దశి, దీపావళి అమావాస్య యను పేరులతో ప్రసిద్ధములైనవి. ఆనాటి యుత్సవములకు చిహ్నముగా ప్రజ లేటేట ఈ రెండు దినములందును గొప్పగా పండుగులు చేసుకొనుచున్నారు.

ఈ నరకాసుర వృత్తాంతము కొంత కొంత భేదముతో వేరు వేరు గ్రంథముల నభివర్ణితమైనది.

2. బలిచక్రవర్తి రాజ్యదానకథ : ఈ కథ భాగవతమునను, ఇతర పురాణములయందును విపులముగా వర్ణితమైనది. పూర్వము బలియను దైత్యరాజుండెను. అతడు అజేయ బలపరాక్రమ సంపన్నుడు. మహాదాని. అతడు దేవతల నందరిని జయించి తన మందిరమున బందెలో వైచెను. ఇంద్రాదులు తమ గోడును విష్ణువునకు తెలిపి తమ్ముద్ధరింప ప్రార్థించిరి. విష్ణువు వారి మొర విని "వైరోచని పుత్రుడగు బలి మహాతపశ్శాలి. శమదమాది గుణసంపన్నుడు. జితేంద్రియుడు, సత్యసంధుడు, మహాబలుడు, ప్రజాపతితో సమానుడు. తన రాజ్య ప్రజలకు మేలుచేయువాడు. మద్గత ప్రాణుడగు భక్తుడు. అతని గుణములు వర్ణించుటకు అలవికానివి. అతడు తపఃఫల మింకను బహుకాలము అనుభవించవలసి యున్నది. తపఃఫలము అంతముకాగానే అతనిని జయింతును; అతని రాజ్యమును దేవతల కిత్తును. అదితి యిప్పుడు పుత్రుని కొరకై నన్ను వేడుచున్నది. ఆమె అభీష్టమును నెరవేర్చెదను." అని చెప్పి, వారి నూరడించి పంపెను.

పిదప కొంత కాలమునకు అదితి గర్భవతి యాయెను. తొమ్మిదవ నెలలో ఆమె విష్ణ్వంశసంభూతుడైన ఒక కుమారుని భాద్రపద శుక్ల ద్వాదశినాడు, శ్రవణ నక్షత్రమున ప్రసవించెను. అతడు మరుగుజ్జు. అతని కాలుసేతులు పొట్టివై, కృశించియుండెను. శిరస్సు పెద్దదిగ నుండెను. ఇట్టి వామనుని చూచి అదితి సంతోష మందెను. దేవతలు పొంగి పోయిరి; దైత్యుల గుండె లవిసెను. అతనికి జాతకర్మ నామ కరణాదులను కశ్యపుడు ఒనర్చెను.

ఇట్లుండ నొకమారు బలి గొప్ప యజ్ఞ మొనర్చెను. అచటికి బ్రహ్మచారియగు వామనుడు జటామకాంజ్యాజిన యజ్ఞోపవీత ధారియై బయలువెడలెను. అచ్చట దైత్యబల మంతయు చేరియుండెను. దాని యెదుట వామనుడు సవినయ ముగా బలితో నిట్లనెను : "మహాబాహో! యజ్ఞపతీ! నాకు చదువుకొనుటకు మూడడుగుల భూమి కావలెను. దాన మిమ్ము." బలిమహారాజు అర్థులకు లేదనువాడు కాడు. కనుక "ద్విజోత్తమ! నీవు కోరినది యిచ్చితిని." అనెను.

ఆ మాట వినిన పిదప వామనుడు "ఇంతింతై" పెరుగుట కారంభించి అనంత విక్రమముతో ఒక అడుగుతో భూమిని, రెండవయడుగుతో స్వర్గాదిలోకములను ఆక్రమించెను. మూడవయడుగునకు స్థానము లేకపోగా "ఈ యడుగు పెట్టు టకు నాకు ఏ ప్రాంతము చూపెదవు ?" అని బలిని ప్రశ్నించెను. అత్యాశ్చర్యకరమైన ఆ వామనుని చర్యను చూచి దేవర్షులు, దేవతలు ప్రశంసించిరి. బలి ప్రాంజలియై మూడవ

యడుగును తన మస్తకముపై నిడు మనెను. వామనుడు ప్రసన్నుడై "బలిమహారాజా! నీవు స్వబలములతో పాతాళము నకు పొమ్ము. అచట నా రక్షణముతో నీవు కోరినవన్నియు ననుభవించుచునుండుము. ఈ యింద్రుని యనంతరము నీవే యింద్రుడ వగుదువు." అనెను.

ఆ మాట లాలకించి బలి వామనుని, ఇంద్రుని నమస్కరించి పాతాళమునకు బోయెను. పిదప వామనుడు దేవతలను వారిలోకములకు పంపుచు "విగతజ్వరులై యుండుడు!" అని హెచ్చరించెను. ఈ జగత్కార్యానంతరము అతడు అంతర్ధానమందెను.

3. భరత్ మిలాప్ :— శ్రీరామచంద్రుడు రావణ వధానంతరము లంకనుండి అయోధ్యా నగరమునకు మరల వచ్చినదియు, అతనికి పట్టాభిషేకము జరిగినదనియును ఈనాడే యనుటయు గలదు. రామచంద్రుడు భరతునితో మరల గలియుటకు ఉపలక్షముగా "భరత్ మిలాప్" అను పండుగ ఉత్తరభారతమున నేటికిని జరుగుచున్నది. ఈ విశ్వాసమువల్లనే రాజులు విజయదశమినాడు సీమోల్లంఘనముచేసి శత్రువులపై దాడివెడలి, విజయముతో దీపావళి అమావాస్యనాడు మరలివచ్చుట సంప్రదాయ మాయెను.

4. విక్రమార్క పట్టాభిషేకము :—విక్రమార్క చక్రవర్తి కార్తిక శుక్ల పాడ్యమినాడు పట్టాభిషిక్తుడాయెను గనుక ఈ ఉత్సవము అతని జ్ఞాపకముకొరకు చేయబడుచున్నదను

ప్రవాదమును గలదు. నేటినుండియే విక్రమశక మారంభ మగును. విక్రమార్కుడు క్రీస్తుకు 55 సంవత్సరములకు ముందు ఉజ్జయిని రాజధానిగా ఆర్యావర్తమును పాలించిన మహాపరాక్రమవంతుడు; అతిమానుషములగు కార్యముల నొనర్చెననియు పెక్కు గాథ లున్నవి. ఈతని పేరనున్న శకము – విక్రమశకము – ఉత్తరభారతమున ప్రచారములో నున్నది. ఇతడు తర్వాత ఆంధ్రుడగు శాలివాహన చక్రవర్తితో పోరి యోడిపోయెను. అప్పటినుండియు దక్షిణాపథమున శాలివాహనశకమే ప్రచారమున నున్నది.

ఈ కథలలో బలిచక్రవర్తి కథ తప్ప మరియేదియు వ్రతగ్రంథములలోను, ధర్మశాస్త్రగ్రంథములలోను కనిపించదు. అన్ని గ్రంథములలోను బలిచక్రవర్తి గాథయే వివరింపబడినది; నేడు మిగుల ప్రచారములోనుండి, ఈ పండుగకు ప్రధానమని భావింపబడు టపాకాయలు మున్నగు బాణసంచా కాల్పులు జరుపబడు నరకాసురవధ కథాప్రస్తావమే కనిపించదు. ధర్మసింధువులో నిట్లున్నది :

''ఆశ్వీన కృష్ణ పక్షచతుర్దశ్యాం చంద్రోదయ వ్యాపిన్యాం నరకభీరుభి స్తిలతైలే నాభ్యంగస్నానం కార్యం. అభ్యంగస్నానోత్తరం తిలకాది కృత్వా కార్తికస్నానం కార్యం......కార్తికస్నానోత్తరం యమతర్పణం కార్యం.

తతః ప్రదోషసమయే దీపా న్దద్యా న్మనోహరాన్,
దేవాలయే మఠేవాపి ప్రాకారోద్యానవీథిషు.
గోవాజిహస్తి శాలాయా మేవం షుస్రత్రయే పిచ,

తులాసంస్థే సహస్రాంశౌ ప్రదోషే భూతదర్శయోః.
ఉల్కాహస్తాః నరాః కుర్యుః పితౄణాం మార్గదర్శనం.

అథాశ్వీన్యమావాస్యాయాం ప్రాత రభ్యంగః ప్రదోషే దీపదాన లక్ష్మీపూజనాది విహితం...చతుర్దశ్యాది దినత్రయేపి దీపావలి సంజ్ఞకే యత్ర యత్రాహ్ని స్వాతీ నక్షత్రయోగ స్తస్య తస్య ప్రాశస్త్యాతిశయః...అథ కార్తిక శుక్ల ప్రతిపత్కృత్యం....అస్యాం ప్రతిపది బలిపూజా దీపోత్సవో గోక్రీడనం గోవర్ధనపూజా మార్గపాలీబంధనం వష్టికాకర్షణం నవవస్త్రధారణాద్యుత్సవో ద్యూతం నారీకర్తృకనీరాజనం మంగళమాలికా చేత్యేవమాదీని కృత్యాని...ముఖ్యగోవర్ధన సాన్నిధ్యే తస్యైవ పూజా. తదసాన్నిధ్యే గోమయే నాన్నకూటేనవా గోవర్ధనం కృత్వా తత్సహితగోపాల పూజాకార్యా.

బలిరాజ్ఞో ద్వారపాలో భవా నద్య భవ ప్రభో,
నిజవాక్యార్థనార్థాయ సగోవర్ధన గోపతే.

...యమద్వితీయా...అస్యాం యమునాస్నాన మపరాహ్ణే చిత్రగుప్త యమదూతసహిత యమపూజనం యమాయార్ఘ్యప్రదానం చ విహితం.''

''ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు తెల్లవారు జామునసే నరకభయనివారణార్థము నూవులనూనెతో అభ్యంగ స్నానము చేయవలెను. పిదప కార్తిక స్నానము. తర్వాత యమతర్పణము. పిమ్మట సాయంకాలమున ప్రదోష సమయమున దేవాలయములలోను మఠములలోను ప్రాకారములయందును, ఉద్యానములయందు ధేన్వశ్వగజ శాలలయందును

మూడు దినములయందును దీపమాలికలు పెట్టవలెను. సూర్యుడు తులారాశిలో నున్నప్పుడు కృష్ణపక్ష చతుర్దశి అమావాస్యల ప్రదోషసమయమందు కొరువులు చేత పట్టుకొని పితరులకు దారిచూపవలెను. అమావాస్యనాడు ఉదయము తలంటుకొని ప్రదోషసమయమున దీపములు వెలిగించి లక్ష్మిపూజ చేయవలెను. చతుర్దశి అమావాస్య పాడ్యమి – ఈమూడు దినములకును దీపావలి యని పేరున్నను ఏనాడు స్వాతీనక్షత్రము వచ్చునో ఆనాడు ఉత్తమమైనది. కార్తిక శుక్ల పాడ్యమిని బలిపూజ, దీపోత్సవము, గోవుల ఆటలు, గోవర్ధనపూజ, మార్గపాలి బొమ్మను కట్టుట, పగ్గము లాగుట, నూతన వస్త్రధారణము, జూదము జరుపవలెను. స్త్రీలు నీరాజనము జరుపవలెను. గోవర్ధనపర్వతము దగ్గర నున్న దానికే పూజ. అట్లు లేకపోయిన పేడతోగాని, అన్నపురాశితోగాని గోవర్ధనము చేసి గోపాలునితోపాటు పూజించవలెను. విదియనాడు యమునాస్నానము, చిత్రగుప్త యమదూత సహితుడైన యముని పూజించవలెను. యమునికి అర్ఘ్యమీవలెను.''

''కార్తికస్యాసితే పక్షే త్రయోదశ్యాం నిశాముఖే,
యమదీపం బహిర్దద్యా దపమృత్యు ర్వినశ్యతి.''

త్రయోదశి నాటి సాయంకాలము ఇంటి వెలుపల యముని కొరకు దీపము వెలిగించవలెను. దీనివలన అపమృత్యువు నశించును – అని స్కాందపురాణమున జెప్పబడినది.

"కార్తికే కృష్ణపక్షేతు చతుర్దశ్యా మినోదయే,
అవశ్యమేవ కర్తవ్యం స్నానం నరకభీరుభిః."

అని భవిష్యోత్తరమున గలదు.

"అమావాస్యా చతుర్దశ్యోః ప్రదోషే దీపదానతః,
యమ మార్గాధికారేభ్యో ముచ్యతే కార్తికే నరః."

అమావాస్యా చతుర్దశులందు ప్రదోష సమయమున దీపదాన మొనర్చుటవలన మానవుడు యమమార్గాధికారములనుండి విముక్తుడగుచున్నాడు. — అని బ్రాహ్మవచనము.

"దీపోత్సవచతుర్దశ్యాం కార్యంతు యమతర్పణమ్."

దీపోత్సవచతుర్దశినాడు యమతర్పణము చేయవలెను — అని మదనపారిజాతమున గలదు. స్మృతికౌస్తుభము మున్నగు ధర్మశాస్త్ర గ్రంథములయందును ఇట్లే చెప్పబడినది.

హేమాద్రి దీనిని కౌముదీ మహోత్సవమని నిర్వచించి నాడు. నరకచతుర్దశినాడు

"యమాయ ధర్మరాజాయ మృత్యవే చాంతకాయచ,
వైవస్వతాయ కాలాయ సర్వభూత క్షయాయచ.
ఔదుంబరాయ దధ్నాయ నీలాయ పరమేష్ఠినే,
వృకోదరాయ చిత్రాయ చిత్రగుప్తాయ వై నమః.
నరకాయ ప్రదాతవ్యో దీపః సంపూజ్య దేవతాః."

అని యమునికి తర్పణ మాచరించి దీపదానము చేయ వలె ననినాడు.

వ్రతచూడామణిలో వామనపురాణ, భవిష్యోత్తర పురాణముల భాగము లీక్రింది విధముగ నుదాహరించ బడినవి :

“ఆశ్వినస్యాసితే పక్షే త్రయోదశ్యాదిషు త్రిషు,
క్రమా త్పాదై స్త్రిభి ర్విష్ణుః అగ్రహీ ద్భువనత్రయం.
మహారాజో బలిః ప్రోక్తః తుష్టేన హరిణా తతః,
వరం యాచయ భద్రం తే యద్య న్మనసి వర్తతే.
ఇతి విష్ణువచః శ్రుత్వా బలి ర్వచన మబ్రవీత్,
ఆత్మార్థే న చ యాచేహం సర్వం దత్తం మయా తవ.
లోకార్థం యాచయిష్యామి శక్త శ్చే ద్దేహి మే ప్రభో,
మయా యా తే ధరా దత్తా వామన ఛద్మరూపిణే.
త్రిభిః పాదైః త్రిదివసైః సా చాక్రాంతా యత స్త్వయా,
తస్మా దేత ద్బలే రాజ్య మస్త్వహ్నాం త్రితయం హరే.
మద్రాజ్యే దీపదానం యే భువి కుర్వంతి మానవాః,
తేషాం గృహే తవ స్త్రీయం సదా తిష్ఠతు సుస్థిరా.
మమరాజ్యే గృహే యేషా మంధకారః పతిష్యతి,
అలక్ష్మ్మి సహిత స్తేషా మంధకారో స్తు సర్వదా.
చతుర్దశ్యాం తు యే దీపా న్నరకాయ దదంతి చ,
తేషాం పితృగణా స్సర్వే నరకా త్స్వర్గ మాప్నుయుః.
బలిరాజ్యం సమాసాద్య యై ర్న దీపావళిః కృతా,
తేషాం గృహే కథం దీపాః ప్రజ్వాలిష్యంతి కేశవ.”

ఆశ్వయుజ బహుళ త్రయోదశి, చతుర్దశి, అమావాస్యలయందు విష్ణువు క్రమముగా మూడడుగులతో భువన

త్రయమును ఆక్రమించెను. విష్ణువు పిదప సంతుష్టుడై "నీ మనసులోని మేలైన వరము నడుగుము" అని బలిచక్రవర్తిని కోరెను. ఆ మాట విని బలిచక్రవర్తి "నా సర్వస్వమును నీ కిచ్చితిని. నాకై కోరదగిన దేదియును లేదు. లోకమునకై ఒక్క వర మడుగుచున్నాను. సమర్థుడవైనచో నిమ్ము. నేను దానమిచ్చిన భూమిని మూడు దినములు మూడు పాదములతో వామనుడను ఛద్మరూపముతో ఆక్రమించుకొంటివి గనుక, ఈ మూడు దినములును బలిరాజ్య మగుగాక! నా రాజ్యమున దీపదాన మొనర్చువారియింట నీసతి-లక్ష్మి-శాశ్వతముగ నుండుగాక! నా రాజ్యమున ఎవరియింట అంధకారముండునో జ్యేష్ఠాదేవితోపాటు వారికి ఎల్ల కాలము చీకటి యగుగాక! చతుర్దశినాడు నరకార్థము దీపదాన మొనర్చువారి పితృగణము నరకమునుండి స్వర్గమునకు బోవును. బలిరాజ్యమున దీపావళి నెలిగించనివారియిండ్లలో దీపము లెట్లువెలుగును! అని ఈ శ్లోకముల యర్థము.

నారద పురాణమున నిట్లున్నది :

"చతుర్దశీ దినే రాజ్యం బలే ర స్త్వితి యాచయేత్,
పురా వామనరూపేణ ప్రార్థయిత్వా ధరా మిమాం.
దదా వతిథి రింద్రాయ బలిం పాతాళవాసినం,
కృత్వా దైత్యపతిం పశ్చా దహోరాత్ర త్రయే హరిః.
తస్మా న్మహోత్సవం చాత్ర సర్వదైవ హి కారయేత్,
మహారాత్రి స్సముత్పన్నా చతుర్దశ్యాం మునీశ్వరాః.
అత స్తదుత్సవః కార్యః........

నరకస్థా శ్చ యే ప్రేతాః తే మార్గం తు వ్రతా త్సదా,
పశ్యంత్యేవ న సందేహః కార్యో త్ర మునిపుంగవైః.''

చతుర్దశినాడు బలిరాజ్య మేర్పడవలెనని సూచించవలెను. పూర్వము హరి వామనరూపమున అతిథియై బలియొద్దకు వెళ్ళి, అతనిని యాచించి ఈ భూమిని మూడహోరాత్రములలో ఇంద్రునికి అప్పగించి, బలిని పాతాళవాసిగా నొనర్చెను. కనుక ఈ మూడు దినములును మహోత్సవ మొనర్పవలెను. మునీశ్వరులారా మహారాత్రి మొదలయినది. కనుక ఆ ఉత్సవ మాచరింపవలెను......... ఈ వ్రతమువలన నరక మందున్న ప్రేతలుగూడ తమ దారిని చూచుకొందురు. కనుక ఈ వ్రతము ఆచరించవలెను.

ధర్మశాస్త్ర వ్రతగ్రంథములయందును, పురాణముల యందును నరకాసుర వధ దీపావళి పండుగకు కారణమని ప్రమాణము లేనందున నరకాసురవధకథ విశ్వసనీయము కాదనియే తోచుచున్నది. ఈ వ్రతగ్రంథములలోని 'నరక' శబ్దమునకు నరకము అనుటకుమారు నరకాసురుడు అని అన్వయించి తర్వాతివారు పురాణకథతో జోడించి యుందురు. అనాదిజాతులకు ఆవాసమగు అస్సాము ప్రాంతము నరకుని వధతో ఆర్యజాతికి వశమయి యుండుననియు, తదుపలక్షణముగా దీపావళితో నీ కథ జోడింపబడినదనియు నొక పండితు డన్నాడు.

విక్రమార్క సింహాసనాధిరోహణకాలము దీపావళి నాడు జరిగియుండవచ్చును. దానికి ప్రమాణముగా ఆనాటి

నుండియే విక్రమశకము ఆరంభమగుచున్నది కదా. ఇది కేవలము చారిత్రకముకాని వ్రత విధులకు సంబంధించినది కాదు.

రామ పట్టాభిషేకముగాని, భరతునితో రామ సమాగమముగాని ఈనాడు జరిగినట్లు ప్రమాణ మేదియును లేదు. రావణవధానంతరము రామచంద్రుడు పంచమినాడు అయోధ్య చేరినట్లు రామాయణమున గలదు :

"పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః,
భారద్వాజాశ్రమం ప్రాప్య వవందే నియతో మునిం."
(రా. యు. స. 124. శ్లో. 1)

దీనికి గోవిందరాజీయ వ్యాఖ్యలో నిట్లు వివరణము కలదు : "పూర్ణ ఇతి :— పూర్ణే చైత్రశుద్ధ పంచమ్యా మయోధ్యాతో నిర్గమనం. తదారభ్య చతుర్దశవర్షే పూర్ణే సతి పంచమ్యాం చైత్రశుద్ధ పంచమ్యాం. తథాహి. చైత్రశుద్ధ పంచమ్యాం నిర్గమః. తద్రాత్ర్యాం తమసాతీరే నివాసః. షష్ఠ్యాం శృంగిబేరపురే. సప్తమ్యాం వనస్పతిమూలే. అష్టమ్యాం భారద్వాజాశ్రమే...ఏవ మాశ్రమమండలవాసేన సహ సార్ధమాసేషు దశ సంవత్సరేషు గతేషు, అవశిష్టకాలే పంచవటీవాసే, తత్ర త్రయోదశ వర్షేషు గతేషు, తతశ్చతుర్దశే వర్షే చైత్రమాసే సీతాహరణం. వైశాఖే సుగ్రీవ దర్శనం. ఆషాఢే వాలివధః. ఆశ్వయుజే సైన్యోద్యోగః. ఫాల్గునే ప్రాయోపవేశః. ఫాల్గున శుద్ధ చతుర్దశ్యాం లంకాదాహః. ఫాల్గునామావాస్యాయాం రావణవధః. చైత్రశుద్ధ

ప్రతిపది రావణసంస్కారాది. ద్వితీయాయాం విభీషణాభిషేకః సీతాప్రాప్తి దేవతాప్రస్థానాని చ. తృతీయాయాం లంకాతో నిర్గమనం. చతుర్థ్యాం కిష్కింధాయాం వాసః. పంచమ్యాం భరద్వాజాశ్రమే వాసః.''

శ్రీరాముడు పదునాలుగేండ్లు వనవాసము పూర్తయిన పిదప చైత్రశుద్ధ పంచమినాడు అయోధ్య చేరాడట. చైత్ర శుద్ధ పంచమినాడు అయోధ్యనుండి అరణ్యమునకు బయలు దేరుట, ఆనాటి రాత్రి తమసానదీతీరమున నివాసము, షష్ఠి నాడు శృంగిబేర పురమున విడిది, సప్తమినాడు వటవృక్షము క్రింద విశ్రాంతి, అష్టమినాడు భారద్వాజాశ్రమమున సత్కారము... ఇట్లాశ్రమములలో నివసించుచు పదిసంవత్సరములు అర్ధమాసమును గడచిపోగా, పిదప పదమూడేండ్లు ముగియు వరకును పంచవటిలో నివాసము, పదునాల్గవయేట చైత్రమాసమున సీతాపహరణము, వైశాఖమాసమున సుగ్రీవదర్శనము, ఆషాఢమాసమున వాలివధ, ఆశ్వయుజమాసమున సేనలను కూర్చుకొనుట, ఫాల్గునమాసమున ప్రాయోపవేశము, ఫాల్గున శుద్ధచతుర్దశినాడు లంకాదహనము, ఫాల్గునామావాస్యనాడు రావణవధ, చైత్రశుద్ధ పాడ్యమిని రావణ దహన సంస్కారాదులు, ద్వితీయనాడు విభీషణపట్టాభిషేకము, సీతాప్రాప్తి, దేవతా ప్రస్థానాదులు, తదియనాడు లంకనుంచి ప్రయాణము, చతుర్థినాడు కిష్కింధకు రాక, పంచమినాడు భరద్వాజాశ్రమములో నివాసము.

భరద్వాజముని రామునిచూచి "రేపు నీవు అయో ధ్యకు వెళ్ళవచ్చును. నేడు నా ఆతిథ్యము స్వీకరించుము." అని కోరెను.

"అహ మ ప్యత్ర తే దద్మి వరం శస్త్రభృతాం వర,
అర్ఘ్యం ప్రతిగృహాణేదం అయోధ్యాం శ్వో గమిష్యసి."
(యు. 124-17.).

దీనినిబట్టి షష్ఠినాడు రాముడు అయోధ్యకు చేరెనని స్పష్టము. పిదప అయోధ్య స్థితిగతులు తెలుసుకొనుటకు రాముడు హనుమంతుని అయోధ్యకు పంపును. భరతుడు వానిని సముచితముగా సత్కరించును. "నేడు రామచంద్రుడు భారద్వాజ ముని సన్నిధిలో ఉన్నాడు. రేపు పుష్యనక్షత్రము. కనుక రేపు రాముని నీవు దర్శింపగలవు" అని హనుమంతుడు భరతునితో ననును.

"తాం గంగాం పున రాసాద్య వసంతం మునిసన్నిధౌ,
అవిఘ్నం పుష్యయోగేన శ్వో రామం ద్రష్టు మర్హసి."
(యు. 128-54)

"తత స్సప్తమ్యుదయానంతరం పుష్య నక్షత్రే గురు వాసరే అభిజిద్వేళాయాం శ్రీరామపట్టాభిషేకః." సప్తమి నాడు రామపట్టాభిషేకమని "రామాయణ సారసంగ్రహ" కారులు వేంటాచార్యులు తెలుపుచున్నారు.

ఈ ప్రమాణములనుబట్టి ఆశ్వయుజమాసమున వచ్చు దీపావళితో రామచంద్ర పట్టాభిషేకమునకుగాని, 'భరత్ మిలాప్'నకుగాని సంబంధము లేదనుట స్పష్టమయినది.

త్రయోదశినాడు సాయంకాలము యమదీపముపెట్ట వలెననియు, చతుర్దశినాడు నరకక్షయార్థము స్నానమొన రించి యమతర్పణ మాచరించి, దీపదాన మొనర్చి, ప్రదోష సమయమున పితృగణమునకు దారిచూపుటకు కొరవులు తిప్పవలెననుటయు, అమావాస్యనాడు తర్పణాదులు, పాడ్యమి నాడు మార్గపాలీ బంధము (దారిచూపుటకొరకు పొలి మేరలో గడ్డిబొమ్మలు కట్టుట), ద్వితీయనాడు మరల యముని పూజించుటయు, బలిచక్రవర్తి కథతో సంబంధముండుటయు పరిశీలింపగా, ఈ పండుగ పితరులను నరకవిముక్తి చేయుట కేర్పడినదనియే తోచుచున్నది.

ఉత్తరాయణము మేషమునుండియు, దక్షిణాయనము తులనుండియు ఒకప్పుడు ప్రారంభమగుచుండెనని వరాహ మిహిరుడు బృహత్సంహితలో చెప్పినది, తర్వాత అయనము లెట్లు మారినది ఉగాది పండుగలో మనము చర్చించినాము. దేవతలకు తులా సంక్రమణమునుండి రాత్రి ప్రారంభమగును. ''మహారాత్రి స్సముత్పన్నా చతుర్దశ్యాం మునీశ్వరాః'' అను వాక్యమువలన దీర్ఘరాత్రి ప్రారంభమగునని తెలియుచున్నది. ఈ ఆరునెలలరాత్రియందు పితరులు సద్గతిపొందుటకు దీపావళి నాడేకాక కార్తికమాసమంతయు దీపములుపెట్టుట యాచార మైనది. ఉల్కలను తిప్పుటకుమారే నేటి ఉప్పుపొట్లములు, గోగువత్తులు, టపాకాయలును.

బలిచక్రవర్తిని విష్ణువు మూడుపాదములతో పాతాళ మునకు అణగత్రొక్కెను గదా! విష్ణువనగా సూర్యుడని,

ఇతని మూడుపాదములు ఉదయ మధ్యాహ్నాస్తమయములే నని తిలక్‌గారు తెలిపియున్నారు. ఈ పాదములలో రెండు మాత్రము కనిపించునని, మూడవది కన్పించదని ఋగ్వేద మున (1–155–5) వర్ణితమైనదనియు వారు తెలిపినారు. విష్ణువు బలిని పాతాళమునకు అణగద్రొక్కి యతనికి ద్వార పాలకుడుగా నున్నాడని కథలో నున్నది. అనగా సూర్యుడు క్షితిజముక్రిందికి మునిగిపోయి దీర్ఘరాత్రి ఏర్పడినది గనుక "చతుర్దశ్యాం దినే రాజ్యం బలే రస్త్వితి యాచయేత్"– మరల బలిరాజ్యము కావలెనని యాచించుట–మరల సూర్యుడు ఉదయించి తమ కగపడవలె ననుట.

అయిన నరకాసురవధగాథ యేల ఇంత ప్రసిద్ధి పొందినదని సందేహము కలుగవచ్చును. జ్యోతిశ్శాస్త్ర సంబంధమగు రహస్యమొకటి యిం దిమిడియున్నది. నరకా సురవధ చతుర్దశినాడు ఆకాశమున రాసుల స్థితిని తెలుపు నట్టిది. తులారాశి తూర్పు క్షితిజముమీద ఉదయించు చుండగా, పడమటి క్షితిజముమీద మేషరాశి అస్తమించు చుండును. ఈ మేషరాశి భౌమునిరాశి. నరకుడు భూదేవి కుమారుడు. మేషము స్వభావతః సాధువే అయినను మూర్ఖ తకు మూర్తి. నరకుడును అట్టివాడే. కనుక అతని పరిపాలన అంధకార బంధురమైనది. అనగా ఆదినములలో మేషరాశి సూర్యాస్తమయ సమయమున ఉదయించును. మరల అస్త మించువరకును చీకటియే. మేషరాశి అస్తమించు వేళకు తులా రాశి తూర్పు దిక్కున క్షితిజముమీదికి వచ్చును. స్వాతీ

నక్షత్రమునకు వాయువు దేవత. దానిని అధిష్ఠించి నరకుని మీదికి యుద్ధమునకు బయలు వెడలిన కృష్ణుడు సూర్యుడు; సత్యభామ చంద్రుడు. నరకుడు పడిపోగానే ఆకాశపు అంచుల మీద దీనచ్ఛాయలతోనున్న కన్యారాశి (కన్యలగుంపు) నరకుని బందెనుంచి విడివడి, తమను విడిపించిన సూర్యుని—కృష్ణుని నాయకునిగా చేసుకొనినది. దీనిని పురాణకథతో అతికించినారు.

దీపావళి కౌముదీ మహోత్సవమను పేర జరుపబడు చుండెనని ఇదివరకే తెలిపినాను. ఈ కౌముదీ మహోత్సవము ముద్రారాక్షసమున ఉల్లేఖించబడినది. దీపావళికి కూతురిని, అల్లుని పిలిపించుట కొన్ని ప్రాంతముల యాచారము. ఈ ఆచారము ప్రాచీనమైనది; నాగానందమున ఉల్లేఖితము. విశ్వావసు మహారాజు తనకూతురు మలయవతికిని, అల్లునకును దీపప్రతిపదుత్సవమున (కార్తిక శుక్లపాడ్యమిని) ఉత్సవానురూపమైన బహుమతి ఇచ్చుటకు ఏర్పాటుచేయుమని తన పుత్రునివద్దకు ప్రతీహారిని పంపును. (ప్రతీహారః— ఆదిష్టోస్మి మహారాజ విశ్వావసునా: యథా సునంద గచ్ఛ మిత్రావసుం బ్రూహి. అస్మిన్ దీపప్రతిపదుత్సవే మలయవత్యా జామాతుశ్చ ఉత్సవానురూపం యత్కించి త్ప్రదీయతే. త దాగత్య నిరూప్యతా మితి. 4 వ అంకం విష్కంభం.)

మహావీరుడు ఈ అమావాస్యనాడు నిర్వాణము చెందినాడనియు, ఆనాడు దేవతలు ఆయనను పూజించి పావా నగరమంతటను దీపములు వెలిగించిరనియు, అప్పటి

నుండి దీపావళిపండుగ ఏర్పాటయినదనియు జైన హరివంశ మున గలదు.

సుప్రసిద్ధ ఆరబ్ యాత్రికుడు అల్ బెరూనీ 11 వ శతాబ్దిలో దీపావళి మన దేశమున జరుపుకొను పద్ధతిని ఇట్లు తెలిపినాడు. "కార్తికమాస ప్రారంభమున దీపావళి పండు గను చేసుకొనుచున్నారు. ప్రజలు ఉదయము స్నానాదులు ముగించి, అలంకరించుకొని, అల్పాహారముచేసి తాంబూల చర్వణము చేయుచున్నారు. పిదప దేవాలయములకు వెళ్ళి వచ్చి వినోదములతో గడపుచున్నారు. ఆనాటిరాత్రి దీప మాలికతో నగరమును అలంకరించుచున్నారు. ఈ సమయ మున బలిరాజు శాసనము ఏర్పడునని ప్రజల విశ్వాసము."

బౌద్ధ జాతక కథలలో లక్షదీపోత్సవము, దీపదానము జరుపబడినట్లు పెక్కు కథలు గలవు. బుద్ధుని చుట్టును దీపములు పెట్టి పూజించినట్లును కలదు.

విజయనగరరాజుల కాలమున దీపావళి వైభవోపేత ముగ నెట్లు జరుపుకొనుచుండి రనునది ఆ కాలమున రచిత మైన "ఆకాశభైరవ కల్పము" అను సంస్కృత గ్రంథము వలన తెలియుచున్నది. దానిలో నున్నతీరు సంగ్రహము గానిది :

ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు వేకువజామున రాజు మేల్కొని కాలకృత్యములు తీర్చుకొని పంచమంగళ వాద్యములు మొగసాలలో మ్రోయుచుండగా, సుందరులు గాజుల గలగలలతో స్తనతట మల్లలనాడుచుండగా తల

స్నంటగా, మల్లులు కోష్ణవారిధార కుమ్మరించుచు గంధపిష్ట ముతో నలుఁగుపెట్టుచుండగా మంగళస్నానము చేయించుకొని, పిదప కొలువుతీర్చి, నృత్య గీతాదులతో వినోదించి, అంద రకును బహుమతు లిచ్చి, ఇష్టులతో మృష్టాన్న మారగించ వలెను. పిదప రాత్రి పటాకాలు ప్రేల్చవలెను.

"నదత్సు పంచవాద్యేషు బాహ్యా కక్ష్యాంతరే తతః,
క్వణత్కంకణయా వధ్వా దరవల్గుమరోజయా.
అభ్యక్తః స్నాపితో మల్లైః కైశ్చి త్కోష్ణేన వారిణా."

దీపావళిని తెలుగువారు దివ్వెలపండుగయనియు ననిరి. నేటికిని తెలంగాణమున దీనిని దివిలిపండుగ యందురు. సింహాసన ద్వాత్రింశతిలో నిది దివ్వెలపండుగగా జెప్పబడినది. (భాగ. 2, పుట. 39.)

ప్రాచీనకాలమున వివిధదేశములలో ప్రత్యేకోత్సవము లలో దీపదానమొనర్చు ఆచారమున్నట్లు చరిత్ర తెలుపు చున్నది. ఈజిప్టు, యమన్ దేశములలో సూర్యదేవత జన్మ దినమునకు ఉపలక్షకముగా డిసెంబరు 25 వ తేదీన దీపదా నము జరుపుచుండిరట. నేటికిని ఈ ఆచారము క్రైస్త వులలో గలదు.

ఈజిప్టులో ఒకప్పుడు దక్షిణాయనము డిసెంబరు నెలలో ఆరంభమగునని విశ్వసించుచుండిరి. ఓసిరిస్ మరణ మునకు చిహ్నముగా ఇంటింటను దీపమాలికలు వ్రేలాడ గట్టుచుండిరి. పిదప మరణించినవారియెడ గౌరవము ప్రద ర్శించుటకు నవంబరు మూడవవారమున ఈ దీపోత్సవము

జరుపు నాచారము ఏర్పడెను. మరణించినవారి ఆత్మ తన ప్రాతయిండ్లకు తిరిగివచ్చునని వారు విశ్వసించుచుండిరి. కనుకనే సమాధి స్థలమునుండి ఇంటివరకు దీపమాలికలు వెలిగించు నాచార ముండెను.

చైనాలోను రెండుమార్లు దీపోత్సవము జరుపు నాచారమున్నది. మొదటిది ఫిబ్రవరినెల ప్రారంభములోను, రెండవది సెప్టెంబర్ నెల మధ్యమునను. రెండవ ఉత్సవము పితరుల స్మరణ నిమిత్తము జరుపబడుచున్నది.

భారతదేశమున దీపావళిపండుగ జరుగు సమయమునసే అమెరికాలోను దీపావళివంటి పండుగ ఆచరించబడుచున్నది. దీనిపేరు 'హాలోవీన్' పండుగ. ఇది నవంబరు 1 వ తేదీన జరుపబడుచున్నది.

రేపు హాలోవీన్ పండుగ యనగా ముందునాడు — అనగా అక్టోబరు 31 వ తేదీన–సాయంకాలము బాలబాలికలు మంచిదుస్తులు తొడిగి, ముఖాలకు విచిత్రమైన కవచాలు పెట్టుకొని ఇరుగుపొరుగు ఇండ్లకువెళ్లి తినుబండములు యాచింతురు. గృహాంగణములలో నిలుచుండి 'ట్రీట్ ఆర్ ట్రిక్' అని కేకలువేయుదురు. అనగా "మాకు విందుచేయుదురా, లేక ఏవో సాకులుచెప్పి వట్టిచేతులతో పంపివేయుదురా!" అనుట. బాలబాలికల గోల విన్న ఇల్లాండ్రు మందహాసముతో వారికి స్వాగతమిచ్చి, వారికి తీపి తినుబండములు పంచిపెట్టి సాగనంపుదురు.

ఈ పండుగ క్రీస్తుకు పూర్వము కొన్ని శతాబ్దుల క్రిందటనే ఇప్పటి ఆంగ్లేయులకు పూర్వజాతి అయిన కెల్ట్ (డ్రూయిడ్) జాతి కాలముననే ప్రారంభమైనది. రోమను సామ్రాజ్యము విస్తరించిన పిదప రోమనుల పంటలపండుగ 'పామోనా' యనుదాని తంతుకూడ హాలోవీన్ పండుగకు జోడించబడినది. క్రైస్తవులును ఈ పండుగను ఆచరించుచు వచ్చిరి. ఈ విధముగా పెక్కు క్రైస్తవేతరములగు పండుగలు క్రైస్తవులవిగా మారినవి. అందువలన ఈ పండుగకు 'అల్ హాలోస్', లేక 'ఆల్ సెయింట్స్ డే', లేక 'హాలోవీన్' అని వ్యవహారము కలిగినది.

కెల్ట్ జాతివారికి నవంబరు మొదటి తేదీ ఉగాదిపండుగ. నూతన సంవత్సరారంభమున వారు సూర్యుని ప్రీత్యర్థము హోమాదులు జరిపెడివారు. నూతన సంవత్సరము వెనుకటి నాడు అక్టోబరు 31 వ తేదీన మృత్యుదేవత మరణించినవారి ఆత్మలన్నిటినీ సమకూర్చి, మరుసటి సంవత్సరము ఏ ఏ రూపములలో అవి విహరింపవలెనో నిర్ణయించునని, సహృదయుల ఆత్మలు మరణానంతరము మరల మానవశరీరములోనే ప్రవేశించునని వారు విశ్వసించుచుండిరి. దానధర్మములవలనను, భగవత్ప్రార్థనలవలనను దుష్టుల పాపములు, నరకలోక బాధలు కొంతవరకు తగ్గుననియు వారు నమ్ముచుండిరి. బ్రిటనులో రోమనుల పరిపాలనకాలమున ఈ డ్రూయిడ్ల ఆచారము కొంత సడలినా, కొంతవరకు బ్రిటిష్ ప్రజల ఆచారమున జీర్ణించిపోయినది. బ్రిటన్ నుంచి అమెరికాకు వలసవచ్చిన

వారు తమవెంట 'హాలోవీన్' పండుగనుకూడ అమెరికాకు తెచ్చిరి. ఈ పండుగదినమున దయ్యములు, మాంత్రికులు దూరదేశములలో సంచారము చేయుదురనియు నమ్మక ముండెడిది. నేడు క్రైస్తవులు జరుపు 'కాండిల్ ఫెస్టివల్' దీపావళివంటిదే.

ముస్లింలలోను ఈ దీపావళి పండుగవంటిది ఉన్నది. మహమ్మద్ పైగంబర్ నూతన సంప్రదాయమును స్థాపించి మక్కాకు తిరిగివెళ్ళిన రాత్రికి సూచకముగా దీపోత్సవము జరుపబడుచున్నది. దీనిని 'షబే బరాత్' అందురు. అనగా రాత్రి జరిగిన ఊరేగింపు అని యర్థము. ఈ పండుగనాడు బాణసంచా విపరీతముగా కాల్చి, మతాబాలు వెలిగింతురు. ముస్లిములతో సంబంధము కలిగిన తర్వాతనే మనకును బాణ సంచా కాల్చు ఆచారము ఏర్పడినది.

ఈ విదేశముల ఆచారములను, పండుగ పద్ధతులను పరిశీలించినను మన దీపావళిపండుగ పితాళ్ళ పండుగయనియే స్థిరపడుచున్నది.

---

# 17. మకరసంక్రాంతి

తక్కిన కొన్ని పండుగులవలెనే సంక్రాంతి పండుగ యును మన పూర్వుల పంటలపండుగయే. మన కిది పెద్ద పండుగ. మనకే కాదు; దేశమునకంతయు పెద్దపండుగ. పరిశ్రమోపజీవులగు మన పూర్వులు తాము పండించు కొనిన పంటలను విజయోత్సాహముతో పొంగించి వండుకొని పంచభూతములను తనియించి, తాము తనిసి చలిమంటల వెలుగులో గొబ్బిళ్ళతోను, గొండ్లితోను మైమరచిన పండుగ యిది. కనుకనే శ్రీనాథుడు దీనిని "పెనుబండువు" అనెను. దీని నిట్లనుటకు కారణము ప్రకృతిమాత చల్లనిచూపే.

ఈ పండుగ మార్గశిర పుష్యమాసములలో వచ్చును. సంక్రాంతి యనగా చేరుటయని యర్థము. సూర్యుడు నెల కొకమారు ఒక్కొక్క రాశిని చేరును. దీనినే సంక్రాంతి, సంక్రమణము అందురు. "తత్ర మేషాదిషు ద్వాదశరాశిషు క్రమేణ సంచరతః సూర్యస్య పూర్వస్మాద్రాశేః ఉత్తరరాశౌ సంక్రమణ ప్రవేశః సంక్రాంతిః" అని జయసింహ కల్పద్రుమ మున సంక్రాంతి పదము నిరుక్తమయినది. సూర్యుడు మేషాది ద్వాదశ రాసులలో సంచరించుచు మొదటి రాశి నుండి తర్వాత రాశిలో ప్రవేశించుట సంక్రాంతి యగునని దీని యర్థము. అట్లయిన, సంవత్సరమున పండ్రెండు సంక్రాంతులు వచ్చుచుండును గదా! ఈ మకర సంక్రాంతి కేల ప్రాముఖ్యము?

ద్వాదశాత్ముడైన దివాకరుని దివ్యయాత్రయందు ప్రధానములగు ఘట్టములు నాలుగు. అవి :- మేష, కటక, తులా, మకర సంక్రమణములు. మార్తాండుడు ఈ మజిలీలు చేరగనే ప్రకృతి పులకించి పరిపరి విధముల విలాసముల జూపును. ఆ విలాసముల విశిష్టరూపమే మకరసంక్రాంతి. తొలకరిలో మొలకెత్తిన జొన్న, సజ్జ, ఆరిక, చామ, కొఱ్ఱ, నూవు, పెసర, కంది, సెనగ మొదలగు మెట్టపైరును, రాగి, వరి, కూరగాయలు మున్నగు మాగాణి పంటలును కార్తిక మార్గశిర మాసములకు కాపువచ్చి పండి, ఎటుచూచినను కలకలలాడుచు కనులపండువుగా నుండును. గ్రామముల చుట్టుపట్టుల నిండారపండి ఒరగి కోతకు సిద్ధముగానున్న వరి చేలు, చేమంతి బంతిపూవులు బంగారుకాంతులు వెదజల్లు చుండగా, కొలది దినములక్రిందటనే ఈని దండిగా పాలనిచ్చు చున్న పశుగణము లుండగా, లేగలు చెంగుచెంగున నిటు నటు చిరుగంతులు వేయుచుండగా పొంగని మానవు డుండునా ? సంవత్సరారంభమునుండియు తాము చేసిన కృషిరూపమగు నపార పరిశ్రమమునకు అనురూపమగు ఫలమును ఎదురు చూచుచు కర్షకులు మురిసిపోవు సమయ మది. ఈ సస్య సమృద్ధిని చూచియే కాబోలు కృష్ణభగవానుడు గీతలో "మాసానాం మార్గశీర్షో హమ్" అనెను.

మార్గశిరమాస సమాప్తినుండి యుత్తరాయణము ప్రారంభమగును. భాస్కరుని యాత్రలోని రెండవ ఘట్టమగు కటక సంక్రమణమునుండి నాలుగవ ఘట్టమగు మకర సంక్రమణము వరకు గల ఆరునెలలను దక్షిణాయనమనియు, మకర

సంక్రమణమునుండి కటక సంక్రాంతివరకునగు ఆరునెలలను ఉత్తరాయణమనియు జ్యోతిశ్శాస్త్రులందురు. కటకమునుండి మకరమువరకు ప్రభాకరుడు కొంచెము దక్షిణాభిముఖముగా సంచరించుటవలన నా ఆరునెలలకు దక్షిణాయనమనియు, మకరమునుండి కటకమువరకు కొంచె ముత్తరాభిముఖముగా సంచరించుటవలన నుత్తరాయణమనియు జ్యోతిర్విశారదులు సంకేతము లేర్పరచిరి. ఉత్తరాయణము దేవతలకు ముఖ్యము గనుక ఉత్తమ కాలమనియు, దక్షిణాయనము పితృదేవతలకు ముఖ్యము గనుక చెడుకాలమనియు ప్రజల విశ్వాసము. నిజమే: దక్షిణాయనమున వానలు, వల్లప్పలు, బురదలు, చీకట్లు, మబ్బులు – కనుక చెడ్డకాలమే కదూ! ఉత్త రాయణముననో చేను చెక్కలగునట్లు పంటలు, గాదెలనిండు గను, గరిసెలనిండుగను ధాన్యములు, ఆరోగ్యము, ఐశ్వ ర్యము – ఉత్తమకాలమే కదూ! దక్షిణాయనమున మరణిం చిన ఉత్తమ గతులుండవనియు, ఉత్తరాయణమున మరణిం చిన మోక్షప్రాప్తి యనియును మనపూర్వుల విశ్వాసము. అందువలననే భీష్ముడు రణరంగమున దక్షిణాయనమున కూలి పోయినను ఉత్తరాయణమువరకును ప్రాణముల బిగబట్టుకొని పిదప "హరీ!" అనుకొనెనని భారతమునందు గలదు. ఈ కారణములవలన మకర సంక్రాంతిని ఉత్తరాయణ పుణ్య కాల మందురు. ఈ ఉత్తరాయణ పుణ్యకాల ప్రశస్తి శ్రుతి స్మృతీతిహాస పురాణములయందు బహువిధముల వర్ణించ బడినది. (అయనచర్చను ఉగాదిపండుగలోను చూడ గోరినాను.)

నేడు మనము చైత్ర శుద్ధ పాడ్యమిని సంవత్సరాదిగా పరిగణించుచున్నాము. కాని, ఒక తీరుగా చూచిన మకర సంక్రాంతియే మనకు సంవత్సరాదియని నిర్ణయము కాగలదు. మకరసంక్రమణము నుండియే ప్రకృతియందు ప్రస్థానమగు మార్పులు గోచరించును. శీతవాతములు తగ్గుదల జూపును; పంటలు చేతికి వచ్చి జీవితము నవనవోన్మేషముగా నుత్సాహితమౌను. సంక్రాంతి పురుషుని – సంకురమయ్య – వీక్షణము సంవత్సరమంతయు నుండునని అందురు. ఉండదూ మరి? "కుండలో నుండిన అబకలోనికి!" అన్నట్లు దేశము బాగుగ పండిన, ఆ ప్రభావము సంవత్సరమంతయూ నుండును; లేనిచో శని పీడవలె బాధించు నందురు.

సంక్రాంతి పండుగ మూడుదినములు మహోత్సాహముతో జరుపుకొందుము. ఈమూడు దినములును మన ప్రాచీనాచారములకు ప్రతీకములే. వీనిలో మొదటిది భోగి. మకరసంక్రమణమునకు వెనుకటి ముప్పది దినములును ధనుర్మాసము; సూర్యుడు ధనూరాశిలో నుండును. ఈ ధనుర్మాసము ముప్పది దినములును భక్తులు వేకువనే మేల్కాని, స్నానాదికములను నిర్వర్తించి, దైవారాధన పూర్వకముగా భజనచేయుచు గ్రామ ప్రదక్షిణ మొనరింతురు. మన పూర్వులు తమపంటల నెవరును కోసికొనకుండ పొలముల వెంట దిరుగుచు, చలిమంటలు వేసికొని జాగరూకతతో మెలగెడి వారేమో! ఆ పద్ధతికి నాగరక స్వరూపమే ఈ గ్రామప్రదక్షిణములు, భజనములు, భోగిమంటలును అని ఆధునికులగు మనకు తోచవచ్చును. ఆచారములు, విశ్వాస



సంక్రాంతి ముగ్గులు

ములు, తత్త్వచింతనము మొదలగునవి యెన్నియో కలసియే కదా పండుగలు రూఢియగుట!

ఈ భజనలు సంక్రాంతికి పూర్వము దినముతో ముగియును. ధనుర్మాసమున కంతయు పండుగనెల యనియే వ్యవహారము గలదు. ఈ దినములలో గ్రామిణులు తమ యునికి పట్టులను చక్కబరచుకొందురు; గోడలకును, గాదెలు కణజములు మొదలయిన ధాన్యభాండారములకు పూతలు పూసి వెల్ల వేయుదురు. ప్రాతవడి నిరుపయోగములైన గృహోపకరణములను పరిహరించి క్రొత్తవానిని సేకరించుకొందురు. పరిహృతములైన వస్తువులను భోగి మంటలలో కాల్చివేయుటకై కడగా నుంచెదరు. క్రొత్తకుండలను సేకరించుకొందురు. ఇల్లాండ్రును, బాలికలును ప్రతిదినము అరుణోదయ సమయమున నిద్రలేచి ఇండ్ల వాకిలిపట్టులను ఊడ్చి, కలయంపి చల్లి వింతవింత ముగ్గులతో అలంకరింతురు. ద్వారమున కిరువైపులను, ఎట్టయెదుటను పేడ ముద్దల నుంచి, వానిని పసుపుకుంకుమలతో అలంకరించి బంతి, చేమంతి, బీర, పొట్ల, గుమ్మడి మొదలగు పూలు చెక్కుదురు. వీనినే గొబ్బిముద్దలు, గొబ్బెమ్మలు అందురు. బాలికలు ఈ గొబ్బిముద్దల చుట్టును తిరుగుచు లయానుగుణముగ చేతులు తట్టుచు పాటలు పాడుదురు. దీనిని గొబ్బిళ్ళాట యందురు. ఈ కార్యక్రమమంతయు భోగి పండుగకు వెనుకటి దినముతో ముగిసియును.

భోగి పండుగనాటి కార్యక్రమము వేరు. 'భోగి'యను పదమును గురించి కొంత చర్చయున్నది. 'భుజ్' అను

సంస్కృత ధాతువునుండి ఈ పదము నిష్పన్నమైన దనియు, ఇంద్రుని ప్రీతికై ఈ పండుగ చేయుదురనియు కొందరందురు. కాని, పోగు, పొంగు – మున్నగు ద్రావిడ ధాతువులనుండి పుట్టిన పోగు, పొంగు అను పదముల సంస్కృతీకరణమే 'భోగి' యను పదమని నేననుకొందును. భోగిపండుగనాటి తెల్లవారు జామున ప్రతియింటి వాకిటను మంటవేయుదురు. ఈమంటను భోగిమంట యందురు. పూర్వము పరిహరించి యుంచిన నిరుపయోగమగు వస్తువులు ఈమంటలో వేసి కాల్చివైతురు. ఉత్తరభారతమున నీ మంటలను 'లోడి' యందురు. వెంటనే ఆబాలవృద్ధము – కలవారును, లేనివారును – ఉష్ణోదకముతో అభ్యంగన మంగళ స్నానముచేసి, భోగిపీడ వదలినదని సంతోషింతురు. దీనితో అశుభము, పీడ విరుగడ యయినవి. నూతన జీవిత మారంభమగును. వరికంకుల తోరణములతో, సిరికుంకుమ పారాణులతో ఇండ్ల నలంకరింతురు. తాము పండించి తెచ్చిన తండులాలతో వివిధములయిన కూర గాయలు కలిపి పాలుపోసి, పొంగళ్ళు – పులగములు – వండికొందురు. ఈ పొంగలి మన అనాదియగు వంటకము. సాయంకాలము పిల్లలకు పేరంటముచేసి పండ్లు, చెరకు ముక్కలు తలలపై పోయుదురు.

రెండవనాడు సంక్రాంతి. ఉత్తరాయణ పుణ్యదినము. ఈనాడు సూర్యుడు మకరరాశిలో ప్రవేశించును. ఈనాటి నుండి సూర్యుడు సహజోష్ణ సంభరితములైన తన సహస్ర కిరణముల తీక్ష్ణతను నాడునాటికి పెంపొందించుకొనుచు, హేమంత శీతవాత జనితమైన జడిమకు గురియయి నవయు

చున్న స్థావర జంగమాత్మకమగు ప్రకృతిని ఉత్తేజపరచి నూతనచైతన్యము నుల్లసిల్లజేయుచు తన లోకబాంధవత్వ మును సార్థకపరచుకొనును. మకరరాశ్యధిపతి శని. శని వాత ప్రధానగ్రహమని జ్యోతి శ్శాస్త్రజ్ఞులును, భౌతిక శాస్త్రజ్ఞ లును చెప్పుచున్నారు. వాతమెట్లు తగ్గును? నూనె మొద లగు స్నేహద్రవ్యముల వలనను, వాతహరమగు కూష్మాం డాది శాకముల భక్షణములవలనను కదా! కనుకనే ఆనాడు తెలకపిండితో ఒడలు రుద్దుకొని స్నానమాచరించి నూవులు, బెల్లము, గుమ్మడికాయలు మున్నగునవి దాన మిత్తురు. పితరుల పుణ్యలోకప్రాప్తి నిమిత్తము తర్పణశ్రాద్ధాదుల నొనర్తురు. సమృద్ధికి సూచకముగా కలవారును, లేనివారును దాన ధర్మముల నొనర్తురు. 'నాస్తి' యను శబ్ద మీనాడు రాకుండ దానమొనర్పవలెనని ధర్మశాస్త్రములు తెలుపు చున్నవి. స్త్రీలు తమ మాంగల్యాభివృద్ధికై ఇష్టులకును, శిష్టు లకును కుంకుమము, సుగంధద్రవ్యములు, గుడము, పుష్ప ములు, వస్త్రములు మున్నగునవి దాన మొనర్పవలెనని పురాణములు ఉద్ఘోషించుచున్నవి.

సజ్జలుపండు ప్రాంతమున ప్రజలు నూవు లద్దిన సజ్జ రొట్టెలు ఆరగింతురు. సజ్జలు ఉష్ణవీర్యములు. కనుక నివి చలిని తొలగించి వేడిమిని కలిగించును. ఉత్తరదేశమున గొంగళ్ళు దానము చేయుటయును గలదు. ఆనాటి సాయం కాలమున కొన్ని ప్రాంతములలో నువ్వులు, బెల్లమును ఇంటింటికి పంచిపెత్తురు. ఘృత కంబళదానములతో పాటు ఈనాడు మహేశ్వరునికి 'మహాఘృతకంబళము' సమర్పించ

వలెనని 'శివరహస్య' మాదేశించుచున్నది. ఈ 'ఘృత కంబళ' మును అర్పించువాడు అన్ని భోగములను అనుభ వించి తుదకు మోక్షము పొందునట. ఘృతకంబళమనగా?

"అసితాయా స్సితాయా వా ధేనోర్ఘృత మనుత్తమమ్,
సంపాదనీయం యత్నేన ఘనీభూతంచ శోధితమ్.
తద్ఘృతం తులయోస్త్రీర్ణం ప్రస్థం సార్ధశతత్రయం,
మహాకంబళ మేతద్ధి ఘృతస్య పరికీర్తితమ్."

తెల్ల ఆవుదికాని, నల్లావుదికాని మూడునూర్ల ఏబదుల ప్రస్థ ముల పేరిననేయి, పరిశుద్ధమైనది ఘృతకంబళమని వ్యవహ రించబడుచున్నది. ఇంత నేయిని సేకరించలేనివాడు ఏత దర్ధమో, పాదమో సేకరించి మహేశ్వరుని మొదట ఇతర ఘృతముతో అభిషేకించి, పిదప ఈ ఘనీభూతమగు ఘృత కంబళమును శివుని మస్తకముపై అర్పింపవలెను.

మకర సంక్రాంతియందు చేయు దానములను హేమాద్రి వ్రత ఖండమున నిట్లు చెప్పినాడు:

స్కాందే:—

"ధేనుం తిలమయీం రాజన్ దద్యాద్యశ్చోత్తరాయణే,
సర్వా న్కామా నవాప్నోతి విందతే పరమం సుఖం."

విష్ణుధర్మే:—

"ఉత్తరే త్యయనే విప్రా వస్త్రదానం మహాఫలమ్,
తిలపూర్ణ మనడ్వాహం దత్త్వా రోగైః ప్రముచ్యతే."

శివరహస్యే :—

"తస్యాం కృష్ణతిలై స్స్నానం కార్యం చోద్వర్తనం శుభైః,
తిలా దేయా శ్చ విప్రేభ్యః సర్వదైవో త్తరాయణే,
తిలతైలేన దీపాశ్చ దేయా శ్శివగృహే శుభాః."

ఉత్తరాయణమున తిలలతో ధేనువునుచేసి దానమివ్వవలెను. ఉత్తరాయణమున వస్త్రదానము మహాఫలము నిచ్చును. తిలలతోచేసిన ఎద్దును దానమిచ్చుట వలన రోగవిముక్తుడగును. ఉత్తరాయణమున నల్లనూవులతో స్నానమొనర్చి విప్రులకు నూవులు దానమివ్వవలెను. నూవుల నూనెతో శివాలయమున దీపములు వెలిగించవలెను.

మజ్జిగను చిలికి, దానిని వెన్న మీగడలతో పాటు ఘటసహితముగా దానమివ్వవలెనని వ్రతచూడామణిలో నుడువబడినది.

ఇవి యన్నియు శీతవాతాపనోదన క్రియలనుట స్పష్టము. నేయి అగ్నిదీపనము, ఓజస్కరమునని వైద్యశాస్త్రము నుడువుచున్నది. కనుక వీనిదానము నేడు ఉత్తరదేశమున నాచారములో నుండుట సమంజసమే.

తొలిమాపువేళ, చిన్నవారు నమస్కారార్హులందరికినీ నమస్కరించి వారి ఆశీర్వాదములను పొందుదురు. ఈ సంప్రదాయము నేటికిని గ్రామములలో, పాటింపబడుచున్నది. కనుకనే సంక్రాంతికి మ్రొక్కుల పండుగ యనియును పేరు వచ్చినది.

ఈ పండుగకు మరునాడు కనుము. ఇది పూర్తిగ కర్షకుల జీవితమునకు సంబంధించినది. తమ కృషికంతయు శాసటగా నిలిచిన పశువులను వారు గౌరవించు దిన మిది. ఈ ఏర్పాటును ఏ మహాపురుషుడు చేసెనో! నిజమునకు గోధనమేగదా దేశధనము! కనుకనే పెక్కు భాషలలో పశువులను సొమ్ములని, ధనమని వ్యవహరించుట నానుడి యయినది. గ్రామములలో కనుమునాటి యాచారము ప్రాచీన పశుబలి సంప్రదాయమునకు తార్కాణము. ఈనాడు కర్షకులు ఉదయముననే లేచి పశువుల కొట్టములముందు పాలుపోసి పొంగళ్ళు వండుదురు. పొంగలి యుడుకుచున్న సమయమున "పాలపొంగలి, పసుల పొంగలి" అని పెద్దగా కేకలు వేయుదురు. ఈ పొంగలిని దేవతలకు నైవేద్యము పెట్టిన తర్వాత పండిన పొలములకు వెళ్లి పొంగలిమెతుకులు చల్లుదురు. దీనినే 'పొలిచల్లుట' యందురు. ఇట్లు చేయుట వలన పంట పొల్లుపోక గింజరాలుబడి హెచ్చునని వారి విశ్వాసము. ఈ పొలిపొంగలిని పసుపుకుంకుమలతో కలిపి చల్లుదురు. ఇది పూర్వకాలపు రక్తసిక్తాన్న బలిహరణ మునకు సంకేతమని పెద్దలు చెప్పుదురు. ఈ సమయముననే దిష్టితీసి ఎఱ్ఱగుమ్మడికాయను పగులగొట్టుదురు. ఇది బలి యోగ్యమగు గొఱ్ఱె తలకాయకో, మరొక బలిపశువు శిరస్సుకో ప్రత్యామ్నాయమట.

"ముందున్నది మొసళ్లపండుగ" అను సామెత మనమందరెరింగినదే. ప్రాతకాలపు పశుబలిని సూచించు సామెత ఇది. నిజమున కిది మొసళ్లపండుగ కాదు. ముసర్ల-

ముసళ్ల పండుగ. ముసర అనిన అన్నపుమెతుకులు. ఈ పదము నేడు తెనుగులో లుప్తప్రాయమయినను, కన్నడమున వ్యవహారమున నున్నది. ఈ సామెత కొరకు చిన్నకథ గలదు. ఒక పొలమున ఒక గొర్రెపిల్ల చాల ఉత్సాహముతో గంతులు వేయుచుండెనట. పాపము! దానికేమి తెలియును తన జీవిత మెపుడు ఇతరుల ప్రీత్యర్థమగునో యని! అక్కడనే మేయుచున్న ఒక ఎద్దు చూచి "ముందున్నదిలే ముసర్ల పండుగ" అని గొర్రెపిల్లను గేలిచేసెనట. "ముసర్లు – పొలాలలో పాలి అన్నపు మెతుకులు – చల్లు పండుగ రానున్నది. అప్పుడు తెలియునులే నీ మిడిసిపాటు!" అని దాని యర్థము. సంక్రాంతి తర్వాత కనుమపండుగనాడు ఎడ్లకు ఎక్కడలేని వైభవము, గొర్రెలకేమో బలియగు పాటు! కనుక ఈ సామెత ఒకానొకప్పుడు మనము పంటసిరికి గొర్రెనో, మరొక జంతువునో బలియిచ్చు ఆచారమును సూచించుచున్నది. బల్యన్నమును దాని రక్తముతో రంజితమొనర్చుటకు మారే నేడు పసుపుకుంకుమలతో కలుపుటయు, మేషశిరః ఖండనమునకు మారే గుమ్మడికాయను పగులగొట్టుటయును. కాళికా పురాణమున బలిప్రత్యామ్నాయము లిట్లు పేర్కొనబడినవి:

"కూష్మాండ మిక్షుదండంచ మాంసం సారక్య మేవ చ,
ఏతే బలిసమాః ప్రోక్తాః తృప్తౌ ఛాగసమాః సదా."

గుమ్మడికాయ, చెరకుగడ, మాంసము, మద్యము ననునవి నివేదించిన మేకను బలియిచ్చి తృప్తిపరచుటతో సమానము. రుద్రయామళమున నిట్లు నుడువబడియున్నది :

"భాగాభావే తు కూష్మాండం శ్రీఫలంవా మనోహరం,
వస్త్రసంవేష్టితం కృత్వా ఛేదయే చ్ఛురికాదినా."

మేకకు మారు బూడిదగుమ్మడికాయను గాని, చక్కని కాశీ ఫలమును (ఎఱ్ఱగుమ్మడికాయను) గాని గుడ్డతో కప్పి ఛేదించవలెను.

"బ్రాహ్మణేన సదా దేయం కూష్మాండం బలికర్మణి,
శ్రీఫలంవా సురాధీశ ఛేదం నైవతు కారయేత్.
మాషాన్నేన బలి ర్దేయో బ్రాహ్మణేన విజానతా."

అని మరియొక వాక్యమున్నది. బ్రాహ్మణుడు బలికి మారు కూష్మాండమునుగాని, శ్రీఫలమునుగాని సమర్పించవలెను. దానిని ఛేదించరాదు. మాషాన్నమును బలియివ్వవలెను.

కనుమునాడు పశువుల సంబరము చెప్పనక్కరయే లేదు. నాడుఉదయమునుండియే పశుగణమును పలు తెరంగుల నలంకరింతురు. పూలదండలను మెడలో వేయుదురు. దూడల మెడలను, కాళ్ళను చిరుగంటలతో నలంకరింతురు. ఎడ్ల కొమ్ములకు రంగులుపూసి, కుత్తుకలకు గంటల పట్టెడలు కట్టెదరు. ఈ యలంకారములు వారివారి యభిరుచిని ఆయతిని అనుసరించియుండును. మన జీవికకు మూలాధార మయిన ధరిత్రీమాతను అభ్యర్థించుటలో-కృషిచేయుటలో – మనతో పాటు కొట్టికోరాడు కోడెలను, తియ్యనిపాలతో తనియించు ఆవులను ఇట్లాదరించుట మన కృతజ్ఞతాసూచక చర్యయే. గంగిరెద్దు హంగులుకూడ దీని అంగములే.

డూ డూ డూ బసవన్నా!
డూ డూ డూ వెంకన్నా!
అయ్యగారికీ దండంపెట్టూ
అమ్మగారికీ దండంపెట్టూ

అని గంగిరెద్దులవారు సన్నాయిమేళముల సవ్వడిలో అడుగగా గంగిరెద్దులు తల అడించుట, వానిమూలమున భావి శుభములను తెలియజెప్పుట పశుగణము నెడ పసగులుతీయు గౌరవబుద్ధికి తార్కాణములే. ఆనాటి సాయంకాలమున గ్రామోపకంఠములలో ఎడ్లపోటీలు, కోడిపందెములు, గొఱ్ఱెపొట్టేళ్ళ పందెములు మొదలగు వినోదములు, గ్రామములలో పశువుల ఊరేగింపులు జరుపుదురు.

దక్షిణదేశమునందలి మధుర, తిరునెల్వేలి జిల్లాలలోని కొన్ని తెగలలో నొక వింత ఆచార మున్నది. ఎడ్లకొమ్ములకు నగలో, నాణ్యములో కట్టి పరువెత్తింతురు. తప్పెటల మ్రోతలో అవి విచ్చలవిడిగా పరువెత్తును. వాని కొమ్ములకు కట్టిన నగలనుకాని, గుడ్డలనుకాని భద్రముగా విప్పి తెచ్చుట యొక వినోదము. దీనిలో ప్రాణోపద్రవముగూడ జరుగును. పందెములో నెగ్గిన యువకుని కన్యలు వరించుటకూడ ఆచారముగ నుండెనట.

కొన్నిచోట్ల ఈ కనుముకు తరువాత దినముకూడ ముక్కనుము అనుపేరుగల పండుగదినముగా పాటింతురు.

ఈ పండుగనాళ్ళలో నాచరించు వ్రతములు కొన్ని కలవు. వానిలో గొబ్బిగౌరీవ్రత మొక్కటి. ఈ వ్రతము

భోగినా డారంభమగును. నాడు సాయంకాలవేళ నట్టింట నొకవైపున మంటపము నిర్మించి యలంకరింతురు. ఆ దినములలో దొరకు పండ్లు, కూరగాయలు, చెఱకుగడలు అలంకార సామగ్రిలో ముఖ్యములు. మంటపము మధ్యన బియ్యము పోసి, దానిపై బంకమట్టితో చేసిన గౌరీవిగ్రహము నుంతురు. నిష్ఠానియమములతో పూజచేసి, పాటలుపాడి రాత్రివేళ దేవిని నిద్రపుత్తురు. ఉదయవేళ మేల్కొలుపుదురు. మూడు దినములు సాయంకాలవేళల ముత్తైదువులను పేరంటమునకు పిలుతురు. స్త్రీలందరును కలిసి దేవీ మంటపమున కెదుట పాటలుపాడుచు గొబ్బిళ్ళు తట్టుదురు. నాల్గవనాడు ఉద్వాసన చేయుదురు. మంటపము నలంకరించిన కూరగాయల నేకముగా కలిపి కూర వండెదరు. దీనిని గొబ్బికూర యందురు. ఇట్లు చేయుట అప్పటి శాకసమృద్ధికి తార్కాణము. ఆ సాయంకాలము ముత్తైదువలు బాలికలు గొబ్బిదేవిని కొనిపోయి చెరువులోగాని, నదిలోగాని ఓలలాడింతురు. ఈ వ్రతము కొన్నిచోట్ల నారుదినములు జరుగును.

కనుమునాడు కొందరు స్త్రీలు పుట్టినింటి క్షేమాభివృద్ధిని కోరి మరియొక వ్రతము చేయుదురు. దీనిని "కాకి పిడచ పెట్టుట" అందురు. కొన్ని మండలములలో భోగినాడు మొదలు పదిదినములు బొమ్మలకొలువు పెట్టెదరు. దీనిని సంక్రాంతికొలు వందురు.

సంక్రాంతి పండుగలో పొంగలి వండుకొనుట మన వైద్యశాస్త్రానుసరణమునకు ఉపలక్షణ మనియును పెద్దలందురు.

వాగ్భటుడు మున్నగు వైద్యకాచార్యులు ఆయా ఋతువు లలో సేవించవలసిన ఆహారమును తెలిపినారు. చలికాలమున రాత్రులు పెద్దవి; పగళ్లు చిన్నవి. నిద్రలేవగనే ఆకలి బాధించును. కనుక స్వస్థులు ముద్గాన్నము సేవించవలెనని వారు ఆదేశించిరి. ఈ వైద్యుల మాటలను పాటించగలవారు రాజులో, శ్రీమంతులో అగుదురుగాని సామాన్యులకు సాధ్యమా? ఒక్కనాడు పండుగయని పులగము వండుకొనుట సామాన్యులకు సాధ్యమగును గాని నెలయంతయును సాధ్యమా? రాజులు తమ వైభవముల నన్నిటిని భగవత్కైంకర్య భావముతో అనుభవించు ఆచారముగలవారు గనుక పొంగలి పెరుమాళ్ల కోవెలలలో పొంగులువారినది. దేవాలయములు ప్రజల ఉమ్మడిసంస్థలు. వైద్యకోపదేశములు ప్రజలలో వ్యాపింపజేయుటకై ఈ సంప్రదాయము దేవాలయములలో ఆచరణకు వచ్చినది.

ఈ సంక్రాంతి పండుగకును, బలిచక్రవర్తి గాథకును సంబంధ మున్నది. విష్ణువు బలిచక్రవర్తి తలపై మూడవ అడుగు పెట్టెను. దానివలననే సంక్రాంతిపండుగ మూడు దినములు జరుపుకొనుట. అందులకే బలిచక్రవర్తి రాజ్యమును ఆబాలగోపాలము స్మరించుకొనుచు ఉత్సవములు జరుపు కొందురు. అనగా దక్షిణాయనములో పాతాళమున కేగిన బలిచక్రవర్తి మరల వచ్చుగాక యని భావము.

"చతుర్దశ్యాం దినేరాజన్ బలే ర స్త్విృతి యాచయేత్" అని నరక చతుర్దశినాడు బలికి రాజ్యమును కోరినాము.

అనగా సూర్యుడు బలిని వదలి మరల మన కగపడుగాకయని కోరినాము గదా! కనుకనే మరల సంక్రాంతినాడు బలి స్మరణము.

ఇట్లు పై కారణములనుబట్టి మకరసంక్రాంతి పండుగ సూర్యారాధనమని విశదమగుచున్నది.

ఈ పండుగ చలికాలమునందు వచ్చును. కనుక ఎండకోసము ప్రాణులు అంగలార్చుదురు. దీనిని శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యమున సుందరముగా నిట్లు వర్ణించినాడు:

ఇంట్లె మొదలను నీరెండ నిడికలను
ననుగుచమ్ముడు నన్నయు నాటలాడు
అత్తయును కోడలును గుమ్ములాడు కుమ్ము
గాచుచోటికి మకరసంక్రాంతి వేళ.

కాని యింత పెద్ద పండుగను ప్రాచీన కవులు వర్ణించకపోవుట వింతగనే యున్నది. పాల్కురికి సోమనాథుడు మాత్రము బసవపురాణమున పులగమును గురించి, పండితారాధ్య చరిత్రమున "పదములు వాలేసు పదములు గొబ్బి పదములు........" అని గొబ్బినిగురించి ఉల్లేఖించినాడు.

మకరరాశి జలచర స్థలచరము ద్వంద్వరూపమని మన గ్రంథములు చెప్పుచున్నవి. ఈ జంతువు ఊర్ధ్వకాయము బంగారు కొమ్ముల మేక యాకారమును, అధఃకాయము మొసలి యాకారమును గలది.

గ్రీకులుకూడ దీని ఊర్ధ్వకాయమును మేక రూపము గనే చెప్పినారు. వెనుక సగమును చేపయాకార మనినారు. ఈ వింత జంతువు సృష్టియగుటకు గ్రీకులలో కొన్ని గాథ లున్నవి.

ఒకమారు జేకన్ అను దేవత తక్కిన దేవతలతో సహా నైలునదీ తీరమున విందారగించుచుండెనట. ఆ సమయ మున టైఫన్ అను మహాభూతము మహాప్రళయమువలె వచ్చి మీాద పడినదట. దానిని చూచునప్పటికి జేకన్ మున్నగు దేవతల పై ప్రాణములు పైననే ఎగిరిపోయినవట. అప్పుడు టైఫన్ జేకన్ను చూచి "ఈ దేవతారూపము వదలివేసి ఇంకొక రూపము ధరించిన మిమ్ములను ప్రాణము లతో వదలిపెట్టుదును" అని యనెనట. జేకన్ సంతోషించి స్థల జల చర రూపములను కలిపి సముద్రపు మేకరూపముతో టైఫన్ ఎదుట నిలచెనట. ఈ వింతరూపమును టైఫన్ మెచ్చుకొని తన మాటప్రకారము వారి నేమియుననక తన దారిని వెళ్లెనట. ఈ వింత మేక ఆకాశమున మకరరాశిలో శాశ్వతముగా నిలిచిపోయెనట.

మరొకవింత కథయును గలదు. పాన్ అను దేవత నైలునదీ తీరమున విహరించుచు, మైమరచి గంతులు వేయుచు ఆ నదిలో పడిపోయెనట. ఆ పడిన పాటున ఒక మునక వేసి పైకి లేచునప్పటికి మేకరూపము వచ్చినదట.

గ్రీకు, లాటిన్ గాథలలో మకరరాశి జలాధిదేవతగా వర్ణితమైనది. వర్షము ప్రసాదించునది మకరము; తుపాను రాకను తెలుపునది మకరము.

ఈజిప్టు సిద్ధాంతులు ఈ మకరరాశికిని, 'సమ్' అను జలాధిదేవతకును సంబంధము ఏర్పరచి సూర్యుని మకరరాశి ప్రవేశమునకును నైలునది పొంగుటకును సంబంధము కలిపిరి. నైలునదీ ప్రాంతములలో తుపానులు మకరరాశిలో సూర్యుడు ప్రవేశించుటతో నారంభమగునని ఆ శాస్త్రజ్ఞులనుచున్నారు.

---

# 18. రథసప్తమి

రథసప్తమి పండుగ మాఘ శుద్ధ సప్తమినాడు చేయుదురు. ఇది ముఖ్యముగ సూర్యుని ఆరాధించు పండుగ. దీనిని గురించి భవిష్యపురాణమున విశేషముగా వర్ణనలు గలవు. ఇది సూర్యగ్రహణ తుల్యమగు పర్వమనియు, ఈనాడు అరుణోదయమున స్నానమాచరించుట మహాఫలదాయక మనియు మదనరత్నము, నిర్ణయామృతము, వ్రతచూడామణి మున్నగు గ్రంథములు నుడువుచున్నవి.

"సూర్యగ్రహణ తుల్యా సా శుక్లా మాఘస్య సప్తమీ,
అరుణోదయ వేళాయాం స్నానం తత్ర మహాఫలం.
మాఘే మాసి సితే పక్షే సప్తమీ కోటిపుణ్యదా,
కుర్యాత్ స్నానార్ఘ్యదానాభ్యా మాయురారోగ్యసంపదః."

షష్ఠినాడు రాత్రి ఉపవసించి సప్తమినా డరుణోదయమున స్నానమాచరించిన ఏడుజన్మముల పాపము తొలగుననియు, రోగశోకములు నశించుననియు, ఈజన్మమున జేసినదియు, జన్మాంతరార్జితమును, మనోవాక్కాయ కృతమును, జ్ఞాతాజ్ఞాతమును అగు ఏడువిధములగు పాపము విడిపోవునని ధర్మసింధువు తెలుపుచున్నది. వ్రతచూడామణియందు ఈ స్నానవిధి యిట్లున్నది:

"బంగారు వెండి రాగి ఇనుము—వీనితో దేనితోగాని దీపపుప్రమిదను సిద్ధపరచి, దానిలో దీపము వెలిగించి, దీప

మును నెత్తిపై నిడుకొని నదీతీరమునకుగాని, తటాకాదులకు గాని వెళ్ళి, సూర్యుని ధ్యానించి, ఆదీపమును నీటిలో వదలి, ఎవ్వరును నీటిని తాకకముందే స్నానముచేయవలెను. స్నానముచేయునపుడు ఏడు జిల్లేడాకులుగాని, ఏడు రేగాకులుగాని, తలపైనిడుకొనవలెను.

జననీ త్వం హి లోకానాం సప్తమీ సప్త సప్తికే,
సప్తవ్యాహృతికే దేవి నమస్తే సూర్య మాతృకే.

(సప్తాశ్వములు గల ఓ సప్తమీ నీవు సకలభువనములకును, లోకములకును జననివి. సూర్యునికి తల్లివైన నీకు నమస్కారము.) అను మంత్రముచే సూర్యునకు అర్ఘ్యమిచ్చి పూజించవలెను. పిదప పితృతర్పణము చేయవలెను.''

తామ్రపాత్రమునగాని, మట్టిపాత్రమునగాని చిమ్మిలి వంటి పదార్థమును చేసిపెట్టి, దానిని ఎఱ్ఱనిగుడ్డతో కప్పి గంధపుష్పాక్షతలతో పూజించి, బ్రాహ్మణులకు దానమివ్వవలెను-అని నిర్ణయసింధుకారుడు తెలిపెను.

భవిష్యోత్తర పురాణమున ఈవ్రతవిధి ఎట్లున్నదియు తెలియుటముఖ్యము గనుక సంగ్రహముగా వ్రాసి నిట తెలుపుచున్నాను.

చక్రవర్తిత్వ ఫలము నిచ్చు రథసప్తమీ వ్రతమును ఎట్లాచరించవలెనని ధర్మతనయుడు అడుగగా కృష్ణుడిట్లు తెలిపెను : పూర్వము కాంభోజదేశమున యశోధర్ముడను రాజుండెను. ఆతనికి ముదిమిముప్పున ఒక కుమారుడు కలిగెను.

ఆకుమారునికి ఎప్పుడును రోగమే. తనకుమారునికి వ్యాధి కలుగుటకు కారణ మేమని రాజు బ్రాహ్మణుల నడిగెను. "నీ కుమారుడు పూర్వజన్మమున పరమలోభియగు వైశ్యుడు. రథసప్తమీ వ్రతమును ఎవరో చేయుచుండగా చూచెను. ఆవ్రతదర్శన మాహాత్మ్యమునలన నీకడుపున పుట్టెను. లోభియగుట వలన వ్యాధితు డయ్యెను."అని బ్రాహ్మణులు తెలిపిరి. "అయిన దీనికి పరిహారమేమి?" యని రాజు మరల ప్రశ్నించెను. "ఇతనికి నీకడుపున పుట్టు భాగ్యము కలిగించిన రథసప్తమీ వ్రత మాచరించుము. పాపము నశించి చక్రవర్తిత్వమును పొందుదుడు."అని బ్రాహ్మణులు హితవు చెప్పిరి. ఆవ్రత విధానమును తెలుపుడని రాజు కోరగా వారిట్లు నుడివిరి.

"మాఘశుక్ల షష్ఠినాడు తెల్లనూవుల పిండితో నలుగుపెట్టుకొని నదియందు స్నాన మాచరింపవలెను. నది లేకున్న ఎచ్చటనైనను సరియే. దేవపూజ నిర్వర్తించి సూర్యాలయమునకువెళ్ళి అచట సూర్యు నారాధించి, ఇంటికి వచ్చి అతిథులకు, బంధుమిత్రులకు భోజనముపెట్టి, తైలవర్జితముగా భుజింపవలెను. రాత్రి భుజింపరాదు. రాత్రి వేదపారగుడగు బ్రాహ్మణుని ఆహ్వానించి పూజించవలెను. పిదప నిరాహారుడై భూమిపై పడుండవలెను. తర్వాత, సప్తమినాడు ఉదయముననే లేచి కాల్యకృత్యములు దీర్చి, కింకిణీజాలములు గలది,సర్వాలంకృతము,రత్నఖచితమునగు రథమును నిర్మించి, దానిని చాందినీ మండపము మధ్యమున నుంచి, కుంకుమ

గంధాక్షతలతో పూజించి, పూలమాలలతో అలంకరించి, సర్వ సంపూర్ణ లక్షణమగు సూర్యవిగ్రహమును రథములోనుంచి అర్చించి, నానావిధ ఫలభక్ష్యములు నైవేద్య మిచ్చి, రాత్రి జాగరముచేసి, అష్టమినాటి యుదయమున స్నానమాచరించి బ్రాహ్మణులకు కోరినవన్నియు దానమీయవలెను. ఆరథమును, రెండురక్తవస్త్రములను, రక్తధేనువును గురువునకు దానమీవలెను. ఇట్లు వ్రత మాచరించువాడు ఏమి పొందడు? ఈవ్రతమాచరించిన భాస్కర ప్రసాదమువలన నీ కుమారుడు మహాతేజస్వియై అపూర్వబల పరాక్రమవంతుడై సకలభోగము లనుభవించి, రాజ్యమును అకంటకముగా పాలించి, సూర్యలోకముపొంది, అచట ఒక కల్పపర్యంతముండి, పిదప చక్రవర్తియై జన్మించును.'' ఆరాజు ఈ వ్రతము సల్లే చేసెనట.

హేమాద్రి రథసప్తమీ వ్రతమునే కాక కల్యాణసప్తమి, కమలసప్తమి, శర్కరాసప్తమి, అచలాసప్తమి, రథాంకసప్తమి, మహాసప్తమి, జయాసప్తమి, విజయాసప్తమి, జయంతీసప్తమి, అపరాజితాసప్తమి, మహాజయాసప్తమి, నందాసప్తమి, సిద్ధార్థకాదిసప్తమి, సాక్షుభార్యసప్తమి, సర్షపసప్తమి, మార్తాండసప్తమి, సూర్యవ్రతసప్తమి, సప్తసప్తిసప్తమి, అర్కసంపుట సప్తమి, నింబసప్తమి, మరీచసప్తమి, ఫలసప్తమి – మున్నగు పెక్కు సప్తమీవ్రతములను పేర్కొనినాడు. ఇవియన్నియు సూర్య

వ్రతములే. దీనిలో కొన్ని రథసప్తమినాడు - ఆచరించవలసి నవియు నున్నవి.

సూర్యారాధనము మనకు వేదకాలమునుండియే కలదు.

"ఆసత్యేన రజసా వర్తమానో నివేశయ న్నమృతం మర్త్యంచ
హిరణ్యయేన సవితా రథేనా దేవేయాతి భువనాని పశ్యన్."

హిరణ్యరథము నెక్కి సూర్యుడు వెళ్లుచున్నాడని ప్రాచీనులు ఎంతో సుందరముగ నూహించి యారాధించిరి. ఈ సూర్యుని రథమునకు చక్ర మొక్కటే. ఆచక్రమునకు ఆకులారు; గుఱ్ఱములు ఏడు.

"రథే విశ్వమయే చక్రం కృత్వా సంవత్సరాత్మకం,
ఛందాంస్యశ్వాః సప్తయుక్తాః స్వయం పర్యేతి భావయన్."

అని సూర్య సిద్ధాంతమున సూర్యుడు సంవత్సరమను ఒకే చక్రముగల విశ్వమను రథమున ఛందస్సులను ఏడు గుఱ్ఱములను పూన్చి వచ్చుచున్నాడని వర్ణింపబడినాడు. సంవత్సరము ఆవృత్తమగు ఆరు ఋతువుల సముదాయము గనుక చక్రముగను, సూర్యకిరణమున ఏడురంగులు భాసించుచున్నవి గనుక వానిని అశ్వములుగను పూర్వులు వర్ణించిరని పరిశోధకులు తెలుపుచున్నారు. ఏడురంగులను కనుగొనుటనే పూర్వులు పలువిధములుగా వర్ణించిరి. కనుకనే తదుపలక్షణముగా సప్తమీ తిథియందు సూర్యారాధన చేయవలెనను నియమ మేర్పరుచుకొనిరి. రథసప్తమినాడు సూర్యోదయ

సమయమున ఆకాశమండలమున గ్రహనక్షత్ర సన్నివేశము రథాకారముగ నున్నందున రథసప్తమియని పేరు వచ్చినది యనియును పరిశోధకు లనుచున్నారు.

రథసప్తమి కింత ప్రాధాన్యమొందుటలో అరయుదము. రథసప్తమినాడు సూర్యునికి పొంగళ్ళు నివేదించుట గమనింప వలసిన విషయము. "సూర్యగ్రహణ తుల్యా సా శుక్లా మాఘస్య పంచమీ" అనియు, "స్నానం శుక్ల తిలైః కార్యం" అనియు. "జననీ త్వం హి లోకానాం సప్తమీ సప్తసప్తికే" అనియు చెప్పుట పరిశీలించదగినది. దక్షిణాయనము దేవతలకు రాత్రి, ఉత్తరాయణము పగలు. మకరసంక్రాంతితో ఉత్తరాయణ మారంభమగును. ఒకప్పుడు రథసప్తమినాడే ఉత్తరాయణ మారంభమగుచుండెనని యూహించవచ్చును. అంతవరకు సూర్యుడు మరుగయియుండి, ఆనాడే దృగ్గోచరుడగుటవలన ఈ సప్తమి "సప్తవ్యాహృతికే దేవి నమస్తే సూర్యమాతృకే" అని సూర్యుని తల్లిగా వర్ణితమైనది. తెలకపిండితో ఒడలు రుద్దుకొని స్నానమాచరింపవలయుననియు, జిల్లేడాకులు తలపై నిడుకొనవలెననుటయు, తిల గుడాదులు దానము చేయవలెననుటయు–ఇది మకరసంక్రాంతి వంటి శీతాపనోదన వ్రతమని చెప్ప బనిలేదు. కనుకనే సూర్యునికి ముద్గాన్నమును నివేదించుచున్నాము. చలి, చీకటి తొలగి నూతనయుగము – కాంతియుగము ప్రారంభమగును. సూర్యుడు ఉత్తరమునకు ప్రాలి పయనించునట్లు

గోచరమగును. నిజమునకు రథసప్తమినుండి చలితొలగి వేసవి యారంభమగు ననవచ్చును.

''చలి ప్రవేశించు నాగుల చవితినాడు;

మెరయు వేసవి రథసప్తమి దివసమున.''

అని శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యమున వర్ణించెను. కాగా, అంధకారమునుండి విడివడి జీవకోటికి చలి తొలగించి, నూతన చైతన్యము కలిగించు సూర్యదేవునియెడ కృతజ్ఞతా సూచకముగా చేయు పండుగయే రథసప్తమి. మాఘ శుద్ధ పంచమినాడు వసంతపంచమి జరుపుకొనుటయు పరిశీలింపుడు.

సూర్యారాధన ఆంధ్రదేశమున పూర్వము విశేషముగా నుండెను. నేటికిని 'సూర్యనారాయణ' యను పేరు పెట్టుకొనుట తెనుగువారిలో ప్రబలిన యాచారము. పూర్వము ఈజిప్టు మొదలగు దేశములలోను సూర్యారాధనము ప్రబలియుండెను. మరణించినవాడు సూర్యలోకమునకు వెళ్ళి ప్రభామయులుగ నుందురను నమ్మకము వారి కుండెను. జపాన్ – నిప్పన్ ; అనగా సూర్యుడే-సూర్యదేశ మనియే.

---

# 19. మహాశివరాత్రి

ఈ పండుగ మాఘ బహుళ చతుర్దశినాడు చేయబడుచున్నది. ఇది ప్రధానముగా శివభక్తుల పండుగ. ఈనాడు శివభక్తులు తెల్లవారుజాముననే లేచి, స్నానాద్యనుష్ఠానములు నిర్వర్తించి, పూజలొనర్చి ఉపవసించి, రాత్రియంతయు మేల్కొని మరునాటి యుదయమున పారణ చేయుదురు. రాత్రియంతయును శివపూజలు, అభిషేకములు, అర్చనలు, శివలీలా కథనములు జరుపుదురు. శివక్షేత్రములందు ఈ ఉత్సవము గొప్పగా జరుగును. శ్రీశైలమందు పూర్వమీనాడు జరుగు ఉత్సవమును పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రమున విపులముగ వర్ణించినాడు.

శైవులు ధరించు భస్మమును సిద్ధపరచుటకును ఈనాడు పవిత్రముగ భావింపబడుచున్నది.

శివరాత్రినాడు పూజలు, జాగరణాదులు జరుపువారు సర్వ పాపవిముక్తులై అంతమున శివసాయుజ్యమును పొందుదురనియు, ఈ వ్రత మాచరించనివారు జన్మ సహస్రములలో కొట్టుమిట్టాడుదురనియు పురాణములు చెప్పుచున్నవి.

శివరాత్రి మాహాత్మ్యమును గురించి స్కాంద, లింగ, భవిష్యత్పురాణములలో పెక్కు కథలు కలవు. కాలోత్తరమున ఈనాటి రాత్రి నాలుగు యామములలోను జరుప

దగు పూజావిధులు వివరింపబడినవి. లింగపురాణమున శివ రాత్రి మాహాత్మ్యమును దెలుపు కథ యిట్లున్నది:

ఒకనాడు కైలాస శిఖరముపై పార్వతీ పరమేశ్వరులు సుఖాసీనులై గోష్ఠి జరుపుచుండ, పార్వతి "దేవదేవేశ, అన్ని వ్రతములలోను ఉత్తమమగు వ్రతమును, భుక్తి ముక్తి ప్రదాయకమగు దానిని తెలిపి నన్ను కృతార్థురాలిని చేయుము" అని కోరెను. అంతట శివుడు "దేవీ, శివరాత్రి వ్రత మనునది కలదు. అది పరమరహస్యమును, సర్వయజ్ఞ సమానమును, ఉత్తమోత్తమమును, ముక్తిప్రదము నైనది. దీనిని మాఘ బహుళ చతుర్దశినాడు ఆచరింపవలెను. తెలిసి కాని, తెలియక కాని ఒక్కమారు చేసినను యముని తప్పించుకొని ముక్తి పొందుదురు. దీనికి దృష్టాంతముగా ఈ గాథను వినుము." అని ఇట్లు నుడివెను.

ఒకానొకప్పుడు ఒక పర్వత ప్రాంతమున హింసా వృత్తిగల వ్యాధు డొక డుండెను. అతడు ప్రతి యుదయము నను అడవికి వేటకు వెళ్ళి సాయంకాలమునకు ఏదేని మృగ మును చంపి తెచ్చుచు, కుటుంబ పోషణము గావించు చుండెను; యథారీతిగనే ఒకనాటి ఉదయమున బయలుదేరి అడవియంతయు తిరిగెను. ఒక్క మృగమును కంటబడలేదు. చీకటి పడజొచ్చెను. వట్టిచేతులతో ఇంటికి మరలుటకు మన సొప్పలేదు. అయినను గత్యంతరము లేక ఇంటివైపు మరలెను. దారిలో అతని కొక తటాకము కనిపించెను. 'ఏ మృగమైనను నీరు త్రాగుట కిచ్చటికి తప్పకవచ్చును. వేచియుండి దానిని

సంహరింతును.' అని ఆలోచించి, క్రూరమృగముల బారి పడకుండుటకై సమీపముననున్న ఒక చెట్టెక్కి తన చూపునకు అడ్డముగానున్న ఆకులను, కొమ్మలను విరచి క్రింద పడ వేయసాగెను. చలికి 'శివ శివ' యని వడకుచు విల్లెక్కుపెట్టి మృగాగమనముకొరకు వేచియుండెను. మొదటిజాములో ఒక పెంటిలేడి నీరు త్రాగుటకు అక్కడికి వచ్చెను. వ్యాధుడు సంతోషముతో దాని పై బాణము విడువబోయెను. అప్పుడా లేడి భయపడక "వ్యాధుడా! నన్ను చంపకుము." అని మనుష్య వాక్కులతో అతనిని ప్రార్థించెను. వ్యాధుడు ఆశ్చర్యపడి "మనుష్యులవలె మాటలాడు నీవంటి మృగమును చూడలేదు. నీ సంగతి ఏమి? తెలుపుము" అని కోరెను. దానికి జింక "లుబ్ధకాగ్రేసరా! నేను పూర్వ జన్మమున రంభయను అప్సరసను. హిరణ్యాక్షుడను అసురరాజును ప్రేమించి శివుని పూజించుట మరచితిని. దానికి రుద్రుడు ఆగ్రహుడై 'కామాతురవైన నీవును, నీ ప్రియుడును జింకలుగా పన్నెండేండ్లు గడపి ఒక వ్యాధుడు బాణముతో చంపనుండగా శాపవిముక్తులగుదురు' అని సెలవిచ్చెను. నేను గర్భిణిని. నీకు అవధ్యను. నావలన నీ కుటుంబమునకు సరియగు భోజనము లభింపదు. కనుక నన్ను వదలుము. మరొక పెంటిజింక ఇచటికి వచ్చును. అది బాగుగా బలసినది. దానిని చంపుము. లేనిచో నేను నా వసతికి వెళ్ళి ప్రసవించి, శిశువును బంధువుల కప్పగించి తిరిగి వత్తును." అని అతని నొప్పించి పెక్కు శపథములుచేసి వెళ్ళెను.

ఇంతలో రెండవ జాము గడచెను. మరల నొక వెంటి జింక కనిపించెను. మొదటి జింకయే తిరిగివచ్చెనని వ్యాధుడు సంతోషించి, విల్లెక్కుపెట్టి బాణము విడువబోయెను. అదిచూచి ఆ జింక భయపడి మానవవాక్కులతో "ఓ ధనుర్ధరుడా, మొదట నామాట విని పిదప నన్ను వధింపుము. నేను విరహముతో కృశించియున్నాను. నాలో మేదో మాంసములు లేవు. నేను మరణించినను నీకుటుంబమునకు సరిపోను. ఇంతలో నిక్కడికి అత్యంత స్థూల పీనాంగమగు మగజింక యొకటి రాగలదు. దానిని చంపుము. అట్లు కానిచో నేనే తిరిగి వత్తును." అనెను. వ్యాధుడు దానితో ప్రమాణము చేయించుకొని విడిచిపెట్టెను.

మూడవజాము వచ్చెను. వ్యాధు డాకలితో జింక కోసము వేచియుండెను. ఇంతలో సౌభాగ్యబల దర్పితమైన మగజింక యొకటి అక్కడికి వచ్చెను. వ్యాధుడు దానిని చూచిన వెంటనే, వింటిలో బాణము తొడిగి, చెవివరకు అల్లెత్రాడు లాగి బాణము విడువబోగా, ఆమృగము కాలరూపుడగు వ్యాధుని చూచి, తనప్రియురాలినిగూడ వాడే చంపియుండునని నిశ్చయించి, తనప్రియురాలు లేని జీవితము వ్యర్థమని తలపోసి, అతనినే అడిగి తెలిసికొందమని యూహించి "ఓ మహాసత్త్వుడా! రెండువెంటి జింకలు ఇక్కడికి వచ్చినవా? అవి ఎటు పోయినవి? నీవు వానిని చంపితివా? నిజము చెప్పుము." అని ప్రశ్నించెను. వ్యాధుడు దానిమాటలకు మునుపటివలెనే ఆశ్చర్యపడి, "రెండు వెంటిజింకలును మరలి వచ్చుటకు

ప్రతిజ్ఞ చేసి, వెళ్లినవి. నిన్ను నాకాహారముగ పంపిన వను కొందును. కనుక నిన్ను చంపుదును.'' అనెను. కృష్ణసారము ఆమాట విని ''నేను ఉదయము నీ ఇంటికి వచ్చెదను. నాభార్య ఋతుమతి. ఆమెతో గడపి, బంధుమిత్రుల అనుజ్ఞ పొంది మరలి వత్తును.'' అని పెక్కు ప్రమాణములు చేసి వెళ్లెను.

ఇట్లు నాల్గు యామములు గడచెను. సూర్యోదయము కావొడగెను. వ్యాధుడు జింకలకొరకు ఎదురుచూచుచు దిక్కులు పరికించుచుండెను. ఇంతలో మరియొక హరిణి శిశు సమేతముగా అక్కడికి వచ్చెను. దానిని చంపబోగా, అది శిశుసహితగనుక తా నవధ్యయని, శిశువును ఇంట అప్పగించి వత్తునని చెప్పివెళ్లెను. కొంతసేపటికి వ్యాధునికడకు ఈ నాలుగు జింకలును వచ్చి ''నన్ను మొదట చంపుము, నన్ను మొదట చంపుము.'' అనుచు వ్యాధుని ఎదుట మోకరిల్ల సాగెను. లుబ్ధకుడు మృగముల సత్యనిష్ఠకు ఆశ్చర్యపడెను. వానిని చంపుట కతని మన స్సొప్పలేదు. తనహింసావృత్తిపై జుగుప్సయు కలిగెను.

''అహో మృగ మహాసత్త్వ గచ్ఛ గచ్ఛ స్వ మాలయం,
ఆమిషేణ న మే కార్యం య ద్భవ్యం త ద్భవిష్యతి.
సత్త్వానాం చ వధా త్పాపం తర్జనే బంధనే తథా,
నైవ పాపం కరిష్యామి కుటుంబార్థే కథంచన.
ధర్మాణాంచ దయా మూలం సత్య శాఖాఫలం దమం,
త్వం గురు ర్మమ ధర్మాణా ముపదేష్టా హి సాంప్రతం.

గచ్ఛ గచ్ఛ కురంగ త్వం కుటుంబేన సమన్వితః,
న్యస్తాని తు మయాస్త్రాణి సత్యధర్మసమాశ్రితః.''

... ... ... ...

''ఓమృగమా ! నీ నివాసమునకు వెళ్లుము. నాకు మాంస మక్కరలేదు. కానున్నది కాకమానదు. మృగములను చంపుట, బంధించుట, బెదరించుట పాపము. కుటుంబము కొరకు ఇక ఆ పాపము చేయను. ధర్మములకు దయ మూలము. దమము సత్యఫలము. నీవు నాకు గురువు, ఉపదేష్టవు. కుటుంబసహితముగ నీవు వెళ్ళుము. నేనిక సత్యధర్మము నాశ్రయించి అస్త్రములను వదలిపెట్టుదును.'' అని చెప్పి తన ధనుర్బాణములను పారవేసి, మృగములకు ప్రదక్షిణ మాచరించి నమస్కరించెను.

ఆసమయమున ఆకాశమున దేవ దుందుభులు మ్రోగెను. పుష్పవృష్టి కురిసెను. దేవదూతలు మనోహరమగు విమానమును తెచ్చి, యిట్లనిరి: ''ఓమహాసత్త్వుడా! శివరాత్రి ప్రభావమున నీపాతకము క్షీణించినది. ఉపవాసము, జాగరమును జరిపితివి. తెలియకయే యామ యామమునను పూజించితివి. నీవెక్కినది బిల్వవృక్షము. దానిక్రింద స్వయంభు లింగమొకటి గుబురులో మరుగుపడి యున్నది. నీవు తెలియకే బిల్వపత్రముల త్రుంచివేసి దానిని పూజించితివి. సశరీరముగ స్వర్గమునకు వెళ్లుము. మృగరాజ! నీవు సకుటుంబముగా నక్షత్రపదము పొందుము.''

ఈకథ వినిపించిన పిదప పరమేశ్వరుడు పార్వతితో నిట్లనెను: ''దేవీ ! ఆ మృగకుటుంబమే ఆకాశమున కని

పించు మృగశిరనక్షత్రము. మూడునక్షత్రములు కనిపించుచున్నవే వానిలో ముందున్నవి జింకపిల్లలు, వెనుకనున్న మూడవది మృగి. ఈమూడింటిని మృగశీర్ష మందురు. వాని వెనుకనుండు నక్షత్రములలో ఉజ్వలమైనది లుబ్ధక నక్షత్రము. శివరాత్రి సమానమైన వ్రతము మరియొకటి లేదు.''

స్కాందపురాణమున చెప్పబడిన నిషాదగాథ లింగ పురాణమున నున్న గాథకంటె భిన్నముగ నున్నది. వ్యాధుడు రాత్రియంతయు మృగములకొరకు కాచుకొనియుండెను. సూర్యోదయము వరకును ఏజంతువును దొరకలేదు. నిరాశతో ఇంటిముఖము పట్టెను. ఇంటికి రిక్తహస్తములతో వచ్చిన వ్యాధునిచూచి, ఆకలితో అటమటించు భార్యయును, పిల్లలును మిగుల చింతించిరి. వారుకూడ ఆరాత్రియంతయు నిరాహారులై జాగరముచేసిరి. వ్యాధుడు అరణ్యమున బిల్వ వృక్షమెక్కి బిల్వదళములు త్రుంచివేయుట మొదలగు పనులు చేసెను. ఆవ్యాధుని మరణసమయమున యమకింకరులు చుట్టుముట్టిరి. అదిచూచి శివుడు తనకింకరులను పంపి అతనిని శివలోకమును పొందింపుడని ఉత్తరువిచ్చెను. శివకింకరులు అతనిని శివలోకమునకు గొనిపోయిరి. యమకింకరు లదిచూచి తమరాజగు యమునితో మొరపెట్టుకొనిరి. యముడు శివుని కడ ఈవిషయము నివేదించెను. శివరాత్రినాడు అజ్ఞానముతో నైనను వ్యాధుడు శివునకు బిల్వార్చనచేయుటవలన ఈ పుణ్యము కలిగెనని యమునికి శివుడు తెలియబరచెను.

మహాభారతమున శాంతిపర్వములో చిత్రభానుడను రాజు శివరాత్రివ్రతము జరిపినట్లు భీష్ముడు తెలిపియున్నాడు.

చిత్రభానుడు అష్టావక్ర మునితో శివరాత్రివ్రతమును తానెం దుల కాచరించుచున్నదియు ఇట్లు వివరించెను. "మహామునీ! నేను పూర్వజన్మమున సుస్వరుడను వ్యాధుడను. ఒకనాడు వేటకువెళ్లి ఒక జింకను చంపితిని. ఇంతలో రాత్రియాయెను. ఇంటికి మరలి రాలేకపోయితిని. ఆరాత్రియంతయు ప్రాణరక్ష ణమునకు ఒక బిల్వవృక్షమెక్కి, నాభార్యాసుతులను తలచు కొనుచు కన్నీరు కురిపించుచు, ఏమియును తోచక బిల్వపత్ర ములు త్రుంచివేయుచుంటిని. ఆ కన్నీరు, ఆపత్రి చెట్టుక్రింద నుండు శివలింగముపై పడెను. తెల్లవారగనే జింకనుమోసి కొని ఇంటికి వెళ్ళి దానిని అమ్మివేసితిని. ఆహార పదార్థము లను కొని ఇంటికి తిరిగివచ్చి, వంటచేసికొని భుజింపనుండెగ. ఒక అభ్యాగతుడు వచ్చెను. అతనికి మొదట వడ్డించి, పిదప నేనును, తక్కినవారును భుజించితిమి. ఈపుణ్యావశమున మర ణానంతరము నాకు శివసాయుజ్యము కలిగినది. ఈజన్మమున చిత్రభానుడనై జన్మించితిని."

అలంపురము గొప్ప శివక్షేత్రము. దాని మాహాత్మ్య మును తెలుపు ఆలంపురీ మాహాత్మ్యమను గ్రంథములోను ఈ మృగలుబ్ధక గాథ కొంతమార్పుతో నిట్లున్నది: 'విలసత్' అనురాజు మిగులదుర్మార్గుడై మృగయావ్యసనిగా నుండెను. అతని సేవకు డొకనాడు ఒక మృగమును రాజుభోజనము కొఱకై చంపబోయెను. ఆమృగము అదిచూచి ఆసేవకుని వారించి, రాజు మృగయావ్యసనమునుగూడ నిందించెను. మృగము మనుష్యభాషితమున నుడువుట విని రాజసేవకుడు మిగుల నాశ్చర్యపడి ఆవృత్తాంతమును తనయేలిక కెఱింగిం

చెను. విలసద్భూపాలుడును కుతుకముతో ఆమృగమును తన ఎదుటకు రప్పించి, తనను నిందించినందుకు కారణమడిగెను. "నీవు మృగయవలనను, ఇతర దుష్కర్మలవలనను మహా పాపివైతివి. పాపవిమోచనమునకై దేవాలయములను నిర్మించి, నీవిగ్రహమును, దానియెదుట నావిగ్రహమును చెక్కించుము. నీవిగ్రహమును భక్తులు నిరంతరము చూచు చుందురు. దీనివల్ల నీపాపము క్షీణించి ఉత్తమలోకములు కలుగును." అని మృగ మాతని కుపదేశించెను. ఆరాజుఅట్లే చేసెను. ఆలంపురీ దేవాలయమున ఒక బోయ జింకను వెంటాడుచున్నట్లు చెక్కబడిన విగ్రహములున్న స్తంభ ములు నేటికిని పెక్కుగలవు.

ఈమృగవ్యాధ కథకును, మృగశిర నక్షత్రమునకును గలసంబంధమును గురించి పిదప చర్చింతము. ప్రస్తుతము మాఘ బహుళ చతుర్దశియే శివరాత్రియనుటకు కారణ మేమి యని విచారింతము. ఈశానసంహితలో నిట్లున్నదని నిర్ణయ సింధుకారుడు ఈప్రమాణమును తెలిపినాడు :

"మాఘకృష్ణ చతుర్దశ్యా మాదిదేవో మహానిశి,
శివలింగ తయోద్భూతః కోటిసూర్య సమప్రభః,
తత్కాలవ్యాపినీ గ్రాహ్యా శివరాత్రి వ్రతే తిథిః"

"మాఘకృష్ణ చతుర్దశినాటి మహారాత్రిని ఆదిదేవుడగు శివుడు లింగరూపమున కోటిసూర్య ప్రభలతో అవతరించెను. కనుక ఆనాడు శివరాత్రివ్రత మాచరించవలెను. లింగపూజ జరుపవలెను."

శివుడు లింగాకారుడై తన పరమేశ్వరత్వమును నిరూపించుకొన్నది దారుకావన విహారసమయమున. శివుడు దక్షాధ్వరధ్వంసము తర్వాత హిమాలయమున అత్తవారింట మనుగుడుపులుండగా, గణములు మున్యాశ్రమములలో అత్యాచారములు చేయసాగిరి. వానిని వారింపుమని పార్వతి కోరెను. శివుడు దానిని వినక తానును మునిపత్నుల వెంట బడి వారికి పాతివ్రత్య భంగమొనర్చెను. దానితో మునులు క్షుబ్ధులై అతని లింగము తెగిపడి పోవలెనని శపించిరి. శివుడు తనలింగమును భూమ్యాకాశముల వరకును పెంచి తనగొప్ప దనమును నిరూపించుకొనెను. ఈకథను శ్రీనాథుడు హర విలాసమున దెలిపినాడు. ఇట్లు లింగపూజకు నాందియయిన దని పురాణములు తెలుపుచున్నవి.

శివ స్కంద వాసుదేవుల విగ్రహములపూజ మనదేశమున రెండువేల ఎనిమిదవందల సంవత్సరములకు ముందు నుండే యున్నదని పాణిని సూత్రములనుండి తెలియుచున్నది. "జీవికార్థేచాపణ్యే" (5-3-96) అను సూత్రమునకు పతంజల్యాచార్యులు భాష్యము వ్రాయుచు "జీవికార్థం యదవిక్రీయమాణం తస్మిన్ వాచ్యే కనోలుప్ స్యాత్. వాసుదేవః, శివః, స్కందః. దేవలకానాం జీవికార్థా సుదేవ ప్రతికృతి ష్విదం. అపణ్యేకిం? హస్తికాన్విక్రీణీతే" దేవలకులు ఆకాలమున వాసుదేవ శివ స్కందాది విగ్రహములను సిద్ధపరచు చుండిరని స్పష్టమగుచున్నది. శివవర్ణనలు హాలునిగాథా సప్తశతిలోను కొన్నికలవు. లింగపూజయు ఐదారువేలేండ్ల నుండియే పెక్కు దేశములలో ఆచారమున నున్నట్లు ఈజిప్టు,

బాబిలోనియా, అసిరియా, రోము, గ్రీసు దేశముల చరిత్రలు తెలుపుచున్నవి. మన దేశమున హరప్పాలో వెలువడిన శిథిలములవల్ల లింగపూజ పెక్కువేల సంవత్సరముల నాటిదనే నిర్ణయమగుచున్నది. శివలింగము యజ్ఞములలోని యూపస్తంభ స్తోత్రముల నుండి ఉత్పన్నమైనదనియు, ఆయూపస్తంభమే క్రమముగా శివలింగముగా పేర్కొనబడినదనియు పలువురు వాసించినను. శివుని దారుకావన విహారగాథనుబట్టి పురుషచిహ్న పూజ కాదనరానిదిగా తోచుచున్నది.

నాకు చూడగా శివరాత్రి వసంతఋతు ప్రారంభోత్సవముగా కానవచ్చుచున్నది. మాఘశుద్ధ పంచమి వసంత పంచమి యనుటనుబట్టి, తర్వాత ఫాల్గుణ పూర్ణిమనాడు హోళీ జరుపుటనుబట్టి, హోళీలోని బండుబూతులు మొదలగు వానినిబట్టి శివరాత్రియును మొదట అట్టిబూతుపండుగయై పిదప శివపూజాపరముగ పవిత్రమయినదై యుండునని భావించుచున్నాను. ఇది వసంతఋతు ప్రారంభకథన మనుటకు మృగవ్యాధగాథే ప్రమాణము. ఒకప్పుడు మృగశిర నక్షత్రమున వసంతవిషువత్తు వచ్చుచుండెనని పండితులు అంగీకరించినదే. ఈవిషువన్నిర్ణయమునే మనపూర్వులు కథలుగా కల్పించి, జ్యోతిర్లోకముతో ముడిపెట్టుట పరిపాటి యయినది. ధ్రువుని ధ్రువనక్షత్రముగా చేయుట, సప్తర్షులను నక్షత్రములుగా నిలిచినారనుట మనకు తెలిసినదే. అట్లే మృగశీర్షమున వసంతవిషువత్తు ఏర్పడుకాలమును కథలుగా నల్లిరని తోచుచున్నది. తర్వాతదానికి శైవ సంప్రదాయత్వము ఆపాదింపబడియుండును. శివరాత్రి వసంతర్తు

ప్రారంభమనుటకు ఉపలంబకముగా శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారి "ప్రాచీన ఖగోళము" అను గ్రంథమునుండి కొన్ని భాగములు ఉదాహరించుచున్నాను.

"కొన్ని ఋక్కుల కాలమున పునర్వసు మృగశీర్షలును, తైత్తిరీయ సంహితా బ్రాహ్మణముల కాలమున కృత్తికయును, ఐతరేయ బ్రాహ్మణముల కాలమున కృత్తికా రోహిణులును, వేదాంగ జ్యోతిష కాలమున ధనిష్ఠయు, భారత కాలమున శ్రవణమును ప్రథమ నక్షత్రములు. అనగా వసంత విషువము ఆయాయి నక్షత్రములలో నగుచుండెడిది. ఐతరేయ బ్రాహ్మణమునుండి ఒక ఉపాఖ్యాన సారమీదిగువ :

"ఒకప్పుడు ప్రజాపతికి తన కూతురుమీద తలంపు కలిగెను. అతడు లేడియాయెను. అతని కూతురు రాడు లేడియాయెను. దేవత లితడు పాడుపని చేయుచున్నాడని ఒక భూతమును సృష్టించి ప్రజాపతిని శిక్షింపుమని కోరిరి. ఆతడు ప్రజాపతి యకృత్యమును బాణముతో కొట్టెను. ఆ బాణముతో ఆ మృగ మాకసమున కెగసెను. దానినే మృగమందురు. దాని నేసిన వ్యాధుడు మృగవ్యాధుడు. కూతురు రోహిణి. (ఐతరేయ–2, పంచిక–3, మంత్ర–33.)

"ప్రజాపతియన్నను యజ్ఞమన్నను సంవత్సరమన్నను ఒకటియేయని ఈ బ్రాహ్మణము మాటి మాటికిని చెప్పుచుండును. ఏడాది పొడుగునను సత్రము జరుగును గాన యజ్ఞమనినను సంవత్సరమనినను ఒక్కటియే. యజ్ఞము

చేయనిచో ప్రజాసృష్టి కాదు గాన ప్రజాపతియనగా యజ్ఞము. ప్రజాపతి కూతురు రోహిణి. ఈ రోహిణి నక్షత్రమందపుడు వత్సరారంభము. ఆ కాలమున వాసంత విషువమునుండి ఉగాది. వేదఋషులకు కొండొక నక్షత్రమునందు ఉగాది యగుట తెలియును. బ్రాహ్మణ కాలమునందలి ఋషులకు ఇప్పుడు రోహిణిలో విషువమగుట ఆయన వ్యభిచారముగా కనబడెను. కావున అది 'అకృత' మనగా లోగడలేని పనిగా తోచెను. ఈ ఉపాఖ్యానమున విషువత్పశ్చిమగతి వ్యక్తమగు చున్నది. ఇట్టి ఉపాఖ్యానములు పెక్కులు పురాణములం దెల్లెడ గలవు.''

ఈ కథనుబట్టి శివరాత్రి వసంత విషువదాగమ దిన మని ఊహించుటకు విప్రతిపత్తిలేదుగదా!

కాని, మృగశిరమున వసంత విషువము కలుగుట కల్ల యని పండిత రఘునందనశర్మగారు తమ 'వైదికసంపత్తి' యను గ్రంథమున బాలగంగాధరుల మతమును ఖండించిరి.

''సుషుప్వాంస ఋభవ స్త దపృచ్ఛతా
గోహ్యక ఇదంనో అబలా బుధత్
శ్వానం బస్తో బోధయితార మబ్రవీత్
సంవత్సర ఇద మద్య వ్యఖ్యత.''
(ఋగ్వేద 1-161-13)

అను మంత్రమునకు ''ఓ ఋతువులారా! మమ్ములను నిప్పుడు ఎవరు మేల్కొల్పిరని మీ రడిగినప్పుడు సూర్యుడనెను కుక్కలు లేపినవని. ఎందుకనగా నేడు సంవత్సరాంతము''

అని అర్థమని, దీనికి బాలగంగాధరుడు. ఈ కుక్క మృగశీర్ష నక్షత్రము నొద్దగల కుక్క (డాగ్ స్టార్) అని అర్థము చెప్పుట సరికాదని, ఇది చిత్రకార్తిని - వర్షర్తు సమాప్తిని తెలుపు కుక్కల అరుపేకాని మరియొకటికాదని పండితశర్మ అన్నాడు. వేదమున మృగశీర్ష శబ్దము మేఘవాచకమేనని, కనుక ఈ మంత్రార్థము వర్షర్తు సూచకమే కాని, వసంత ఋతువు కాదని, "ఏషాహ సంవత్సరస్య ప్రథమారాత్రిర్య త్ఫాల్గునీ పౌర్ణమాసీ" (శతపథ 6-2-2-18) అని ఫాల్గున పూర్ణిమ (హోలి) యే వసంతఋతు ప్రారంభచిహ్నమని, వసంత విషువము పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రము లలో వచ్చుచుండెనని అన్నారు.

వర్షమనిన వానకును, సంవత్సరమునకును పర్యా యము. పూర్వ మొకప్పుడు వానకారునుండి-ఉత్తరాయ ణాంతమునుండి సంవత్సరము ప్రారంభమగుటను ఎవరును కాదనరు. తైత్తిరీయ సంహిత మాఘ పూర్ణిమనుండి సంవత్స రాదిని చెప్పుచున్నది. అయినను, ఐతరేయ బ్రాహ్మణము నందలి గాథ తోసివేయరానిది. మరియొక విషయమేమన మాఘామావాస్యను యుగాదిగా స్మృతికారులు పేర్కొనుట.

విష్ణుపురాణమున

"మాఘాసితే పంచదశీ కదాచిత్
ఉపైతి యోగం యది వారుణేన,
ఋక్షేణ కాలః సపరః పితౄణాం
నహ్యల్ప పుణ్యై ర్నృప లభ్యతేసా."

అని కలదు. మాఘామావాస్య శతభిషక్ నక్షత్ర యుక్తమైన పితృదేవతలకు శ్రేష్ఠమైనదనియు, మహాపుణ్యప్రదమైన దనియు దీని భావము. శివరాత్రి పిదప వెంటనే వచ్చు అమావాస్యను యుగాదియనుటయు, శివరాత్రి పండుగకు ముందు వెనుకలుగ వసంతపంచమి, మాఘపూర్ణిమ, ఫాల్గున పౌర్ణమి మున్నగు దినములు వసంతఋతువును సూచించు పండుగలగుటను బట్టియు శివరాత్రి వసంతఋతువు ప్రారంభోత్సవమే నని నా విశ్వాసము. పిదప దానికి లింగోద్భవ వృత్తాంతము చేర్పబడియుండును. (వసంతఋతు చర్యను ఉగాదిలో చూడగోరినాను.)

విగ్రహారాధకులగు భారతీయుల కిది పండుగ యగుట సహజమే. కాని, విగ్రహ పూజానిరాసకులగు ఆర్యసమాజానుయాయులకును ఇది గొప్ప ఉత్సవమగుట విశేషము. దీనిని వారు ప్రబోధదినమనియు, జ్ఞానోదయదినమనియు నందురు. దీనికొక గాథగలదు. స్వామి దయానంద సరస్వతి తండ్రి హిందుల సనాతన మతనిష్ఠుడు. ఆయన ఒక శివరాత్రి నాడు శివలింగమును పూజించి వివిధ భక్ష్యఫలములు నైవేద్యమిడి జాగరము చేయుచుండెను. పుత్రుడును తండ్రి ఆనతి జవదాటక నిద్రముంచుకొని వచ్చుచున్నను ఎట్లో మేల్కొనియుండెను. అర్ధరాత్రి దాటిన తర్వాత తండ్రి పూజామందిరమునుండి వెలుపలికి రాగా దయానందుడొక్కడే అచట నుండుట తటస్థించెను. అప్పుడు కొన్ని ఎలుకలువచ్చి ఆ నివేదిత భక్ష్యఫలములను తినుచు అటునిటు పరుగిడుట, శివ లింగము పైనను ఎక్కి గంతులువేయుట దయానందుని కంట

బడెను. "పరమేశ్వరుడగు శివుడు తనపై గంతులువేయు మూషికములనే అదలించనప్పుడు భక్తుల ఆపద లెట్లు తీర్చును?" అను సందేహము దయానందునికి కలిగి, అది వటవృక్షమై విగ్రహారాధనయందు వైరస్య మేర్పడెనట. ఇట్టి ప్రబోధ మతనికి కలిగించినందున శివరాత్రిని వారు ప్రబోధదినముగా పరిగణించి ఉత్సవము చేసికొందురు.

సర్వదేవ సమబుద్ధిగల మనవారిలో కాలక్రమమున శైవ వైష్ణవ మతభేదములు ప్రబలి రెండు మతములు ఒక దాని కొకటి చుక్కెదురుగా నయ్యెను. శైవ పక్షమునను బసవేశ్వరులవలనను, పాల్కురికి సోమనవంటి వారివలనను వీరశైవము ఆంధ్రదేశమున వ్యాపించెను. వీరశైవమున భక్తి ప్రధానము. కులభేదములు లేవు. కాన శివరాత్రి ఈ మతము వారికి మహోత్సవము. బ్రాహ్మణులలో లింగధారులగు ఆరాధ్య శైవులకును స్మార్తులకును ఇది ముఖ్యవ్రతము. తైత్తిరీయోపనిషత్తులోని ఈ మంత్రముతో ఈ చర్చ నిక ముగింతును.

"తత్పురుషాయ విద్మహే
మహాదేవాయ ధీమహి,
తన్నో రుద్రః ప్రచోదయాత్."

---

# 20. హోలి

ప్రకృతిదేవి శీతకాలపు జడిమను ఉడుపుకొని నూతన శోభను సింగారించుకొని కన్నులపండు వయినప్పుడు, ఆమెకు స్వాగతము పలుకుట భారతీయులు అనాదిగా అనుసరించుచున్న యాచారము. ఈ ఆచారపు ఆనంద స్వరూపమే ఫాల్గునోత్సవము — హోలి.

ఇది ఫాల్గున పూర్ణిమనాడు జరుపబడుచున్నందున దీనికి ఫాల్గునోత్సవమను వ్యవహార మేర్పడెను. వసంత విషువత్కాల మీనాడే సంభవించుటచేత వైదిక కాలమున నూతన వర్ష మీనాటినుండియే యారంభమగుచుండెను. పూర్వము నాలుగు నెలల కాలమొక ఋతువుగా పరిగణింపబడు చుండెను. ఈ నాలుగు నెలలలో జరుపబడు కృత్యములకు చాతుర్మాస్యవ్రతమని ఇదివరకే తెలిపితిని. మొదటి చాతుర్మాస్య వ్రతము ఫాల్గునోత్సవముతో నారంభమగుచుండెను. కనుక దీనికి వసంతోత్సవమనియు, మదనోత్సవమనియు వ్యవహారము గలదు.

కాని, యిది ఋతు పరివర్తనమువల్ల కలిగిన పండుగ. ఫాల్గునమునకు గోధుమమున్నగు ధాన్యములు – ముఖ్యముగ గోధుమలు – కోతకు వచ్చును. ఆకోతల, నూర్పుల కోలాహలమే – హో హో కారమే – ఈ పండుగకు మూలమని కొందరు అనుచున్నారు. పుత్రఘాతినియగు హోలిక యను

శాత్రువిని సంహరించిన దినము గనుక హోలీపండుగ యయిన దని మరికొందరి వాదము.

ఆంధ్రదేశమున కొన్ని ప్రాంతములలో దీనిని కాముని పున్నమయందురు. కన్నడ ప్రాంతమున కామన హబ్బ, తమిళమున కామన్ పండిగై యనియు నందురు. కామదహనమో, లేక కామ పునరుజ్జీవనమో జరిగిన దానికి గుర్తుగా ఈ పండుగ ఏర్పడినదని వేరొక కొందరన్నారు. ఈ వేరువేరు వాదములను పరిశీలించుటకు ముందు ఈ పండుగ జరుపుకొను పద్ధతిని తెలిసికొందము. ఇది ఉత్తర భారతముననే విశేషముగా జరుపబడు పండుగ గనుక అక్కడి ఆచారమునే మొదట తెలిసికొంధము.

పూర్ణిమనాడు ప్రతి యింటిముందటను ఒక గుంట త్రవ్వుదురు. దానిలో ఒక ఆముదపు కొమ్మనునాటి, గడ్డి, గాదము, పిడకలు దానిచుట్టును ప్రోగు చేయుదురు. హోలీ, హోలికయను దేవతను పూజించి, చేతి వెనుక భాగముతో నోరు కొట్టుకొనుచు, ఆ గడ్డిగాదము ప్రోవునకు నిప్పంటింతురు. రాత్రియంతయు, ఆరుబయట వసంతమును, బుక్కాపిండిని ఒకరిపై నొకరు చల్లుకొనుచు నాడుదురు. మరునటి ఉదయము కింది తరగతులవారు ఒకరిపై నొకరు దుమ్ము, బూడిద, బురద చల్లుకొనుచు, అసభ్య వాక్కులతో గునిసి యాడుదురు. ఈనాటి పండుగను, ధూల్‌వాడ్, ధులండీ యందురు. 'ధూల్‌వాడ్' అనినను, "ధులండీ" యనినను ధూళి రేపుట, ధూళిచిమ్ముట యని యర్థము.

మహారాష్ట్రులు ఈ పండుగను మరియొక విధముగ జరుపుదురు. వీర సంస్మరణ చిహ్నముగా హోలీ మంటల చుట్టును మృతవీరుల బంధు మిత్రులు నాట్యమాడుదురు. పిదప ఆమంటలలో కాగిన నీటితో స్నాన మాడుదురు. పై తరగతివారు పూర్ణపు బొబ్బట్లుచేసి, హోలికాగ్నిలో వ్రేల్తురు.

వంగ ప్రాంతమున దీనిని డోలోత్సవమందురు. ఈనాడు కృష్ణునికి డోలోత్సవము జరుపుదురు. పూర్ణపు బొబ్బట్లు నైవేద్యమర్పింతురు. దీనిని బట్టి గోధుమల పంట పండుగ యన వచ్చును. ఈలాటి పండుగనే సంతాలులు, ముండాలు సాలవృక్షాలు పూచినప్పుడు జరుపుదురు. ఆటవికులైన ఈ జాతులవారికి సాలవృక్షములు ముఖ్యములైనవి గనుక అవి పూచినప్పుడే పండుగ.

మన రాష్ట్రమునను, కన్నడ, తమిళనాడులలోను జరుపు కామదహనము చాలవరకును సమానమైనదే. శివుడు తన తపస్సును పాడుచేయుటకు వచ్చిన మన్మథుని కథ యందరెరిగినదే. శివుడు తన మూడవ కన్ను తెరచి, మన్మథుని చంపినది ఫాల్గున పూర్ణిమనాడని ప్రజల విశ్వాసము. పూర్ణిమకు నాల్గైదు దినములకు ముందుగనే కొన్ని ముఖ్యమైన ప్రాంతములలో పతాకలను నాటుదురు. వీనికి కామధ్వజములని పేరు. వీనిని పూజింతురు. పిదప ఒక గుడ్డలోగాని, కాయితము మీదగాని, మన్మథుడు శివునిపై విల్లెక్కు పెట్టినట్లున్న చిత్రమును గీచి, యూరేగించి రాత్రి

గడ్డిగాదము చేర్చి, ఆధ్వజములతో బాటు కాల్చివేతురు. ప్రేమ గీతములు పాడుదురు.

ఉత్తర దేశమునందును, మహారాష్ట్రమునందును, పశ్చిమ భారతమునందును ఈ పండుగ మిగుల నశ్లీలముగ నుండును, 'నథూర్గా' అను నలుబది యడుగల ఎత్తు బుట్ట బొమ్మ నొకదానిని దీర్ఘమగు పురుషాంగముతో నిర్మించి వీథులలో నెల కొల్పుదురు. ఈ అసభ్య ప్రవర్తన క్రమముగ మరుగయినది.

దక్షిణ దేశపు కొన్ని ప్రాంతములలో స్త్రీలు, పురుషులు దొంగాటక మాడుదురు. ఒక స్త్రీ ధాన్యపు కంకులను కట్టి దొంగిలించినట్లు నటించుచు తప్పించుకొనుటకు చెట్టెక్కును. కొందరు పురుషులు దానిని తరిమి పట్టుకొనుటకు ప్రయత్నింతురు. కొందరు ఆడువారు వారిని ఎదుర్కొని పోరాడుచున్నట్లు నటింతురు.

హోలికా రాక్షసి శిశువులను చంపి తిను కథయును వివిధముగా నున్నది. పూర్వము హోలిక యను శిశుఘాతినియగు రాక్షసియుండెను. అది శిశువులందరిని చంపి తినుటవలన ప్రపంచ ప్రజలందరును రాక్షసరాజుతో మొర పెట్టుకొనిరి. అతడును క్రూరుడే. కాని, తన జాతి స్త్రీని యొకతెను అసంతృప్తి పరచుట కిష్టములేక ప్రజలు దినమొక శిశువు చొప్పున ఆమెకు అప్పగించవలెనని యుత్తరువు చేసెను. ఇదియే పదివేలని ప్రజలు సంతసించిరి. ఇట్లు కొన్నేండ్లు గడచెను. ఒకసారి యొక ముసలిదాని వంతు

వచ్చెను. ఆమె కొకడే పౌత్రుడు. ఆ వంశోద్ధారకుని పంప వలెసి వచ్చెగదా! ఆమె దుఃఖమునకు ఎల్లయే లేదు. ఆమె దుస్థితికి అందరును కన్నీరు నించిరి. దైవముగూడ దయ దలచెను. ఇంతలో అకస్మాత్తుగా ఆయూరి కొక యోగిపుంగవుడు విచ్చేసెను. అతడు ముసలిదాని యింటి గోడును విని యేమిటియని విచారించెను. ముసిలిది తన గోడునంతయు వివరించెను. అతడు కొంతసేపు ధ్యానించి యోగదృష్టితో విషయమంతయును కనుగొని, ముసలిదాని మనుమనినే కాక ప్రపంచములోని శిశువులందరిని కాపాడుట కొక యుపాయమును వెదకెను. "వృద్ధురాలా! భయపడకుము. నా మాటవిని నడచుకొనినచో హోలిక రేపే మరణించును. అది తిట్లను, అసభ్య వాక్కులను వినినచో, వెంటనే మరణించును. ఇది దైవనిర్ణయము. కనుక నీవు గ్రామము లోని పిల్లవారి నందరిని గుంపుజేర్చి, రేపు హోలిక నీమనుమని కోసము రాగానే, పిల్లలందరును అసభ్యవాక్కులతోను, చేష్టలతోను దానిని దూషించునట్లు చెప్పుము. అది పిల్లలను తరిమి వేయుటకు ప్రయత్నించును. కాని, పిల్లలు భయపడరాదు. అసభ్యపు కేకలు మానరాదు. ఆ రాక్షసి ఆమాటలు భరించలేక పడి చచ్చును" అనెను.

వృద్ధురాలీవార్తను ఊరంతయు వ్యాపింపజేసెను. గ్రామీణులు యోగుల మాటలు విశ్వసించువారు గనుక ఆ యోగిమాటలను నమ్మి యట్లే చేసిరి. హోలిక మరణించెను. పిల్లలందరును, ఆమెను నిప్పుపెట్టి కాల్చిరి. కనుకనే కొన్ని ప్రాంతములలో పసిపిల్లలను ఎత్తుకొని మంటలపై అటు ఇటు

ఆడింతురు. దీనివల్ల పసిపిల్లల పీడలు పరిహారమగునని తల్లుల నమ్మకము.

ఈ ఆచారమునే హేమాద్రి నిర్ణయసింధువు, ధర్మ సింధువు మొదలగు స్మృతి గ్రంథములు తెలుపుచున్నవి. ధర్మసింధువులో నిట్లున్నది: "ఫాల్గునీ పౌర్ణమాసీ మన్వాదిః... ...ఇయమేవ హోలికా...హోలికాదీపనం. దివ హోలికా దీపనంతు సర్వగ్రంథ విరుద్ధం. ఇదం హోలికాపూజనం శ్రవణా కర్మాదివత్ భుక్త్వాపి కుర్వంతి...ఢుంఢారాక్షసీ ప్రీత్యర్థం హోలికా పూజనమహం కరిష్యే ఇతి సంకల్ప్య శుష్కాణాం కాష్ఠానాం గోమయ పిండానాంచ రాశింకృత్వా వహ్నినా ప్రదీప్య తత్ర

"అస్మాభిఃభయ సంత్రస్తైః కృతాత్వం హోలికేయతః,
అతస్త్వాం పూజయిష్యామి భూతే భూతి ప్రదాభవ."
...ఇతి ప్రార్థయేత్

"తమగ్నిం త్రిః పరిక్రమ్య గాయంతు చ హసంతు చ
జల్పంతు స్వేచ్ఛయాలోకః నిశ్శంకాయస్య యన్మతః"

ఫాల్గున పౌర్ణమినాడు మన్వాది. ఇదే హోలిక. హోలికనాడు నెగడు వెలిగించవలెను. పగలు నెగడు వెలిగించుట సర్వ గ్రంథ విరుద్ధము. ఈ హోలికా పూజనమును భుజించిన తర్వాతను చేయుదురు...ఢుంఢారాక్షసి ప్రీత్యర్థము, హోలికాపూజనము చేయుచున్నానని సంకల్పించుకొని, ఎండిన కర్రలు, పిడకలు రాశిచేసి నిప్పు ముట్టించి 'మేము భయ సంత్రస్తులమై నిన్ను పూజించుచున్నాము. మాకు

ఐశ్వర్యదాయునికమ్ము.' అని ప్రార్థించవలెను. పిదప ఆ నిప్పు చుట్టును ముమ్మారు ప్రదక్షిణ మాచరించి, స్వేచ్ఛగా నోటికి వచ్చినట్లు వాగవచ్చును, పాడవచ్చును. ఈ శుష్కకాష్ఠములకు అంటించు నిప్పును 'చండాల సూతికా గేహాము నుంచి' పిల్లలు దొంగిలించుకొని రావలెనట. పిదప మరునాడు 'శ్వపచుని' తాకి స్నానము చేయవలెనట.

"గీతవాద్యై స్తథా నృత్త్యైః రాత్రిస్యానీయ తేజనైః
తమగ్నిం త్రిః పరిక్రమ్య శబ్దైః లింగభగాంకితైః
తేన శబ్దేన సాపాపారాక్షసీ తృప్తిమాప్నుయాత్."

(రాత్రియంతయు గీత వాద్యనృత్యములతో గడుపవలెను. ఆ అగ్నిని లింగభగాద్యసభ్య వాక్యములు ఉచ్చరించుచు ముమ్మారు ప్రదక్షిణ మాచరించవలెను. ఈ శబ్దములవలన ఆ పాపిష్ఠి రాక్షసి తృప్తిపడును.) అని జ్యోతిర్నిబంధమున నున్నది.

హేమాద్రి భవిష్యోత్తర పురాణమునందలి యీ కథ నిట్లుదాహరించినాడు. యుధిష్ఠిరుడు కృష్ణుని

"కిమర్థం ఫాల్గునస్యాంతే పౌర్ణమాస్యాం జనార్దన,
ఉత్సవో జాయతే లోకే గ్రామే గ్రామే పురే పురే.
కిమర్థం శిశవ స్తస్యాం గేహే గేహే నినాదితః.
హోలికా దీప్యతేకస్మాత్ ఫాల్గున్యాంతు కిముచ్యతే.
ఆడాడేజేతి కాసంజ్ఞా శీతోష్ణేతి కిముచ్యతే,
కోహ్యస్యాం పూజ్యతే దేవః కేనేయ మవతారికం
కిమస్యాం క్రియతే కృష్ణ ఏతద్విస్తరతోవద."

"కృష్ణా! ఫాల్గున మాసాంతములో పూర్ణిమనాడు పల్లె పల్లెన, పట్టణ పట్టణాన ఉత్సవమెందుకు జరుగుచున్నది? పిల్లలు ఇండ్లలో ఎందుకు కేకలు వేయుదురు? ఎందుకు హోలికామంటలు? వేయుదురు? ఆడాడేజా అనిననేమి? శీతోష్ణ మనగానేమి? ఈ ఉత్సవమున ఎవరిని పూజింపవలెను? ఎవరు దీనిని ఏర్పాటుచేసిరి? ఈదినము ఏమి చేయుదురు? అంతయును సవిస్తరముగా తెలుపుము." అని ప్రశ్నించగా కృష్ణుడు ఇట్లు చెప్పెను.

"రాజా! పరంపరగా వచ్చిన హోలికా చరితము చెప్పెదను వినుము. పూర్వము రఘువను రాజుండెను. అతడు సమస్త పృథివిని జయించి ప్రజలను ఔరస పుత్రులనువలె పాలించుచుండెను. ఇట్లుండగా ఒకనాడు అకస్మాత్తుగా ప్రజలతని యొద్దకువచ్చి "ఢోంఢా అనే రాక్షసి మా యిండ్లకు వచ్చి బాలులను పీడించుచున్నది. మాంత్రికు లెవరును దానిని కట్టలేక పోవుచున్నారు. రక్షించుము." అని మొర పెట్టుకొనిరి.

రాజా మాటలువిని విస్మితుడై 'ఈ రాక్షసి ఎవర'ని తన పురోహితుడగు వశిష్ఠుని ప్రశ్నించెను. "ఇది మాలియను రాక్షసుని కూతురు. అది యొకమారు శివునిగూర్చి తపమాచరించి, మానవులతోగాని, దానవులతోగాని, దేవతలతోగాని, శస్త్రాస్త్రములతోగాని, శీతోష్ణవర్ష సఘయమునగాని, రాత్రిగాని, పగలుగాని, ఇంటగాని, వెలుపలగాని మరణము లేనట్లు వరము పొందెను. ఈ వరమిచ్చిన శంకరుడు నీకు ఉన్మత్తుల

నుండి, శిశువులనుండి ఋతుసంధిలో భయము కలుగును''
అని హెచ్చరించెను. అది మొదలు ఆ రాక్షసి శంకర
వాక్యములు స్మరించి అడాడాయనుచు ఇండ్లలో జొరబడి
శిశువులను పీడించసాగెను. దీని మారణోపాయము వినుము.
నేడు ఫాల్గుణ శుక్ల పౌర్ణమాసి. శీతకాలము గడచినది. ఉద
యమునుండి గ్రీష్మకాలము ప్రారంభమగును. అందరికిని
అభయమిమ్ము-భయము లేదని చెప్పుము. ప్రజలు నిశ్శంకగా
నవ్వులు, వినోదములు జరుపుకొందురుగాక! శిశువులు ఖడ్గ
హస్తులై సమరోత్సాహముతో యోద్ధలవలె వెలువడుదురు
గాక! ఎండుకట్టెలు, గడ్డిగాదము ఒక్క వైపు చేర్పించుము.
దానిలో అగ్నిని ముట్టించి రక్షోఘ్న మంత్రములతో
హోమము చేయుము. పిదప కిలకిల నవ్వుచు, చప్పట్లు
కొట్టుచు, పాడుచు ఆ మంటలకు ప్రదక్షిణ మాచరింప
వలెను. దేశభాషలలో ఇష్టమువచ్చినట్లు భగలింగాద్యసభ్య
పదము లుచ్చరింతురుగాక! ఆ శబ్దమునకును, హోమమున
కును, పిల్లల అట్టహాసమునకును భయపడి అది క్షీణించును.''
అని వశిష్ఠుడు తెలిపెను.

ఆ ఋషివాక్యముల ప్రకారము రఘురాజు చేసెను.
ఆ ఉగ్రమగు కర్మతో ఆ రాక్షసి నశించెను. అప్పటినుంచి
దానికి అడాడా యను పేరువచ్చెను. ఈ హోమము దుష్ట
దమనకరము, సర్వరోగశాంతిదము గనుక హోలికయను
పేరువచ్చెను. ఈరాత్రి శిశువులను ఇండ్లలో జాగరూకతతో
కాపాడవలెను. ఈ పూర్ణమాసి సర్వసారమగు తిథి. కనుక
అందరకును పరమానందదాయిని.

"మరుసటినాడు ఉదయమున వసంతపూజ చేయవలెను. మామిడిపూతను వసంతునికి నివేదించి తినవలెను. నేటినుండి మధుమాస ప్రారంభము. ఈనాడు చందనముతో సహా మామిడిపూతను తినువాడు సంవత్సరమంతయును సుఖముతో నుండును."

"వృత్తే తుషారసమయే సిత పంచదశ్యాం
ప్రాత ర్వసంతసమయే సముపస్థితేచ,
సంప్రాశ్య చూత కుసుమం సహచందనేన
సత్యంహి పార్థ పురుషేణ సమాం సుఖీస్యాత్."

ఫాల్గున శుద్ధ పూర్ణిమనాడు వంగదేశమున కృష్ణడోలోత్సవము చేయుదురనియు, బొబ్బట్లే నైవేద్యము పెట్టుదురనియు ఇదివరకే తెలిపితిని. దానికిని నిర్ణయసింధు ప్రమాణము గలదు. నిర్ణయసింధుకారుడు ఈ విషయమున కృత్యచింతామణిలోని బ్రాహ్మవచనము నిట్లుదాహరించినాడు.

"నరో దోలాగతం దృష్ట్వా గోవిందం పురుషోత్తమం,
ఫాల్గున్యాం సంయతో భూత్వా గోవిందస్య పురంవ్రజేత్."

అని. ఫాల్గున పూర్ణిమనాడు దోలాగతుడైన గోవిందుని దర్శించి, నియమితేంద్రియుడై, అంతమున గోవిందుని లోకమును చేరుకొనును. వసంతఋతువున సంతోషముగా తాము ఉయ్యాలలో ఊగుచు, తమ ఆరాధ్య దైవమునకు దోలోత్సవము జరుపుచు నానందించుట సహజమే. కనుక దోలోత్సవము తర్వాత ఆచారమయియుండును.

ఉత్తర దేశమున పూర్ణిమనుండి పూర్ణిమకు నెల యను సాచారముండెడిదని, ధర్మశాస్త్ర గ్రంథములలోను దాని చర్చయు, విధి నిషేధములును కలవనియు ఉగాదిపండుగ యందు చర్చించితిని. ప్రకృతము పూర్ణిమనుండి పూర్ణిమకు నెలయను పద్ధతిని వ్రతగ్రంథములలోగల కామదేవ పూజోత్స ములను పరిశీలించిన హోలీపండుగ యాంతర్యము మనకు మరికొంత బోధపడును.

మార్గశిరశుద్ధ త్రయోదశినాడు ప్రారంభించి సంవత్సర పర్యంతము ప్రతి శుక్ల త్రయోదశినాడును అనంగవ్రత మాచరించిన సకల సౌందర్యాది గుణములన్నియు కలుగునని భవిష్యోత్తరపురాణమున గలదు. దీనికి అనంగ త్రయోదశి యని పేరు.

చైత్ర శుక్ల త్రయోదశినాడు (ఫాల్గుణ బహుళ ప్రతి పత్తునుండి చైత్రమాసము) అనంగవ్రతము జరుపవలెనని కాలోత్తరమను గ్రంథమున జెప్పబడినది. ఈనాడు నీల దూర్వాంకురశ్యాములుడగు మన్మథుని రతి ప్రీత్యుభయ భార్యలతోసహా గుడ్డమీద చిత్రించి, ఉద్యానవనమున పుష్ప మండపమున నుంచి పూజింపవలెను. స్త్రీపురుషులు సకల సౌభాగ్యములు పొందగలరు. దీనినిగూడ అనంగవ్రత మందురు. ప్రతినెలయును సంవత్సరముపా టాచరించ వచ్చును.

భవిష్యోత్తరపురాణమున మదన మహోత్సవమను వేరొక పండుగ చెప్పబడినది. ఇది కామదహనగాథ. మన్మ

థుడు ముక్కంటి మూడవకంటి మంటకు అనంగుడై పోగా రతీదేవి ఆయనను పతిభిక్ష వేడినది. రుద్రాణియును ఈ విష యమున శివునకు 'సిఫారిసు' చేసినది. "ప్రియురాలా నేను కాల్చిన మన్మథుడు మరల సశరీరుడై వచ్చుట యెట్లు? కాని, నీవు ప్రియపడితివి గనుక నీమాట కాదనను. చైత్ర శుక్ల త్రయోదశినాడు మనోభవుడు మరల రూపుదాల్చును. బీజ భూతుడగు నీతనియందే ప్రపంచమంతయు నుండగలదు."

"మయాదగ్ధస్య కామస్య పునరాగమనం కుతః,
కించ తే మానవద్వాక్యం కరోమి సఫలంప్రియే,
అస్మిన్వసంత సమయే శుక్ల పక్షే త్రయోదశీ,
అస్యాం మనోభవో దేవో భవిష్యతి శరీరవాన్,
ఏ తేన బీజభూ తేన జగద్వ్యాప్తిష్య తేఖిలం."

అని హరుడు వరమిచ్చెనట. కనుక అప్పటినుండి మన్మథజనన చిహ్నముగా నీ పండుగ చేయబడుచున్నది.

స్మృతి కౌస్తుభ కారుడు విష్ణుధర్మమున చెప్పబడిన కామదేవ వ్రతమును ఇట్లుదాహరించినాడు. "చైత్ర శుక్ల త్రయోదశి మొదలు వైశాఖము వరకును కామదేవవ్రత మాచరింపవలెను."

మార్కండేయ ఉవాచ :

"శుక్ల పక్షే మహారాజ త్రయోదశ్యా ముపోషితః,
పూజయేత్కామదేవంతు వైశాఖాత్ప్రభృతి (?) ప్రభోః"

పైన పేర్కొన్న ఉదాహరణములనుబట్టి మార్గశిర శుద్ధత్రయోదశి మొదలు వైశాఖము వరకును కామదేవ పూజనము జరుపబడునట్లును మాఘ శుద్ధ పంచమినాడు వసంత పంచమియగుటకు ముఖ్యముగ ఫాల్గున శుద్ధ త్రయోదశినాడు మదను డుద్భవించుననుటయు, హోలీపండుగ ఫాల్గున శుద్ధ పూర్ణిమకు మూడు నాలుగు దినములు ముందునుండియే యారంభమగుటయు, చైత్ర బహుళ ప్రథమ (అనగా కృష్ణాది మాసము ప్రకారము) నాడు వసంతోత్సవము జరుపబడుటయు, చూడ హోలిక హోలి ఆనందతుందిలమగు వసంతోత్సవ భాగమేనని స్పష్టమగుచున్నది. వసంత విషువత్తు ఎప్పుడు సంభవించునో అప్పుడే నిజమగు వసంతము ఆరంభమగును. ఇప్పుడు వసంత విషువత్తు మన చైత్రశుద్ధ ప్రతిపత్తును దాటి వెనుకకు చలించినదనియు, వరాహమిహిరుడు చేసిన మార్పును మనమిప్పుడు మరల మార్చుకొనవలసి యున్నదనియు ఉగాదిలో చర్చించితిని.

ఇక హోలికారాక్షసి గాథకును, వసంతోత్సవమునకును, వంటచెరకుల అపహరణకును, చైత్రకృష్ణ ప్రతిపత్తున శ్వపచుని తాకి స్నానమాచరించవలెనను ధర్మశాస్త్ర వాక్యములకును సమన్వయమెట్లు? ఈ చర్చకుముందు హోలీ రాక్షసి కథలను పోలిన భూతమహోత్సవ, భూతమాత్రుత్సవములను గురించి కొంత తెలిసికొందము. ఈ కథలు రెండును భవిష్యోత్తరమున గలవు.

"ఒకప్పుడు పార్వతీదేవికి పిల్లలు లేరను చింత కలిగినది. అట్లు చింతించుచుండగా, ఆమె హృదయమునుండి

పంకిల శరీరయగు నొక కన్య యుద్భవించెను. ఆమె నల్లని చీరకట్టుకొని, ఎర్రటి పైటవేసికొనెను. పార్వతి ఆమెను చూచి తల్లి మనసు పొంగినప్పటికిని పంకిల శరీరయగుటవలన తలమాత్రము మూర్కొని, "నీవు భూమి పంకలిప్తాంగివై జన్మించితివి గనుక ఉదకసేవయను మహోత్సవము కలుగును. ఆనాడు నీవు ఆరాధింపబడుదువు." అని యనెను. ఇంతలో శంకరునికిని, పార్వతికిని కలిగిన ఘోర కామవాంఛనుండి పుట్టిన భైరవుడు ప్రత్యక్షమై ఆ కన్యను తన భార్యగా చేసికొనెను. వీరిద్దరివలన భైరవోత్సవము జరుగునట్లు శంకరుడు శాసించెను. ఈ భైరవుడు ప్రవేశించిన ప్రదేశమున జనులందరును ఉన్మత్తులవలె అగుదురని, అశ్లీలవాక్కులు, అసభ్యవాక్కులును పలుకుదురని, వావివరుసలు పాటించరని శివుడు తెలిపెను. తుదకు భైరవుడు మరణించెనని జనులందరును కేకలు వేయుదురు. పిదప "భైరవుడు మమ్ములను వదలిపెట్టుచున్నాడు" అనుచు నదిలోనో, చెరువునందో స్నానముచేసి తమ యొడలికంటిన బురద మొదలగువానిని కడిగికొని, ఇండ్లకు తమ ప్రియులతో వెళ్లుదురు. ఇది భూత మహోత్సవము. దీనిని వైశాఖశుద్ధ పక్షమున చేయవలెనని స్కాందపురాణమున గలదు.

భూతమాత్రుత్సవము ప్రకారమిది: యుధిష్ఠిరుడు కృష్ణునితో ని ట్లనుచున్నాడు: "భూతమాత యనుచు గ్రామములందును, పురములందును ఉత్సవములు చేయుదురు. ఆ యుత్సవములలో ప్రజలు పిచ్చివారివలె పలవించుచు, మత్తెక్కినవారివలె భూమిపై దొర్లుచు, కోపగించుకొనిన వారివలె

పరుగులు తీయుచు, ఆప్తులు మరణించిన వారివలె ఏడ్చుచు, భూతావిష్టులవలె వికారచేష్టలు చేయుచు. భూతములవలె బురద, బుగ్గి, మూత్రము మున్నగువానిని దేహమున అలదుకొనుచు నుందురు. ఇది శాస్త్రవిహితమైన వ్రతమా ? లౌకికమా ? తెలియజెప్పుము.''

కృష్ణు డిట్లు చెప్పెను : ''ఒకప్పుడు పార్వతీ పరమేశ్వరులు సొగటాలాడుచుండిరి. అప్పుడు కాలిపోయిన కామతరువు ఫలమువలెనున్న ఆమెనుచూచి మోహించి నూరు దివ్యవర్షాలు క్రీడించెను. అప్పుడు పార్వతి కసుపుచీల్చుకొని ఒక నల్లని భయంకర స్వరూపిణియగు కన్య జనించెను. అట్లే శంకరునినుండి భయంకర భూతములతో ఆవృతుడు ఒక పురుషుడు జనించెను. ఆ కన్యయును, ఆ పురుషుడును వెంటనే జంటయయిరి. ఈ కన్యకు భ్రాతృభాండ, భూతమాత, ఉదకసేవిత అనుపేర్లు కలిగెను. ఈమెను పూజించిన భూతప్రేత భయముండదని సంతానాభివృద్ధి కలుగునని శివుడు శాసించెను.

''జ్యేష్ఠ శుక్ల ప్రతిపత్తునుండి పూర్ణిమవరకు ఈ ఉత్సవము చేయవలెను. వింత వింత చేష్టలును, వికృత దృశ్యములను ప్రదర్శింపవలెను. నవమినాడుగాని, ఏకాదశి నాడుగాని ఒక కుండలో దీపము వెలిగించి, ప్రదోష సమయమున దేవీ మందిరమునకు తీసికొని పోవలెను. ఇట్లు పూర్ణిమవరకు జరిపి, పూర్ణిమనాడు భూతమాతృ మహోత్సవము చేయవలెను.''

ఈ ఉత్సవమును వైశాఖమాసమున చేయవలెనని స్కాందపురాణమున తెలుపబడినది.

ఈ కథలనుబట్టి వసంతఋతువున చేయబడు నీ ఉత్సవములలో వర్గ తారతమ్యములేని ప్రజల ఆనందము స్పష్టముగా కనిపించుచున్నది.

ఈ భూతమాతృ మహోత్సవము కాకతీయుల కాలమున జరుపబడుచుండినట్లు నృత్తరత్నావళి వ్యాఖ్యాతయగు జాయపసేనాని తెలిపినాడు :

"కల్యాణకటకే పూర్వం భూతమాతృ మహోత్సవే,
సోమేశః కుతుకీ కాంచిత్ భిల్లవేష ముపేయుషీం,
నృత్యంతీ మధగాయంతీం స్వయంప్రేక్ష్య మనోహరం
ప్రీతో నిర్మితవాన్ చిత్రం గోండలీ విధిమత్యయం
యతోభిల్లీ మహారాష్ట్రే గోండలీత్యభిదీయతే."

పూర్వము (బసవేశ్వరుని నివాసమయిన) కల్యాణ కటకమున భూతమాతృ మహోత్సవము జరుగుచున్నప్పుడు చాళుక్య భూలోక మల్ల సోమేశ్వరుడు ఒక భిల్లవేషధారిణి నృత్యము చేయుచుండగా చూచి సంతోషించి దాని గీతమును ప్రచారముచేసెను. దానికి మహారాష్ట్రమున గోండలీవిధియని పేరు. తిరుపతి మొదలగు నగరములలో వసంతఋతువులో జరుగు గంగజాతర ఈ భూత మాతృత్సవమే.

గోధుమ, చెరకు, సెనగపంటల కాలమిది. అప్పుడు వర్ణవ్యవస్థలో నిర్బంధ మేమియులేక నూర్పిడి జరుపుటకు,

పిదప దానిని రక్షించుటకు నెగళ్లు వేసికొని దానిచుట్టును నాట్యమాడుటయు, నెగళ్ళకు సస్యక్షేత్ర సమీపములలోని శ్వపచులయింటి నిప్పైనను గ్రాహ్యమనుటయు, చెత్త చెదారమును-భోగిమంటలకువలె-వెదకి వెదకి, దొంగతనమునకైనను జంకక సేకరించుటకు, ఆటలలో పిల్లలు ప్రమాదవశమున పడిపోకుండ జాగ్రతపడుటయు, పంటకాలమునకు నెల రెండునెలలు ముందును, నెల తర్వాతను ఆనందోత్సవములు జరుపుటయును, పిల్లలు కేకలు వేయుటయును, (క్రొత్తధాన్యము తినుటయందు ఆసతో), కొన్ని ప్రాంతములలో ధాన్యపు కంకులను పట్టుకొని పరుగెత్తునట్లు నటించుటయు, వారిని మరికొందరు తరుముట, పంటలెవరును దొంగతనముగా కోసికొనిపోకుండ హేహేయని కేకలు వేయుటయు మొదలగునవి చూడగా, ఈ పండుగ పంటల నూర్పిడి, చలివిరిగి, నూతన ఋత్వవతరణము, అనాదిజాతుల పెక్కు విశ్వాసములు ఆచారములు మున్నగువాని సమ్మేళనమని మనకు స్పష్టముకాగలదు. హోలికాపద వ్యుత్పత్తియును ఈ నిర్ణయమునకు తోడ్పడుచున్నది.

హోలా, హోలీ, హులాలీ, హోలికా, హోలకా, హోలాకా అను నారురూపములు కనిపించుచున్నవి. హోలిక పూర్వరూపము సోలికయనియు, దానికి శైత్యము, పులుపు అను నర్థములని శ్రీ గుప్తే తెలిపిరి. ఇది 'హోహో' యను కేకల అనుకరణధ్వని వాచకమయి యుండునని కొందరు నిఘంటుకారులు నిర్వచించిరి. పురాణము లేవియు దీని వ్యుత్పత్తి నివ్వలేదు.

హోలకః యను మరియొక పదమున్నది. దానికిః కచ్చాపక్వా—గా కాలిన ధాన్యమని శబ్ద కల్పద్రుమాది నిఘంటుకారులు అర్థము వ్రాసియున్నారు. "తృణాగ్ని భృష్టార్థపక్వ శమీధాన్యం హోలకః హోలా ఇతి హిందీ." అనగా గడ్డిమంటలో వేయగా వ్రేలి సగము సగము ఉడికిన గింజలు—వేపిళ్ళు.

"అర్థ పక్వ శమీధాన్యైః తృణ భృష్టశ్చ హోలకః,
హోలకోల్పానిలో మేదః కఫ దోషశ్రమాపహః"

అని వైద్యక గ్రంథములలో కలదు. హోలకమనగా గడ్డి మంటలో సగము కాలిన ధాన్యము హోలకము. ఇది కొద్దిగా వాతము కలిగించును. క్రొవ్వు, కఫము, శ్రమము వీనిని పోగొట్టును.

ఈ వ్యుత్పత్తినిబట్టి మన పూర్వులు ఇప్పుడు మనము వేరుసెనగలను, సెనగలను మళ్ళలో నిప్పులపై కాల్చుకొని భుజించుచున్నట్టే కోతల పిదప వానికి కాపలాయుండి, రాత్రి నెగళ్లు వేసికొని, ఓపికయున్నంతవరకు కేకలు వేయుచు, గీతలు పాడుచు, వినోదముకోసమై పచ్చి కంకులను నెగడులో వేసి కాల్చుకొని తినుచు, గడుపుచుండిరనియు, దీనివల్ల చలి కూడా నశించుచుండెననియు, కనుక, హోలిక హోలక శబ్దములవల్లనే హోలీ హోలికాది పదములు పుట్టి పండుగకు పర్యాయమై, తర్వాత రాక్షసత్వము కల్పింపబడినదనియు మన మూహింపవచ్చును.

ఈ ఉత్సవము వసంతోత్సవమే గనుక అతి ప్రాచీన కాలమునుండి మన యాచరణలో నున్నట్లు చరిత్రాధార ములు గలవు. రెండువేల మూడువందల యేండ్లనాటి సీతా వేంగాగుహాల శాసనమున ఈ ఉత్సవము 'ధులేవసంతియా' అని పేర్కొనబడినది. ఈ సీతా వేంగాగుహాలు సర్గూజాజిల్లా రామగఢ్ కొండలలో నున్నవి. ఈ ఉత్సవము పూర్ణిమ నాడు జరుపబడుచుండెనని ప్రజలు పెద్ద పెద్ద మొల్లదండలు మెడలో వేసికొని నృత్యగీతములతో ఆనందించుచుండిరని యును ఆ శాసనము తెలుపుచున్నది.

రెండువేల యేండ్లనాటి గాథాసప్తశతిలో ఇది ఫాల్గు నోత్సవమని, మదనోత్సవమని, మధూత్సవమని వర్ణించబడి నది. ఈ ఉత్సవమున బుక్కాపిండి చల్లుట, బురదనీరు మొదలగునవి చల్లుట పరిపాటియని, ఆనాటి ఆచర్యాలకు దోషములేదని ఈ వర్ణనలు తెలుపుచున్నవి.

"ఫగ్గుచ్ఛణ ణిద్దోసం
కేణవి కద్దమ పసాహాణం దిణ్ణమ్,
థణ అలస ముహాఫలోట్టంత
సే అధో అం కిణో ధువసి.' 4—69

(ఫాల్గునోత్సవ నిర్దోషం
కేనాపి కర్దమ ప్రసాదనం దత్తమ్,
స్తన కలశముఖ ప్రలుఠత్
స్వేద ధౌతం కిమితి థావయసి.)

ఒక వనిత తన చెలినిట్లు మందలించుచున్నది. "ఫాల్గు ణోత్సవమున ఎవరో నీపై బురద చిమ్మినారు. పండుగగనుక అదేమియు తప్పు కాదు. స్తన కలశ ముఖమునుండి స్రవించు స్వేదముచేతనే ఆ బురద కడిగి వేయబడినది. మరల ఎందు లకు కడుగుచున్నావు ?

ఉప్పహ పహావి అజణో
పవిజిమ్మి కలఅలో పహ అతూరో,
అవ్వో సోచ్చే అఛణో
తేణ విణా గామదాహోవ్వ. 6-35.

(ఉత్పథ ప్రధావితజనః
ప్రవిజృంభిత కలకలః ప్రహతతూర్యః,
దుఃఖం సవవతక్షణః
తేన వినా గ్రామ దాహ ఇవ.)

పూర్వము ఫాల్గుణోత్సవమున ప్రియుని కలిసికొనినది. ఈతూరి యుత్సవమున అతడు కనిపించలేదు. కనుక ఉత్స వము ఊరికి నిప్పంటుకొనినప్పు డున్నట్లు ఉన్నదే కాని ఉత్సాహకరముగ లేదు. జనులు అటు ఇటు పరువిడు చున్నారు. కలకలము చెలరేగుచున్నది. నగారాలు వాయించుచున్నారు. కాని ఏమి ప్రయోజనము? అతడు లేడు.

గ్రామ తరుణీ ఓం హి అలం
హారంతి ఛే ఆ ణం థణహారిల్లి ఓ,
మ అణే కుసుంభరంజి అ
కంచు ఇ ఆహారణ మే త్తయో. 6-45.

(గ్రామ తరుణ్యో హృదయం
హరంతి విదగ్ధానాం స్తన భారవత్యః.
మదనే కుసుంభ రాగయుక్త
కంచుకాభరణ మాత్రాః.)

మదనోత్సవములో గ్రామ యువతులు కుసుమపూవు రంగు రవికలు తొడిగిన చక్కని చనుకట్టుతో, మరియే ఆభరణములు లేకపోయినను సరసుల హృదయాలను ఆకర్షించుచున్నారు.

బుద్ధుని కాలమున 'బాలనక్ఖత్త' అను నొక పండుగను శ్రావస్తీ నగరమున జరుపుచుండినట్లు ధమ్మపద అర్థకథనుండి తెలియుచున్నది. దీనిని 'మూర్ఖులపండుగ' అనవచ్చును. ఈ ఉత్సవము ఏడురోజులపాటు జరుపబడుచుండెను. సోమరులవంటివారు, మూర్ఖులు పేడవంటి అసహ్య పదార్థమును తమ దేహమునకు పూసికొని, బంధుబూతులు తిట్టుచు వీధులలో తిరిగెడివారు. పెద్దమనుష్యుల యింటి ముంగిట నిలబడి తిట్లు కురిపించువారు. వారికి తృణమో పణమో చెల్లించి వారిని గృహస్థులు సాగనంపేవారు.

ఈ పండుగ మొదట లౌకికమయినది. కనుక దీనికి దర్శనాచార్యులు ఆచారమును త్రోసివేయలేక వైదికత్వ ముద్రవేసిరి. జైమినీయ మీమాంసా న్యాయమాలలో హోలాకాధికరణమను ప్రత్యేకాధికరణమే కలదు. అందు 15 నుండి 23 వ సూత్రమువరకు హోలికాచర్చ గలదు. వేదములలో దృష్టచరములుగాని పండుగలు, వ్రతములు

మున్నగునవి 'హోలాకాధికరణ న్యాయమూల సిద్ధ' మను నియమముతో గ్రహింపబడి వేద సంప్రదాయ సమ్మతముగా పరిగణింపబడినవి. జైమిని సూత్ర నిర్వచనమిది :

"హోలాకా దే ర్వ్యవస్థాస్యాత్ సాధారణ్యా ముతా
గ్రమః,
దేశభేదేనదృష్టతా త్సామ్యం మూల సమత్వతః,"

"హోలికాచ ప్రాచ్యాభిమానిభి రనుష్ఠీయతే హోలాకాచ వసంతోత్సవ విశేషః హులీతి ప్రసిద్ధః ఏమాదీనేషుకాదికం దాక్షిణాత్యైః ఆదీనేషుకం స్వస్వకులాదిగతం కరంజార్యాది స్థావర దేవపూజాదికం తద్దేశ ప్రసిద్ధం ఉద్వృషభయజ్ఞాదికం ఉదీచ్యైః క్రియతే..........."

"హోలాకాదయః ప్రాచ్యైరేవ క్రియతే. వసంతోత్సవో హోలాకా ఆహ్నీ నైజకాదయో దాక్షిణాత్యైః ఉద్వృషభ యజ్ఞాదయ ఉదీచ్యైః జ్యేష్ఠమాసస్య పౌర్ణమాస్యాంబలీవర్దానభ్యర్థధావయంతి సోయముద్వృషభయజ్ఞః. ఏవం హారీతాదిస్మృతిః. కాచిత్క్వచిద్దేశ విశేషే దృశ్యతే తస్మాద్వ్యవస్థితం ప్రామాణ్యమితిచేత్ మామైవం. తన్మూలత్వేనాను మితస్య వేదస్య సర్వ సాధారణత్వేన తేషామపి సర్వ సాధారణత్వాత్. అత్రైవ గురుమత మాహ..."

హోలికాదులను ప్రాచ్యులు మాత్రమే ఆచరించుచున్నారు. వసంతోత్సవమును, హోలాకను, మరికొన్ని కర్మలను దాక్షిణాత్యులు చేయుచున్నారు. ఉద్వృషభయజ్ఞాదులను ఉదీచ్యులు చేయుచున్నారు. జ్యేష్ఠ పూర్ణిమయందు

ఎద్దుల నలంకరించి, పరువెత్తించుటను ఉద్వృషభయజ్ఞమందురు. హారీతస్మృతి యిట్లు చెప్పుచున్నది. ఒక ప్రాంతమున ఒక యాచారము కనిపించును. కనుక వ్యవస్థితమైనది ప్రామాణ్యమనియా? అట్లుకాదు.

హోలాకాధికరణ న్యాయముల సిద్ధమను న్యాయమే ఏర్పడినప్పుడు హోలి ప్రాచీనత్వమును, రూఢత్వమును శంకించ బనిలేదు. కనుకనే రంగరామానుజులవారు తైత్తిరీయోపనిషద్భాష్యమున "యాన్యస్మాకం సుచరితాని తానిత్వయోపాస్యాని, నోఇతరాణి" అను వాక్యమునకు భాష్యము వెలయించుచు "శిష్టాచారేష్వపి శ్రుతి స్మృతి విరోధ శూన్యతయా యాని సుచరితాని. తాన్యేవ హోలాది కాని గ్రాహ్యాణి. నలోభాది మూల చరితాని" అని స్పష్ట పరచిరి. శిష్టాచారములయందున్న వానిలోను శ్రుతి స్మృతి విరోధములేని సుచరితములు–హోలాదులవంటివి గ్రహించ వచ్చును అని దీని యర్థము.

క్రీస్తుశకము రెండు, మూడు శతాబ్దులలో రచితమైన కామసూత్రములలో వాత్స్యాయనుడీ హోలాకా పండుగను తెలిపినాడు. "యక్షరాత్రిః, కౌముదీ జాగరః, మదనోత్సవః, దమనభంజికా, హోలాకా, అశోకోత్తంసికా" (1–4–42) దీనికి జయమంగళయను టీక వ్రాసిన యశోధరుడు "హోలాకా ఫాల్గున పూర్ణిమాయాం శృంగకాది ముక్త కింశుకాది కుసుమరాగాంభసా పరస్పరోక్షణం మిథః పట వాస ప్రక్షేపశ్చ" అని హోలాకా పండుగను వివరించినాడు.

ఫాల్గున పూర్ణిమనాడు శృంగకాదులు (కొమ్ములతో చేయబడిన పిచికారీలు మొదలగునవి) మొదలగువానితో మోదుగుపూలు మొదలగువాని రసము కలిపిన రంగునీటిని పరస్పరము చిమ్ముకొనుట, బుక్కా-పిండి ఒకరిపై నొకరు చల్లుకొనుట జరుపవలెననుట.

కాళిదాసు మాళవిక రాజభవనమున నాటకమాడుట వసంతోత్సవముననే. దశకుమార చరితమందును, హర్షుని రత్నావళి నాటికయందును వసంతోత్సవ వర్ణన కలదు.

అల్ బెరీనీ-మన దేశయాత్రకోసము 11 వ శతాబ్దమున వచ్చిన ఆరబ్ పండితుడు-ఫాల్గున పూర్ణిమనాడు దోలోత్సవము, హోలీదహనము జరుపబడుటను లిఖిత మొనర్చినాడు.

విజయనగర చక్రవర్తులు దీనిని వసంతోత్సవముగా జరుపుచుండిరి. కృష్ణరాయలు ప్రతి వసంతోత్సవమునకును తిరుమలకు వెళ్ళి యట వేంకటేశ్వరునికి వసంతోత్సము జరిపించుచుండెను. అప్పుడు కావ్యగోష్ఠియును జరిగెడిది.

ఆ కాలమున విజయనగరమున హోలీపండుగ జరుపుకొనుచుండిన తీరును నికలోకాంటీయను పాశ్చాత్యు డిట్లు వర్ణించినాడు.

''నగరవీథులలో ఎరుపురంగు నీరు (వసంతము) ను బానలతోను, కడవలతోను నింపియుంచువారు. ఆనాడు వీథుల్లలో వెళ్లు ప్రతివారిపైనను వసంతపు జల్లులు పడవలసినదే.

చక్రవర్తిగాని, చక్రవర్తినిగాని వెల్లినను వారికి వసంతపు జల్లులు తప్పవు.''

ఈ వసంతోత్సవ సమయమున, జరుగు విద్వద్గోష్ఠులకును.కవి సమ్మేళనములకును వచ్చువారిని చక్రవర్తి బహుధా బహూకరించుచుండెను. ఈ విషయమును ముక్కు తిమ్మన పారిజాతాపహరణమున నిట్లు తెలిపినాడు.

''ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర...
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతః పుర వధూప్రసాదన రసికా. 1-139

16 వ శతాబ్దిలో మొఘల్ చక్రవర్తులు తమ దర్బారులో హోలీపండుగ జరుపుచుండిరి. 1757 లో అహమద్ షా అబ్దాలీ ఆక్రమణ తర్వాత ఇది ఆగిపోయెనని చరిత్రకారులనుచున్నారు.

పైన పేర్కొన్న కారణములనుబట్టి ఋతు పరివర్తనమువలన కేవలము లౌకికముగా ఆచరణముననున్న ఈ ఉత్సవము క్రమముగా శిష్టాచారమునబడి, వైదిక సంప్రదాయ బద్ధముగూడ నయినదని స్పష్టమైనది. దీనితోపాటు భూతమాత మహోత్సవములోను, 'బాలనక్షత్ర' ఉత్సవములోను గల అసహ్య సంప్రదాయమును, వివిధ ప్రాంతములలో వివిధ దేవతల పూజలు చేరినవి. మొదటి బురదనీరు కొట్టు

కొనుటవంటి మోటుచేష్టలు పోయి, వసంతపు జల్లులాడుటగా సంస్కారము పొందినది.

మన దేశమున ఆచరణమునగల ఈ హోలీ పండుగ లోని విలక్షణ స్వభావమంతయు, సంప్రదాయమును యూరోపు లోని విభిన్న ప్రాంతములలో వసంతగ్రీష్మ ఋతువులలో జరుగు ఉత్సవములలోను ఉండుట వింతకదా! కనుక ఈ ఉత్సవము ఆనందతుందిలుడగు మానవుని స్వభావమే మూలముగ ప్రపంచమంతటను వివిధ నామధేయములతో వ్యాపించినదన వచ్చును. యూరపులో ఈ ఉత్సవవ్యాప్తిని గురించి మన్మథ్ రామ్ ఇట్లు తెలుపుచున్నారు :

మన దేశమున ఋతుపరివర్తనము తెలుపుటకు ఫాల్గున మాసమున హోలీ పండుగనాడు మంటలు వేయునట్లే యూరోపు ఖండమునందును ఎముకలు కొరుకుచలిని మరపించుటకు వసంతఋతువునందో, గ్రీష్మ ఋతువునందో అగ్న్యుత్సవము జరుపు నాచార మున్నది. ఈ ఉత్సవమున పాల్గొనువారు కార్మిక కర్షక వర్గములవారే అధికముగా నుందురు. కనుక ఈ పండుగ పూర్తిగా ప్రజల పండగ యనవచ్చును. కొన్ని కొన్ని చోట్ల శీతకాలమునందును అగ్న్యుత్సవముచేయుట కలదు. ఈ అగ్న్యుత్సవము క్రైస్తవ మతము వ్యాపించుటకు ముందునుండే ఆచరణలో నున్నది.

రోమనులు జూన్ 21 వ తేదీన అగ్నినుండి జనించి నట్లు చెప్పబడు సర్వియస్ టూలియస్ అనురాజు ప్రియు

రాలు ఫర్చూనా దేవి గౌరవార్థము గొప్ప ఉత్సవము జరుపు చుండిరి. ఆనాడు బానిసలు, ఇతరులు కలసిమెలసి మధుపానముచేసి, నృత్యగీతాదులతో ఆనందించుచుండిరి ; పరుగులపోటీ, నౌకలపోటీ జరుపుచుండిరి. పూలతో అలంకరించిన నావలలో ప్రియులు, ప్రియురాండ్రు కూర్చొని మద్యపానము చేయుచుండెడివారు. ఇది గ్రీష్మఋతువున చేయు. సాటర్నేలియా ఉత్సవము. సాటర్నేలియా అను ఉత్సవమును రోమనులు డిసెంబరు 17 వ తేదీనుండి 23 వ తేదీ వరకు జరుపుచుండిరి. ఈ వారములో వారు ఉచితానుచిత విచక్షణ లేక తోచినపనులుచేసి ఆనందించుచుండిరి. అదుపాజ్ఞలు ఉండెడివికావు. వ్యక్తిగతమైన వస్తువనునది యుండదు. బానిసలు యజమానునితో పాటు సరిసమానముగా ప్రవర్తించుచు, వారితో పనులుకూడా చేయుంచుకొనెడివారు. ఒక రాజును కూడా ఎన్నుకొనెడువాడు. వాడు ఈ 'మూన్నాళ్ల ముచ్చటలో' తన ప్రజలందరిపైన అధికారము నెరపుచుండెడివాడు.

జూలై 7 వ తేదీన రోమనులు మరియొక ఉత్సవము చేసికొనుచుండిరి. దీనిని "చిన్న సాటర్నేలియా" అనెడివారు. బానిసలకు ఆనాడు పూర్తిగా స్వాతంత్ర్యముండెడిది. దాసీలు తమ పిల్లలతోపాటు రోమునగర వీధులలో స్వేచ్ఛగా చరించెడివారు.

ఇటలీలో 'రేడికా' అను ఉత్సవమును ఫిబ్రవరి మధ్యన జరిపెడివారు. మూఢవర్షామున జనులు ఊరేగింపులతో

ప్రభుత్వభవనములున్న వీధుల లో ప్రవేశించుచుండిరి. దారిలో నాలుగు గుర్రములు కట్టిన రథము కనిపించు చుండెను. దానిపై ఒక పెద్ద కుర్చీమీద తొమ్మిదడుగుల యెత్తున 'కార్నివాల్' అను విగ్రహమును నెల కొల్పు చుండిరి. ఆ విగ్రహము ఒక చేతిని కుర్చీ చేతిమీద ఆనించి మరొక చేతితో ప్రజలను అభినందించుచున్నట్లు నిర్మింపబడి యుండును. దాని కాళ్లకు ఎత్తైనబూట్లు, తలపై పెద్దటోపీ, దేహముపై రంగురంగుల కోటు ఉండును. ఆ విగ్రహము వెనుక ఒకడు దాగుకొని చేతిని కదలించుచుండును. జనులు ఆ రథముచుట్టును మూగి కేకలు వేయుచు నాట్యమాడుదురు. పిదప ఆరథము జిల్లాపాలకుని యింటిముందు ఆగును. అక్కడి కది చేరగానే ప్రజలు అల్లరిమాని వేయుదురు. పాలకుడు కనిపించగానే జయ జయధ్వానములు మిన్నుముట్టు చుండెను. పిదప పరస్పర దూషణమును పోట్లాటలు జరుగును. గుంపువెంట మద్యము నిండిన పాత్రలతో ఒక బండియు వచ్చుచుండును. మద్యపానమునకును తొక్కులాట జరుగును. పిదప ఆ విగ్రహమును ఒక చతుష్పథము పైన కర్రల రాశిపై ఉంచి నిప్పంటింతురు. దీనికి మరియొక పేరు "కార్నివాల్ సమాధి."

ఈ విధముగనే ఫ్రాన్సులోను ఈ దినమున గడ్డిగాదములతో ఒక బుట్టబొమ్మను చేసి ఊరంతయును త్రిప్పి, దానినొక గడ్డి మేటిపై పెట్టి కాల్చి వేయువారు. దీనిని 'క్రోల్ సమాధి' అనెడివారు.

స్వీడన్, నార్వే, డెన్మార్కు దేశములలో జూన్ నెలలో ప్రాచీనమహాత్ముల సంస్మరణదినము జరుపబడు చుండెను. స్వీడన్‌లోని కొన్ని ప్రాంతములలో నేటికిని ఈ ఉత్సవము జరుపబడుచున్నది. ఈ దినమున ఎడతెగక తుపాకి కాల్పులు వినబడుచుండెను. బాణసంచా కాల్చబడుచుండెను. కొండలపైన గుట్టలపైన పెద్ద మంటలు వెలిగించెడివారు. ఈ మంటలచుట్టును తిరుగుచు నాట్యము చేసెడివారు.

రోమునగరమున లూపర్ కేలియా అను వసంతోత్సవము జరుపుచుండిరి. ఈ ఉత్సవమున యువకులు దిసమొలతో పరుగెత్తుచుండగా సంతానప్రాప్తికై గృహిణులు వారి వెంటబడుచుండిరి. వారు తమచేతిలోని తోలుపట్టాలతో ఆ గృహిణులను కొట్టుచుండిరి. మన్మథునికి బ్యాకస్ అని పేరు. ఈ బ్యాకస్ పండుగ మిగుల నసభ్యముగ జరుగుచుండెను.

పోర్చుగల్లు దేశమున ఏప్రిల్ నెలలో లెంట్ అను పండుగ జరుపుచుండిరట. ఈ పండుగలో పౌరులు వీథులలో వెళ్లువారిపై రంగులు చల్లెడివారు.

ఇంగ్లాండులో ఈ కాలమునందే వసంతోత్సవము జరుపుచుండిరి. నేటి ఏప్రిల్‌ఫూల్ ఉత్సవమిదే. ఏప్రిల్ ఫూల్ ఉత్సవమున జరుగు వినోదములను చెప్ప నక్కరలేదు.

హోలీ పండుగను ఫాల్గునోత్సవము, ఫాల్గుని యని యును వ్యవహరించుచుండిరని యిదివరకే తెలిపితిని.

'ఫాల్గున' అను పదము గ్రీకుల ఫగాసిన్ అను పదమును పోలినది. హోలిక - పోలిక యను పదము ఈజిప్టు వారి పల్లికా అను పదమును పోలినది. ఈజిప్టువారు పల్లికా యను ఉత్సవమును జరుపుచుండిరి. ఈ ఉత్సవమును గ్రీకులు ప్లోరేలియా యనియు, ఫలేరికా అనియు వ్యవహరించుచుండిరి. ప్లోరేలియా అనగా పుష్పోత్సవము.

ఇట్టి ఉత్సవము - హోలీ ఉత్సవము - ఆదిమానవుని ఆనందోత్సవమునకు తార్కాణమగు అనాది వసంతోత్సవ మనుట స్పష్టమైనది కదా.

"చైత్రోత్సవే సకలలోక మనోవికాసం
కామం వసంతమలయాద్రి మరుత్సహాయం,
రత్యాసహార్చ్య పురుషః ప్రవరాచ యోషిత్
సౌభాగ్యరూపసుత సౌఖ్యయుతా సదాస్యాత్."

(భవిష్యత్పురాణము)

---

# 21. వసంతపంచమి

ఈ పండుగ మాఘశుద్ధ పంచమినాడు జరుపబడుచున్నది. ఇది ఉత్తర భారతమున విశేషమగు పండుగ. ఆంధ్రదేశమున అంతగా పాటింపబడుటలేదు. అయినను హైదరాబాద్ నగరమందును తెలంగాణమునందును కొందరు జరుపుకొందురు గనుక సంగ్రహముగా దెలుపుచున్నాను.

ఈ వసంతపంచమిని శ్రీ పంచమి యనియును వ్యవహరింతురు. నిర్ణయసింధు, స్మృతికౌస్తుభకారులు దీనిని శ్రీపంచమియే యనిరి. ఈనాడు సమృద్ధికొరకు లక్ష్మిని కుంద కుసుమములతో పూజచేయవలెనని హేమాద్రి తెలిపెను.

"మాఘ శుక్ల చతుర్థ్యాంతు వరమాసాద్యా చ శ్రియః,
పంచమ్యాం కుందకుసుమైః పూజాంకుర్యా త్సమృద్ధయే."

రతీమన్మథులను పూజించి మహోత్సవ మొనరించవలెననియు, దానములు చేయవలెననియు, దీనివలన మాధవుడు—వసంతుడు—సంతోషించుననియు నిర్ణయామృతకారుడు తెలిపినాడు. ఇది యే వసంతోత్సవమనియు ననినాడు.

"మాఘమాసేతు సంపూజ్య కర్తవ్యః సుమహోత్సవ దానానిచ ప్రదేయాని తేనతుష్యతి మాధవః. అయముత్సవో వసంతోత్సవః."

ధర్మసింధుకారుడు "మాఘ శుక్లపంచమీ వసంత పంచమీ, తస్యాం రతికామయోః పూజోక్తా." అని నిర్వచించినాడు.

వ్రతచూడామణిలో "అథమాఘ శుక్ల పంచమ్యాం వసంత ప్రవృత్తిః, తత్రవిష్ణోః పూజాకార్యా. చైత్ర శుక్ల పంచమీవత్ బ్రాహ్మణాన్ భోజయేదితి ప్రసంగః." మాఘ శుద్ధ పంచమిన్నాడు వసంతఋతువు ప్రారంభమగును. ఈనాడు విష్ణువును పూజింపవలెను. చైత్రశుద్ధ పంచమియందువలెనే బ్రాహ్మణులకు సంతర్పణ చేయవలెను" అని యున్నది.

ధర్మశాస్త్రకారు లందరును దీనిని వసంతఋత్వారంభముగా పేర్కొనుటనుబట్టి ఉగాదిపండుగలో చర్చించినట్లిదియు ఒకానొకప్పుడు వసంతవిషువత్కాలమయి యుండునని యూహింపవచ్చును.

వసంతపంచమినాడు ఉత్తర భారతమున ప్రజలు ప్రాతఃకాలముననే లేచి స్నానాదికము తీర్చి పసుపురంగు వస్త్రములను ధరించి సూర్య, వినాయకులను, భూదేవిని పూజింతురు. పసుపురంగు నవనవోన్మేషితమగు వసంత ఋతువుకు చిహ్నము. సాయంకాలము అందరును ఊరేగింపుగా తోటలకు వెళ్లి వినోదముగ గడపుదురు. దేవప్రయాగ, హృషీకేశము, హరిద్వారము మున్నగు క్షేత్రములలో మేలాలు జరుగును. ఈనాడే పరమేశ్వరుడు తన తపోభంగము చేయ వచ్చిన మన్మథుని తన మూడవకంటి మంటల కెరచేసెనని యును గాథగలదు.

వంగప్రాంతమున ఈనాడు సరస్వతీపూజ జరుపబడును. సరస్వతీ విగ్రహమును ఊరేగించి గంగానదిలో విసర్జింతురు. పుస్తక పూజకూడ కావింతురు. విద్య సర్వమునకు మూలము గనుక, విద్యాధిదేవతయగు సరస్వతిని సంవత్సరారంభమగు నీనాడు పూజించుట యాచారముగ నేర్పడియుండును.

మహారాష్ట్రమున ఈదినము వసంతారంభ దినముగా భావించబడుచున్నది. నూతన వస్త్రధారణము కావింతురు. పూర్వపు స్వదేశరాజుల సంస్థానములలో ఈనాడు పెద్ద దర్బారు జరుగుచుండెను. వసంతాగమమునకు చిహ్నముగా లాంఛనముగ నందరిపైనను వసంతపు నీరు (ఎర్రరంగు నీరు) చిలకరించి, అత్తరుపూసి, తాంబూలాదులతో దర్బారీలు సత్కరించబడుచుండిరి.

---

# 22. సుబ్బరాయషష్ఠి

శివకుమారుడగు కుమారస్వామిని స్కందుడనియు, కార్తికేయుడనియు, సుబ్రహ్మణ్యుడనియు, సుబ్బరాయుడనియు నందురు. స్కందుడు జనించిన షష్ఠియే స్కందషష్ఠి. దీనినే తెలుగువారు సుబ్బరాయషష్ఠి యనిరి. ఈనాడు ఉపవసించి, స్కందపూజ యొనర్చి, బ్రహ్మచారికి వస్త్రాదిదానము లొసగి భోజనము పెట్టుదురు. మరునాడు పారణ చేయుదురు. ఈ పండుగను గురించియు, పూజాదికమును గురించియు వ్రతగ్రంథములలోను, ఆచరణమునను వైవిధ్యమున్నది. వ్రతచూడామణి "కార్తికే స్కందషష్ఠీవ్రతం. మార్గశీర్ష శుక్లేవా భాద్రపదేచం వావ్రతం" అని స్పష్టముగా నన్నది. కాని, నిర్ణయసింధువు మార్గశిరశుక్ల షష్ఠియే స్కందషష్ఠి యనినది. హేమాద్రి భవిష్యోత్తరములోని కార్తికేయ షష్ఠీవ్రతమును ఒకదానిని,

"మార్గశీర్షే సితేపక్షే షష్ఠీభరత సత్తమ,
పుణ్యా పాపహరా జ్ఞేయా శివా శితా గుహప్రియా.
నిహత్య తారకం షష్ఠ్యాం గుహస్తారక రాజవత్
రారాజతేన దయితా కార్తికేయస్య సా తిథిః."

మార్గశిర శుక్ల షష్ఠినాడు కుమారస్వామి తారకాసురుని సంహరించి, తారకాధిపతివలె ప్రకాశించెను. గనుక ఈ తిథి అతనికి మిగుల ప్రియమైనదని మార్గశిర మాసముననే తెలి

పెను. కార్తికమాసమందును ఒక స్కందషష్ఠీ వ్రతమును ఇట్లు తెలిపినాడు. ఇదియును భవిష్యోత్తరములోనిదే.

"షష్ఠ్యాం ఫలాశనో రాజన్ విశేషా త్కార్తికే నృప,
రాజ్యచ్యుతో విశేషేణ స్వరాజ్యం లభతేచిరాత్
షష్ఠీతిథిర్మహారాజ సర్వదా సర్వకామదా,
ఉపోష్యా సాప్రయత్నేన సర్వకాలం జయార్థినా.
కార్తికేయస్య దయితా ఏకాషష్ఠీ మహాతిథిః,
దేవసేనాధిపత్యం హి ప్రాప్తమస్యాం మహాత్మనా."

ఈ తిథి కార్తికేయుడు దేవసేనాధిపత్యమును పొందిన తిథి గనుక జయాభిలాషియగు రాజు ఈ వ్రతమాచరించవలెను. రాజ్యము కోల్పోయిన వా డాచరించిన మరల రాజ్యమును పొందును అని ఈ శ్లోకముల భావము.

చైత్రశుద్ధ షష్ఠి మొదలు ప్రతి షష్ఠియందును స్కందపూజ నాచరించు కుమారషష్ఠీ వ్రతమును కాలోత్తరమను గ్రంథము తెలుపుచున్నది. కుమారస్వామి చైత్ర శుద్ధ షష్ఠినాడు జన్మించెనని బ్రాహ్మవచనము.

"జాతః స్కందశ్చ షష్ఠ్యాంతు శుక్లాయాం చైత్రనామని,
సేనాపత్యేభిషిక్తశ్చ దేవానాం బ్రహ్మణాస్వయం."

మాఘశుక్ల షష్ఠినాడును స్కందషష్ఠి జరుపు నాచారము కొన్ని ప్రాంతములలో గలదు.

పూర్వ మొకప్పుడు తారకుడను రాక్షసుడు బలగర్వితుడై దేవతలను బాధింపదొడగెను. దేవతలందరు బ్రహ్మకు తమ గోడు తెలుపుకొనిరి. ''మహేశ్వరుడు తపస్సుచేయుచున్నాడు. ఆతడు తపమును మానునట్లుచేసి, పార్వతిని పరిణయమాడునట్లు చేసిన, వారికి జనించు కుమారుడు తారకాసుడుని చంపును.'' అని బ్రహ్మ వారికి తెలిపెను. అంతట దేవతలు మన్మథుని శివునికి తపోభంగము చేయబంపిరి. అప్పుడు పార్వతి శివునికి పరిచర్యలు జరుపుచుండెను. ఆ సమయమున మన్మథుడు శివునికి కామవికారము కలిగించెను. శివుడది గ్రహించి తన మూడవకన్ను తెరచి కాముని దహించివేసెను. కాని, తారకాసురుని వధ అవశ్యం భావియని తెలిసిన శివుడు పార్వతిని పెండ్లాడెను. సంభోగ సమయమున ఆయన వీర్యము క్రిందపడగా దానిని అగ్ని గ్రహించి భరించలేక గంగలో వదలెను. గంగ దానిని తన తీరములోని శరవనమునకు తోసెను. అక్కడ కుమారస్వామి జనించెను. శరవనమున జనించుటవలన శరవణభవుడని యతనికి నామధేయ మాయెను. ఆశిశువును ఆరుగురు తల్లులు కృత్తికలు రక్షించిరి. కనుక షాణ్మాతురుడని, కార్తికేయుడని పేర్లు వచ్చెను. పిదప దేవతలతనికి దేవసేనాధిపత్యము నిచ్చిరి. స్కందుడు తారకాసురునిపై దండెత్తి యతనిని వధించెను.

•

స్కందపూజ రెండువేల సంవత్సరములకు ముందు నుండియే మన దేశమున నున్నట్లు శివరాత్రి చర్చలో తెలిపి

నాను. స్కంధగాథలు పెక్కు పురాణములలో గలవు. కాళి దాసు కుమారసంభవము, నన్నెచోడుని కుమారసంభవము మొదలగునవి స్కందపూజావ్యాప్తికి నిదర్శనములు. అయి నను స్కందునియెడ దక్షిణభారతమున నున్నంత భక్తి తెలుగుదేశమున కానరాదు.

నాకు చూడ స్కందపూజ శరత్కాలపూజగా తోచుచున్నది. స్కందజననము శరవనములో—రెల్లుదుబ్బు లలో—ననుట, కృత్తికలు రక్షించినవనుట, తారకాసంహారము, ఇవన్నియు శరత్కాల సూచకములేగదా !

---

# 23. పరశురామ జయంతి

పరశురామావతారము విష్ణువు దశావతారములలో ఆరవది. పరశురాముడు వైశాఖ శుక్ల తృతీయనాడు అవతరించెనని స్కాందపురాణము తెలుపుచున్నది.

"వైశాఖస్య సితేపక్షే తృతీయాయాం పునర్వసౌ,
నిశాయాం ప్రథమేయామే రామాఖ్యం సమయేహరిః.
స్వోచ్చగే షడ్గ్రహైర్యుక్తే మిథునే రాహుసంయుతే,
రేణుకాయాస్తు యో గర్భాదవతీర్ణో హరిస్స్వయం."

వైశాఖ మాసశుక్లపక్షతృతీయనాడు పునర్వసు నక్షత్రమందు రాత్రి మొదటి జామున, ఆరు గ్రహములు ఉచ్ఛస్థానములోనుండగా, రాహుయుత మిథునలగ్నమున సాక్షాత్ హరి రామరూపమున రేణుకాదేవి గర్భమున జనించెను అని భావము. కాని బ్రహ్మాండపురాణమున.

"వైశాఖస్య తృతీయాయాం శుక్లాయాంతు జనార్దనః,
బ్రహ్మలోకాత్త్రిపథగాత్ పృథివ్యామవతారయత్
ఏవముత్పాద యామాస రవౌ మధ్యందినేసతి,
ప్రోక్తా పరశురామస్య జయంతీతిచ సూరిభిః."

వైశాఖశుక్ల తృతీయనాడు మిట్టమధ్యాహ్నమున జనార్దనుడు బ్రహ్మలోకమునుండి పరశురాముడుగా అవతరించెను. గనుక, నేడు పరశురామజయంతి యని యున్నది.

మధ్యాహ్నమనినను, రాత్రి యనినను తృతీయనాడే గనుక అంత విరోధమేమియు నుండదు.

పరశురాముని తండ్రి జమదగ్ని. మహాకోపనుడు. తల్లి రేణుక. క్షత్రియస్త్రీ. మహా పతివ్రత. ఆమె ప్రతిదిన మును ఏటికిపోయి, అక్కడి యిసుకతో కుండను చేసికొని, దానితో నీరు తెచ్చు చుండెనట. ఒకనాడు చిత్రరథుడను ఒక రాజు ఆనదీ తీరమునకు వేట నిమిత్తము వచ్చెను. అతనిని చూచి రేణుక మనసు చలించెను. కనుక ఇసుకబిందె కుదుర లేదు. ఆశ్రమమునకు మిగుల తడవుగా బోయెను. తడవు నకు కారణమేమని జమదగ్ని యడిగెను. రేణుక తన మన స్సంక్షోభమును తెలుపుటకు జంకి యూరకుండెను. జమదగ్ని తన యోగదృష్టితో వాస్తవము గ్రహించి, మిగుల నాగ్రహించి యామెను తునియలుగా ఖండించి వేయుమని కుమారుడగు పరశురాముని ఆజ్ఞాపించెను. తండ్రి మాట జవదాటని పరశురాముడు తన గండ్ర గొడ్డలితో తల్లిని రెండు తుండ్లుగా నరికివేసెను. పరశురాముడా గండ్ర గొడ్డలి శివుని తపముతో మెప్పించి సంపాదించినది. ఆగండ్ర గొడ్డలి– పరశువు– వల్లనే యతనికి పరశురాముడను పేరు వచ్చెను. తండ్రి కుమారుని వినయసంపదకు మెచ్చి వరము వేడు మనెను. తన తల్లిని మరల బ్రతికింపుమని పరశురాముడు వరము కోరెను. తండ్రి అనుగ్రహించి రేణుకను బ్రతికించెను.

ఇట్లుండగా ఒకనాడు కార్తవీర్యార్జునుడను మహారాజు జమదగ్ని యాశ్రమమునకు వచ్చెను. జమదగ్నిముని రాజును

సత్కరించి, అతనికి అతని పరివారమునకును పంచభక్ష్య పర మాన్నములతో విందుచేసెను. ఒక్కమునికంతటి యైశ్వర్య మున్నందుకు రాజు విస్మితుడై, దాని రహస్యమేమనిముని నడిగెను. తనయొద్ద కామధేను వున్నదనియు, అదియే అంతయును వర్షించుననియు ముని యనెను. రాజు దానిని తన కిమ్మని కోరెను. ముని నిరాకరించగ, రాజు కుపితుడై అతని లెక్కపెట్టక కామధేనువును తోలుకొని పోయెను. ఆ సమయమున పరశురాముడు ఆశ్రమమున లేడు. అతడు తిరిగిరాగానే, సంగతి తెలిసి కోపోద్దీపితుడై, కార్తవీర్యుని యొద్దకేగి, అతనితో పోరి, అతనిని తన పరశువుతో చంపి, అతని పుత్రులను తరిమివేసి, తన కామధేనువును తోలుకొని వచ్చెను.

కాని, కార్తవీర్యుని పుత్రులు పగబట్టి పరశురాము డింటలేని యదనున జమదగ్ని తల నరికివేసిరి. పరశురాముడు తిరిగి రాగానే రేణుకాదేవి దుఃఖమున "మీతండ్రిలేడు" అని ఇరువదియొక్కమారు లనెనట. అంతట పరశురాముడు కార్త వీర్యుని పుత్రులను చంపి, కోపము శాంతించనందున ఇరువది యొక్కమారు భూమండలమంతయు తిరిగి క్షత్రియుల నందరిని చంపివేసి భూమిని క్షత్రియ రహితముగా చేసెను. మరల యాశ్రమమునకు వచ్చి తండ్రితలను మొండెముతో గలిపి యతనిని పునర్జీవితుని జేయుటకు యజ్ఞమొనర్చి, తండ్రిని సజీవుని చేసెను. ఆయజ్ఞమున మహర్షులు ఋత్విక్కు లయిరి. జమదగ్ని సప్తర్షులలో ఒక డయ్యెను. ఆయజ్ఞ

మున తానుసంపాదించిన భూమినంతయును కాశ్యపునికి ధారపోసి తపమాచరించుటకు మహేంద్రగిరికి బోయెను. ఇతడు చిరంజీవి యని మన పూర్వుల విశ్వాసము. అప్పటి నుండియే భూమికి కాశ్యపియను పేరు వచ్చినది.

పరశురాముడు తపమాచరించుచుండగా దశరథసుతుడగు రాముడు శివుని ధనుస్సును విరిచి జనకుని కుమార్తెను పెండ్లాడి మిథిలనుండి యయోధ్యకు తిరిగి వచ్చుచుండెను. తన గురువగు శివునిధనువు విరుగగొట్టబడి నందులకు పరశురాముడు కుపితుడై అతనిని ఎదిరించి ఓడిపోయెను. పరశురాముడు భీష్మునకు ధనుర్విద్యాగురువు. అంబ విషయమై అతనికిని, భీష్మునికి జరిగిన పోరులోను అతడే (పరశురాముడే) యోడిపోయెను. కర్ణుడును పరశురామునియొద్ద విలువిద్య నేర్చెను. కాని, కర్ణుడు తాను విప్రుడనని చెప్పి విలువిద్య నేర్చెను. అతడు విప్రుడు కాడని తెలిసిన పిదప పరశురాముడు "నీకు మంచి యదనున అస్త్రశస్త్రములు జ్ఞాపకమునకు రాకుండు గాక!" యని శాపమిచ్చెను.

పరశురామావతారము నాంతర్యమేమి? ఒకప్పుడు బ్రాహ్మణ క్షత్రియులకు తాము గొప్పయన్న తాము గొప్ప యను వివాద మేర్పడి, క్షత్రియులు తమ బలదర్పములతో బ్రాహ్మణుల నడిచివేయగా, కలిగిన విద్వేషముతో బ్రాహ్మణు లెదురు తిరిగి తమయాధిక్యమును బాహుబలముతోను నిరూపించుకొని యుందురనియు, అట్టి స్థితికి పరశు

రాముని చర్యలు నిదర్శనమనియు పరిశోధకుల అభిప్రాయము. క్షత్రియు లధర్మపరులై ప్రజలను పాలింపలేకపోయి హింసించుచున్నందున పరశురాముడు అవతరించి వారిని సంహరించి ప్రపంచమును నిష్కంటకముగా జేసెనని పురాణములు చెప్పుచునే యున్నవి. పరశురాముడు భూమిని దానమొనర్చిన తర్వాత కశ్యపుడు అతనిని వెడలగొట్టెను. అప్పుడు అతడు బ్రాహ్మణుల ఆవశ్యకత ఏర్పడగా, ఆటవికులను కూడ మెడలో జందెమువేసి బ్రాహ్మణులుగా చేసెనని స్కాందపురాణములోని సహ్యాద్రి ఖండములో నున్నది.

"అబ్రహ్మణ్యేతథా దేశే కైవర్తాన్ ప్రేక్ష్య భార్గవః,
స్థాపయిత్వా స్వకీయే సత్క్షేత్రే విప్రాన్ ప్రకల్పితాన్."

పరశురాముడు, హనుమంతుడు, బభ్రువాహనుడు, విభీషణుడు, పరాశరుడు, సుగ్రీవుడు రామాయణమునందును, భారతమునందును కానవచ్చుటవలన రామాయణ భారత కాలముల కంతగా కాలవ్యత్యాసము కనపడదనియు, దశరథ రాముని వార్ధక్యమున కృష్ణుడు బాలుడై యుండుననియు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు వ్రాసిరి.

పరశురాముడు కైవర్తా ఆటవికులను బ్రాహ్మణులుగా గుర్తించుటవల్లనే కాబోలు కొన్ని జాతులవారికి అతని తల్లి రేణుకాదేవి యిలువేల్పయినది.

పరశురామ జయంతినాడు ఉపవసించి, పరశురాముని షోడశోపచారములతో పూజించి, "జమదగ్నిసుత వీర క్షత్రియాంతకర ప్రభో, గృహాణార్ఘ్యం మయాదత్తం కృపయా పరమేశ్వర" అని అర్ఘ్యప్రదానము చేయవలెనని వ్రతగ్రంథములు తెలుపుచున్నవి.

---

# 24. హనుమజ్జయంతి

స్వామిభక్తికిని, కార్య నిర్వహణమునకును హనుమంతుడు పెట్టినది పేరు. హనుమంతుని జయంతిని చైత్రశుద్ధ పౌర్ణమినాడు జరుపుదురు. హనుమంతుడు కేసరియను వానర రాజునకును, అంజనాదేవికిని జనించినవాడు. ఈతని జనన వృత్తాంతమునను కొంత వింతగలదు.

అంజనాదేవి పూర్వ జన్మమున పుంజికయను నొక యప్సరస. శాపకారణమున వానరజాతిలో పుట్టెను. ఆమె యొకనాడు వనమున విహరించుచుండగా, గాలిపాటునకు పైయెద తొలిగెను. ఆమె పీనపయోధరములు బయల్పడెను. వానిని చూచి వాయుదేవుడు మోహావేశమున ఆమెను ఆలింగనము చేసికొనెను. వారిద్దరకును ఆంజనేయుడు జనించెను.

అంజనాదేవి యొకనాడు తన కుమారుని వదలి పండు తెచ్చుటకు పరిసరవనమునకు వెళ్లెను. అప్పుడా బాలుడు మిగుల ఆకలిగొని, జపాపుష్పోత్కరోపమమైన సూర్యబింబమును పండను భ్రాంతితో మ్రింగుటకు గగనవీధి కెగిరెను. అదిపర్వ సమయమగుటవలన రాహువుకూడ సూర్యుని మ్రింగుటకు వచ్చుచుండెను. తన కన్న ముందుగా సూర్య బింబముమీదికి వచ్చుచున్న ఆంజనేయుని రాహువు చూచి భయపడి వెనుదిరిగిపోయి, ఇంద్రునకు ఈ సంగతి తెలిపెను. ఇంద్రుడును ఆశ్చర్యపడి ఐరావతమెక్కి నూతన

రాహువును చూచుటకు వచ్చెను. ఆంజనేయుడు తెల్లని ఐరావతమునుచూచి, ఇదయేదయో కొత్తపండనుకొని, దానిని మ్రింగుటకు వచ్చెను. ఇంద్రుడు చేయునదిలేక తన చేతి వజ్రాయుధముతో ఆంజనేయుని కొట్టెను. అతడు ఆ దెబ్బకు ప్రాణములు వదలి ఒక కొండపై పడెను. పడునప్పుడు అతని ఎడమదవడ (హనువు) పగిలెను. తన కుమారునిపై ఇంద్రుని దుశ్చర్యను వాయువు సహించలేకపోయెను. వెంటనే తన కుమారునెత్తుకొని, ఒక గుహాలో దూరెను. దానివలన ప్రపంచమంతయు ప్రాణరహితమై స్తంభించిపోయెను. దేవతలు, ఇతరులు ఏమి చేయుటకును తోచక బ్రహ్మావద్దకు వెళ్ళి మొరయిడిరి. బ్రహ్మ తన దివ్యదృష్టితో విషయము నంతయును గ్రహించి, వారందరిని వెంట నిడుకొని వాయువున్న గుహావద్దకు వెళ్ళి, అతనిని ప్రార్థించెను.

వాయువు గౌరవముతో లేచి, బ్రహ్మకు నమస్కరించి, మరణించిన తన పుత్రుని బ్రహ్మముందు పెట్టెను. బ్రహ్మ అతనిని చేతితో స్పృశించెను. ఆ స్పర్శమాత్రమువనే, వాడిపోయిన పైరు నీరుపోయగనే నవనవలాడుచు తల యెత్తినట్లు ఆంజనేయుడు పునః జీవించెను. వాయువు సంతసించి యథారీతిని తిరుగసాగెను. ప్రపంచమంతయు మరల సుఖపడెను. వాయువును సంప్రీతుని చేయుటకై దేవతలందరును ఆంజనేయునునికి వరము లొసగిరి. ఇంద్రుడు ఒక పద్మమాలను అతనికిచ్చి, "నా వజ్రఘాతమువలన హనువునకు దెబ్బ తగిలినది గాన, ఇకమీద నీపేరు హనుమంతుడని

ప్రఖ్యాతమగుగాక!'' అనియు వరమిచ్చెను. ''హనుమంతుడు అవధ్యుడగుగాక!'' యని ఈశ్వరుడు వరమిచ్చెను. పిదప వాయువు తన కుమారుని అంజనాదేవికి అప్పగించెను.

హనుమంతుడు పెరిగి పెద్దవాడై బలగర్వముతోను, వరశక్తితోను ఆశ్రమములో అల్లరిచేయుచు మునులను బాధపెట్ట దొడగెను. అత డవధ్యుడగుట యెరిగిన మునులు ''నీకు నీ బలము తెలియకపోవుగాక! నీ కీర్తి పొగడిననే గాని బలము పెరుగకుండునుగాక!'' అని శపించిరి. ఆ శాపము వలన హనుమంతుడు ఆగడములు చేయుట తగ్గి, నిస్తేజుడాయెను. పిదప అతడు సూర్యునియొద్ద వ్యాకరణము నేర్చెను. ఇట్లే సకల విద్యలను నేర్చెను. పెద్దవాడైన పిదప ఇతనికి సుగ్రీవునితో సఖ్యమేర్పడెను. తర్వాత అతనికి మంత్రియాయెను. అనంతరమందలి రామాయణకథ యందరకును తెలిసినదే గాన వివరింపలేదు.

ఈ హనుమజ్జయంతి ద్వైత సంప్రదాయము ననుసరించు మాధ్వులకు ప్రధానమగు పండుగ. వారు హనుమంతుని 'ముఖ్య ప్రాణదేవరు' అనెదరు. హనుమదుపాసకులును ఈ పండుగను చేయుదురు. శ్రీరామనవమితోపాటు ఈ జయంతి జరుపుటయును కలదు.

రామాయణమునందలి ఈ వానరులు కోతులు కారనియు, అనాది జాతివారనియు పరిశోధకుల యభిప్రాయము. జైనరామాయణ రచయితలు వీరిని ఖేచరీవిద్య నెరిగిన విద్యా

ధర జాతివారని వర్ణించిరి. హనుమంతుడు ఏ జాతివాడైననూ ఆదర్శగుణములు గలవాడు. కనుక ఆరాధనీయుడు.

మనోజవం మారుతతుల్య వేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం,
వాతాత్మజం వానరయూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.

# 25. వామనజయంతి

ఈ పండుగను భాద్రపద శుద్ధ ద్వాదశినాడు జరుపుదురు. శ్రవణ నక్షత్రయుక్తమైన ఈ ద్వాదశినాడు మధ్యాహ్నమున వామనుడు అవతరించెనని పురాణములు తెలుపుచున్నవి. భాగవతమున ఈ కథ విపులముగా వర్ణింపబడినది. బలిచక్రవర్తిని అణచివేయుటకై విష్ణువీ యవతారమెత్తెనని పురాణగాథ. ఈ విషయమున విపులమగు చర్చను దీపావళి యందును శ్రావణ పూర్ణిమయందును చూడగోరినాను. త్రివిక్రమ విష్ణువనగా సూర్యుడేయనియు అతని ప్రాతర్మధ్యాహ్న సాయంగతులే మూడు అడుగులుగా వర్ణింపబడినవనియు పరిశోధకుల యభిప్రాయము. కేరళదేశమున ఈనాడు జరుగు 'తిరువోణం' ఉత్సవమున బలిపూజలనుబట్టియు ఇది సూర్యారాధనమేనని నిశ్చయింపవచ్చును.

"ఈనాడు ఉదయముననే నదిలో స్నానమాచరించి, వామనుని ఆరాధించవలెను. మరునాడు వామన విగ్రహమును ఒక బ్రాహ్మణునికి దానమివ్వవలెను." అని వ్రతగ్రంథములు తెలుపుచున్నవి.

---

# 26. నృసింహజయంతి

ఈ జయంతి వైశాఖ శుద్ధ చతుర్దశినాడు జరుప బడుచున్నది. చతుర్దశినాడు సాయంకాలము నృసింహ మూర్తి హిరణ్యకశిపు వధార్థము అతని యాస్థానమంటప స్తంభమున నావిర్భవించెనని పురాణములు చెప్పుచున్నవి.

"వైశాఖ శుక్లపక్షేతు చతుర్దశ్యాం సమాచరేత్,
మజ్జన్మ సంభవం పుణ్యం వ్రతం పాప ప్రణాశనం."

అని నరసింహుడే ప్రహ్లాదునితోననెనని నృసింహ పురాణ మున గలదు. ఈ వ్రతము శ్రీవైష్ణవులకు ముఖ్యమైనది.

వైశాఖ శుద్ధ త్రయోదశినాటి రాత్రియం దుపవసించి, చతుర్దశినాడును ఉపవసించి, ప్రదోష కాలమున నృసింహ విగ్రహమును పూజింపవలెను. స్తంభమునం దవతారము గనుక భవంతి స్తంభములకు తిరుమణి, తిరుచూర్ణములు పెట్టి పూజించుట శ్రీవైష్ణవుల సంప్రదాయము. రాత్రి జాగరణము చేసి, స్వర్ణసింహ విగ్రహమును దానమిచ్చి, మరునాడు పారణచేయుదురు. వైశాఖము గ్రీష్మము గనుక వడపప్పు పానకము ఆరగింపు పెట్టుదురు.

హిరణ్యకశిపును సంహరించిన పిదప శాంతకోపుడై సుఖాసీనుడైన నృసింహుని ప్రహ్లాదుడు చేతులు జోడించి, "దేవా! నీవు నాకు శత్రుకోటిలోనివాడవు. నీయందు నాకు భక్తికి కారణమేమి ? నీకు నేనెట్లు ప్రీతిపాత్రుడనైతిని" అని

ప్రశ్నించెను. నృసింహ భగవానుడిట్లు నుడివెను. "వత్సా!! వినుము. నాకు ప్రీతిపాత్రుడవగుటకు నీ భక్తే కారణము. నీవు పూర్వజన్మమున వాసుదేవుడవను విప్రుడవు. వేశ్యా సంగుడవై నా వ్రతముతప్ప మరొక సుకృతము చేయవైతివి. నా వ్రతప్రభావమున నీకు నాయందు భక్తికలిగినది. దాని కారణము వినుము. అవంతీనగరమున సుశర్మయను వేద వేదాంగ పారగుడగు బ్రాహ్మణుండెను. అతని భార్య సుశీల యను నామె మిగుల ఉత్తమురాలు. వారికి ఐదుగురు కొడు కులు పుట్టిరి. వారిలో కనిష్ఠుడవు నీవు. నీవు వేశ్యాలోలు డవై చేయరాని పనులన్నియు చేసితివి. ఇట్లుండగా నొకనాడు నీకును వేశ్యకును కలహము సంభవించెను. నీవు కలహించుట వలన ఆ రాత్రి భుజింపలేదు. ఆనాడు నా జయంతి. వేశ్య లేనందున ఆరాత్రి నీవు జాగరణముగూడ చేసితివి. వేశ్య యును అట్లే కావించినది. అజ్ఞాతముగా ఇట్లు వ్రతమాచ రించుటవలన ఇద్దరును ముక్తులయి ఉత్తమగతులు పొందితిరి." ఇది నృసింహాపురాణకథ.

నృసింహావతారము మహావిష్ణువు నాల్గవ యవతారము. క్రూరమృగములు పూజలతో అనుగ్రహించునని ప్రాచీనుల భయవిశ్వాసములు. ప్రకృతి బలముకన్నను, మానవుని శక్తి యుక్తులకన్నను దైవమే బలీయము, దైవబలము మానవుని యుక్తికిని, ఊహకును అతీతమైనదియను భావము నాటుటకే నృసింహజయంతి యుద్దేశింపబడినట్లు తోచుచున్నది. దీనికి హిరణ్యాకశిపుని వరములే నిదర్శనము.

---

# 27. తులసీపూజ

ఆయుర్వేద సూత్రములకును, మన పండుగలకును వ్రతములకు మిగుల సంబంధమున్నది. పూర్వము అపరాజిత యను ఓషధికిని ఇతరౌషధులకును ప్రాధాన్యము వచ్చినట్లే తర్వాతి కాలమున తులసికిని ప్రాధాన్యము కలిగినది. తులసి గుణములు వైద్య గ్రంథములలో విశేషముగా వర్ణింపబడినవి.

"తులసీ లఘురుష్ణా రూక్షాచ కఫవాతనుత్,
క్రిమిదోషం హరత్యేషా రుచికృద్వహ్నిదీపనీ"

అని ధన్వంతరీ నిఘంటువున దీని గుణములు వర్ణింపబడినవి. అనగా, తులసి తేలికగా జీర్ణమగునది. చేదురుచి గలది. ఉష్ణవీర్యము, రూక్షగుణము కలిగించునది. కఫవాతములను పోగొట్టును, క్రిమిదోషమును హరించి, రుచిని, ఆకలిని కలిగించును - అని యర్థము. తులసిలో పెక్కు భేదములున్నవి. కృష్ణ తులసి కాసశ్వాస రోగములను, పార్శ్వశూలలను, దౌర్గంధ్యమును హరించును. గజ్జి తామర దురద మొదలగు చర్మవ్యాధులు దీనిరసము పూయుటవలన తగ్గుననుట అనుభూత ప్రక్రియ. తేలు, పాము విషమును గూడ దీనిరసము తగ్గించును. ఇట్టి మూలికా ప్రాధాన్యమును బట్టియే దీనినొక దేవతగా పూజించుట, వివాహాదులు ఒనర్చి యానందించుట ఆచారమైనది.

ఈ తులసీ వివాహవ్రతము కార్తిక శుక్ల ద్వాదశి నాడు సాయంకాలము జరుపబడును. దీనికి కారణ మిదియని యూహించుచున్నాను. కార్తికమాసము రెండవ పక్షము (బహుళ పక్షాదిమాస గణనముతో) మార్గశిరాది పక్షము యమదంష్ట్రయని వైద్యులు చెప్పుట శయనైకాదశిలో చర్చింప బడినది. ఆ సమయము పెక్కురోగములకును, క్రిములకును పుట్టినిల్లు. కనుక ఆహార నియమముతోనుండి క్రిమిహరమగు నోషధులను వాడిన మంచిదని చెప్పుటకు మన పూర్వులు ఈ కాలమున నీ వ్రతమును ఏర్పాటు చేసియుందురు. చాతుర్మాస్యవ్రత సమాప్తిలో దీనిని జరుపుట ఆరోగ్యదృష్టితోనే యని వేరుగ చెప్పనక్కరలేదు.

తులసీ జన్మను గురించియు, మాహాత్మ్యమును గురించియు పురాణములలో పెక్కు కథలు కలవు. పూర్వము కాలనేమియను రాక్షసుడుండెను. తులసి ఆమె కుమార్త. పరమేశ్వరుడు ఒకమారు తన చెమటబొట్లను చేతితో విసరెను. అది సముద్రములో బడగా, దానినుండి జలంధరుడను రాక్షసుడు పుట్టెను. జలంధరుడు పెద్దవాడై, ఇంద్రుని కడకేగి, తన జనకుడగు సముద్రునినుండి యుద్భవించిన పారిజాత కామధేను కౌస్తుభాదివస్తువులను తన కిమ్మని కోరెను. దాని కతడియ్యకొననందున, జలంధరు డతనిని తరిమి వేసి, స్వర్గము నాక్రమించుకొనెను. • జలంధరు డజేయుడు. ఆతని భార్య పాతివ్రత్యము చెడనంతవరకును, అతనికి మరణము కలుగకుండునట్లు పితామహుడు వరమిచ్చియుండెను.

దేవతలందరును ఎప్పటివలె విష్ణువును శరణువేడిరి. విష్ణువు నకు జలంధరుని మరణ రహస్యము దెలియును గనుక, మారువేషమున వెళ్ళి తులసి పాతివ్రత్యమును భంగము చేసెను. వెంటనే ఇంద్రుడు జలంధరుని తల నరికెను. ఆతల తులసి ముందరపడెను. మహాపతివ్రతయగు తులసి అంతయు నెరిగి విష్ణువును శిల కమ్మని శపించెను. ఆ శాపకారణముననే. విష్ణువు గంకీడనదిలో నేడు లభించు సాలగ్రామ రూపము పొందెను. విష్ణువామెకు చెట్టువుకమ్మని ప్రతి శాపమిచ్చెను. ఆమెయే ఓషధీరూపమున నున్న తులసి.

పద్మపురాణమునగల ఈ తులసీ కథలో కొంత మార్పున్నది. జలంధరుడు ముక్కంటి మూడవ కంటినుండి పుట్టెను. అతని భార్య బృంద. జలంధరునికి దేవతలతో యుద్ధము పొసగినప్పుడు అతనికి విజయము చేకూర్పుమని. ఆమె విష్ణువును పూజ చేయసాగెను. ఆమె పాతివ్రత్యమును. భంగపరచుటకు విష్ణువు జలంధరరూపమున వచ్చెను. ఆమె. యాతడు కుహనా భర్తయని తెలియక అతనితో గడపెను. ఇంతలో నిజమైన భర్తతల ఆమె ఎదుటపడెను. బృందకోపించి. విష్ణువును శపింపదలచగ, విష్ణువు లోకకల్యాణమునకు ఇట్లు. చేయవలసివచ్చెనని వివరించి తులసీ దేవిగా నీవు లోకమున పూజ లందుకొందువని వరమిచ్చెను.

కృష్ణతులాభారము కథ యందరెరిగినదియే. అది తులసీ మాహాత్మ్యమునకు పరాకాష్ఠగా కల్పింపబడినది.

ఈ ద్వాదశినాడు స్త్రీలు ఉపయము పూజలు; పారణ జరిపిన పిదప సాయంకాలము బృందావనము (తులసి కోట)ను అలంకరించి, వివాహోత్సవము జరుపుదురు. చుట్టును దీపమాలికలు వెలిగింతురు. ఆశ్వయుజ బహుళా మావాస్యనుండి కార్తిక పూర్ణిమవరకును వివిధరీతుల వివిధ ప్రాంతములలో దీపోత్సవములు జరుపబడుటచూడగా, నీ తులసీ వివాహ వ్రతమును, దీపోత్సవ భాగమనియు, తర్వాత కొంత కాలమునకు తులస్యాషధీ ప్రాముఖ్యము జోడింపబడి, క్రమముగా వ్రత గ్రంథముల కెక్కినదనియు తోచుచున్నది.

జలంధరుడు చెమటనుండి, మూడవ కంటినుండి పుట్టినన, చెమటవలనను, కోపాది మనోవికారములవలనను రోగములు కలుగుననియే గదా! తులసి పాతివ్రత్యము భంగమొనర్చుట యన దానిని నలిపి రసముదీయుట యనియే గదా. విష్ణువుతో వివాహమనగా, నాలుగు నెలల వర్షర్తువు తర్వాత, జలప్రళయము తర్వాత ఓషధులకు, సూర్యునితో సంబంధమనుటయేగదా. దానికి ప్రతీకమే తులసీ వివాహ మని భావింతును.

---

# 28. అనంతపద్మనాభ చతుర్దశి

అనంతపద్మనాభ వ్రతమును అనంతవ్రతమనియు నందురు. ఇది భాద్రపద శుక్ల చతుర్దశినాడు జరుపబడును. పూర్ణిమతో గూడిన చతుర్దశినాడు ఈ వ్రతము చేయవలెనని భవిష్యపురాణమున నున్నదని నిర్ణయామృతము తెలుపుచున్నది.

"తథా భాద్రపద స్యాంతే చతుర్దశ్యాం ద్విజోత్తమ,
పౌర్ణమాస్యాః సమాయోగే వ్రతం చానంతకం చరేత్."

భాద్రపదాంత్య మనగా కృష్ణపక్షాదిమాసము ప్రకారమని యర్థము. పూర్ణిమ ఒక్క ముహూర్తకాలమున్నను ఫలప్రదమగుననియు, త్రయోదశీ విద్ధయగు చతుర్దశినాడు చేసి, సంవత్సర పుణ్యమునుగూడ నపహరించుననియు భవిష్యపురాణమే విధి నిషేధములు తెలిపినది.

"ముహూర్తమపి చేద్భాద్రే పూర్ణిమాయాం చతుర్దశీ,
సంపూర్ణాంతాం విదుస్తస్యాం పూజయే ద్విష్ణుమవ్యయం."

అనంత పద్మనాభవ్రత విధానము వ్రతగ్రంథములలో నిట్లు చెప్పబడియున్నది. ఈ వ్రతములో ప్రధానమైనది ప్రతిసరబంధనము. భర్త భార్య ఎడమచేతికిని, భార్య భర్త కుడి చేతికిని ఈ తోరము కట్టుదురు. ఈ తోరము మరుసటి అనంత చతుర్దశివరకును ఉండవలెనని శాస్త్రము. ఈ తోరము సకల కష్టములకును శ్రీరామరక్షయట.

ఈ వ్రతము ఏతదంగ భూతమైన 'యమునా జలాహరణము'తో నారంభమగును. అనగా యమునాపూజ మొదట జరుపబడును. ఒక కలశమున చెరువునుండియో, నదినుండియో, బావినుండియో జలము తీసికొనివచ్చి, దానిలో యమునను ఆవాహనముచేసి పూజింతురు. పిదప ముగ్గుతో పదునాలుగు పడగలుగల అనంతుని, అనంత మండలమున రచింతురు. పదునాలుగు పడగల అనంతుని దర్భలతో చేయుటయును గలదు. యమునా కలశమును అనంత మండలముపై ప్రతిష్ఠించి, పూజాదికము నిర్వర్తించిన పిదప అనంత ప్రతిసరము పూజితమై ధరింపబడును. పిదప అనంతవ్రత కథాశ్రవణము జరుగును. అనంతపూజానంతరము పాతతోరము విసర్జింపబడును.

భవిష్యపురాణమున ఈ కథ యిట్లున్నది: ధర్మరాజు జూదమున నోడిపోయి వనవాస మనుభవించుచున్నప్పుడు మనః క్లేశముపొంది కృష్ణునిచూచి "ఈ అనంత దుఃఖసాగరము నుండి ముక్తి యెట్లో తెలుపుము మహానుభావా?" యని ప్రశ్నించెను. "అనంతవ్రతమనునది యొకటి కలదు. భాద్రపద శుక్ల చతుర్దశినాడు అనుష్ఠించిన సకల పాపములును తొలగి, కష్టదూరుడవగుదువు." అని కృష్ణుడు తెలిపెను. "అయితే కృష్ణా! ఈ అనంతు డెవడు? శేషనాగమా? తక్షకుడా? పరమాత్మయా? బ్రహ్మయా? ఎవడు?" అని ధర్మరాజడుగగా,

"అనంత ఇత్యహంపార్థ మమరూపం నిబోధత,
ఆదిత్యాది గ్రహాత్మాసౌ యః కాల ఇతికథ్యతే.
కలాకాష్ఠా ముహూర్తాది దివారాత్రి శరీరవాన్,
పక్ష మాస ర్తు వర్షాది యుగకాల వ్యవస్థయా.
యోయం కాలో మహాఖ్యాతః సోనంత ఇతి కీర్త్యతే."

"అనంతుడంటే నేనే. నా రూపముగనే వానిని గ్రహించుము. ఆదిత్యాదిగ్రహాత్మకుడు, కలా కాష్ఠా ముహూర్త దివా రాత్రి దేహుడు, పక్షమాస ఋతు వర్ష యుగ కాల వ్యవస్థతో వ్యవహరింపబడువాడు అయిన కాలపురుషుడే–కాలమే– అనంతుడు. అది నేనే.–" అని కృష్ణుడు సమాధానమిచ్చెను. "అయిన ఆ వ్రతమును నాకు తెలుపుము. మున్నెవరైనా చేసిరా?" అని ధర్మజుడు మరల ప్రశ్నించెను. దానికి కృష్ణుడు ఇట్లు సమాధానముగా నొక గాథ చెప్పెను.

కృతయుగమున సుమంతుడను నొక బ్రాహ్మణుడుండెను. అతని భార్య పేరు దీక్ష. వారికి శీలయను కన్య కలిగెను. కొంతకాలమునకు తల్లియగు దీక్ష జ్వరపీడితయై నదిలో పడి మరణించెను. అతడు మరొక కన్యకను పెండ్లాడెను. ఇట్లుండగా శీలను పెండ్లాడదలచి కౌండిన్య మహర్షి సుమంతుని యింటికి వచ్చెను. సుమంతుడు సంతోషించి అతనికి తన కూతురునిచ్చి వివాహముచేసెను.

పిదప కౌండిన్యుడు శీలతోపాటు ఎడ్లబండిపై బయలుదేరి మధ్యాహ్నమున నొక నదీతీరమున విడిసెను. ఆనాడు చతుర్దశి. నదీతీరమున పలువురు సువాసినులు ఏదియో

పూజ చేయుచుండిరి. శీల వారిలో ఒకతెను ఇదియేమి పూజ యని ప్రశ్నించెను. అనంతవ్రతమని ఆమె తెలిపి దాని విధానముగూడ విశదీకరించెను. వారి మాటలు విని ఆమె ఉత్సాహమున ఆ వ్రతమాచరించి, తోరము-పదునాలుగుముళ్లు గలది-కట్టుకొని, భర్తతోపాటు వెళ్లెను. ఆ వ్రతమాహాత్మ్యమున ఆమె యిల్లు నిత్యకల్యాణము పచ్చతోరణముగానుండెను.

ఇట్లుండగా నొకనాడు ఆమె భర్త ఆమె చేతితోరము చూచి, "ఏమిటిది? నన్ను వశపరచుకొనుటకిది కట్టుకొన్నావా?" యని బెదరించెను. కాని, ఆమె సాంత్వన వచనములతో అనంతవ్రతమును గురించి తెలిపెను. కాని భర్తయగు కౌండిన్యుడామాటలు వినక ఆ తోరమును తెంపి 'ఎవడీ అనంతుడు?' అనుచు కేకలు వేయుచు, ఆ తోరమును నిప్పులో విసరి విసవిస వెలుపలికి నడచెను. శీల ఆ తోరమును పాలలో భద్రపరచెను. తోరమును అవమానించిన కారణమున కౌండిన్యుని సంపద క్షయించెను. ఆవులను దొంగలు అపహరించిరి. అతడు నిర్ధనుడాయెను. దీనికి కారణమేమిటని ఒకనాడు అతను భార్యనడుగగా, "అనంతవ్రతాక్షేపణ దుష్ఫలమే యిది. తచ్ఛాంతికి యత్నింపుడు." అని ఆమె హితవు చెప్పెను.

కౌండిన్యుడు పశ్చాత్తప్తుడై అనంతుని సంతోషపెట్టదలచి తపస్సుకై వనమునకేగెను. దారిలో అతనికొక ఫలపుష్ప సంభృతమగు ఆమ్రవృక్షము కనిపించెను. దానిమీద

నొక పిట్టయును లేదు. చెట్టంతయు చెదపట్టియుండెను. "నీవు, అనంతుని చూచితివా?" అని బ్రాహ్మణు డడిగెను. "నేను చూడలేదు." అని చెట్టు సమాధానమిచ్చెను. అది విని బ్రాహ్మణుడు ముందునకు సాగిపోవుచు, దూడతోపాటు పరు విడుచున్న ఒక ఆవును చూచెను. "నీకు అనంతుడు తెలియునా?" అని దాని నడిగెను. అది తెలియదనెను. కొంత దూరము వెళ్ళగా ఒక పచ్చిక బీడుపై పడుకొనియున్న ఎద్దు కనిపించెను. దానినికూడ బ్రాహ్మణుడు మునుపటివలె నడిగెను. తనకు అనంతుడు తెలియదని వృషభము సమాధానమిచ్చెను. మరికొంత ముందునకు వెళ్ళగా రెండు సరోవరములు, కమల, హంస, చక్రవాక మండితములు కనిపించెను. వాటిని మునుపటివలెనే యడుగగా నవియు చూడలేదని సమాధానమిచ్చెను. పిదప నొక గాడిదయును, ఏనుగును అట్లే సమాధానమిచ్చెను. కౌండిన్యుడు విసుగుపడి, నిరాశతో మూర్ఛితుడై మరల తేరుకొని ప్రాణములు వదలుటకు ఉద్యుక్తుడు కాగా, అనంతుడు వృద్ధ బ్రాహ్మణ రూపమున ప్రత్యక్షమై, అతనిని కుడిచేయి పట్టుకొని ఒక గుహాలోపలకు పిలుచుకొని వెళ్లెను. అచ్చట దివ్య సింహాసనమున శంఖ చక్ర గదాద్యాయుధపాణి యగు అనంతపద్మనాభుడు విప్రునకు సాక్షాత్కరించెను. అప్పుడు విప్రుడు సాగిలపడి తన యపరాధములను మన్నింపుమని వేడెను. అనంతు డతనిని అను

గ్రహించి, "ఓ విప్రుడా! వెంటనే నిజగృహమునకు మర లుము. పిదప పదునాలుగు సంవత్సరములు అనంత చతుర్దశీ వ్రతమాచరించుము. సకల కష్టదూరుడవై, అంతమున నన్ను పొందుదువు" అనెను. కౌండిన్యుడు "స్వామీ కుతూహలము కొలది ఒక్కటి యడుగుచున్నాను. నేను అడవికి వచ్చు నప్పుడు మామిడిచెట్టు, ఆవు, ఎద్దు, సరస్సులు, గాడిద, ఏనుగు కనిపించినవి. వాని యాంతర్యమేమి వివరింపుడు" అని ప్రార్థించెను. అనంతు డిట్లు చెప్పెను. "ఆచూతవృక్షము విద్యావేద విశారదుడగు విప్రుడు. శిష్యులకు విద్యాదానము చేయనందున వ్రూనయ్యెను. ఆయావు విత్తులను హరించు భూమి. ఎద్దు ధర్మస్వరూపము.-- ఆ రెండు పుష్కరిణులు పూర్వము బ్రాహ్మణకన్యలు, అక్కచెల్లెండ్రు. వారెప్పుడును దానధర్మములుచేసి యెరుగరు. గాడిద క్రోధము. ఏనుగ మందము. నీవు ప్రవేశించిన గుహ సంసారము. వృద్ధ బ్రాహ్మణుడను నేనే." అని అంతర్ధానము చెందెను. కౌండి న్యుడు అదియంతయు కలగా తోచగా, స్వగృహమునకు తిరిగివచ్చి, అనంతవ్రత మాచరించి సుఖముండెను.

ఈ కథను సూక్ష్మముగా పరిశీలించిన ఈ వ్రతము ఆకాశమునందలి నక్షత్రగ్రహ సన్నివేశము, నాగపూజ, ఋతుపరివర్తన ప్రభావము మొదలగున వెన్నియో సమ్మి ళితములుకాగా ఏర్పడినదనుట స్పష్టము కాగలదు. కృష్ణుడు అనంతకాల స్వరూపుడగు అనంతుడను నేనే యనుట ఇది

దక్షిణాయనమున కానరాకపోయిన సూర్యుని గురించిన పూజయేయనుట స్పష్టము. దక్షిణాయనమున రాత్రి పాలవెల్లిపై పురుషోత్తముడు పరుండియుండి నట్లుండుట జ్యోతిశ్శాస్త్రవేత్తలు తెలిపినదే. దీనికి ఉపలక్షకమే తోరమును పాలలో ముంచుట. చూతవృక్షము, ఆవు, ఎద్దు, సరస్సులు-ఇవి యన్నియు ఋతుపరివర్తన సూచకములే.

---

# 29. వరలక్ష్మీవ్రతము

ఈ వ్రతము శ్రావణ పూర్ణిమకు వెనుకటి శుక్ర వారమున ఆచరించబడుచున్నది. ఆ శుక్రవారమున అను కూలముకాదేని, శ్రావణ మాసమున ఏ శుక్రవారమున నైనను చేయవచ్చును. ఈ వ్రతమును సత్సంతానప్రాప్తికొరకును దీర్ఘ సౌమాంగల్యము కొరకును జరుపవలెనని శంకరుడే పార్వతికి చెప్పినట్లు స్కాంద, భవిష్యోత్తర పురాణముల యందు గలదు.

ఈనాడు స్త్రీలు ఉదయముననే మంగళ స్నానమాచ రించి, నూతన వస్త్రములు ధరించి, మంటపము కట్టి దాని మధ్యన ముగ్గులతో కమలమును తీర్చి, దాని మధ్య కలశ మును స్థాపించి, దానిపై నొక నారికేళ ఫలమునుంచి, దానికి చెవులు, కన్నులు, ముక్కులను తీర్చి, అలంకరించి, లక్ష్మిని ఆవాహనముచేసి, షోడశోపచారములతో పూజింతురు. పిదప నొకరక్షను - తోరమును - పసుపుతో నలంకరించి చేతికి కట్టుకొందురు. సాయంకాలము హారతి యెత్తి ముత్తైదు వులకు ఫలపుష్ప తాంబూలముల నిత్తురు. వరలక్ష్మీవ్రత మాహాత్మ్యమును గురించి భవిష్యోత్తరపురాణమున నీ కథ యున్నది :

కైలాస శిఖరమున ఒకనాడు పార్వతీ పరమేశ్వరులు సొగటా లాడుచుండిరి. 'నీవు ఓడి పోయితివనిన నీ వోడి పోయితి'వని వారికి వివాద మేర్పడెను. వా రిరువురును చిత్ర నేమిని మధ్యవర్తిత్వము కోరిరి. వాడు శివునికి భయపడి పార్వతియే యోడిపోయెనని అబద్ధమాడెను. పార్వతి

కోపించి, "అసత్యవాదీ! కుష్ఠరోగివికమ్ము" అని శాప మిచ్చెను. పిదప శంకరు డనునయింపగా, ఆమె ప్రశాంతు రాలై "ఒక సరోవరతీరమున దేవవేశ్య లొకవ్రతము చేయుదురు. వారు నీకా వ్రతము తెలుపుదురు. దానితో నీకు శాప విమోచనము జరుగును" అనెను.

పిదప చిత్రనేమి కొంతకాలమునకు శాపగ్రస్తుడై ఒకసరోవరసమీపమున కుందుచు నుండెను. ఒకనాడు అప్స రసలు ఆ సరోవరమునకు వచ్చి ఒక వ్రతమాచరించు చుండిరి. వారిని చూచి చిత్రనేమి "ఏమివ్రతమని?" ప్రశ్నించెను. వారది వరలక్ష్మీవ్రతమని తెలిపిరి. వారా వ్రతమా చరించుచుండుట చిత్రనేమి శ్రద్ధాభక్తులతో పరిశీలించి, గతకుష్ఠుడాయెను. శరీరము స్వర్ణచ్ఛాయపొందెను. పిమ్మట అతడును ఆ వ్రతమాచరించి, కైలాసమును చేరి, పార్వతీ పర మేశ్వరులకు ప్రణామ మాచరించెను. వారతనిని ఆశీర్వదించిరి. పరమేశ్వరుడు అతనితో నిట్లనెను.

"ఈ వ్రతమును పార్వతియును పుత్రలాభార్థమాచ రించెను. ఈ వ్రతరాజ ప్రసాదముననే షణ్ముఖుడు జనించెను. పలువురు పతివ్రతలీ వ్రతము చేసిరి. పూర్వము కుండిన పురమున చారుమతియను పతివ్రత స్వప్నమున ఈ వ్రతమును గ్రహించి, శ్రావణ శుక్ల పూర్ణిమోపాంత శుక్ర వారమున ఈ వ్రతము చేసెను. నందుడును, విక్రమాదిత్యు డును ఈ వ్రతమువలన రాజ్యము సంపాదించిరి. అప్పటినుండి ఈ వ్రతము లోకమున ఆచరణమునకు వచ్చెను."

---

## 30. సత్యనారాయణవ్రతము

సత్యనారాయణవ్రతము కామ్యవ్రతములలో ప్రధానమైనది. దీనికి ఇతర వ్రతములకువలె తిథి వార నక్షత్ర నియమమేదియును లేదు. భక్తులు కోరినప్పుడు చేసికొనవచ్చును. దీనిని ఎప్పుడు తలచిన నప్పుడు చేయవచ్చునని విష్ణువే నారదునితో ననినాడట.

ఈవ్రతమాహాత్మ్యము తెలుపునట్టి యుపాఖ్యానము స్కాందపురాణములోని రేవాఖండమున గలదు. త్రిలోక సంచారియగు నారదుడు ఒకపరి భూలోకమునకు వచ్చి, ఇక్కడి ప్రజలకష్టములను చూచి, సహింపలేక, వాని నివారణోపాయము తెలియక నారాయణుని కడకేగి కష్టనివారణోపాయము తెలుపుమని కోరెనట. సంక్రాంతినాడుగాని, పూర్ణిమనాడుగాని సాయంకాలము సత్యనారాయణ వ్రతమును జరిపి, కథాశ్రవణముచేసి, ప్రసాద మారగించిన ప్రజలు కష్టముల నీగుదురని నారాయణుడు తెలిపెను. నారదుడు మరల భూలోకమునకు వచ్చి ఈ వ్రతమును ప్రజలకు తెలిపి, వారిని ఉద్ధరించెనట.

ఈవ్రతమును ఎవరైనను చేయవచ్చును. ఇది ఉత్తర భారతదేశమునను, దక్షిణాపథమున్న తెలుగు దేశమునను మిగుల ప్రజాదరము పొందినది. ఇది తిథ్యాది నిర్ణయము లేకున్నను తరచు, కార్తిక పూర్ణిమ, వైశాఖ పూర్ణిమ,

శ్రావణ పూర్ణిమ, చైత్రపూర్ణిమ, సంక్రాంతులలో జరుపుట కొన్ని ప్రాంతములలో నాచారమైనది. పెక్కు కామ్యవ్రతములు చెప్పిన హేమాద్రి దీనిని చెప్పలేదు. కొన్ని వ్రతగ్రంథములలో "పౌర్ణమాస్యా మమావాస్యాయాం సూర్యసంక్రమణ వ్యతీపాతాష్టమీ ద్వాదశీ భౌమ భృగు సూర్య పర్వదినేషు చంద్రానుకూల్యే మన ఉత్సాహ బ్రాహ్మణ ముఖోక్త పర్వసువా సత్యనారాయణవ్రతం కుర్యాత్" అని కలదు. అనగా, పూర్ణిమ, అమావాస్య, సూర్యసంక్రమణము, వ్యతీపాత, అష్టమి, అంగారక శుక్ర సూర్య పర్వదినములు, చంద్రబలమున్న దినము, మనస్సున కుత్సాహమున్న దినము వీనియందుగాని, బ్రాహ్మణ ముఖ్యులు చెప్పిన పర్వముల యందుగాని ఈ వ్రతము చేయవలెననుట.

ఈ వ్రతమును గురించి స్కాందపురాణమున రేవా ఖండమునగల వివిధకథలను సంగ్రహముగా తెలుపుచున్నాను.

పూర్వ మొక నిరుపేద బ్రాహ్మణు డుండెను. అతడు భిక్షావృత్తితో జీవిక గడపుచుండెను. శ్రీమన్నారాయణు డొక వృద్ధుని రూపమున అతనికి ప్రత్యక్షమై సత్యనారాయణ వ్రత మొనర్చిన దారిద్ర్య విముక్తుడ వగుదువని ఉపదేశించెను. బ్రాహ్మణు డతని మాట ప్రకారమే ఈవ్రత మాచరించి, సకలాభీష్టములు పొందెను.

ఈ బ్రాహ్మణుడు ఐశ్వర్యవంతుడైన పిదప ఈ వ్రతము నొకమారు వైభవముతో చేయుచుండెను. అప్పు

డొక కట్టెలమ్ముువాడు దప్పిగొని అతని యింటికి వచ్చెను. సత్యనారాయణవ్రత కథ జరుగుచుండెను. కట్టెలమ్ముువాడు అచ్చటనే కూర్చొని శ్రద్ధాసక్తులతో కథ వినెను. అట్టి వ్రతమును తానును ఆచరింపవలెనని తలచెను. ఇంతలో ప్రసాదము వినియోగము కాగా, ప్రసాదము స్వీకరించి యింటికి వెళ్లెను. ఆనాడు కట్టెలమోపు ఇబ్బడి మొత్తమునకు అమ్ముడు పోయెను. అతడు వెంటనే సత్యనారాయణ వ్రతమునకగు పదార్థములను కొని శ్రద్ధాభక్తులతో సకుటుంబముగ వ్రతమాచరించెను. దానివలన అతని కామితార్థములన్నియు పూర్ణమయ్యెను. అంతమున అతడు సత్యలోకమును చేరెను.

మూడవ కథ యొక రాజుది : పూర్వము ఉల్కాముఖుడను రాజుండెను. అతడు సత్యనారాయణ భక్తుడు. ఆయన భార్యయును ఉత్తమ శీల. వారిరువురును ఒకనాడుపవసించి భద్రశిలా నదీతీరమున సత్యనారాయణ వ్రత మాచరించిరి. అప్పుడు సాధుశ్రేష్ఠి యను ఒక వైశ్యుడు అక్కడకు వచ్చి, "మీరు చేయుచున్న వ్రతమేది?" యని ప్రశ్నించెను. రాజు సత్యనారాయణ వ్రతమును సవిస్తరముగ తెలిపెను. ఆ శ్రేష్ఠిపుంగవుడు నిజపట్టణమునకు మరలి వచ్చిన పిదప తన పత్నియగు లీలావతికి సత్యనారాయణవ్రత ప్రభావమును తెలియజెప్పెను. తమకు ఒక పుత్రుడు కాని ఒక పుత్రిక కాని కలిగినయెడల సత్యనారాయణ వ్రతమాచరింతుమని వారు మొక్కుకొనిరి. సత్యనారాయణుని అనుగ్రహము వలన లీలావతి గర్భిణియై కాలక్రమమున ఒక స్త్రీ శిశువును కనెను. ఆశిశువుకు కళావతి యని పేరిడిరి. సాధుశ్రేష్ఠి మిగుల

సంతోషించి తన కుమార్తె వివాహ సమయమున సత్యనారాయణవ్రత మాచరింపవచ్చునని భావించెను.

కలావతి యుక్తవయస్కురాలయిన పిదప, ఆమెను తలిదండ్రులు మరియొక ధనవంతుని కిచ్చి పెండ్లి చేసిరి. కాని, సాధుశ్రేష్ఠి సత్యనారాయణవ్రతమును ఆచరించుట మరచెను. పిదప కొంత కాలమునకు ఆశ్రేష్ఠి తన యల్లునితో పాటు వాణిజ్యమునకై విదేశములకు పోయెను. సత్యనారాయణదేవుడు అతనికి వ్రతాచరణమును జ్ఞాపకపరచ దలచెను. ఆశ్రేష్ఠియు అతని యల్లుడును రత్నసారపురమున ఓడ విడిసియుండగా, అక్కడి రాజభటులు వారిని తస్కరులను భ్రాంతితో నిర్బంధమున నుంచిరి. ఇక్కడ స్వస్థలమున సాధుశ్రేష్ఠి యింట దొంగలు పడి ధనమంతయు నపహరించిరి. కలావతియు, లీలావతియు మిగుల కష్టముల పాలయిరి.

ఒకనాడు కలావతి బిచ్చమునకై పోగా, ఒక దేవాలయమున సత్యనారాయణ ప్రసాదము లభించెను. ఆమె ఇంటికి మరలివచ్చి, తాము ను ఆ వ్రతమును చేయవలెనని తల్లితో చెప్పెను. అప్పుడు వారు భక్తితో ఆ వ్రతమాచరించిరి. వీరు వ్రతమాచరించిననాడే. రత్నసారపురాధినాథునికి స్వప్నమున నెవరో కనిపించి, సాధుశ్రేష్ఠి తస్కరుడు కాడనియు, అతనిని సపరివారముగ వెంటనే విడుదల చేయనిచో సకుటుంబముగ నశింతువనియు హెచ్చరించి నట్లయ్యెను. రాజు వెంటనే మేల్కొని సాధుశ్రేష్ఠిని సపరివారముగ విడు

దలచేసి, స్వాధీనపరచుకొనిన అతని సంపదకు ఇబ్బడిగా ధన మిచ్చి పంపెను.

శ్రేష్ఠి ఓడలో స్వనగరమునకు మరలివచ్చుచుండగా, మధ్యన ఒక రేవులో సత్యనారాయణస్వామి ఒక సన్న్యాసి రూపమున అతనియొద్దకువచ్చి, "ఓడలో ఏమున్నది?" యని ప్రశ్నించెను. యథార్థమును తెలిపిన, వాడు డబ్బడుగునను భయముతో "ఆకు అలము ఉన్నది" అని శ్రేష్ఠి సమాధాన మిచ్చెను. "నీమాటలు యథార్థ మగుగాక వణిక పుంగవా?" అని సన్న్యాసి వెడలిపోయెను. శ్రేష్ఠి రాత్రి ఓడ యెక్కిన పిదప సరకులు పరిశీలించగా, నగనట్ర యంతయు ఆకుఅలము లయి యుండుట చూచి, దిగ్భ్రాంతుడై, ఓడదిగిపోయి, సన్న్యాసిని వెదకి, తన తప్పిదమును మన్నించునట్లు కోరెను. అప్పుడా సన్న్యాసి శ్రేష్ఠి సత్యనారాయణవ్రతము చేయుట మరచినది తెలిపి, మాటనిలబెట్టుకొనుమని ఆదేశించి, నిజ స్వరూపము చూపి, అంత ర్హితుడాయెను శ్రేష్ఠి మరల ఓడ యెక్కి చూచుకొనగా నగనట్ర చెక్కుచెదరక యుండెను. వైశ్యుడు సత్యనారాయణస్వామిని భక్తితో పూజించెను.

ఐదు దినముల తర్వాత ఆ వణిజుడు స్వనగరమును చేరెను. తన రాకను తెలుపుటకు ఒక దూతను తనయింటికి పంపెను. ఆదూత వచ్చినప్పుడు అతని భార్యయు కుమార్తెయు సత్యనారాయణ కథను వినుచుండిరి. వారు దూత నుండి వార్త విని ప్రసాదమును స్వీకరించుట మరచి సాధు శ్రేష్ఠిని కలసికొనుటకు ఓడరేవునకు బయలుదేరిరి.

ప్రసాదము స్వీకరింపక అశ్రద్ధ చేసిన సంగతిని సత్య నారాయణస్వామి కళావతికి తెలియజేయ దలచెను. వెంటనే అల్లునితోపాటు ఓడ మునుగునట్లు చేసెను. తీరముననున్న సాధుశ్రేష్ఠి తన యల్లుని కాపాడుమని సత్యనారాయణస్వామిని వేడెను. అప్పుడు 'కలావతి సత్యనారాయణ ప్రసాదమును స్వీకరించుట మరచినందున ఇది సంభవించెనని'' అశరీర వాణి వినబడెను. అది విని కలావతి వెంటనే ఇంటికి పరుగిడి వెళ్లి ప్రసాదము పుచ్చుకొని తిరిగి రేవువద్దకు వచ్చెను. అక్కడ తన భర్త యుండుటకూడ చూచి ఆశ్చర్యపడెను. అందరును సంతోషించిరి. శ్రేష్ఠి ప్రయాణములో తనకు కలిగిన ఇడుములు, అవి సత్యనారాయణస్వామి యనుగ్రహము వలన తొలగిన విధమును వివరించెను. పిదప వారు పూర్ణిమ నాడును, సంక్రాంతినాడును సత్యనారాయణ వ్రతమాచరించుచు, అవసానమందు సత్యలోకము చేరిరి.

మరియొక కథ యింకను విచిత్రమైనది. తుంగధ్వజుడను రాజు ఒకనాడు వేటకై అడవికిపోయెను. చాల దూరము తిరుగుటవలన మిగుల అలసిపోయి ఒక మర్రిచెట్టు నీడను విశ్రమించెను. కొందరు గొల్లపిల్లలు ఆ మర్రిచెట్టు సమీపమున సత్యనారాయణవ్రతము జరుపుచుండిరి. రాజొకడు మర్రిచెట్టు నీడను విశ్రమించినాడని తెలిసి ఆ గొల్లపిల్ల వారిలో నొకడు సత్యనారాయణ ప్రసాదమును తెచ్చి రాజు ముందుపెట్టెను. రాజు గర్వముతో సత్యనారాయణస్వామికి నమస్కరించనూ లేదు; ప్రసాదమును స్వీకరించనూ లేదు.

తర్వాత అతడు తన రాజధాని చేరుకొనెను. సత్యనారాయణుడు అతనికి బుద్ధి గరపవలెనని తలచి, అతని పుత్రులు, పుత్రికలు మరణించునట్లు, రాజ్యము ధ్వంసమగునట్లు చేసెను. రాజు దీనికి కారణము తాను సత్యనారాయణ ప్రసాదమును అలక్ష్యము చేయుటయేయని గ్రహించి, పశ్చాత్తాపపడి, పిదప శ్రద్ధాభక్తులతో సత్యనారాయణుని పూజించెను. స్వామి అనుగ్రహించి, అతనికి రాజ్యము మరల లభించునట్లును, సంతానము పునర్జీవించునట్లును చేసెను. బహు కాలము సుఖముగా రాజ్యము పరిపాలించి అంతమున సత్య నారాయణ సాయుజ్యము పొందెను.

ఈ వ్రతాచరణోద్దేశములు రెండు కానగును. ప్రజలు సత్యనిరతులు కావలెననునది యొకటి; సత్యమహిమ సంఘములో నిరంతరము కీర్తింపబడవలయుననుట రెండవది. భారత సంస్కృతిలో సత్య ప్రాధాన్య మింతింత కాదు. వ్యాసమహర్షి సకల యజ్ఞయాగములకన్నను ఒక్క సూనృత వాక్యము మేలనినాడు. "సత్యాన్నాస్తి పితాభూమిః" అని శ్రుతి. సత్యవ్రత మందరకును సమానమైనది. విద్యావంతుడు, పాలకుడు, సిరిగలవ్యాపారి, పాలమ్మువాడు, తుదకు కట్టెలు కొట్టువాడు. అందరికిని ఇది సమానమైనది. ఈ వ్రత కథలే దీనికి నిదర్శనము. సత్యనారాయణ వ్రతకల్పమున సత్య స్వరూపము తెలుపు శ్లోకములు మహోదాత్త శైలిలో నున్నవి పెక్కుగలవు. ఆ సత్యమే నారాయణస్వరూపము.

"నారాయణ స్త్వమేవాసి సర్వేషాంచ హృదిస్థితః;
ప్రేరకః ప్రేర్య మాణానాం త్వయాప్రేరిత మానసః.
త్వదాజ్ఞాం శిరసాధృత్వా భజామి జనపావనమ్,
నానోపాసక మార్గాణాం భావకృత్ భావబోధకః."

ఈ వ్రతాచరణవల్ల మానవుడు సకల దుఃఖముల నుండి విడివడును. పాపమారుడగును; ఈ లోకమున భోగములనుభవించి అంతమున ముక్తిని పొందును. దరిద్రుడు ధనవంతుడగును; బద్ధుడు ముక్తుడగును. ఇది ఫలశ్రుతిః

"యత్కృత్వా సర్వ దుఃఖేభ్యో ముక్తోభవతిమానవః,
సర్వపాప వినిర్ముక్తో దుర్లభం మోక్ష మాప్నుయాత్.
ఇహ సద్యః ఫలం భుక్త్వా పరత్ర మోక్ష మాప్నుయాత్
ధనధాన్యాదికం తస్య భవేత్సత్య ప్రసాదతః.
దరిద్రోవిత్తంలభతే బద్ధోముచ్యేత బంధనాత్,
భీతోభయాత్ ప్రముచ్యేత సత్యమేవ నసంశయః."

కాని, ఈ ఫలములన్నియు ఎప్పుడు కలుగును? దానికి శివసూత్రమొకటి కలదు. జితేంద్రియుడును, సత్యవాదియునగు వానికే ఈ వ్రతఫలములు కలుగునని శివవాక్యము.